సాధన మొనర్చుట భరతఖండమునందే గాక ఖండ
ఖండాంతరములందుఁగూడ నత్యంత ప్రాచీనకాలము
నుండియుఁ బరిపాటిగ జరుగుచుండినట్లు కాన నగును.
సింధునదీప్రాంతమునందలి హారప్పా, మొహెంజో
దారో మున్నగు ప్రదేశములలో భూగర్భపరిశోధన
లందు దొరకిన వస్తుజాలములు క్రీస్తు పూర్వము
కొన్ని వేలసంవత్సరముల నాఁటివై యుండునని పురా
తత్త్వశాస్త్రజ్ఞులు ప్రకటించినారు. వీనిలో శివ
లింగములుకూడఁ జేరియున్నవి. భరతఖండము
మాట యట్లుండ నత్యంత ప్రాచీనములగు శివలింగ
ములు, ఆశియా, ఆఫ్రికా, అమెరికా ఖండాంతర్గత-
దేశములలోఁ బెక్కుచోట్లఁ గానవచ్చుటచే శైవ
మత మాదేశములందుఁగూడ బూర్వము వ్యాప్తి
చెందియుండినట్లు కాన నగును. భారతీయ వాఙ్మయ
ములో వేదములు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణ
ములు, శివాగమములు, శైవమత ప్రాపతను
బహుముఖములఁ జాటుచుండును. ఈమతమునందు
శివాగమములు కొన్నింటిలో స్థూలదృష్టితో
సామాన్యశైవము, మిశ్రశైవము, శుద్ధశైవము,
వీరశైవము అను చతుర్విభాగములును, మఱి
కొన్నింటిలో నింతకన్న వివరముగ సామాన్య
శైవము, పూర్వశైవము, మిశ్రశైవము, శుద్ధ

శైవము, శ్రౌతశైవము, మార్గశైవము, వీరశైవము, సామాన్యవీరశైవము, విశేషవీరశైవము, నిరాభార వీరశైవము అనెడి దశవిధాంతరభేదములు సుదాహృతములయి యుత్తరోత్తరముగ నవి యుత్తమ ఫలదాయకములని ప్రశంసింపఁబడినవి భస్మ, రుద్రాక్ష ధారణాదిచిహ్నములు శివభక్తులకు విహితమయినవి.

గురుదత్తమైనభస్మమును ధరించుట, ఎచ్చటఁ గాన్పించినను శివలింగమునకుఁ బ్రదక్షిణ ప్రణామము లాచరించి శివభక్తి గల్గియుండుట సామాన్య శైవలక్షణము. ఇందు నియమములంతగా లేవు. గురువలన శివమంత్రోపదేశమును బొంది యామంత్రమును జపించుచు గురుపాదతీర్థమును దన యన్నపానీయములతో మిళితమొనర్చి గ్రోలుట లేదా నందిముద్రాంకితుఁడై గురుపాదచిహ్నాతమైన యిసుకతో స్వయముగ వాలుకాలింగమును నిర్మించికొని పూజించుచుఁ దత్తీర్థ నిర్మాల్యములను గుర్వాజ్ఞతో సేవించుట పూర్వశైవలక్షణము. శివపారమ్యబుద్ధితో శివలింగమును మధ్యముందుంచి యాచుట్టును సౌర, కౌమార, శాక్తిక, గాణాపత్య, వైష్ణవవిగ్రహములుంచి యావరణదేవతాబుద్ధితో వానినిగూడ నానామంత్రములతో సమభావముతో నర్చించుట మిశ్రశైవము. స్మార్తబ్రాహ్మణుల

పంచాయతనపూజ యీసంప్రదాయమునకే చేరును. గురుదత్తమైనలింగమును బీఠమునఁగాని సింహాసన మునఁగాని స్థాపించి త్రికాలములందు భక్తితో నారాధించుట శుద్ధశైవము. ఆలింగము ప్రమాద వశమున దూషితమయినయెడలను, నష్టమయినయెడ లను పంచాక్షరీమంత్రమును పలుమాఱు జపించి, ప్రాయశ్చిత్తము గావించికొని యాలింగమునుగాని గురుదత్తమైన మఱొక క్రొత్తలింగమునుగాని శుద్ధ శైవసంప్రదాయమువారు పూజింప నగును. దేవాలయములందలి స్థావరలింగపూజనములకుఁ దత్ప్రతిష్ఠాదికములకు నేర్పడిన శివద్విజు లీశుద్ధ శైవమునకే శాఖాంతరమగు ఆదిశైవమునకుఁ జేరెద రని కొన్ని యాగమములలోఁ జెప్పఁబడినది. గురు దత్తమయినలింగమును మూర్ధమునఁగాని, కంఠ మునఁగాని ధరించి పూజాసమయమున హస్తతల మునను ంచి యర్చించుట,నిత్య నైమిత్తిక శ్రౌత స్మార్త కర్మములఁగూడ నాచరించుట, సాధకుని ప్రాణావ సానమునం దాతని నొకగడియసేపు భూస్థాపిత మొనర్చి యా పిమ్మట దహనసంస్కారము గావించుట, ఆతనికి గురుఁడొసంగినలింగము నాతని సుతులుగాని సోదరులుగాని పూజించుట శ్రౌతశైవలక్షణము. కులాచార లోకాచారపూర్వకముగా నైమిత్తిక

కర్మము లాచరించుచు, గురుదత్తలింగమును భక్తి
శ్రద్ధలతోఁ బాహ్యోత్కృష్టస్థలముల దేహమునధరించి
త్రికాలములందును గరపీఠమునందే యర్చించుట,
సాధకుని ప్రాణావసానమందు దాతని నా లింగము
తోడనే కేవలము భూస్థాపితమొనర్చుట మార్గశైవ
లక్షణము.

గురుఁడు హస్తమస్తకసంయోగమునఁ జిత్కళా
న్యాసమొనరించి, ఆణవ, కార్మిక, మాయామలము
లను వేధామను క్రియాత్మక త్రివిధదీక్షలచే దగ్ధ
మొనర్చి, భౌతికశరీరమును లింగశరీరముగఁ జేసి
ప్రసాదించిన యిష్టలింగమును స్థూలశరీరమునఁ గంఠ
మునఁగాని శిరమునఁగాని భుజమునఁగాని వక్షమునఁ
గాని ధరించుచు సూక్ష్మకారణశరీరముల నిష్ఠిత
మయిన ప్రాణభావలింగములతో దాని కవినాభావ
ముగ నైక్యానుసంధానము నలవరించుకొనుచు
హస్తాంబుజపీఠమునం దుంచికొని యనన్యచిత్త
ముతో నర్చించుట, ప్రణవసహితశైవపంచాక్షరీ
మంత్రము వినా మఱి యేయితర మంత్రములను
మననము చేయకుండుట, ఇష్టలింగార్చనకన్న భిన్నము
లయిన కర్మములనెల్ల బరిహరించుట, శరీరమునుండి
యిష్టలింగము ప్రమాదపతితమయినచో వెంటనే
ప్రాణత్యాగ మొనరించుట, లింగైక్యమైనపుడు సాధ

కుని యిష్టలింగము నాతని హస్తాంబుజపీఠముననే యుంచి యర్చించి యాతనితోఁ ఖనన మొనరించుట వీరశైవలక్షణము. ఈవీరవ్రతమును విశేషాచార నియమములతో నిర్వహించువారు విశేషవీర శైవులు. ఆజన్మము విరక్తులై (యతీశ్వరులు) సర్వోత్తమముగ నిర్వహించువారు నిరాభారులు. ఈవీర శైవులందఱకు చతురాశ్రమధర్మము లొక్క యెడనే కలది యను నర్థమిచ్చు "అత్యాశ్రమి" అను పదముగూడ వాచకముగానున్నది. ఏకేశ్వరోపాసనాత్మకమై సులభప్రక్రియతోనుత్తమోత్తమఫల ప్రదాయకమగు నీవీరవ్రతము కులాంగనాసదృశమనియుఁ దక్కనవి గణికాంగనాతుల్యములనియు ముముక్షువుల కిదియే ముఖ్యముగ వరణీయమనియుఁ జెప్పఁబడినది.

సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అను శివుని పంచవదనములనుండి యైదుగురాచార్యు లుద్భవించి వేర్వేఱుయుగములలో వేర్వేఱునామములతో వ్యవహరించుచు, వలయు చోటులనెల్ల గగనయానమునఁ విహరించుచు, ప్రపంచమందంతట శైవమతోద్ధరణ మొనర్తురనియు వారే వీరశైవులకు గోత్రకర్తలనియు శైవాగమములలోఁ జెప్పఁబడినది. ఇట్లుద్భవించిన

కర్మము లాచరించుచు, గురువక్త్రలింగమును భక్తి శ్రద్ధలతో బాహ్యోత్కృష్టస్థలముల దేహమునధరించి త్రికాలములందును కరపీఠమునందే యర్చించుట, సాధకుని ప్రాణావసానమందాతని నాలింగము తోడనే కేవలము భూస్థాపితమొనర్చుట మార్గశైవ లక్షణము.

గురుఁడు హస్తమస్తకసంయోగముచే చిత్కళా న్యాసమొనరించి, ఆణవ, కార్మిక, మాయామలము లను వేధామను క్రియాత్మక త్రివిధదీక్షలచే దగ్ధ మొనర్చి, భౌతికశరీరమును లింగశరీరముగఁ జేసి ప్రసాదించిన యిష్టలింగమును స్థూలశరీరమునఁ గంఠ మునఁగాని శిరమునఁగాని భుజమునఁగాని వక్షమునఁ గాని ధరించుచు సూక్ష్మకారణశరీరముల నిహిత మయిన ప్రాణభావలింగములతో దాని కవినాభావ ముగ నైక్యానుసంధానము నలవరించుకొనుచు హస్తాంబుజపీఠమునం దుంచికొని యనన్యచిత్త ముతో నర్చించుట, ప్రణవసహితమైన పంచాక్షరీ మంత్రము వినా మఱే యితర మంత్రములను జపము చేయకుండుట, ఇష్టలింగార్పితకన్న భిన్నము లయిన కర్మములనెల్ల బరిహరించుట, శరీరమునుండి యిష్టలింగము ప్రమాదపతితమయినను వెంటనే ప్రాణత్యాగమొనరించుట, లింగైక్యమైనపుడు సాధ

కుని యిష్టలింగము నాతని హస్తాంబుజపీఠముననే యుంచి యర్చించి యాతనితో ఖననమొనరించుట వీరశైవలక్షణము. ఈవీరవ్రతమును విశేషాచార నియమములతో నిర్వహించువారు విశేషవీర శైవులు ఆజన్మము విరక్తులై (యతీశ్వరులు) సర్వోత్తమముగ నిర్వహించువారు నిరాభారులు ఈవీర శైవులందఱకు చతురాశ్రమధర్మము లొక్కయెడనే కలది యను నర్థమిచ్చు "అత్యాశ్రమి" అను పదముగూడ వాచకముగానున్నది. ఏకేశ్వరోపాసనాత్మకమై సులభప్రక్రియతో సుత్తమోత్తమఫలప్రదాయకమగు నీవీరవ్రతము కులాంగనాసదృశమనియుఁ దక్కినవి గణికాంగనాతుల్యములనియు ముముక్షువులకిదియే ముఖ్యముగ వరణీయమనియుఁ జెప్పఁబడినది.

సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అను శివుని పంచవదనములనుండి నైదుగు రాచార్యు లుద్భవించి వేర్వేఱుయుగములలో వేర్వేఱునామములతో వ్యవహరించుచు, పలయు చోటులనెల్ల గగనయానమున విహరించుచు, ప్రపంచమంతట శైవమతోద్ధరణ మొనర్తురనియు వారే వీరశైవులకు గోత్రకర్తలని శైవాగమములలోఁ జెప్పఁబడినది. ఇట్లుద్భవించిన

యాగోత్రకర్తల తొలినామములు వీర, నంది, భృంగి (భృంగిరిటి), వృష, స్కంద అనునవి వీరే కృతయుగమున ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షర, పంచాక్షరనామములతోను, త్రేతా యుగమున ఏకవక్త్ర, ద్వివక్త్ర, త్రివక్త్ర, చతుర్వక్త్ర, పంచవక్త్రనామములతోను, ద్వాపరమున రేణుక, దారుక, శంఖుకర్ణ (ఘంటాకర్ణ), ధేనుకర్ణ (గజకర్ణ), విశ్వకర్ణనామములతోను, కలియుగమున రేవణ, సిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వా రాధ్యనామములతోను వ్యవహరింతురు. ఈపంచా చార్యులసింహాసనము లిప్పటికిని వరుసగా రంభాపురి (బాలెహొన్నూరు, మైసూరురాష్ట్రము), ఉజ్జిని (బళ్ళారిమండలము), కేదారము (హిమాలయప్రదే శము), శ్రీశైలము (కర్నూలుజిల్లా), కాశీ అను క్షేత్రములందు నెలకొనియున్నవి

సదాచారము, శివాచారము, లింగాచారము, గణాచారము, భృత్యాచారము అనుపంచాచార ములును, భూతి, రుద్రాక్ష, గురు, మంత్ర, లింగ, జంగమ, పాదతీర్థప్రసాదములను,అష్టావరణములును వీరశైవులకు విహితములయి యున్నవి అందుచే వారిలో బురుషులతోపాటు సమానబాధ్యతలతో స్త్రీలకుఁగూడ లింగధారణాదికము విధింపఁబడియున్నది.

పుట్టిన శిశువునకుఁగూడ వెంటనే యాదీక్ష గావింపఁ బడును. ఈకారణమున బ్రాహ్మణులలో స్త్రీల కసలే లేని ద్విజత్వము, పురుషులకైనను నుపనయనానంతరముగాని లభింపని ద్విజత్వము వీరశైవులకు స్త్రీపురుషవివక్షతలేక పుట్టుకనుండియుఁ బ్రాపించుటచే వా రాజన్మశుద్ధులు దీక్షితులునై యుందురు. వారికి లింగమే యజ్ఞోపవీతము. "యజ్ఞో వై విష్ణురితి శ్రుతేః యజ్ఞస్య విష్ణునామ్నః పీఠస్య, ఉపసామీప్యే, విశేషేణ ఇతం ఆవృతం, యజ్ఞోపవీతం శివలింగమిత్యర్థః" "శివవిష్ణుమయం లింగం త్రిస్సూత్రం సనాతనం యజ్ఞోపవీతం పరమంపవిత్రం." "ఇష్టలింగ ప్రాణలింగ భావలింగాఖ్యయా యాని యస్య తత్సూత్రం మణిగణ సూత్రవత్స్య వ్యాపకం త్రివృత్సూత్రం జ్యోతిర్మయం మహాలింగం" "సంసూచితత్వాత్సమస్తేషు వస్తుష్వపి చ సంతతం సూచనాత్పరమేశస్య, లింగమితీరితమ్." "యదక్షరం పరం బ్రహ్మతత్సూత్రమితి ధారయేత్, ధారణాదస్య సూత్రస్య, నోచ్ఛిష్టం నాఽశుచిర్భవేత్" ఇత్యాది ప్రమాణములచే యజ్ఞోపవీతశబ్దముగూడ శివలింగవాచకమే యని వీరశైవుల వ్యవహారము. "లింగయజ్ఞోపవీతినే శివలాంఛన ధారకాయ." అని వీరశైవపంచాచార్యుల పూజామంత్రము లుద్ఘో

షించుచుండుదురు. వీరశైవులు తమదీక్షాదిక శుభ కర్మములందు పంచాచార్యస్మారకములుగాఁ బంచ కలశముల స్థాపించి పూజింతురు. "ఈశానస్సర్వ విద్యానామ్" అని పంచబ్రహ్మమంత్రములలోఁ జెప్పినట్లు సకలవిద్యాధీశుఁడగు శివునియొక్క పంచకము నుండి యుద్భవించిన యాచార్యపంచకముయొక్క సంతతి యగుటచే, దాము శివకులీనులమనియు, (ఈశ్వరకులజులు) అందుచేతను లింగధారణ దీక్షామూలమునను వేదాధ్యయనాదిక సమస్తాధికారములు తమకుఁగలవనియు వారిమతము. లింగాంగ సామరస్యమే (శివజీవైక్యము) లక్ష్యముగాఁగల ముముక్షువులగుటచే, స్వర్గప్రాప్తిరూపక భోగముల కేర్పడిన యజ్ఞయాగాదివైదికకర్మములఁ బరిహరించి, "అష్టావరణసంపన్నః, పంచాచారపరాయణః,వైదికం కర్మకుర్వీత, జ్ఞానైక ఫలసాధనమ్" అను శివాగమ ప్రమాణమువలనను జ్ఞానమోక్షైక సాధనమగు ఇష్టప్రాణభావలింగార్చనకర్మమును మాత్రమే యాచరించుచు నందు కవసరమైనంతవరకే, పంచ బ్రహ్మషడంగమంత్రములు,శతరుద్రీయము మున్నగు వైదికమంత్రముల నధ్యయనమొనరించి, వాని తోడనే వారు శివపూజ గావింతురు. కావున నీవిధముగ వీరశైవులుకూడ వేదప్రామాణ్య మంగీ

కరించిన వైదికులేగాని యవైదికులు గారు. తక్కిన శైవాంతర్భాగములవలె వీరశైవముగూడ సవైదికమేగాని యవైదికము గాదు. "పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః, అతప్తతనుర్నతదామో అశ్నుతే, శ్రితాస ఇద్వహన్తస్తత్సమాశత." "యాతేరుద్ర శివాతనూరఘోరాఽపాపకాశినీ । తయానస్తనువా శన్తమయా గిరిశన్తాభి చాకశీహి" "అయం మే హస్తో భగవాన్" "శిన్నమో బ్రహ్మణే ధారణం మేఅస్తు నిరాకరణం ధారయితా భూయాసమ్" ఇత్యాది శ్రుతులు లింగధారణబోధకములే యని వీరశైవులు నిశ్చయింతురు. వీరశైవులు పాశముక్తులైన కర్మ సంహారులనుటలోనిభావము వారు హింసాత్మకములయి, భోగైకసాధనములగు యజ్ఞయాగాదిరూపక కామ్యకర్మములకు విదూరులనుటయే గాని మఱొకటిగాదు. శివజీవైక్యసాధనవిముఖులై భోగపరాయణబుద్ధితోఁ గేవల మట్టిక్రతుకర్మాదికము లొనరించుచు, బహుదేవతారాధనము గావించువారినే త్రాటిమాలలు, (కర్మపాశబద్ధులు) కర్మచండాలురు నని బసవేశ్వరాదులు నిరసించినట్లు సోమనాథుఁ డుగ్గడించినాఁడు.

"చతుర్వర్ణానాం లింగమిష్యతే" అనెడియుపనిషత్ప్రమాణముచే నాలుగువర్ణముల వారికిఁ గూడ లింగధారణదీక్షనొంది శివజీవైక్యరూపకమైన మోక్షమును బడయుట కధికారము గలదు. గురుఁడు హస్తమస్తకసంయోగమున చిత్కళాన్యాసము గావించి, దీక్ష నొసంగి, భౌతికశరీరమును లింగశరీర మొనర్చినంతనే దీక్షితునకుఁ దొంటిజన్మము నశించి వేఱొకజన్మము సిద్ధించుననియు నందుచే గురుహస్తాంబుజమే యాతని జన్మస్థానమనియుఁ జెప్పఁబడును. అందుచేతనే "గురుకరోదర" జనితులను వ్యవహారముగూడ వీరి కేర్పడినది. జన్మతః వీరశైవులయినవా రనగా వీరశైవజనకుల కుద్భవించిన వారు, పంచాచార్యసింహాసనములలోఁ దమవంశమున కేర్పడిన పీఠమునకు సంబంధించిన గురునివలననే దీక్ష నొందవలెను. ఇతరకులములలోఁ బుట్టి తరువాత వీరశైవమును స్వీకరించెడివారి గురుపీఠము లైదింటిలో దేనికి సంబంధించిన గురునివలననైనను దీక్ష పొందవచ్చును. ఏకగురుపీఠమునకు సంబంధించిన శిష్యులెల్ల సోదరప్రాయులై యాపీఠగోత్రమే గల సగోత్రులుగా వ్యవహరింపఁబడుదురు. కావున వారు వైవాహిక సంబంధములను దక్కిన నాలుగుపీఠములకుఁ జెందిన వారితోనే

గావించికొనవలెను. ఇతర కులస్థులు, మతస్థులు వీరశైవమును స్వీకరించిన తరువాత వారుకూడఁ దమ గురుగోత్రమే తమగోత్రముగ వ్యవహరించి కొందురు. గురుహస్తాంబుజమునుండి పునర్జన్మ మొందిన వీరియెడ దగ్ధములయిపోయిన వారి తొలికులములు, మతములు, గోత్రసూత్రముల నిఁక నెంతమాత్రము స్మరింపఁదగదు. జన్మతః వీరశైవు లయినవారు (సహజ వీరశైవులు) మొదటినుండియుఁ దమ గురుపీఠమునకుఁ జెందిన గోత్రసూత్రములనే చెప్పికొనెదరు

"కలౌ శైవమరోచకమ్' అనునట్లు భక్తి జ్ఞాన వైరాగ్యప్రధానమయిన శైవమతము, అందునను ఇష్టలింగధారణపూజనములుగల శ్రౌతశైవ, మార్గ శైవ, వీరశైవములు క్రమక్రమముగా క్షీణతను బ్రాపింపఁగా వాని నుద్ధరించుటకయి పూర్వోదా హృతులైన పంచాచార్యులేగాక నడుమ నడుమ మఱికొందఱు ప్రముఖులుగూడ శివాజ్ఞాబద్ధులై యవతరించుట యావశ్యకమగును. ఇట్టి యవసరము దక్షిణహిందూస్థానమున క్రీ. శ. పదిరెండవ శతా బ్దిలోఁ దటస్థింపఁగా వీరశైవమతోద్ధరణమునకై నందీశ్వరుఁడు కర్ణాటకదేశమున బసవేశ్వరనామము నను, శ్రౌతమార్గశైవ సంప్రదాయోద్ధరణమునకయి

మహాలోక ప్రమథమూర్తి యాంధ్రమండలమున మల్లి
కార్జున పండితారాధ్యనామమునను, వీరిరువురు చరి
త్రముల రచించి తన్మతప్రచారమునకయి యుపక
రింప భృంగీశ్వరుఁడు పాలకురికి సోమనాథరూప
మునను నవతరించిరని వీరశైవలోకమునందలి
యైతిహ్యము. కొందఱవిచారమూలకముగ వా
కొనునట్లీయీమతము లీయుద్ధారకుల యుప
జ్ఞము లెంతమాత్రమును గావు అవి కొలఁదిగనో
గొప్పగనో భరతఖండమున మొదటినుండియు నెల
కొనియున్నవి ఈమహాపురుషు లుద్ధారకులేగాని
యామతస్థాపకులు గారు

సోమనాథునికృతులలో బసవపురాణ పండితా
రాధ్యచరిత్రములే ముఖ్యతమములైన యుద్గ్రంథ
ములు. జనవశీకరణమునకు మతప్రచారమునకు
ననువగుటకు గాను "ఉరుతరగద్యపద్యోక్తులకంటె,
సరసమై పరగిన జానుతెనుంగు, చర్చింపఁగా సర్వసా
మాన్యమగుట గూర్చెద ద్విపదలుగోర్కెదైవార."
"ఆరూఢగద్యపద్యాదిప్రబంధ, పూరిత సంస్కృత
భూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబుగామి,
జానుతెనుగు విశేష ప్రసన్నతకు" అని యుద్ఘా
టించుచు సోమనాథుఁడీరెండు గ్రంథములను జాను
తెనుంగుసొంపులు తులకింప నాంధ్రజాతీయచ్ఛంద

మగు ద్విపదలో రచించినాఁడు. సోమనాథుని చరిత్ర మెఱుంగుటకు మునుముం దాతనికృతులు, తరువాత నాతనిశిష్యప్రశిష్యులు భక్తులు నగు నితర కవులాంధ్ర కర్ణాటములలో రచించిన గ్రంథములు నాధారములు కాఁదగును. ఏకవినిగూర్చియైనను నాతఁడు స్వయముగా వ్రాసికొన్న వాక్యములకున్న ప్రామాణ్యమాతని యనంతరము కొన్నివందల సంవత్సరములకు వెలసినవారు వ్రాసిన విషయములకుఁ గలుగనేరదని సహృదయులకు వేఱచెప్పనక్కఱ లేదు. అసలుకవి వ్రాతలకు వైరుధ్యము లేనంత వఱకే యన మాతరువాతికవుల వాక్యములను గొంత ప్రమాణముగఁ గైకొనవచ్చును. ఆంధ్రకవులలో క్రీ. శ. 1250 ప్రాంతమునుండి వెలసిన పిడుపర్తికవులు (పిడుపర్తి బసవన, ఆతని కుమారుఁడు సోమనాథుఁడు, తమ్ముని కుమారుఁడు బసవన) మున్నగు వారు పాల్కురికి సోమనాథుని దమ కులగురువుగా నారాధించిన శిష్యప్రశిష్యకోటిలోనివారు. వీరిలో పిడుపర్తి సోమనాథుఁడు తన తండ్రియానతిపై పాల్కురికి సోమున ద్విపద బసవపురాణమును బద్యకావ్యముగ ననువదించి దాని యవతారికలో నాతనిచరిత్రను గొంత వివరించినాఁడు. మఱియొకఁడు "శ్రీహిమశైలసంగ! యేకాంతగురుచిత్త కలిసభృంగ!

సోమనాథలింగ !" అనుమకుటముతో "అన్యవాద
కోలాహల" మను సీసపద్యశతకమును రచించి సోమ
నాథునికే యంకిత మొనరించినాఁడు. కాకతీయ
రాజులఁగూర్చి యేకామ్రనాథు డను కవి "ప్రతాప
చరిత్రము" అనుపేరతో నైతిహాసిక రూపకమగు
వచనగ్రంథ మొకటి కూర్చియున్నాఁడు. దానిలోఁ
గూడఁ బాలకురికి సోమనాథునిఁగూర్చి కూడఁ గొన్ని
విషయము లాతఁడు చెప్పినాఁడు. వానికిని, పిడు
పర్తి సోమనాథుని పద్య బసవపురాణావతారికలో
నుదాహృతమైన సంగతులకుఁ గొంత యైక్యముండు
టచేఁ బిడుపర్తి సోమనాథుని వ్రాఁతల కీప్రతాపచరి
త్రము కొంతవఱకు మూలమేమో యని తలఁప
నగును ఇట్లే "బసవవిజయ" మను పేరితో పిడు
పర్తి సోమనాథుని తరువాత మఱి రెండువందల
సంవత్సరములకు వెలసిన తుమ్మలపల్లి నాగభూషణ
కవి పద్యకావ్యమును, నల్లగంట్ల నారనారాధ్యుఁడు
ద్విపద కావ్యమును రచించియున్నారు. ఇవి కూడ
పాలకురికి సోమనాథునిఁగూర్చి చెప్పుటలో "ప్రతాప
చరిత్రము"నందలి సంగతులనే యనువదించినటులు
కానన గును. ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర మొక
పుక్కిటిపురాణము వంటిది. అందుఁ బలువిధములైన
వ్యత్యాసము లున్నవి. కావునఁ జరిత్రకారు లెవరు

దానికి జారిత్రక ప్రామాణ్య మొసంగుట లేదు. ఇఁకఁ గర్ణాటకకవులలో క్రీ. శ. 1500-1560 ప్రాంతమువాఁడేయగు తోఁటద సిద్ధలింగకవి "పాలకురికి సోమేశ్వరపురాణ"మను పేరితోఁ గన్నడమున సోమనాథునిఁగూర్చి యాతని సమకాలీనభక్తులచరిత్రములఁగూడఁ గొంతఁజేర్చుచు నొక ప్రత్యేకకావ్యమునే రచించినాఁడు దానికిని బూర్వోక్తలోపములు గొన్నిపట్టినవి. అందుచె సోమనాథునిచరిత్రమును యథార్థముగ నిరూపించుట కదియు నంతగా నుపకరింపఁజాలదు కావునఁ బాలకురికి సోమనయాతనికృతులలో స్వయముగా వ్రాసికొన్న వాక్యములకే విశేషప్రామాణ్య మొసంగి, వానితో వైరుధ్యములేనంతవఱ కితరు లాతనిఁగూర్చి వ్రాసినవిషయములఁగూడ గ్రహించి యాతనిచరిత్రమును సంగ్రహముగ వివరింతును.

## సోమనాథుని కృతులు

అనుభవసారము, బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, వృషాధిపశతకము, చతుర్వేదసారము, చెన్నమల్లుసీసములు, సోమనాథభాష్యము (బసవరాజీయమని నామాంతరము), రుద్రభాష్యము, బసవరగడ, బసవాద్యరగడ, సద్గురురగడ, గంగోత్పత్తిరగడ, పంచప్రకారగద్య, నమస్కారగద్య,

అక్షరాంకగద్యపద్యములు, అష్టోత్తరశతనామగద్యం,
బసవోదాహరణయుగ్మము. (ఒకటి తెలుఁగు, మఱొ
కటి సంస్కృతము) బసవాష్టకము, బసవపంచరత్న
ములు, త్రివిధలింగాష్టకము మున్నగు బహుకృతు
లను సోమనాథుఁడు రచించినాఁడు. పిడుపర్తి సోమ
నాథుఁడుకూడ తన పద్యబసవపురాణావతారికలో
వీనిలోఁ గొన్నింటిని పేర్కొనియున్నాఁడు ఇవి గాక
పాలకురికి సోమేశ్వరస్వామిపైఁ జెప్పిన "సోమనాథ
స్తవము" అను చిన్నద్విపదకృతికూడ సోమనాథ
రచనముగాఁ బ్రచారమందున్నది. వీనిలో అనుభవ
సారము, [illegible] 200 పద్యములుగల తెలుఁగు
పద్యకావ్యము సవిమర్శముగఁ జదివిన నదియే సోమ
నాథుని ప్రాథమికకృతిగాఁ గనఁబట్టును. దానిని
రచించునప్పటి కాతఁ డించుమించుగా నిరువదేండ్ల
ప్రాయమువాఁడై మాతృభాషయగు తెలుఁగులోఁ
గొంతపాండితి సంపాదించి, సంస్కృతమున వే
పురాణములను గొంతవఱకు నేర్చియుండును. అప్పటి
కాతఁడు ఉభయభాషాకవితా ప్రవీణుఁడు గాని సర్వాగమ
పారగుఁడుగాని కాలేదు. కర్ణాటదేశమున వీర
శైవమతోద్ధరణ మొనర్చిన బసవేశ్వరునిఁ గూర్చి
యంతగాఁ దెలిసికొని యుండలేదు. పదములు, గీతము
లగు నాలని కర్ణాటగీతములతోడి పరిచయము గలి

నాతనియందు భక్తిపారవశ్యము గుదురుట సోమ
నాథుని కప్పటికి జరగియుండదు. అందుచేతనే
యాంధ్రదేశీయు డగు మల్లికార్జునపండితారాధ్యుని
శివతత్త్వసారాదికృతులఁ బ్రశంసించుచు, నాతనిని
మూఁడు సీసపద్యములలో నుతించియు, సోమనాథుఁ
డీ గ్రంథావతారికలో బసవేశ్వరుని నామోచ్చారణ
మైనను గావింపలేదు ఇందలి పద్యములశైలి,
లాలిత్యముగూడ నీతని యాంధ్రకవితాప్రాథమిక
దశనే సూచించుచుండును. ఇట్టు లంతస్సాక్ష్యముఁ
బరిశీలింపక గ్రంథనామముఁబట్టి భ్రమించి కొందఱు
సోమనాథుఁ డిదిని జరమదశలో రచించియుండు
నని తలంచుట యసంభావ్యము. అనంతరము గొంత
కాలమునకు బసవేశ్వరునిఁగూర్చియు, నాతని యను
యాయులఁగూర్చియు గొన్ని వివరములు దెలిసినతరు
వాత నాతఁడు ముందుముందు సోమనాథస్తవము,
బసవస్తోత్రపదములను గద్యలు, రగడలు, ఉదా
హరణములు మున్నగు లఘుకృతుల రచింపవొర
కాని, కేవల సంస్కృతభాషాగ్రథితములులేక సం
స్కృతభూయిష్ఠములుగు నిట్టి దేశీయగేయ
కృతులు జనులకు వినములకు, మతప్రచారమునకుఁ
దగినంత సహాయకములు గానేరవని తలంచి, జాను
తెనుంగుపై వలపు వహించి, యాతెలుగు నుడి

కారపు మెఱుంగులు తుఱంగలింప బసవపురాణము
నాంధ్రజాతీయచ్ఛందమగు ద్విపదలో నేడాశ్వాస
ములు కావ్యముగా రచించినాఁడు. పైనిజెప్పిన
లఘుకృతులలోఁ గొన్ని బసవపురాణానంతరము
గూడఁ గూర్పఁబడియుండవచ్చును. బసవపురాణ
రచనము తరువాతనే "బసవా బసవా—బసవా
వృషాధిపా" యను మకుటముతో, ఉత్పల చంపక
మాలావృత్తములలో వృషాధిప శతకమును.
"బసవలింగ" అను మకుటముతో "చతుర్వేద
సారము" అను కొన్నివందలసీసపద్యముల శతకము
నాతఁడు రచించి తన బసవభక్తి వలివేలముగఁ
బ్రదర్శించినాఁడు. సోమనాథభాష్యము, రుద్ర
భాష్యము, అష్టకములు, పంచకములు, కేవలము
సంస్కృతభాషయందే కూర్పఁబడినవి. పండితా
రాధ్యచరిత్రము నతఁడు పంచ బాణిక పరిపరి
పాకదశలో గణుతింప దగిన విశాలరీతిగానము లో
ద్విపదలోనే రచించి దానిని బసవేశ్వరునకే యంకిత
మొనరించినాఁడు. ఉపలబ్ధమైన యాతని కృతులలో
నిదియే కడపటిదిగా గోచరించును. ఈ గ్రంథావ
తారికలోనే యాతఁడు తన చతుర్వేదసారకృతిని
చతుర్వేదపారగత్వము నుగ్గడించినాఁడు. ఇవిగాక
"మల్లమదేవీపురాణము" అను నాలు గాశ్వాసముల

ద్విపదకావ్యముకూడ సోమనాథుఁడు రచించినట్లు తెలియవచ్చినది. దీనితాళపత్త్ర ప్రతిని కర్నూలు మండలములో నందికొట్కూరులో నొక లింగాయతునియింటఁ జూచితిమని, తానే దానిని ప్రకటింతుననిచెప్పి దాని ప్రతిని వ్రాసికొనుటకైన నాతఁ డనుమతింపలేదని కీ॥ శే॥ శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు 192[illegible]-వ సం॥ లో సారస్వత సర్వస్వము"అను పత్త్రికయందు "నా కర్నూలు మండలసంచారము" అను వ్యాసమున వ్రాసియున్నారు. నేను దానికై ప్రయత్నించితినిగాని లభ్యము గాలేదు.

## జన్మస్థలము

ఈకవి యింటిపేరినిబట్టి యాతఁడు పాలకురికి గ్రామవాస్తవ్యుఁడై యుండునని గోచరించును. తోంటదసిద్ధలింగకవికూడఁ దన "పాలకురికి సోమేశ్వరపురాణము"లో శ్రీశైలమున కీశాన్య భాగమందున్న కొలనుపాకయందలి సోమేశ్వర స్వామి వరప్రసాదమునఁ దత్సమీపమునందలి పాలకురికిలో నీతఁ డాతని తలిదండ్రులకుదయించె నని వ్రాసియున్నాఁడు. అన్యవాఙ్కోలాహల శతక కర్తగూడ

"సీ. భవదీయసంబంధ బంధురంబయ్యె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
భవదంఘ్రిపూజనా పరులకిమ్మయ్యె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
యుష్మద్విహారసంయుక్తమై వెలసె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
యుష్మదీయాశ్ర మాభ్యున్నతిం జెందె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
గీ. పాలకురికి యెట్టిభాగ్యంబు చేసెనో
నీ స్వనామపూర్వ నిహితమయ్యె ..... .."

అని చెప్పియున్నాఁడు. ప్రతాపచరిత్రము, పిడుపర్తి సోమనాథునిపద్య బసవపురాణము నుబట్టికూడ నీపాలకురికి ఓరుగల్లు ప్రాంతమందలిదని కానసగును. ఇది నేఁటి నిజామురాష్ట్రములో నల్లగొండజిల్లా జనగామ తాలూకాలో వరంగల్లుకు బండ్రెండు క్రోసుల దూరములో నున్నది. ఇది యొకపుణ్యక్షేత్రము. స్వయంభువగు సోమేశ్వరస్వామియాలయము, సోమనాథుని యనంతర మాతని యాశ్రమస్థలిపయి శిష్యులు ప్రతిష్ఠించిన సోమనాథలింగాలయము విశేష మహిమాన్వితములయి భక్తులకు యాత్రారంగములుగ నిచ్చట వెలయుచున్నవి. దీనికి రెండు మైళ్లదూరములోనే బమ్మెర పోతనామాత్యుని

నివాసస్థానమైన బమ్మెర గ్రామ మున్నది. దేశమున మహమ్మదీయ ప్రభుత్వ మేర్పడినతరువాత రాను రాను జనులవాడుకలోను, ఉచ్చారణమునందును నేర్పడిన వ్యత్యయములఁబట్టి నేఁడిది "పాలకుర్తి" అనికూడ వ్యవహరింపఁబడుచుఁ బ్రభుత్వము వారి గ్రామనామ పట్టికలలో నట్టిపేరితోఁ బ్రకటితమైనను, సోమనాథునికాలమునాఁటికిమాత్రము దీనికి "పాలకురికి" యనియే వ్యవహారము "సుకృతాత్మ పాలకురికి సోమనాథ" ఇత్యాది గ్రంథములలోఁ గూడ "పాలకురికి" యనియే యాతఁ డుదాహరించినాఁడు. గిరి సమీపమందలి ఎలకురికి, ఉలుకురికి యను గ్రామములుగూడఁ బైని జెప్పినవిధముగా నేఁడు ఎలకుర్తి, ఉలుకుర్తి యని వ్యవహరింపఁబడుచున్నను బదిరెండవ, పదమూఁడవ శతాబ్దిలశాసనములలో ఎలకురికి, ఉలుకురికి యను రూపములతోనే యామ్నాతమైనవి

1. "రెండువేల్ల ఎలకుర్కి ప్రసన్నవిశ్వేశ్వర దేవరకు సమర్పించినంతాల గని యోగము భోగము వారు . ..కాకతియరుద్రదేవుని ధర్మసాగరము శాసనము—

2. శ్రీచౌండ సైన్యాతి రావపిండు తారం గ్రామం సముగ్రమ స..............న్నుఉలుకుర్కె

సౌంజ్ఞం (గణపతిదేవుని కొండిపర్తి శాసనము శా॥ శ॥ 1136)

పాలకురికిలోనున్న సోమేశ్వరస్వామి యాలయముయొక్క ధ్వజస్తంభము దిగువనున్న బాతిపైఁ గూడఁ బ్రాచీన లిపిలో "శ్రీపాలకురికి సోమేశ్వరస్వామి" అనియే చెక్కఁబడినది. కర్ణాటకవి చరిత్ర ప్రథమసంపుటములో శ్రీనరసింహాచార్యులుగారు సోమనాథునిఁగూర్చి వ్రాయుటలో సరియైన స్థలపరిజ్ఞానము లేని దూరదేశీయులగుటచే నీపాలకురికి "గోదావరిజిల్లా"లోనిదని వ్రాసియున్నారు. వారి వ్రాఁతలననుసరించి 'Kanarese Literature" అను గ్రంథములో శ్రీరైసుదొరగారుకూడ నిట్లే వ్రాసియున్నారు. ఇది పొరపాటు. నేఁడు చెన్నపురి రాష్ట్రమునకుఁజెందిన తూర్పుగోదావరిజిల్లాలోఁగాని పశ్చిమగోదావరిజిల్లాలో గాని "పాలకురికి" లేదు. శ్రీనరసింహాచార్యులుగారి వ్రాత "గంగాయాం ఘోషః" వంటిది కావున పాలకురికి గోదావరి నదీప్రాంతమందలి దను స్థూలగ్రహణమునే వారట్లు వ్రాసియుందురని మనము గ్రహింపఁదగును. పాలకురికి, బమ్మెరగ్రామములకు గొన్ని మైళ్లదూరముననే గోదావరినది ప్రవహించుచున్నది. సోమనాథుఁడు బాల్యమునుండియు శ్రీశైలము, త్రిపు

రాంతకము మున్నగు దివ్యస్థలముల సందర్శించు చుండి నట్లాతని గ్రంథములవలన ద్యోతకమగును కావున నీక్షేత్ర ప్రాంతములందున్న నిజాము రాష్ట్రస్థ పాలకురికియే సోమనాథుని జన్మస్థలముగా గ్రహించుట సర్వవిధముల సంగతముగా నుండును. పూర్వాంధ్ర కర్ణాటకవులు, ఆధునిక చరిత్రకారులు నందఱు నట్లే గణించిరి. కాని కీ॥ శే॥ శ్రీ చిలుకూరి నారాయణరావుపంతులుగారు తాముగూడ నందఱతోపాటు మొదట నిట్లే తలంచినవారయ్యు, ఆంధ్ర గ్రంథమాలిలో ౧౯౧-వ సం॥లో వెలువడిన సోమనాథుని పండితారాధ్య చరిత్రమునకుఁ దాను వ్రాసిన యుపోద్ఘాతములో మైసూరు రాష్ట్రమందలి తుముకూరుజిల్లాలో నేడు "పాలకురికె" యను పేరితో నున్న గ్రామమే సోమనాథుని జన్మస్థల మనువింత వాదమును బ్రతిపాదించిరి. కాని విజ్ఞులెవ్వరు దాని నామోదింపలేరు. ఆవాదమెంతటి యసామంజస్యము నవిస్తరముగ నెఱుంగ నెంచువారు శివధర్మ గ్రంథ మాలికలో బ్రకటితమైన నా "పాలకురికి సోమనాథ కవి" యను గ్రంథమందలి మూఁడవ ప్రకరణమును, ఆగ్రంథమునకు గాను శ్రీనారాయణరావుగారు 1948 నవంబరు భారతిలో వ్రాసినవ్యాసముపై నేను "త్రిలింగ" పత్రికయందుఁ బ్రకటించిన వ్యాసము

లలో 8-8-49, 15-8-49, 22-8-49 తేదుల సంచిక లలో "పాలకురికి" యను శీర్షికగల వ్యాసము లందలి యంశములను జదువఁదగును.

కులగోత్రములు

సోమనాథుఁడు తన మొదటికృతియగు అనుభవసారములో

"భృంగిరిటిగోత్రుఁడను, గురు
లింగతనూజుండ శివకులీనుఁడ, దుర్వ్యా
సంగవివర్జిత చరితుఁడ
జంగమలింగప్రసాద సత్పాత్రుండన్"

అని చెప్పికొనినాఁడు. బసవపురాణావతారికలోఁ గూఁడ నిందు కనుగుణముగనే

" 'ధర నుమామాతాపితా రుద్ర' యనెడు
వరపురాణోక్తి నీశ్వర కులజుండ
శరణగణాశ్రయ సకలస్వరూప
గురులింగ వరకరోదర జనితుండ"

అనియు, పండితారాధ్యచరిత్రలో "ఎద్దురులింగ ఘన కరుణాహస్త గర్భసంభవుఁడ" అనియుఁ జెప్పికొనినాఁడు. గురులింగమనునది వీరశైవులలో దీక్షాగురువునకు నుపయుక్తమగు విశేషణమే గాని యది కేవల మొకవ్యక్తినామము కాదు. "ఏకా

మూర్తి త్రయో భాగా గురులింగ చరాభిధాః"
అను ప్రమాణముచే, ఏకమూర్తియగు లింగమే (పరబ్రహ్మము) గురు, లింగ, జంగమరూపమున మూఁడువిధముల నభేదముగ వ్యవహృతమగును. ఈవిషయమునే యనుభవసారములోని మొదటి పద్యములో

"ఉ. శ్రీగురులింగజంగమ విశిష్టమహామహిమంబు వేఁడెదన్
శ్రీగురులింగజంగమముఁ జెప్పఁ ద్రిమూర్తినిగూఢమైచనన్
శ్రీగురులింగజంగమ విశేషము లేకముఁగాఁదలంచి యా
శ్రీగురులింగజంగమ వశీకృతమౌ మదిఁగొల్చి సమ్మతిన్"

అని సోమనాథుఁడుగూడ నుగ్గడించినాఁడు. వీరశైవ పంచాచార్యుల తొలుదొలుతటినామములగు వీర, నంది, భృంగి, (భృంగిరిటి) వృష, స్కంద అనునవియే వీరశైవుల గోత్రములుగా నాదినుండియు వ్యవహృతమగుచున్నవని ముందే చెప్పియుంటిని. దశవిధశైవులలో నీప్రముఖగోత్రవ్యవహారము కేవల వీరశైవులయందుమాత్రమే గలదు. తక్కిన శైవభేదములకుఁ జెందిన బ్రాహ్మణులలో, లింగధారణ మాహాత్మ్యమంగీకరించఁగల శ్రౌతశైవ మార్గశైవులలో గూడ, ఋషిగోత్ర సూత్రవ్యవహారమే యిచ్చట ప్ర[illegible]చ్చుచున్నది. కావున నేఁటి వీరశైవులు [illegible]కుల గోత్రముల నేరితిగఁ జెప్పికొను

చున్నారో యట్లే సంప్రదాయానుగుణముగ సోమ నాథుఁడుగూడఁ దాను శివకులీనుఁడనని, భృంగిరిటి గోత్రుఁడనని, గురులింగపుత్త్రుఁడనని తన కులగోత్రా దికములను ప్రథమవయస్సులో రచించిన తొలి కృతిలో విస్పష్టముగఁ జెప్పికొనినాఁడు. దీని ననుస రించియే యాతని ప్రశిష్యప్రశిష్యుఁడు పిడుపర్తి సోమనాథుడు పద్యబసవపురాణాశ్వాసాంత పద్య ములలో

"క. భృంగిరిటి గోత్రసంభవ!
జంగమ లింగార్చనా విశారద! విల స
త్సంగీత శాస్త్రపారగ!
గంగోత్పత్తిప్రకార కావ్యధురీణా!"

అని సోమనాథుని సంబోధించినాఁడు. అనుభవసార రచనము నాఁటికి సోమనాథునకు బసవేశ్వరునియం దంతగా వ్యామోహము గలుగలేదనియు, నందు చేతనే యా ప్రథమకృతిలో నాతని నామోచ్చా రణమైనఁ గావింపలేదనియుఁ బైని జెప్పియున్నాను. బసవేశ్వరునందు భక్తిపారవశ్యము గలిగినతరువాత వ్రాసిన బసవపురాణ, వృషాధిపశతక, చతుర్వేద సారములలోఁగూడ సోమనాథుఁడు మఱొకగోత్ర మేదియు జెప్పికొనలేదు. బసవపురాణావతారి కలోనున్న "పాశముక్తుండ కేవల భక్తిగోత్రుండ"

అన్నదానికి భక్తిచే వర్ధిల్లువాఁడ ననుటయేగాని మఱొకటి గాదు. భక్తిగోత్ర మనునది యెవరి యందును లేదు. గోత్రశబ్దమునకు వృద్ధి, బలిమియను నర్థములుగూడ నున్నవి. పాండిత్యముతోపాటు బసవేశ్వరభక్తిపారవశ్యముగూడఁ బండువాఱిన చరమదశలో రచించి బసవేశ్వరునికే యంకితమొనర్చిన పండితారాధ్య చరిత్రముయొక్క యవతారికలోమాత్రము

"బసవని పుత్త్రుండ బసవగోత్రుండ
బసవేశు శ్రీపాదపద్మశేఖరుఁడ
బసవనిఁ బొగడఁబొల్పడు కవీంద్రుండ
బసవన్నఁ బొగడఁబొల్పగు పాఠకుండ
బసవన్నదూతనే బసవన్నబంట
బసవన్న యిలుపుట్టు బానిసకొడుక
బసవన్న లెంకనే బసవన్న లింగి
బసవన్న పన్నలపన్న గావునను."

ఇత్యాదిగా నుదాత్తమగు భక్తిభావముతో భృత్యాచారముతోఁ దన బసవతన్మయత్వమును బ్రకటించినాఁడు. బసవేశ్వరుఁ డొక గోత్రకర్త కాఁడు. బసవగోత్రమనునది నాఁటికి నేఁటికి నెప్పుడుఁ గూడ వీరశైవుల వ్యవహారములో లేనేలేదు. కావున సోమనాథుఁడు వాస్తవముగా బసవేశ్వరుని

పుత్త్రుఁడు కానట్లే తద్గోత్త్రుఁడునుగాఁడు. పురాతన శివభక్తులకుఁ దాము పుత్త్రులము, బంటులము, ఇత్యాదిగఁ జెప్పికొనుటగూడ వీరశైవుల సంప్రదాయము. వృషాధిపశతకమందలి కొన్ని పద్యములలో సోమనాథుఁడు బసవేశ్వరుని గూడనిట్లేవర్ణించినాఁడు. కావునఁ బూర్వోక్తములయిన వీరశైవ సంప్రదాయవ్యవహారముల నించుకయెఱింగిన వారికెల్ల సోమనాథుని వ్రాఁతలఁబట్టియే యాతఁడు పుట్టుకతోనే వీరశైవుఁడని సులభముగా గోచరింపఁ గలదు.

సోమనాథుఁడు తన గ్రంథావతారికలలో నాతని గురులను, మిత్త్రులను గొందఱను బేర్కొనినాఁడు. కాని వారిలో నేకామ్రనాథుఁడేయఁ దేవఁడును లేఁడు అయినను పైనిజెప్పినట్లు భృంగిగోత్త్రుల కెల్ల వీరశైవపంచాచార్యులలోఁ గేదారక్షేత్ర మందలి వైరాగ్యసింహాసనాధ్యక్షుఁడు ఏకోరామాచార్యుఁడు గురువు. అందుచే సోమనాథుఁడు తాను భృంగిగోత్త్రుఁడనని చెప్పికొనినప్పుడాతఁడు ఏకోరామగురుపీఠమునకుఁ జెందిన శిష్యుఁడనుట వీరశైవసంప్రదాయజ్ఞులకెల్ల వేఱచెప్పకయే తెల్లమగును. కావుననే యావిషయము నెఱింగిన యన్యవాద కోలాహల శతకకర్త "ఈ హితానుషంగ!

యేకామ్ర గురుచిత్తనలిన భృంగ"అని సోమనాథుని
సంబోధించుటలో ఛందస్సునకు సరిపడునట్లు "ఏకో
రామ" శబ్దమును "ఏకామ్ర" యని ప్రాస్వీకరించె
నేమోయని నేను నాపూర్వవ్యాసములో వ్రాసి
యుంటిని. అసలతఁడు "ఏక్రాము" అని వ్రాయఁగా
సరిగా గుర్తింపక తాళపత్ర ప్రతిలేఖకు లుచ్చారణ
సౌలభ్యముగ దానిని "ఏకామ్ర" యని యైనను
లిఖించియుండవచ్చును. ఏదియైనను నిది యూహాయే
గాని సిద్ధాంతముగాదు. సోమనాథుఁడు చెప్పుకున్నను
అన్యవాగకోలాహలశతకకర్త [illegible] సోమ
నాథుని గురువు "ఏకామ్ర" నాముఁడు మఱొకఁ
డుండిన నుండవచ్చును. ఏకోరాము, ఏకామ్ర శబ్దము
లేక రూపకములనిగాని యభేదకములనిగాని నే
నెచ్చటను జెప్పియుండలేదు. వ్యక్తుల నామములను
పేర్కొను నవసరములలో మనకవులు ఛందస్సునకు
సరిపడునట్లు వానినిమార్చి పలుతెఱంగులఁ గుదించు
టయో పెంచుటయో పరిపాటియని వాఙ్మయ
శోధకులకుఁ దెలిసినదే. భాషను దనచేతికీలుబొమ్మగా
నాడించిన మనసోమనాథుఁడే యిట్టిమార్పులెన్నియో
చేసికొనినాఁడు. మచ్చునకు బసవపురాణమున సప్తమా
శ్వాసములో ఉగ్ఘటునికథలో "ఉగ్ఘట" శబ్దము
నట్లే [illegible] గాని చెప్పి "ఉదుబటు డనవొప్పు

నొక్క భక్తుండు" "పరమేశ్వరుండు నుద్భటయ్య గారి" అనివాడిన విధము జూడుడు. నేను వ్రాసినదేమో సరిగా గుర్తింపకయే శ్రీవిద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు ఈనడుమ "మాతృసేవ" పత్రికలో శతకవాఙ్మయముపై వ్రాయుచున్న వ్యాసములలో సోమనాథునికి సంబంధించిన వ్యాసములందు విద్యార్థులకుఁ బాఠములఁజెప్పు తమ నిత్యపరిపాటి ననుసరించి కాంబోలు "ఏక+ఆమ్ర, ఏకః+రామ" అని సంధులు విడఁదీసి చూపుచు, ఏకామ్ర, ఏకో రామశబ్దముల భిన్నస్వరూపము లెఱుంగనివానిగా నన్ను నిరూపించుచుఁ దమ హేళనా పాండిత్యము గొంత ప్రదర్శించిరి. కాని సోమనాథుఁడు తనసహజవీరశైవత్వమునకు సాధకముగాఁ జెప్పికొన్న భృంగిరిటిగోత్రజత్వమును గూర్చియు, అనుభవసారకృతి ప్రాథమికత్వమును గూర్చియుఁ జల్లఁగా జాఱవిడిచియుంటఁ గూర్చి యొక్క మాటైనను సమాధానపూర్వకముగ వ్రాయరైరి. వీరి వ్రాఁతలందలి యౌచిత్యమును సహృదయులే పరిశీలింపఁదగును.

ఇట్లు సోమనాథుఁడు సహజవీరశైవుఁడని యాతని ప్రాథమికకృతియగు అనుభవసారమువలననే వ్యక్తమగును. శ్రీవీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవుల

చరిత్ర ప్రథమసంపుట పునర్ముద్రణములో నాతఁడు వీరశైవుఁడనియే వ్రాసిరి. దీనికే నేను వివరణముగ ఆంధ్రపత్రిక దుందుభిసంవత్సరాది సంచికలో సోమ నాథుంగూర్చి మొదట వ్రాసిన వ్యాసములో నాతఁడు వీరశైవులలో భక్తవర్గమునకు జేరిన వాఁడుగాక, గురువర్గమునకు జెందినవాఁడనియు నట్టి వారిని నాంధ్రదేశమున నేఁటివాడుకలో మఠస్థులు, మాహేశ్వరులు, జంగములునను సాంకేతికనామము లతో వ్యవహరించుచున్నారనియు వ్రాసియుంటిని. జంగము, మాహేశ్వరశబ్దములు కేవలము కులవాచ కములు గావనియు, నవి వాఙ్మయమున చరలింగ (జీవరూపమునఁ జరించు శివుఁడు = శివభక్తుఁడు.) వాచకములుగనే యుపయుక్తములయినవని నేను గూడ నెఱుఁగుదును కాని వీరశైవేతరలోకము నకుఁ దెలియుటకయియే నేఁటివాడుక ననుసరించి సోమనాథుఁడు సహజవీరశైవుఁడగు జంగముఁడని నేను వ్రాసినది. సోమనాథుని సొంతవాక్యములవలన నిరూపితమై యాతని ప్రశిష్యకోటికిఁ జెందిన పిడు పర్తి సోమనాథాదుల వ్రాతలచే నిర్ధారితమై, సోమ నాథుని వంశ్యులమని నేఁడు కూడపాలకురికి ప్రాంత మందలి మాహేశ్వర కుటుంబములు చెప్పెడి వాడుకచే నిశ్చితమైన యీనిర్ణయమునే నే నిప్పటి

కిని గలిగియున్నాను. దానిని గాదనుటకుఁ దగిన బల
వత్ప్రమాణములు నాకుఁ గానరాలేదు. ఆంధ్రుల
చరిత్ర రచించిన చరిత్రచతురానన బిరుదాంకితులు
కీర్తిశేషులు శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులు
గారు నానిర్ణయమే యామోదించియున్నారు. సోమ
నాథుఁడు ఆరాధ్యబ్రాహ్మణశాఖలో (శ్రౌతమార్గ
శైవములకుఁజెందినది) జనించి రానురాను బసవేశ్వ
రునియందలి వ్యామోహము హెచ్చినకొలఁది అను
భవసారరచనమునాఁటికి వీరశైవులలోఁగలిసిపోయి
భృంగిగోత్రుఁడనని చెప్పికొనెనని కీర్తిశేషులు శ్రీ
కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారును, నేఁటి
తెలుఁగునాఁటి యారాధ్యుల పూర్వులు లింగధారు
లనుటకుఁగాని, పదునాఱవశతాబ్దికిఁ బూర్వము
బ్రాహ్మణులలో లింగధారణ మొందు నాచారముండె
ననుటకుఁగాని యాధారములే మృగ్యములుగాన
బసవేశ్వరాదులందు భక్తిఁ జూపినంతమాత్రమున
సోమనాథుఁడుగూడ వీరశైవుఁడనుట కాధారము
చాలదనియు, నాతఁడాజన్మము స్మార్త బ్రాహ్మణుఁడు
గనే యుండియుండునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
గారును, సోమనాథుఁడు శివద్విజులను శైవబ్రాహ్మణ
శాఖలో జనించి, రానురాను బసవేశ్వరాదుల వీర
శైవమునం దభిమానము గలుగఁగా సన్న్యసము

స్వీకరించి వీరశైవమత ప్రచారమునకై దేశాటన మొనర్చెనని, అట్టివారినే "జంగములు" అందురని వారియందే భృంగిత్యాది ప్రమథగోత్ర వ్యవహార ముండి యుండునని శ్రీ చిలుకూరి నారాయణరావు పంతులుగారును, వారివారికిఁ దోఁచినట్లు ప్రతి వాదముల నెలకొల్పియున్నారు. నేడు శ్రీ వేంకట కృష్ణశర్మగారు గూడ వీనిని గొంతవఱకు (అందును శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి యభిప్రాయమును గొంచె మెక్కువగను) ననుసరించునట్లు వారి వ్రాఁతల వలనఁ గనుపట్టును. అనుభవసార మే సోమనాథుఁడు బాల్యమున వ్రాసిన ప్రథమకృతి యని నిరూపిత మయినప్పుడు శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి వాద మున కవకాశమే లేదు. సోమనాథుని వ్రాఁతలకు సంప్రదాయములకు విరుద్ధములయిన నిట్టి వాదముల కెల్ల మూలాధారములయినవి శివాగమ పరిచయ లోపమును, జన్మతః బ్రాహ్మణుఁడైనఁగాని సోమ నాథుఁడు చతుర్వేదపారగత్వము నద్వితీయపాండి త్యము గడించియుండుట యసంభవమనెడి దుర్భ్రమయును మాత్రమే యని చెప్పఁదగును. పూర్వోక్తము లయిన శైవాంతర్భాగములలో నుత్తరోత్తరముగ నొక్కొక్కటియు దక్కిన వానికన్న నుత్కృష్టము లని, బ్రాహ్మణులకు గర్భాష్టకమున జరిగెడి యుప

నయనసంస్కారముతో లభించు వేదవిద్యాధి కారములెల్ల శివకులీనులగు వీరశైవులకు నుపనయ నముకంటె నెక్కుడు నియమములతో జరుగు లింగ ధారణదీక్షతోడనే కలుగునని శివాగమప్రతిపాదిత మయిన యథార్థతత్త్వ మెఱుంగువారికి ఒయి వాదమందలి దౌర్బల్య మవగతము కాఁగలదు. కావున సోమనాథుని సహజవీరశైవత్వ మాతని యపారవైదుష్యమునకు సాధకమేగాని బాధక మెంతమాత్రమును గాదు వాస్తవముగా సోమ నాథుఁడు వీరశైవేతర ద్విజశాఖలలో జన్మించి చరమదశలోనే వీరశైవమును స్వీకరించినచో నాతఁ డా పూర్వాశ్రమములోఁ దన ఋషిగోత్రసూత్ర ములఁ బేర్కొనుచు రచించిన గ్రంథ మొక్కటియుఁ గానరాకుండుటకుఁ గారణమేమి? వీరశైవమతస్వీక రణముతో నాతని తొంటికులము దగ్ధమైనట్లే యప్పుడు రచించిన పూర్వకృతులెల్ల నశేషముగ దగ్ధము గావింపఁబడినవని సహృదయులు చెప్ప నేర్తురా?

సోమనాథుని ద్విపద బసవపురాణము నోరు గంటిలో భక్తులు స్వయంభూదేవుమంటపమున జదువుచున్నప్పుడు ప్రతాపరుద్రుఁ డచటికేతెంచి యందుఁగూర్చి యడిగిన సందర్భవిషయమున వ్రాసిన

పద్యములో పిడుపర్తి సోమనాథుఁడు "ధూర్తవిప్రుఁ డొకఁడు భర్తఁజేరి - పాలకురికి సోమపతితుఁ డీ నడుమను బెనచె మధ్యవళ్లు పెట్టి ద్విపద" అని యతిస్థానమున వాడిన "పతిత" శబ్దమును, పండితారాధ్య చరిత్రలో కథాశ్రోణియు, హారితసగోత్రాపస్తంబ సూత్రుఁడు, శైవ బ్రాహ్మణుఁడు నగు పాలకురికి సూరనామాత్యుని విషయమున సోమనాథుఁడు వాడిన "నెచ్చెలికాడవు నీవకావనియు మచ్చికనాముద్దు మఱఁది వీ వనియు అఱలేనిసఖుఁడ! సూరార్య! నాముద్దు మఱఁది! విన్మిది మహిమప్రకరణము" అను విశేషణములలో నతఁడు సూరామాత్యునియెడఁ జెప్పికొన్న ముద్దుమఱఁది సంబంధమును ప్రతివాదులు తమవాదమునకుఁ గొంతయాధారముగఁ గైకొనుచున్నారు. ఈ గొడవలు ముందుగా నా వ్యాసములలో నేనే యెత్తికొని ప్రత్యాఖ్యానమొనరించినవే గాని క్రొత్తవిగావు. సోమనాథుఁడు బ్రాహ్మణవంశములోఁ బుట్టి తరువాత వీరశైవమును స్వీకరించి భ్రష్టుఁడయ్యెననెడి భావముతో నే యాతని యెడ "పతిత" శబ్దమును ధూర్తవిప్రుఁడు ప్రయోగించినట్లు పిడుపర్తి సోమనాథుఁడు వ్రాసినాఁడని వీరి వాదము. శివాగమప్రమాణదృష్టితోఁ జూచిన యెడల జన్మతః శ్రౌతమార్గశైవశాఖలకుఁ జెందిన

బ్రాహ్మణులు, తరువాత కేవల వీరశైవమునే స్వీక
రించినచో నది పైకి మఱికొన్ని మెట్లెక్కి యుత్కృష్ట
తను బడయుటే యగును గాని భ్రష్టతనొందుటగానే
రదు సోమనాథుఁడు శివభక్తివిహీనులగు స్మార్త
బ్రాహ్మణులతోడి వాదములలో వారిని పతితులు
(పాపులు) త్రాటికూలలు, కర్మచండాలురు ఇత్యా
దిగా నిరసింపఁగా వాదములలో నాతని నోడింప
లేనివారు కొందఱు ప్రతికిఁ బ్రతిగా నాతనియెడఁ
గూడనట్టి విశేషణములనే వాడియుందురు. "శ్రుతి
శిరస్సమూహి "పతిరేకయాసీ" త్తను చు నుతింపదుర్గు
ణులు మదించి యితరసురలఁబట్టి 'పతితులు' సన్మతి
బాహ్యులగుటదేమి? బసవలింగ!" అని చతుర్వేద
సారపద్యమునందును, పండితారాధ్యచరిత్ర దీక్షా
ప్రకరణములో విభూతిమహిమసిద్ధాంతప్రతిపాద
నమున "పతత్యేవనసంశయః" "పాతిత్యంయాతితత్
క్షణాత్" అనుస్మృతి పురాణప్రమాణముల నుద్ధ
రించుటలోను, ఇట్టే మఱికొన్నిపట్టులను సోమ
నాథుఁడు పాపాత్ము లనునర్థమిచ్చు సందర్భముననే
పతితశబ్దము నుపయోగించినాఁడు. పరమేశ్వరుని
విషయమున "పతితపావన" విశేషణమును సాధా
రణముగ నందఱు వ్యవహరింతురు. కావున పతిత
శబ్దమునకు పాపి యనునది రూఢార్థమైనట్లు కుల

భ్రష్టుఁడనునది కాదు. ఇంతకు ప్రతాపరుద్రు నెదుట సోమనాథునెడ బ్రాహ్మణు లేనిరసనవాక్యముల వాస్తవముగ నుపయోగించిరో పిడుపర్తి సోమనాథుఁడు స్వయముగా నెఱుగునా? పరమపవిత్రుఁడగు నాతనిని ధూర్తబ్రాహ్మణుఁడు నిందించెనను భావమును వ్యక్తీకరించుటలోనే భ్రష్ట పతితశబ్దములలో నేది యచ్చట నుపయుక్తమయినను యతిభంగము లేకున్నను పతితశబ్దమునే యాతఁ డుపయోగించి యుండెను

సోమనాథుఁడు తనకృతులలో అనుభవసారమునకు గోడగి త్రిపురారిని, బసవపురాణమునకు గొబ్బూరి సంగనామాత్యుని, పండితారాధ్యచరిత్రకు పాలకురికిసూరనామాత్యుని గథాశ్రోతలుగా గూర్చి కొన్నాఁడు మొదటికృతిలో త్రిపురారిని దప్ప మఱే మిత్రుల నాతఁడు పేర్కొనలేదు బసవపురాణావతారికలోఁ గథాశ్రోత గొబ్బూరి సంగనామాత్యునితో పాటు మరల గోడగి త్రిపురారిఁ, మఱికొంద ఱితర మిత్రులను భక్తులను బేర్కొనినాఁడేగాని యెప్పుడు గూడఁ బాలకురికి సూరనామాత్యుని స్మరింపలేదు.- ఈతనితో మిత్రత్వము గాని, తద్రూపకమయిన బంధుత్వము గాని సోమనాథుని కాపిష్మటనే ఘటిల్లి యుండును. ఎప్పుడది గలిగినను వారిరువురు భిన్నగోత్ర

సూత్ర వ్యవహారముగల వేర్వేఱు సంప్రదాయము లకుఁ జెందిన శైవులని సోమనాథుని వాక్యముల వలననే వ్యక్తమగుచున్నది. శ్రౌతమార్గశైవసంప్ర దాయములవా గుహనయముతోపాటు ఇష్టలింగ ధారణము.గూడ నొంది వంశానుగతమయిన శ్రౌత స్మార్త కర్మముల గొన్నిటి నాచరించుచు, ఋషిగోత్ర సూత్రవ్యవహారమునే గలిగియున్నను వారు పూర్వ కాలమున లింగధారణము లేని స్మార్తబ్రాహ్మణులతో నెట్టి సంపర్కము లేక కేవల లింగధారణమే గల వీర శైవులతో నెక్కువ సాహచర్యసౌహార్దములను గలిగి యన్యోన్యమైత్రితో వర్తిల్లుచుండిరనుట కనేకాధారములున్నవి. ఈసాహచర్య మానాఁడు వీరికి వీరశైవులకు సహభోజనములు గలిగియుండె నేమో యనునంతవఱకుఁ గూడ సాగియుండవచ్చు నని "ఆంధ్రవిజ్ఞాన"కర్తలు కీ॥ శే॥ శ్రీరాజాకందు కూరి బాలసూర్యప్రసాదరావుగారు (దేవిడీసంస్థా నాధీశులు) మున్నగు పెద్దలు కొందఱు తలంచు చుండిరి. కాని కేవల వీరశైవులతో శ్రౌతమార్గశైవ సంప్రదాయములకుఁ జెందిన శైవబ్రాహ్మణులానాఁడు వైవాహికబంధముఁ గూడఁ గలిగి యుండిరని తలంచు వారెవరును గానరాలేదు. కావున భృంగిగోత్రుఁ డైన కేవల వీరశైవుఁడౌ పాలకురికి సోమనాథుఁడు,

హారితసగోత్రుఁడు మార్గశైవుఁడు నగు పాలకురికి సూరనామాత్యుఁడు నిరువురు నెంత యఱలేని మచ్చికగల నెచ్చెలికాండ్రయినను, ఇచ్చి పుచ్చు కొను పెండ్లిసంబంధములుగూడఁ గలిగిన నిక్కంపు బావమఱఁదులు గారనియు, సోమనాథుఁడు చెప్పిన యీముద్దుమఱఁది సంబంధము తిక్కన మనుమ సిద్ధుల మామమల్లుర సంబంధమువలె నఱలేని మచ్చిక కలిమిఁ జెప్పిన యౌపచారిక సంబంధమని సంభావించుటయే సమంజసమని నేను వ్రాసియుం టిని. భిన్నగోత్రులయినప్పు డేకగృహనామకత్వము వైవాహికబంధమునకు బాధకము గాకపోవచ్చును. సోమనాథ సూరనామాత్యుల యింటిపే రొక్క టైనను వారు వేర్వేఱు ఋషిగోత్రజులు గారు గదా! వారిగోత్రములు కేవలము భిన్నసంప్రదాయ ములకుఁ జెందినవి. వారు నిక్కంపు బావమఱఁదు లే రైననాఁ డాబంధుత్వముతోపాటు సోమనాథుఁడు తనకు సూరనామాత్యునకుఁ గలయఱలేనిసఖిత్వము నెచ్చెలితనము నంతగట్టిగా నుగ్గడించుట కవసరమే గానరాదు ఆనాఁడు ప్రథమగోత్రసూత్రవ్యవ హారముగల కేవలవీరశైవులకు, ఋషిగోత్రసూత్ర వ్యవహారముగల శైవబ్రాహ్మణులకు వైవాహిక సంబంధములుగూడ నుండెనని పరిశోధకు లెవరైనను

ప్రమాణపూర్వకముగ నిరూపింపఁగల్గుచో సోమ
నాథ సూరనామాత్యుల భావమైక్యముల సంబం
ధము కేవల మౌపచారికమే గాక యౌగికము
గూడ నై యుండునని యంగీకరించుటకు నాకభ్యం
తరము లేదు. సోమనాథుని సహజవీరశైవత్వవిషయ
మునఁ బ్రతిపక్షవాదములందలి యసామంజస్యము
నింకను విపులముగ నెఱుంగ నెంచువారు ఆంధ్ర
సాహిత్యపరిషత్పత్త్రిక సం॥ , 19 సంచికలు 3, 4, 5
లందుఁ బ్రకటితమయిన "పాలకురికి సోమనాథకవి
కులగోత్రప్రశంస" అను నావ్యాసమును, పూర్వోక్త
మయిన "పాలకురికి సోమనాథకవి" యను గ్రంథ
మందలి యైదవప్రకరణమును, శ్రీ చిలుకూరి నారా
యణరావుగారి వ్రాఁతలపయి మరల 1949 సం॥
ఆగష్టు 29 సెప్టెంబరు 5, 12, 19 అక్టోబరు 31
తేదులు "త్రిలింగ" పత్త్రికలలో "సహజవీరశైవ
త్వము" అను శీర్షికతో వ్రాసిన వ్యాసములందలి
యంశములను జూడఁదగును.

### తల్లిదండ్రులు, గురులు, మిత్త్రవర్గము, కుటుంబము

సోమనాథుఁడు తనతల్లిదండ్రుల పేళ్ళను దొల్లిటి
కృతి యనుభవసారములోఁ బేర్కొనలేదు. అందుఁ
జెప్పిన "గురులింగ తనూజుండ" అను సమాసమందలి
గురులింగశబ్దము దీక్షాగురునకు వీరశైవు లుపయో

గించు సాంకేతికవిశేషణమని మున్నే చెప్పియుంటిని. తరువాత వ్రాసిన బసవపురాణావతారికలో "భ్రాజిష్ణుఁడగు విష్ణురామిదేవుండు తేజిష్ణువగు శ్రియాదేవియమ్మయును, గారవింపఁగనొప్పు గాదిలిసుతుఁడ" అని చెప్పియుండుటచే నిందలి విష్ణురామిశ్రియాదేవులే యాతని తలిదండ్రులని యూహింపఁదగును. సోమనాథునిజనకు లాతని బాల్యముననే చనిపోవఁగా నప్పటి పాలకురికి గ్రామపరిపాలకులు, శైవబ్రాహ్మణ (మార్గశైవ) కుటుంబమువా రాతని నాదరించి పోషించిరని యొకయైతిహ్యముకూడ నాప్రాంతమందున్నదని, యాసమీపమందలి మల్లంపల్లిలో నిప్పుడున్న "ఉత్తంగురాజు" అను గృహనామము గల నియోగిబ్రాహ్మణులు తా మావంశస్థులమని చెప్పికొనుచున్నారని శ్రీ॥ శే॥ శ్రీచిదిరెమఠము వీరభద్రశర్మగారు "విభూతి" పత్రికావ్యాసములలోఁ బ్రకటించియున్నారు. ఆసందర్భములోఁ బైనిజెప్పిన విష్ణురామిశ్రియాదేవులు సోమనాథుని పోషకజనకులైనను గావచ్చును. "గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ" అనునది యీ రెండవ యూహకే యెక్కుడు పోషకముగఁ గన్పట్టును. ఈనామములు విష్ణుదేవశాస్త్రులుగా నుండుట సోమనాథుఁడు స్మార్తబ్రాహ్మణకుటుంబముననే జన్మించెనని వాదించు

వా రొకింత సహాయకముగ గైకొనుచున్నారు. కాని యది యవిచారమూలకమే. అందుకు వ్యక్తిరేకముగనున్న యితర ప్రబలాధారముల కిది యేపాటి బంధకము కాఁజాలదు. వీరశైవులదృష్టిలో విష్ణు వొక పరమశివభక్తుడు. పలువురు శివభక్తుల నామములతో పాటు విష్ణుసంబంధిక నామములను గూడఁ దమసంతతికిఁ బెట్టినవారు పూర్వము నిప్పుడు గూడ వీరశైవులలోను శైవబ్రాహ్మణులలోను గలరు. ఏకాంతరామయ్య, ఏకోరామయ్య, సిద్ధరామయ్య, చెన్నరామయ్య, హరిశ్వరుఁడు, పద్మరసు, రాఘవాంకుఁడు, పద్మణాంకుఁడు మున్నగు పేర్లుగల వీరశైవులు పూర్వకాలమునందే గలరు

సోమనాథుని కవితావిద్యాగురువు కరస్థలి విశ్వనాథుఁడు. ఆవిషయము నాతఁడు అనుభవసారమునను, బసవపురాణావతారికయందును విస్పష్టమొనర్చినాఁడు. పిడుపర్తి సోమనాథుఁడు గూడ దీని నుగ్గడించినాఁడు. చతుర్వేదపారగుఁడైన తరువాత రచించిన పండితారాధ్యచరిత్రావతారికలో సోమనాథుఁడు “పేరెన్నఁబడిన శ్రీబెలిదేవ వేమ—నారాధ్యులను పరమారాధ్య దేవు—మనుమని శిష్యుండ” అని వ్రాసికొని తనకు వేమనారాధ్యుని మనుమఁడు మఱొక గురుఁడని చెప్పికొన్నాఁడు. బసవేశ్వర

మల్లికార్జునపండితారాధ్యుల సమకాలికుఁడై విశేష
మహిమాన్వితుఁడై, పేరెన్నికగన్న యీ బెలిదేవ
వేమనారాధ్యుని చరిత్రమును సోమనాథుఁడు పండి
తారాధ్యచరిత్ర పురాతనప్రకరణమునఁ బ్రత్యేక
ముగఁగూడ గూర్చి యందులో నాతని "ప్రకట
చతుర్వేదపారఁగతుండు" అనికూడఁ బ్రశంసించి
నాఁడు. వేదవిద్య యాతనియింట సమూచానముగ
నుండియుండును కావున నీతని మనుమనియొద్దనే
సోమనాథుఁడు వేద వేదాంగముల నభ్యసించి
యుండును.

బసవపురాణావతారికలో "కట్టకూరి పోతిదేవర
పదాంబుజషట్పదుండ" నని సోమనాథుఁడు చెప్పి
కొనియున్నాఁడు. ఆరాధ్యశబ్దమువలెనే దేవరకూడ
పూజ్యవాచకము. 'దేవ'శబ్దమునకుఁ గన్నడ బహు
వచనమయిన "దేవరు" పదమునకిది వికృతి. వీరశైవ
మఠస్థల గురుజంగములు పలువురు తమనామముల
చివర నీ దేవశబ్దమును జేర్చికొనుట పరిపాటి. కట్ట
కూరు పాలకురికి సమీపముననే యున్నది. కావున
నీ పోతిదేవ సోమనాథునివలెనే భృంగిగోత్రుఁడైన
మఠస్థలగురుపట్టజంగముఁడై యుండుననియు, వీర
శైవసంప్రదాయానుబద్ధముగ సగోత్రుఁడగు నాతని
చేతనే సోమనాథునితలిదండ్రు లాతనికి లింగధార

ణము చేయించియుందురనియు, అందుచేతనే యాతని విషయమున "పదాంబుజషట్పదుండ" విశేషణమును సోమనాథుఁడు చెప్పికొనెననియు నేను దలంచుచున్నాను. సోమనాథుఁడు సహజప్రతిభావంతుఁడు, శివభక్తిసంపన్నుఁడు నయి బాల్యయౌవనముల నేమాత్రము బీఱువుచ్చక విద్యార్జనమునందును, సద్భక్తసాహచర్యమునందును గాలము గడపుచుఁ బాలకురికి ప్రాంతమందే త్రిపురాంతకము శ్రీశైలము మున్నగు శివక్షేత్రములకుఁ గూడ నేగి వానిని సందర్శించుచు నచ్చటను విద్యాధ్యయన మొనరించుచుండెను. బసవపురాణపండితారాధ్యచరిత్ర రచనముల కుద్బోధము శ్రీశైలక్షేత్రమందలి యొడ్డోలగముల భక్తసమితమునసే తనకుఁగలిగిన ట్లాతఁడు చెప్పికొన్నాఁడు బసవపురాణకథాసూత్రములఁ దన కెఱింగించిన పెద్దలలో త్రిపురాంతకవాస్తవ్యుఁడగు కరస్థలి సోమనాథుని, రెంటాల మల్లినాథుని, మఱియొక మల్లినాథుని, దోచమాంబను నాతఁడు పేర్కొన్నాఁడు. వీరిలోఁ గరస్థలి సోమనాథుఁడు సోమనాథునికి విద్యాగురుఁడైన విశ్వనాథునియగ్రజుఁడైనను గావచ్చును. వీరు, అనుభవసార బసవపురాణపండితారాధ్యచరిత్ర కథాశ్రోతలు గోడగి త్రిపురారి, గొబ్బూరి సంగనామాత్య

పాలకురికి సూరనామాత్యులుగాక సోమనాథుఁడు వడగాము రామేశునిశిష్యుఁడైన చెన్నరాముఁడను మఱొక ప్రాణమిత్రునిఁ జేర్చుకొన్నాఁడు. ఇట్టి మహా భక్తులతోడి గోష్ఠిసాహచర్యములు సోమనాథుని విద్యావైదుష్యములకు మఱింత వికాసమునుగూర్చి యాతని కవిత్వమునందలి రసస్ఫూర్తికిఁ జాల దోహదమును గలిగించెనని తలంపనగును.

తోంటదార్యుఁడు తన పాలకురికి సోమేశ్వర పురాణములో నాతఁడు వేమనారాధ్యవంశ్యుఁడని, గురులింగ మంగళాంబికలపుత్త్రుఁడని సోమనాథుని కృతులందలి వ్రాఁతలను సరిగా గుర్తింపక వ్రాసినాఁడు వేమనారాధ్యుఁడు సోమనాథుని విద్యాగురునితాతయే గాని యాతనికూటస్థుఁడు కాఁడు. గురులింగము సోమనాథునితండ్రి పేరు గాదని ముందే తెలిసికొంటిమి గదా! సోమనాథునితల్లి మంగళాంబయనుట కాతనికృతులందెట్టి యాధారమును లేదు. కావున నీవిషయములలో తోంటదార్యుని వ్రాఁతలకుఁ బ్రామాణ్య మొసంగఁ జాలము.

సోమనాథుఁడు యావజ్జీవము గృహస్థాశ్రమవర్తియైనట్టే కన్పట్టును. అతఁడు సన్న్యాసమును స్వీకరించెననుటకుఁగాని విరక్తుఁడు (నిరాభార వీర

శైవుఁడు)గా వర్తిల్లెననుటకుఁగాని యెట్టి యాధారము లేదు. తోంటదార్యుని గ్రంథమునుబట్టి యాతనికిఁ జతుర్ముఖబసవేశ్వరుఁ డనుపుత్త్రుఁ డుండెననియుఁ, దండ్రితోఁగలిసి యాతఁడు చక్రపాణి రంగనాథాది ప్రత్యర్థుల నోడించెననియు, సోమనాథునియనంతరము శిష్యు లాతనికే తండ్రి గురుపట్టముఁ గట్టిరనియుఁ దెలియుచున్నది.

## వైదుష్యము, బిరుదములు

సోమనాథుఁడు సమస్తవిద్యల నాకళించిన యుద్దండపండితుఁడు. సర్వజ్ఞుఁడు. సరసకవితావిశారదుఁడు. సంగీతశాస్త్రపారగుఁడు. పిడుపర్తి సోమనాథుఁ డీతని శక్తియుక్తుల నిట్లు వర్ణించినాఁడు.

సీ॥ లిపి లిఖింపకమున్న యపరిమితార్థోక్తి
  శక్తి యాతనిజిహ్వ జరగుచుండు
ఛందోధికరణాది సరణిఁ జూడకమున్న
  మదినుండుఁ గావ్యనిర్మాణశక్తి
భాష్యసంతతులు చెప్పక చూడకయమున్న
  రుద్రభాష్యక్రియా రూఢి వెలయుఁ
దర్కశాస్త్రాది విద్యలు పఠింపకమున్న
  పరపక్షనిగ్రహప్రౌఢి వెలయుఁ
గీ॥ నతని నుతియింప నాబోటి, కలవియగునె
జైనమస్తకవిన్యస్త శాతశూల

కలితబిజ్జల తలగుండు గండబిరుద
శోభితుఁడు పాల్కురికి సోమనాభిధుండు

ఇట్టి యపారవిద్యాసంపత్తి కేవలము గురుకుల వాసముననే యార్జింపనలెనన్న నొక్కజన్మములో లభించునట్టిది గాదు. కావున నీత డు గురువులనుండి పడసిన విద్యాసంస్కారము నామమాత్రమే యని యెన్నఁదగును "ప్రవేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అనున ట్లీశ్వరప్రసాదమున నప్రయత్నముగనే సకల విద్యాశక్తులు నీతనిని వరించియుండును. అందు చేతనే యీతనిని సాక్షాత్తు భృంగియవతారమని తలంచిరి. బహుముఖములయిన యీతనికృతులు బహుముఖ మగు నీతని వైదుష్యమున కాదర్శముగ నున్నవి. ఆంధ్రకవులలో సర్వజ్ఞతాశక్తి గల నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ, నన్నెచోడ, నాచన సోమనాథ శ్రీనాథాదుల మించిన విద్వత్కవిగా నీతని గణింపఁ దగును. చెన్నబసవపురాణకర్త అత్తలూరి పాపయామాత్యుఁ డీతనిని "వరసర్వజ్ఞశిఖామణి" యని నుతించినాఁడు. ప్రత్యక్షభృంగీశావతార, తత్త్వ విద్యాకలాప, అన్యవాదకోలాహల, కవితాసార మున్నగు బిరుదము లీతనికిఁ గలవని కర్ణాటకవిచరిత్ర చెప్పుచున్నది.

## ఆచారవ్యవహారములు

ఈతఁడు చతుష్షష్టి శీలసంపన్నుఁడు. అతని వీర శైవాచారధౌరేయత కొలఁది యిడరానిది. సాటి లేనిది. భవి (శివభక్తి విహీనులు) జనదర్శన స్పర్శనాదుల నీతఁడు కలనైన నంగీకరించెడివాఁడు కాఁడు. "భవిజన సమాదరణ సంభాషణాదిసంసర్గ దూరగుఁడ" "భవికృతారంభసంభవధాన్యనిచయ భవినిరీక్షణ రసపాకవితాన భవిహస్తగతఫలపత్ర శాకాది భవిగృహక్షేత్రాది పథవర్జితుండ" ఇత్యాదిగా నాతఁడే చెప్పికొనినాఁడు. పిడుపర్తి సోమనాథుఁ డీతని విగ్రహావర్ణనములో "నిర్మల పటీపటలావృత దేహు" అనికూడఁ జెప్పియున్నాఁడు. ఈ పటలావరణము భవిముఖదర్శన నిరాకరణమునకై యుండును. వీరశైవమందలి చతుష్షష్టి శీలనిర్వాహణ మీమహనీయునితో నంతరించెనని పెద్దలు చెప్పుదురు.

## కాలము

బసవేశ్వరుఁడు నాతని యేలికబిజ్జలుఁడు నిరువురు నించుమించుగ నేకకాలముననే క్రీ. శ. 1 68 లో మరణించియుందురని చరిత్రజ్ఞులు నిర్వివాదముగ నిర్ణయించియున్నారు. మల్లికార్జునపండితుఁడు బసవేశ్వరసందర్శనార్థమై కల్యాణపట్టణమున కేఁగుచు

మార్గమధ్యమున వనిపుర గ్రామమున విడిసియుం డఁగా నంతకుమున్నె నిమిదిదినములై కల్యాణమున ఘటిల్లిన గజిబిజివలన బసవేశ్వరుఁ డవతారమును జాలించి సంగమేశ్వరునం దైక్యమైనవార్త కొందఱు భక్తులవలన విని ప్రలాపించి, బసవేశ్వ రానంతరము తాను ప్రపంచమున నుండియుఁ బ్రయోజనములేదని తలంచి, ప్రయాణమును శ్రీ శైలముపయిపునకు మరలించి, శ్రీగిరి ప్రదక్షిణాదు లతో శివరాత్రి వ్రతమును నిర్వర్తించి, సంగమేశ్వర క్షేత్రమున బసవేశ్వరుబింబలేఁ దన్నుఁగూడ నైక్య మొనర్చుకొమ్మని మల్లికార్జునస్వామిని బ్రార్థించి యాతనియందు లీనమయ్యెనని సోమనాథుఁడు పండి తారాధ్యచరిత్రమునఁ జెప్పియున్నాఁడు. కావున బసవేశ్వరునియనంతర మొకటి రెండుసంవత్సరముల లోనే మల్లికార్జునపండితుఁడు క్రీ. శ. 1170 ప్రాంత మున మరణించెననికూడఁ బలువురుచరిత్రజ్ఞు లంగీ కరించియున్నారు. ఇందుచే సోమనాథుని కాలనిర్ణ యమునకై వీరియనంతర మెంతకాలములో నాతఁ డుండెననుటయే విచారణీయము. బసవపురాణము చివర "ప్రస్తుతింపంగ సద్భక్తివిస్ఫురణఁ బ్రస్తుతి కెక్కిన బసవనిచరితఁ జెప్పితి భక్తులచే విన్నమాడ్కి" అని చెప్పియుండుటచే నీతఁడు బసవనికిఁ గేవలము

సమకాలికుఁడై యాతనిచరితమును స్వయముగ సాకల్యముగ నెఱిఁగినవాఁడు కాఁ డనుట స్పష్టము. బసవపురాణకథాసూత్రములఁ దనకెఱింగించిన పెద్దలలో త్రిపురాంతకవాస్తవ్యుఁడైన కరస్థలి సోమనాథు నీతఁ డీగ్రంథావతారికలోఁ "పండితారాధ్య కృపాసముద్గతుఁ"డనికూడ వర్ణించినాడు. దీక్షా గురుని దయాహస్తగర్భసంభవులని చెప్పికొనుట లింగదీక్షితులసంప్రదాయమని ముందే గుర్తించితిమి. కాన పైవిశేషణమునుబట్టి కరస్థలి సోమనాథుని దీక్షాగురు వాకాలమునఁ బ్రసిద్ధికెక్కిన మల్లికార్జున పండితారాధ్యుఁడే యని స్ఫురింపఁగలదు. గోదావరీమండలమున దక్షారమక్షేత్రమందలి భీమేశ్వర స్వామి నర్చించుచు భీమనపంతుఁడు పుత్త్రసంతానార్థియై శ్రీశైలమల్లికార్జునునిఁగూర్చి తప మొనరింపఁ దత్ప్రసాదముననే యాతనికిఁ బండితారాధ్యుఁడుదయించెనని, తల్లిదండ్రు లాస్వామినామమునే యాతనికిఁ బెట్టిరని పండితారాధ్యచరిత్రము నను న్నది. కావున మల్లికార్జునపండితుఁడు దక్షారామప్రాంతీయుఁడై వను మొదటినుండియు నడుమ నడుమ శ్రీశైలయాత్ర కేఁగుచుండెడివాఁడనియు, అప్పుడు కరస్థలి సోమనాథుఁ డాతనినుండి దీక్షనొందియుండుననియుఁ దలంచుట కెట్టియభ్యంతరము లేదు. ఈతఁడు

సోముని బసవపురాణరచనకాలమునాఁటికి డెబ్బది యెనుబదేండ్లవృద్ధుఁడై యుండును. పండితారాధ్య చరిత్ర రచనమునాఁటి కాఁతడు జీవించియుండెనో లేదో చెప్పఁజాలము. ఆగ్రంథావతారికలో నాతఁ డుదాహృతుఁడు కాలేదు. సోమనాథుఁడు పేర్కొన్న విద్యాగురులలో శెలిదేవ వేమనమనుమ డొకఁడని మున్నే చెప్పితిని. ఈవేమనారాధ్యుఁడు బసవేశ్వర మల్లికార్జునపండితులకు సమకాలికుఁడనియు నాతఁడు సూరసానమ్మ మున్నగుభక్తులు పండితారాధ్యుఁడు మతప్రచారమునకై యొనర్చు సంచారములలో నాతఁడు వెల్నాటిచోడుని సభకు చందవోలు రాక మున్నే యాతని సందర్శించి బసవేశ్వరుని భక్తి మహిమముల నాతనికి వినిపించి యాతనిమన్ననలనంది రని పండితారాధ్యచరిత్ర దీక్షాప్రకరణమునఁ జెప్పఁ బడినది. ఆగ్రంథమున వర్ణితమయిన యీవేమనా రాధ్యునిచరితమువలన నాతఁ డాకాలమునఁ బేరెన్నిక గన్న మహిమశాలియని తెల్లమగును. ఆతఁ డించు మించుగఁ బండితారాధ్యునికి సవయస్కుఁడై యాత నితోపాటు క్రీ. శ 1170 ప్రాంతమున మరణించి యుండును. ఇఁకఁ బండితారాధ్యచరిత్రము చివర సోమనాథుఁ డప్పటికి సజీవులై యున్న పండితా రాధ్యునిమనుమలు మనుమపండితాదులు నలువురను,

పండితారాధ్యునికుమారుఁడు కేదారయ్యకు శిష్యుఁ
డైన ఇవటూరి సోమనాథయ్యను నాతనిపుత్త్రులు
సూరీశ్వరుఁడు మొదలగు ముగ్గురను జేర్కొని
వారినందఱను "తనయ తనయు పరంపరోత్తరపరం
పరలుఁ బరిచిత గురుపరంపరఁ దేజరిల్లు" ఇత్యాదిగా
నాశీర్వదించినాఁడు. ఉపలబ్ధములైన సోమనాథుని
కృతులలోఁ బండితారాధ్యచరిత్రమే కట్టకడపటి
దిగాఁ గన్పట్టుచున్నది. ఆగ్రంథరచనమునాఁటికి
క్రీ. శ. 1170 ప్రాంతమున లింగైక్యమొందిన మల్లి
కార్జునపండితుని మనుమలు నాతని పుత్త్రశిష్యుఁడు
ఇవటూరి సోమనాథయ్య యతని సుతులు జీవించి
వెలయుచున్నారన్నప్పుడు తరమునకు ముప్పది
యేడులు చొప్పున గణించినను బండితారాధ్యచరిత్ర
రచనకాలము క్రీ. శ. 1230-35 కన్నఁ గ్రిందికి రానే
రదు. ఈవిషయము లన్నింటిని గలిపి సమాలోచించి
సమన్వయించినచో బసవేశ్వరపండితారాధ్య, వేమనా
రాధ్యులను స్వయముగా నెఱుంగక, పండితారా
ధ్యునిశిష్యుఁడు కరస్థలి సోమనాథయ్య కాతని పరి
ణతవయస్సులో సమకాలికుఁడై, యాతనివలన బసవ
చరిత్రము కొంతయెఱింగి, వేమనారాధ్యునిమనుమని
వద్ద వేదవేదాంగముల నభ్యసించి,పండితారాధ్యుని
మనుమలను దన చరమవయస్సులో స్వయముగఁ

జూచి యానందించి యాశీర్వదించిన మనకవి సోమ
నాథుడు క్రీ. శ. 1160 ప్రాంతమున జనించి బస
వేశ్వర పండితారాధ్యుల నిర్యాణకాలమునకు వారి
చరిత్రముల స్వయముగాఁ దెలియనేరనియొనిమిది
పదియేండ్లప్రాయమువాఁడై, అనుభవసారమును
క్రీ. శ. 1180 ప్రాంతమునను, బసవపురాణమును
క్రీ. శ. 1192 ప్రాంతమునను, పండితారాధ్యచరిత్ర
మును డెబ్బదియేండ్ల గిండువయస్సులో క్రీ. శ.
1230 ప్రాంతమునను రచించి రమారమి తొంబదేండ్లు
బ్రతికి క్రీ. శ. 1240 ప్రాంతమున శివైక్యమొందెనని
తలంచుటయే సర్వవిధముల సమంజసమని నా యభి
ప్రాయము బయటియాధారములు వేనితోను నిమి
త్తము లేకయే సోమనాథుని సొంతవాక్యములందుఁ
బ్రమాణబుద్ధిగలవారికెల్ల నాతని గ్రంథముల యంత
స్సాక్ష్యమునుబట్టి యింతకన్న భిన్నమైన నిర్ణయ
మేర్పడుట కవకాశము లేదు. సోమనాథుని కథా
శ్రోతలు మువ్వురుకూడఁ దమకాలమున భక్తిసాప
న్నతచే వన్నెకెక్కినవారయ్యుఁ జారిత్రకముగఁ
బ్రసిద్ధికెక్కినవారు గాకపోవుటచేఁ బ్రత్యేకముగఁ
వారి కాలనిర్ణయమొనర్పఁదగిన యాధారము
లేమియు లేకున్నవి. అందుచే సోమనాథుని కాల
నిర్ణయమునకు వారు మన కుపకరింపక యాతని

కృతులమూలముననే లోకమునకు స్మరణీయులైనారు.

ఆంధ్రకర్ణాటవాఙ్మయములం దీకాలనిర్ణయమున కనుకూలముగఁగాని ప్రతికూలముగఁగాని యుండు నాధారముల నిఁక నొక్కింత పరామర్శింతము. బసవేశ్వరుడు కర్ణాటదేశమున జనించి యచ్చటనే విశేషముగ వీరశైవమతోద్ధరణ మొనర్చినవాఁడయ్యు నాతని చరితము నింత విపులముగఁ బురాణరూపముగఁ గన్నడకవులెవరు సోమనాథునికి ముప్పు రచించియుండలేదు. బసవేశ్వరుని యనంతరమాకాలములోఁ బంపాక్షేత్రమందుండిన హరీశ్వరుఁ డనుకవిమాత్రము కొందఱు శివభక్తులఁ గూర్చి "శివగణదరగళె" యను కావ్యమును రచించి దానిలో స్వల్పముగ బసవేశ్వరునిచరిత్రముగూడఁ గూర్చియున్నాఁడు. ఈతఁ డీరగళెమాత్రమేగాక గిరిజాకల్యాణము, పంపాశతకము, రక్షాశతకము మున్నగు ప్రౌఢకృతులురచించిన సుప్రసిద్ధకవి క్రీ.శ. 1245 ప్రాంతమున జైనకవి మల్లికార్జునుఁడు సంధానించిన "సూక్తిసుధార్ణవము" అను గ్రంథమున గిరిజాకల్యాణమునందలిపద్యములు కొన్ని యుద్ధృతము లగుటచే హరీశ్వరునికాలము క్రీ. శ. 1.10 కుఁ గొంత ముందేకాని క్రిందికి రాఁజాలదని పలువురు

పండితులయభిప్రాయము. కర్ణాటకవి చరిత్రకారు లీతనికాలము మనసోమనాథునికాలముతో పాటు క్రీ. శ. 1195 ప్రాంతమని నిర్ణయించినారు ఈతఁడు సోమనాథునిఁగాని, సోమనాథుఁడీతనిఁగాని తమకృతులలో స్మరించియుండలేదు. ఇంచుమించుగ నేక కాలమున దూరముగ వేర్వేఱుప్రాంతములనుండి యప్పటికి వా రొకరికృతుల నొక రెఱుంగకుండుటయే దీనికిఁగారణమనుట విస్పష్టము సోమరాజను మఱొక కర్ణాటవీరశైవకవి "శృంగారసార"మను నామాంతరముగల యుద్భటకావ్యమును గూర్చి "శాలివాహన శాకాబ్దమదెన్దొ సాసిరదనూఱఱింసంద నాల్వత్తు నాల్కనె యాంగిరసచిత్రభాను వవరాశ్వీ జోత్స్నితైకాదశీపన జాతారితనూజ వాసరదొళా దత్తల్ల మంగర్పితమ్" అని యీగ్రంథరచనాకాలము శా. శా. 1144 (క్రీ. శ. 1222) అనికూడఁ జెప్పియున్నాఁడు. ఇందాతఁడు పూర్వకవిస్తుతి నిట్లుఁ గావించినాఁడు.

మ. ప్రమథానీక కథార్ణ వేందు హరిదేవాచార్యనం ధైర్యనం
విమలజ్ఞాన స[illegible]స్ఫురిత చేతస్సద్మనం పద్మనం
సముదంచద్వృషభస్త వామర మహీజారామనం సోమనం
క్రమదిందంబలగొండు పేళ్వె నొసెదానీ కావ్యమం సేవ్యమం

మతెవ్వరి నాతఁడు స్మరింపలేదు. అప్పటికి వృషభ (బసవ) స్తవముల నింతవిరివిగాఁ గావించిన సోమనాథాంకితుఁడైనకవి పాలకురికి సోముఁడుతప్పఁ గర్ణాటులలోఁగూడ మఱియొకఁడెవఁడు వాఙ్మయపరిశోధకు లెవరికి నింతవఱకు గానరాలేదు. ఈపద్యము మొదటి రెండుపాదములందు స్తుతింపబడిన హరీశ్వరుఁడు (పూర్వోక్తశివగణదరగళేశ్వ) కెరెయ పద్మరసు నించుమించుగ సమకాలికులె. పద్మరసు క్రీ. శ. 1151-62 ప్రాంతముల హొయసల రాజ్యమును బరిపాలించిన నరసింహబల్లాళుని దండనాథుఁడై యాతని యాస్థానమునఁ బరమతీ ముఖపండితులఁ బలువుర నిర్జించి కన్నడమున దీక్షాబోధ మున్నగు కృతుల రచించిన యుద్దండపండితుఁడు. సోమనాథుని బసవపురాణమును క్రీ. శ. 1369 సం॥ ననే ప్రప్రథమమునఁ గన్నడమున భీమకవి యనువదించినాఁడు. సోమరాజు ఉద్భటకావ్యరచనాకాలమునాఁటికి సోమనాథుని బసవపురాణము కన్నడదేశమున వ్యాప్తము గాకున్నను దానికిముందుగా సంస్కృతపద్యభూయిష్ఠములుగ నాతఁడు రచించిన పంచప్రకారగద్య, బసవరగడ మున్నగు నసంఖ్యాకములైన లఘుగేయకృతులాంధ్రులకుఁ గర్ణాటులకుఁగూడ నొక్కతీరుననే యుపకరించుటచే నవి భక్తులనోళ్ళలోఁబడి సమ

కాలీనుఁడగు సోమరాజుకాలమునాఁటికే కర్నాట దేశమునందుఁగూడ వ్యాప్తినొందియుండును. ఈ గేయ స్తవముల మనమున నెంచియే యాతఁడు సోమ నాథు నట్లు స్తుతించియుండును. కెరెయ పద్మరసు వంశ్యుడు విశ్వారాధ్యుఁ డనుపండితుఁడు శివపంచ స్తవములకు సంస్కృతమున వ్యాఖ్యానము రచించి నాఁడు. ఈతనిపాండిత్య మగణ్యమైనది. దానిలో నాతఁడు మల్హణ స్తవశ్లోకముల ముప్పదితొమ్మిదింటి నిచ్చి వ్యాఖ్యానించుచు, సోమనాథుడు పండితా రాధ్యచరిత్ర పురాతన ప్రకరణమున వర్ణించిన మల్హణచరిత్రలో నాతని శివ స్తవము ముప్పదియా రు శ్లోకములు గలదిగాఁ బ్రశంసించినవిషయము నిట్లుటంకరించినాఁడు.

"యద్యపికాంతాకచేత్యాది షట్త్రింశ ద్వృత్తై స్తోత్రమిదం మల్హణో నాభాణీతి పాల్కురికి సోమేశ్వరేణ భణితం తథాప్యు పరితనం వృత్తత్రయం బహుపుస్తక స్థితత్వా ద్బహుపాఠ సమ్మ తత్వాద్వ్యాఖ్యాతం వస్తుతస్తుయుక్తిమద్భిః ప్రక్షిప్తం శ్రీ మత్సోమేశ్వరవచన ప్రామాణ్యాదితి సర్వం శివం"

పద్మరసుచరిత్రము నాతనికిఁ దొమ్మిదవతరము మనుమఁడైన పద్మణాంకకవి క్రీ. శ. 1385 ప్రాంత మున "పద్మరాజపురాణ"మను పేరితో రచించినాఁడు. దానిలో వంశానుక్రమణికలో విశ్వారాధ్యుని పద్మ

రుసునకు రెండవపురుషునిగా నుదాహరించి యాతని పాండిత్యము నతిశయముగా వర్ణించినాఁడు. దీనిని బట్టి శివపంచస్తవవ్యాఖ్యాత విశ్వారాధ్యుఁడాతఁడే యైయుండునని యాతఁడుగూడ సోమనాథుని కించు మించుగ సమకాలీనుఁడై క్రీ శ 1240 ప్రాంత మునఁ దనవ్యాఖ్యానము రచించియుండునని గోచ రింపఁగలదు. కావునఁ గన్నడకవిపండితులలో సోమ రాజు, విశ్వారాధ్యుఁడు సోమనాథునియెడఁ గావిం చిన ప్రశంసలుగూడఁ బైనిజెప్పిన యాతని కాల నిర్ణయమున కనుకూలించుచున్నవి కొండవీటి దండ కవిలెలో శతవత్సరము పేర్కొనఁబడిన రుద్రదేవుని (మొదటి ప్రతాపరుద్రుని) బందరుశాసనముతో పాటు శతసంవత్సరము లేని యీక్రిందిశాసనము గూడ నాతనిశాసనముగా నుదాహృతమైనది.

“దదౌ ధరణికోటాఖ్యం, బ్రహ్మ ప్రీత్యా పురం ముదా.
చంద్రార్ధమకుట ప్రీత్యా, చంద్రవాది పురం దదౌ
కేశవార్పణ బుధ్యావై, దదావిత్తుపురం భువి
సోమనారాధ్యగురవే, పిడుపర్తి పురందదౌ
అదౌ ప్రతాపరుద్రాఖ్యో, భూపాలో ధర్మపూర్వకం
సప్తర్షి సంఖ్యయా గ్రామాన్, దదౌ సప్త ద్విజాయతే.
ఏవం ప్రతాపరుద్రాఖ్యః, కృతవాన్ రుద్ర సంఖ్యయా

కీ. శే. మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారీ శాసనములను తాము రచించిన "కొండవీటిసామ్రాజ్యము" అను గ్రంథములోఁ బ్రకటించి యాకాలమున మన పాలకురికి సోమనాథుఁడుగాక మఱొక సోమనారాధ్యగురుఁడు కానరాఁడు కావున నీశాసనపంక్తుల నుదాహృతుఁడైనవాఁడాతఁడే కాఁదగునని నిరూపించిరి. సోమనాథుఁడు కాకతీయచక్రవర్తులు వారిమంత్రులు నెవరితోను దనకు గురుశిష్యసంబంధమున్నట్లుగాని, వారివలన సన్మానము నందినట్లుగాని తనకృతులలో నెచ్చటను జెప్పికొనియుండలేదు. ఏసందర్భముననైన నాతఁడు కాకతీయరాజధానికేఁగి, యప్పటిరాజుచేఁగాని మంత్రులచేఁగాని పూజింపఁబడియున్నచో నది రుద్రదేవునికాలముననే జరిగియుండునని తలంచుట సంగతముగా నుండును. పై శాసనముగూడ నందుకు సాధకము కాఁగలదు. పూర్వాంధ్రకర్ణాటకవులెవరిని సోమనాథుఁడు తనకృతులు వేనియందును స్మరింపలేదు. ఆసమీపమందలి యాంధ్రకావ్యములఁ బరిశీలింప నీతనిరచనములకుఁ గొన్ని స్థూలానుకరణములు ముఖ్యముగా నన్నెచోడుని కుమారసంభవమునందును,బద్దెన సుమతిశతకమునందును, యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వరశతకమునందును గన్పట్టు

చున్నవి. నన్నెచోడునికాల మింకను వివాదగ్రస్తమై యుండుటచే నతఁడే సోమనాథు ననుకరించెనో, సోముఁడే యాతని ననుకరించెనో నిస్సంశయముగ నిర్ణయింపఁ గుదురకున్నది. బద్దెన కాకతీయుల సామంతుఁడుగా క్రీ శ. 1260-1320 మధ్య కాలమున నున్నవాఁడని పలువురు తలంచుచున్నారు. అన్నమయ్య సర్వేశ్వరశతకమును శా. శా. 1164 (క్రీ. శ 1242)లో రచించినట్లు తానే చెప్పికొన్నాఁడు సోమనాథుని యనుభవసార పండితారాధ్యచరిత్రములందలి సంవాదములఁ బెక్కింటి నీ శతకములో అన్నమయ్య గూర్చికొన్నట్లు శ్రీనిడుదవోలు వేంకటరావుగారు 1945 వత్సరము మార్చి భారతివ్యాసములో నిరూపించియున్నారు. ఉద్గ్రంథకర్తయైన సోమనాథుఁడు సుమతిశతక సర్వేశ్వరశతకములవంటి చిన్నశతకములందలి పద్యభావములను గైకొని తనకృతులలోఁ గూర్చికొనెననుటకన్న నీశతకకర్తలే యాతని ననుకరించిరని తలంచుట సంభావ్యమని చెప్పనక్కఱ లేదు. కాఁబట్టి యీశతకములందలి యనువాదములుగూడ సోమనాథుఁడు క్రీ.శ. 1240 సంllకు ముందే వెలసియుండు ననెడి నిర్ణయమునకుఁ దోడ్పడుచున్నవి.

ఇఁక దీనికిఁ బ్రతికూలముగఁ గాన్పించునవి చారిత్రక ప్రామాణ్యము లేని పుక్కిటిపురాణమని చరిత్రజ్ఞులు తలంచెడి ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రమునందలి వ్రాఁతలు, వానిని గొంత యనువదించిన పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణావతారికయందలి వాక్యములు మాత్రమే. సోమనాథుఁ డొక చాకలికి లింగదీక్షయు, సర్వజ్ఞత్వాదిశక్తులు నొసంగి తన్నుఁ బ్రతిఘటించిన ధూర్తవిప్రులను ప్రతాపరుద్రునిసభలో వానిచే నోడింపఁజేసెనని, రాజది చూచి యబ్బురపడి యాబ్రాహ్మణులతోఁ దానుగూడ సోమనాథునకు శరణాగతుఁడై శివదీక్ష నొందెనని యేకామ్రనాథుఁడు తనగ్రంథములో వ్రాసినాఁడు. దీనినే కొంతమార్చి మఱికొన్ని సంగతులు చేర్చి పిడుపర్తి సోమనాథుఁడు తనగ్రంథావతారికలో వ్రాసినాఁడు. ఆ[illegible]డవల గొంత నింతకు మున్ను "పతత"శబ్దవిచారసందర్భమునఁ దడవియే యున్నాను. ఇప్పు ప్రతాపరుద్రుని యాస్థానమున కేఁగినప్పుడే సోమనాథుఁడా శివరాత్రినాఁడు దనకు శిష్యుఁడగు నగు [illegible]లూరి [illegible]కుఁ జెప్పి శివప్రీతిగా నైవేద్యానములు [illegible] శివరాత్రి (పిడిపర్తి, కొ[illegible]) [illegible] కిప్పించెనని చెప్పి పిడుపర్తి సోమనాథుఁడు కొ[illegible]యయ్యె

నుండి తనవఱకు నాలుతరములను వంశానుక్రమణి
కలోఁ జేర్కొన్నాఁడు. ఇంతేగాక యాసోమగురుఁ
డాగతానాగతవేది కావున దేశ మిఁకఁ ద్వరలోఁ
దురుష్కాక్రాంతము గానున్నదని తన యాచార
వ్యవహారము లిట జరుగుట కష్టమని చెప్పి కొలఁది
కాలములోఁ గన్నడ భూమికరిగి యచ్చట "కల్య"
మను క్షేత్రమున సమాధి నేర్పఱచుకొని శివైక్య
మయ్యెనని కూడ పిడుపర్తి సోమనాథుఁడు వ్రాసి
నాఁడు. ఇందులూరి అన్నయ్య రుద్రమదేవి రెండవ
ప్రతాపరుద్రుల దండనాథుఁడుగా నున్నవాఁడు.
ఆతని శాసనము లనేకములు లభ్యమైనవిగాని యందుఁ
బాలకురికి సోమనాథునికిఁ బ్రసక్తమైన దొకటియుఁ
గానరాదు. ఇంతేగాదు. కొండపీటి దండకవిలెలో
నుదాహృతమైన శకసంవత్సరము లేని రుద్రదేవుని
పూర్వోక్తశాసనముగాక సోమనాథునకు సంబంధిం
చిన కాకతీయ శాసనము మఱొక టేదియు నింతదనుక
నెవరికి దొరకనే లేదు. సోమనాథునికృతులు పరిశుద్ధ
ముగఁ బరిష్కృతములయి బహుళప్రచార మొందక
పూర్వ మందలియంతస్సాక్ష్యము నెవరు గుర్తింప
కుండుటచే, పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురా
ణావతారికలోని సంగతులనుబట్టి మొట్టమొదట
శ్రీవీరేశలింగముపంతులుగా రాంధ్రకవులచరిత్ర

ప్రథమముద్రణమునందును, శ్రీచిలుకూరి వీరభద్ర రావుగారు ఆంధ్రులచరిత్ర రెండవభాగము మొదటి ముద్రణమునందును పాలకురికి సోమనాథుఁడు రెండవప్రతాపరుద్రుని కాలము వాఁడనియే తలంచిరి. వారి ననుసరించి యస్మదాదులముగూడ నట్లే భావించితిమి. కాని యాపిమ్మట వెలువడిన కర్ణాట కవిచరిత్రలో శ్రీనరసింహాచార్యులుగారు క్రీ. శ. 122౨లో కన్నడకవి సోమరాజు రచించిన కావ్యమందలి సోమనాథుని స్తుతిని బురస్కరించికొని యితర విధములఁగూడ సమన్వయించుచు సోమనాథుని కాలము క్రీ. శ 1 ౧౫ ప్రాంతమని నిర్ణయించిరి. దానినిబట్టి శ్రీవీరేశలింగము వీరభద్రరావుగారలు గూడఁ దమ పూర్వాభిప్రాయములను మార్చుకొని కర్ణాటకవిచరిత్రకారుల నిర్ణయమునే యనుగమించిరి పిడుపర్తి సోమనాథుఁడు పాలకురికి సోముని యనంతరము మూఁడువందలసంవత్సరములలో క్రీ. శ. 1౫౮0 ప్రాంతమున నుండినవాఁడు ఆతఁడు వినికిలిని బట్టి వ్రాసిన విషయములందును చేర్కొనిన వంశ క్రమమునందును గొన్ని వ్యత్యయములు లోపములు దొరలియుండునుగావున దాని ప్రామాణ్యమును బరిహరించి సోమనాథునికృతులందలి యంతస్సాక్ష్యమునుగూడ నాధారముగఁగొని యాత

కాలము క్రీ. శ. 1160—1240 అని యస్మదాదు లముగూడ నిర్ధరించుటకుఁ గారణమైనది. ప్రభాకర శాస్త్రిగారుకూడ దీనినే యనుగమించిరి. తురుష్కులు దక్షిణదేశముపై దాడిసలిపినపుడు కాకతీయరాజ్యమునేగాక కన్నడరాజ్యములఁ గూడఁ గొల్లగొట్టియుండిరి. కావున మహమ్మదీయాక్రమణమునకు వెఱచి సోమనాథుఁడు కన్నడభూమికిఁ దరలియచ్చుట నైక్యమయ్యెనని పిడుపర్తిసోమన చెప్పిన దానిలో సత్యముగాని సారస్యముగాని లేదు ఇందలి వాస్తవాంశములను తోంటదార్యుని సోమేశ్వరపురాణము ననుసరించి ముందు వివరింతును.

సోమనాథుఁడు రెండవప్రతాపరుద్రునికాలము వాఁడనుపూర్వనిర్ణయ మిట్లు చిరకాలముక్రిందటనే యాంధ్రకర్ణాటచరిత్రకారులచేఁ బరాస్తముగావింపబడినను దానిని బునరుద్ధరించుటకయి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పైసిజెప్పిన వ్యతిరేక ప్రమాణములగొడవ నించుకకూడఁ దడవకయే కాకతీయచక్రవర్తుల సామంతుఁగా అంబయ్యదేవ మహారాజులు శా. శ 1212 (క్రీ. శ. 1290) లో వెలయించిన సిలగంగవరము శిలాశాసనము (ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూమ్-20 Part 6) పురస్కరించికొని 1945 సం॥ ఫిబ్రవరి భారతిలో నొక వ్యాస

మును బ్రకటించిరి. త్రిపురాంతకవాస్తవ్యుఁడు రెండ్రేవుల మల్లినాథయ్య యనుశైవునకు అంబయదేవుఁడు మొల్లకల్లూరుగ్రామము దానమొసంగిన విషయమునకు సంబంధించిన దీశాసనము. ఈ శాసనశిల కొన్నిచోట్ల శిథిలమైనది. శాసనశ్లోకములలోఁ గూడఁ గొన్నిలోపము లున్నవి. ప్రతిగ్రహీతను బేర్కొనుశ్లోకములోఁగూడ నాతనిపేరు గలయక్షరములు లోపించినవి. ఆశ్లోకము స్రగ్ధరావృత్తములో నున్నది. ప్రతిగ్రహీతగృహనామము నామముఁ బూర్తిగా నందుఁ బేర్కొనఁబడకున్నను, కవి దానవిషయమును మరల సంస్కృతశ్లోకభాగము చివరఁ దెలుఁగువచనములోఁ జెప్పుచు నందుఁ బ్రతిగ్రహీతపేరు రెండ్రేవుల మల్లినాథయ్య యని స్పష్టముగా లిఖించినాఁడు. ఇట్లు శాసనమందలి సంస్కృతభాగము తెలుఁగుభాగముకూడ నంతయు ముగిసిన పిదపఁ గ్రిందను మఱియొక సంస్కృతశ్లోకమున్నది. అది యాశిలపై నప్పుడే చెక్కఁబడెనో తరువాత మఱికొంత కాలమునకుఁ జెక్కఁబడెనో చెప్పఁ గుదురదు. ఆశ్లోకమునను ననేక లోపములున్నవి. "ఎవని దేవి దోచయ పేరుగలయామె తననేత్రమును త్రిపురాంతకేశ్వరున కర్పించి యంతకన్న నిర్మలనేత్రమునుబడసి ప్రకాశించెనో, స్వర్గ మధిరోహించు

టకై ప్రతినఁజేసియో యన్నట్టు త్రిపురాంతకదేవు నెదుటఁ గుమారాచలముపై సోపానసరణి కట్టించెనో" అని యాశ్లోకమందలి భావము శాసనమందలి దాతృప్రతిగ్రహీతలకు నీశ్లోకమందలి దోచయ్యకు నెట్టిసంబంధమో తెలియదు. ఆమె యెవని దేవియో స్పష్టముగాదు. యచ్ఛబ్దమేగాని తచ్ఛబ్దమిందు లేదు. ఆమె యంబయదేవునిభార్య యని తలంచుటకుఁగూడ నెట్టియవకాశమును లేదు. ఆతని యుత్తరశాసనము లనేకములున్నవి వేనియందు నాతనిభార్యదోచయ్య యని చెప్పఁబడలేదు. శ్లోకమందలి క్రియాపదములనుబట్టి యీదోచయ యంతకుముందే గతించిన భూతకాలికవ్యక్తిగాఁగూడ గోచరించును. శాసనమును బ్రకటించిన శ్రీపంచముఖ యం. ఏ. గారుగూడ నిందుఁగూర్చి 'Lines 61-66 also contain a verse in corrupt Sanskrit, the sense of which is not quite clear" అని లిఖించియున్నారు ఇందలి రెండ్రేవుల మల్లినాథయ్య, దోచయదేవియే బసవపురాణావతారికలో సోమనాథుఁడు పేర్కొన్న రెంటాల మల్లినాథ దోచమాంబలని యందుచే సోమనాథుఁడు గూడ క్రీ. శ 1290 ప్రాంతమువాఁడే యగునని శర్మగారి యభిప్రాయము. రెండ్రేవులశబ్దమే క్రమముగా రెండ్రేల, రెండేల, రెండాల, రెంటాల అని పరిణా

మమును జెందియుండుననీ, వారిసమాధానము.
ఆనాఁడు సోమనాథుఁడు ఛందోబద్ధముగ వ్రాసిన
ద్విపదకావ్యములోనే స్పష్టముగా నాతఁడు పేర్కొన్న
మల్లినాథుని యింటిపేరు “రెంటాల” అని యున్న
ప్పుడు, ఆయింటిపేరే కలవారు నేఁడుగూడఁ బహు
వురు శైవబ్రాహ్మణులలోఁ గానవచ్చునప్పుడు, రెం
టాల యను గ్రామమొకటి యాపేరితోనే యిప్పటి
కిని పల్నాడుతాలూకాలో నున్నప్పుడు శర్మగారు
చెప్పెడి పరిణామవాదమున కాధార మెంత
మాత్రము లేదనియు, రెండ్రేవుల, రెంటాల
యొక్కటికానేరవనియు, సహృదయులకుఁ జెప్ప
నక్కఱలేదు. శ్లోకములో నేదోరూపమున స్వీక
రించియైనను బ్రతిగృహీతగృహనామము నిముడ్పఁ
జాలని లేఖకుఁడు తెలుఁగువచనములో దానినే
వ్రాయునప్పుడు మూఁడక్కరములతో “రెంటాల”
యని చెక్కలేక నాలుగక్కరములతో “రెండ్రేవుల”
అని చెక్కెనని యెవ్వరైనఁ జెప్పనేర్తురా? ఇంతకు
సోమనాథుఁడు రెంటాల మల్లినాథునిఁగూర్చి చెప్పిన
విశేషము లొక్కటియు నీశాసనమందలి రెండ్రేవుల
మల్లినాథునివిషయమునఁ జేర్కొనఁబడలేదు. దోచ
మాంబనుగూర్చి యాతఁడుచెప్పిన సంగతులకు
నిందు దోచయదేవిగుఱించి చెప్పినవివరములకుఁ

గూడ నైక్యములేదు. శ్రీగిరియందొడ్డోలగమున బసవపురాణకథాసూత్రములఁ దనకెఱింగించిన వారిలో సోమనాథుఁడొక్కఁడు కరస్థలి సోమనాథయ్యయే త్రిపురాంతకవాస్తవ్యుఁడని చెప్పినాఁడుగాని రెంటాల మల్లినాథ దోచమాంబ లెచటివారో వివరింపలేదు. కావున నీశాసనమందలి యసంగతులఁ గూర్చి విమర్శింపుచు, పూర్వోక్తములయిన బలవత్ప్రమాణములఁ బ్రోలి రాజవి, సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాఁడని సాధించుటకది చాలదని సమర్థములైన శాసనాంతరములచే పరిశోధింపవలసినదని, శ్రీ సోమశేఖరశర్మగారి విన్నవించుచు 1945 సం॥ ఆగష్టు భారతిలో నొక వ్యాసమును బ్రకటించియున్నాను. వానిపై శర్మగారింతదనుక నేమియు బదులు వ్రాయలేదు. కాని శ్రీ చిలుకూరి నారాయణరావుగారు మాత్రము నా వ్యాసాంశముల కొక్కటియును సమాధానము చెప్పకయే పండితారాధ్యచరిత్రోపోద్ఘాతములో సోమనాథుని కాలవిషయమునఁ దాముచేసిన నిర్ణయమునకు శర్మగారుదాహరించిన శాసనము కూడఁ దోడగునని 1945 సం॥ సెప్టెంబరు భారతిలో నొకవ్యాసమును బ్రకటించిరి. నారాయణరావుగారి యుపోద్ఘాతమందలి యసంగతులనెల్ల నేను సోమనాథుని గూర్చి

వ్రాసిన ప్రత్యేకగ్రంథము పదియవ ప్రకరణములోఁ జర్చించియే యున్నాను.

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు సోమనాథుని కాలముఁగూర్చి "మాతృసేవ"లో వ్రాసినవ్యాసములో పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణావతారికనే యాలంబనముగాఁ గొని సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రునికాలమువాఁడు కాఁదగునని నిర్ణయించుచు నందుకై సోమశేఖరశర్మగారి పూర్వోక్తవ్యాసము నూతగాఁగొని యాసందర్భమున నేను రెండ్రేవుల రేటాల కాదని నిరూపింపఁబూనిన మేధావినని, సత్యాంశపాత్రులగు పరిశోధకులెల్ల శర్మగారివాదములోని నిశ్చయము నంగీకరించితిరిగదరని, శర్మగారివ్యాసము మాచినతరువాత శ్రీచిలుకూరి నారాయణరావుగారు తమ యభిప్రాయమును మార్చికొని శర్మగారి నిర్ణయము సమంజసమని సమర్థించినారని, అంగీకరింపనిది యెంత నిరాధారమైనను, దుర్బలమైనను నేఁజెప్పినదే వేదమని భావించువాఁడను నే నొక్కఁడనే యని, యెడుగుబొంగులు లేనిది నా వాదధోరణి యని, ఇత్యాదిగాఁ దమ హేళనాప్రౌఢిమను వలసినంత ప్రదర్శించిరి. వీరు వ్రాసినట్లు నారాయణరావుగారు శర్మగారి వ్యాసముఁ జూచిన మీఁదట దమపూర్వాభిప్రాయ మేదియు మార్చి

కొనలేను. పలుతెఱంగులైన యపమార్గములతో పండితారాధ్యచరిత్రపీఠికలో వారుగావించిన కాలనిర్ణయమునకే శర్మగారినిర్ణయముగూడఁ దోడగుచున్నదనియే దానిని వారామోదించినది. సరిగా విషయములఁ బరిశీలించినవారికెల్లనది యవగతమే. నారాయణరావుగారుతప్ప శర్మగారివ్యాసమును సమర్థించినవారు నేఁడు శ్రీవేంకటకృష్ణశర్మగారుగాక మఱెవ్వరున్నారో నాకింతవఱకుఁ దెలియదు. ఎవరైనను నే బ్రకటించిన ప్రతివ్యాసాంశములొక్కదానికిఁగూడ సమాధాన మొసంగక యూరకిట్టి వ్రాఁతలవ్రాయుటవలనఁ బ్రయోజనమేమి? సోమశేఖరశర్మగారిశాసనము బట్టి సోమనాథుఁడు క్రీ. శ. 1290 నాఁటివాఁడనుటయే గాని యాతనికృతులందుకుముందు వెనుకల నేవేవి యెప్పుడు రచింపఁబడెనో క్రీ శ 1320 సం॥కు ముందెప్పు డాతఁడు కన్నడభూమికి నిర్గమించెనో నిరూపింపఁ బ్రయత్నింపలేదు సోమనాథుని సారస్వతసేవావధి ముప్పది నలువదివత్సరములలోపుమాత్రమేయని వారు తలంతురా? రెండ్రేవుల, రెంటాలయొక్కటికావని వాని మొగమే చెప్పుచుండ, ఉన్నదున్నట్లు చెప్పెడి నేను మేధావి నెట్లగుదును? ఏకామ్ర, ఏకోరామ శబ్దములవిషయమై నేనువ్రాసినదేమో సరిగా గుర్తిం

పకయే వానిసంధులు విడఁదీసి నాకుఁ దెలివిడి గలి
గింపఁజూచిన మహనీయులే వ్యాకరణసూత్రములచే
రెండ్రేవుల రెంటాల లొక్కటగునో నిరూపించి
తమశబ్దశాస్త్రపారీణతను బ్రదర్శింపరాదా! ఆనాఁడు
"రెండ్రేవుల" అను పేరితో నున్నది నేఁ డా పేరు
రూపులుమాసి "రెంటాల"యను పేరితో వ్యవహృత
మగుచున్నయెడల, శర్మగారు చెప్పెడి కాలపరిణామ
వాదమునకేదైన నొకింత యవకాశ ముండునేమో
గాని యానాఁడే సోమనాథుని ఛందోబద్ధకృతిలోనే
"రెంటాల"యని ప్రయుక్తమైనప్పు డీవివాదమున
కెంతమాత్ర మాధారములేదని చెప్పనక్కఱ
లేదు. శ్రీవేంకటకృష్ణశర్మగారి వ్రాఁతల కొక దారి
తెన్ను లున్నట్లులేదు. ఇతరులు వ్రాసినవి సరిగాఁ
జూచికొనక వానిని వికృతముగాఁ బ్రదర్శించి యిచ్చ
వచ్చినట్లు కేలిసేయఁ దమకించుట, ముందువెనుక
లరయకుండుట వీరిధోరణికిఁ బరిపాటిగాఁ గన్పట్టు
చున్నది. మాతృసేవ సంపుటము 1 సంచిక 11, 12
లందలి వీరివ్యాసాంశములకు నాసమాధానములను
స్థలాంతరమున సమగ్రముగఁ బ్రకటింతును. మాతృ
సేవవ్యాసములందే సంచిక 10 లో "పండితారా
ధ్యుని కాలము" గూర్చి వ్రాయునపు డాతఁడు క్రీ.శ.
1160—70 ప్రాంతమువాఁడని సోమనాథునిగురునకు

కాతయైన బెలిదేవి వేమనకు సమకాలికుఁడని, తర
మునకు ముప్పదియేండ్లచొప్పున 60 సం॥లయంతర
ము గ్రహించినచో క్రీ. శ 1222లోఁ దన్ను
నుతించిన కన్నడకవి సోమరాజును సోమనాథుఁడు
సమకాలికుఁడు కావచ్చునని వీరు వ్రాసియున్నారు.
ఇది యస్మాదాదులనిశ్చయమున కసంగతమే. ఇంక
పంచిక 26లో "సోమనాథునికాలము" గూర్చి వ్రాయు
సరికి నంతలోనే ధోరణిమార్చి, ఉద్భటకావ్యకర్త
సోమరాజునుతించిన వృషభస్తవ సోమన పాలకురికి
సోమన యైయుండఁడని, వృషభ బసవశబ్దములు
వేఱని, "బసవస్తవ" అన్నను బద్యములు సరిపడునప్పు
డాతఁడు "వృషభస్తవ" యని యేల చెప్పునని, యా
గ్రంథము వ్రాయుసరికి సోమరాజు పాలకురికి సోమన
నెఱుఁగనే యెఱుఁగడని వ్రాసిరి. మఱియుఁ దాము
చేయునిశ్చయమునకు సరిపడదు. గావున సోమనాథు
నకు బసవపురాణకథాసూత్రము లెఱింగించిన
వృద్ధుఁడు కరస్థలి సోమనాథయ్య "పండితారాధ్య
కృపాసముద్గతుఁడు" అన్నదాని కాంగీకరించిన గురువు
పండితారాధ్యుఁడు మల్లికార్జునపండితుఁ డనరాదని,
"పండితారాధ్య" అనునది కేవలము బిరుదమని, మల్లి
కార్జునపండితునికుమారుఁడు కేదారయ్యనైనను గర
స్థలి సోమనాథునిగురువు కావచ్చునని సెలవిచ్చిరి.

ఇ\.క నటుతరువాత 38 సంచికలో క్రీ. శ. 1242
సంవత్సరములో సర్వేశ్వరశతకము రచించిన అన్న
మయ్యనుగూర్చి వ్రాయునపు డాతఁడు సోమనాథుని
యనుభవసారపండితారాధ్యచరిత్రములనుండి సం
వాదములు గ్రహించిన విషయ మంగీకరించుచు,
సోమనాథుడు, అన్నమయ్య, సమకాలికులు
మాత్రమేగాక మూఁడు నాల్గేండ్లెచ్చు తక్కువగ
సవయస్కులుగూడ నైయుందురని చెప్పియున్నారు.
పండితారాధ్యచరిత్రమే సోమనాథుఁడు చరమదశలో
వ్రాసిన చివరికృతి యని పలువురు తలంచుచున్నారు.
క్రీ. శ. 1 42 నాఁటికే యా కృతియందలి సంవాద
ములు సర్వేశ్వరశతకమునందు దొరలినవని యంగీ
కరించుచుఁగూడ క్రీ. శ. 1290 నాఁటి రెండ్రేవుల
మల్లినాథయ్యతో సోమనాథునకు సంబంధముకు
దుడిపెట్టుట వీ రెట్లు సమర్థింతురో? ఒకదాని కొకటి
పొందిక లేని యిట్టి యెగుడుదిగుడు వ్రాతలేనా
నాయందుఁ గనరాదని వీ రుగ్గడించు "ఎదుగు
పొదుగు"నకు లక్ష్యము? శాశ్వతమైనసత్య మచం
చలము, నిరంజనము, నైనదిగదా! "స్థాణుః స్థిరభక్తి
యోగసులభో నిశ్శ్రేయసాయాస్తు" అని కవికుల
గురుని సూక్తి. అట్టిసత్యమును దెలిసికొనుటకై
స్థిరచిత్తముతోఁ గడంగు నాధోరణి యెప్పటికే గాలి

సోఁకిన దాని కనుగుణముగాఁ దూలునట్టిది కాని మాట వాస్తవమే. అట్లని యొకమాఱప్పటికి దొరకిన యుపపత్తులం జేసి సత్యమని దృఢచిత్తముతో నమ్మినదే తరువాతిపరిశోధనములలో సరికాదని యంతకన్నఁ బ్రబలతర ప్రమాణములచే నిర్ధారితమైనయెడలఁ బూర్వాభిప్రాయములను మార్చికొనని శఠత్వము నాయందు లేదనియే నావిన్నపము. తముగృహానాము మనర్థముచేసికొనవలెనన్న యుద్దేశముతో తాము చెప్పినదే వేదమని వాదించెడి యభినివేశము శ్రీ వేంకటకృష్ణశర్మగారి కేమైన నుండునేమో కాని యట్టిది నా కేకోశమందును లేదు ఈకాలనిర్ణయ విషయమున నింకను విశేషాంశముల నెఱుంగ నెంచువారు పూర్వోక్తములైన నా గ్రంథమందలి పదియవ ప్రకరణము, 194[illegible]సం॥ ఆగస్టు భారతివ్యాసములతోపాటు చిలుకూరి నారాయణరావుగారికిఁ బ్రత్యుత్తరముగా 1947సం॥ నవంబరు 7, 21, 23 తేదుల "త్రిలింగపత్రికలో" సోమనాథుని కాలము" అను శీర్షికగల నావ్యాసమును గూడఁ జూడనగును.

## సోమనాథుని శిష్యప్రశిష్యులు

వీరిని మూఁడు తెఱఁగులుగ గణింపవచ్చును. ఈతనివలన వీరశైవదీక్ష నొందిన శిష్యసంతతికిఁ జేరినవారొకతెగ. పిడుపర్తికవు లిందు ముఖ్యముగ

నెన్నఁదగినవారు. వీరు తమపూర్వుల కీతఁడు సంపా
దించియిచ్చిన యగ్రహారాదికములఁ బారంపర్య
ముఁగ ననుభవించుచు విశేషభక్తిగౌరవములతో
నాతనిఁ గులగురువుగ నారాధించి యాతనిమార్గ
మనుసరించితదనంతరమువీరశైవవాఙ్మయాభివృద్ధికై
కృషియొనర్చినవారు. ఈతనికిఁ బ్రత్యర్థులై నిలిచి
మతవివాదమునందు నోటువడి యాతనిచే వీరశైవ
దీక్షలనొంది శిష్యులైనవారు రెండవతెగ. వీరిలోఁ
బ్రముఖుఁడు చక్రపాణి రంగనాథుఁ డనువైష్ణ
వుఁడు. ఇతఁడు కవిరాజ బిరుదాంచితుఁడు. వైష్ణవ
మతపాండిత్యముతోపాటు మిక్కుటముగ శివ
ద్వేషముగూడఁ గలవాఁడు. ఈతఁడు సోమనాథు
నిచే నోటువడి పరాభవదుఃఖముతో నహోబల
క్షేత్రమునకు శ్రీశైలమార్గమునఁబోవుచు శ్రీశైల
శిఖరమును జూడనొల్లక కనులు మూసికొనెను.
దానితో దృష్టినిరోధము గలుగ నహోబలస్వామిని
బ్రార్థింప నాతఁడు శివాధిక్యమెఱింగించి మల్లికార్జున
స్వామిని సేవింపుమని యుద్బోధించెను. అందుపై
నట్లొనర్ప నొకకన్నుమాత్రము వచ్చెను. మల్లి
కార్జునస్వామియుద్బోధనమున నాతఁడు పాలకురికిం
జని సోమనాథుని శరణువేఁడఁగా రెండవకన్ను
గూడ వచ్చెను. అంత సోముని యాతనికిఁ దనకొమ

రుఁడు చతుర్ముఖబసవేశ్వరునిచే వీరశైవదీక్ష నిప్పించి శిష్యునిగా గ్రహించెను. అనంతర మీతఁడు వీరభద్రవిజయము, శరభలీల, శ్రీగిరినాథవిక్రమము మున్నగుకృతులు రచించి సోమనాథున కర్పించెనని తోంటదార్యనిగ్రంథము చెప్పుచున్నది. పైకథకుఁ గొంతస్ఫోరకముగా రంగనాథుఁడు రచించిన "నయసరగడ" అను నామాంతరముగల "శివభక్తిదీపిక" మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకాలయమునం దున్నది. సోమనాథ రంగనాథుల యీగురుశిష్యసంబంధమును బురస్కరించుకొని శివయోగసారకర్త కొలని గణపతిదేవుఁడు తత్కృతిలో నయ్యిరువుర నిట్లు కలిపి నుతించినాఁడు.

క॥ అసమశివభక్తి రసమా
నసుఁడగు పాల్కురికి సోమనాథుని కవిరా
జసమున్నత యశు, సద్యః
ప్రసాదియగు చక్రపాణి రంగనఁ గొలుతున్

భద్రకవి లింగన తన సోమనాథచరిత్రములోఁ గూడ

"సకలవేదపురాణశాస్త్రేతిహాస
నికరార్థములఁ బ్రమాణించి సద్భక్తి
శ్రీమతి నుద్ధరించిన పాలకురికి
సోమనారాధ్యుల సొంపుతోఁ గొల్చి
రంగద్విశాలాంగ 'రంగ' సఖ్యమున
రంగనాథునిఁ గవిరాజవర్యుఁ దలఁచి'

అని నుతించెను. గోనబుద్ధారెడ్డిరచితముగ గ్రంథ మునుబట్టి కానవచ్చినను చిరకాలమునుండి రంగ నాథునిపేర వ్యవహారమందున్న ద్విపదరామాయణ మునకు నిక్కంపురచయిత యీచక్రపాణి రంగ నాథుఁడే యైయుండునని నా యభిప్రాయము. దాని నాతఁడు వీరశైవము స్వీకరింపకమున్నో తరు వాతనో రచించియుండును. ఇది పరిశోధింపఁదగిన విషయము. పూర్వకవు లెవరును బుద్ధారెడ్డిని రామా యణకర్తగా సంభావించియుండ లేదు. పెరుగుకురికి శాస్త్రి, నేతికురికి శాస్త్రి యని పేళ్లుదాల్చి యిరువురు విప్రులు ప్రతిఘటింపఁగా సోమనాథుఁడు వీరిద్దఱు పాలకురికినుండి యాదయించి యందే లయించు వారని కేలిసేయుచు నోడించి శిష్యులుగా స్వీకరించె నని కర్ణాటకవిచరిత్ర చెప్పుచున్నది. ఇట్టిశిష్యులు సోమనాథుని కాలమునఁ బలువురు ఘటిల్లి యుండురు.

ఇఁక నీతనికృతుల భక్తిగౌరవములతోఁ బరించి యాతనిరచనాసరణుల నారాధించి యనుకరించిన యాంధ్రకర్ణాటకవులను మూఁడవతెగగా గణింప నగును ఆంధ్రకవులలో నన్నెచోడుఁడు, యథా వాక్కుల అన్నమయ్య, తిక్కన, బద్దెన, నాచన సోమన, జక్కన, శ్రీనాథుఁడు, గౌరన, బమ్మెరపోతన,

ఎడపాటి యెఱ్ఱన, రఘునాథభూపాలుఁడు, నాగలూటి శేషనారాధ్యుఁడు మున్నగువారిందు ముఖ్యులు. బసవేశ్వరపండితారాధ్యులచరితములను మును ముందు తెలుఁగున వెలయించి తమకు మార్గదర్శకుఁ డగుటచేఁ గర్ణాటకవులు పలువు రందు ముఖ్యముగా వీరశైవకవులు సోమనాథుని గురుభావముతో నారాధించిరి. ఇతని బసవపురాణమును యథామూలముగఁ బ్రప్రథమమున క్రీ. శ. 1369లోఁ గన్నడించిన భీమకవి. "పాల్కురికి సోమేశ్వరన కారుణ్య—ఒదవిక ళా ప్రపూరితహృదయ" అని గద్యలో వ్రాసికొని తనభక్తిని వెల్లడించినాఁడు. అటుతరువాత శంకరారాధ్యులు బసవేశవిజయమను పేర నొకసంస్కృతానువాదమును, సింగిరాజు (క్రీ. శ 1500) మహాబసవరాజచరితము (సింగిరాజపురాణము) అను మఱియొకకర్ణాటానువాదమును, షడక్షరకవి (క్రీ. శ. 1655) బసవరాజవిజయము (వృషభేంద్రవిజయము) అను చంపూకావ్యము రచించి తమభక్తిగౌరవములఁ బ్రదర్శించిరి. ఇట్లే యీతని పండితారాధ్యచరిత్రమునకుఁగూడ గురురాజకవి (క్రీ శ. 1430) సంస్కృతానువాదమును నీలకంఠాచార్యుఁడు (క్రీ. శ. 1485) ఆరాధ్యచరిత్రమను పేరిటఁ గర్ణాటానువాదమును వెల

బుంచిరి. తోంటద సిద్ధలింగకవి (క్రీ శ 1560) “పాలకురికి సోమేశ్వరపురాణము” అను ప్రత్యేక గ్రంథమునే రచించినసంగతి మున్నే చెప్పియుంటిని. వీరుగాక పద్మణాంకుడు, బొమ్మరుసు, గుబ్బిమల్ల నార్యుఁడు, విరూపాక్షపండితుడు మున్నగు ప్రసిద్ధ కవులు పలువురు తమకృత్యవతరణికలలో నితనిఁ బ్రశంసించిరి. విశేషవివరములు, ఆంధ్రకవులు తమ కృతులలో నీతనిరచనముల ననుసరించి కావించిన స్థూలానుకరణవిశేషములు దెలియఁగోరువారు నా గ్రంథమందలి “సోమనాథునారాధించిన యాంధ్ర కర్ణాటకవులు” అను నిరువదియవ ప్రకరణము చూడఁ దగును

### నవీనగుణములు, శైలి, కవితావిశేషములు

సోమనాథుఁ డవతరించునప్పటి కాంధ్రవాఙ్మయమున వెలసిన గ్రంథములు మిక్కిలి తక్కువగనే యున్నవి. నన్నయ ప్రారంభించిన భారతాంధ్రీకరణ మాతని మరణముతో నిలిచిపోయినది. తరువాత రెండువందలేండ్లవఱ కెవ్వరును దానిదెస దృష్టిపఱపి యుండలేదు. నూటికిఁ దొంబదిపాళ్ళు సంస్కృత పదములతో నన్నయ తనరచనము సాగించెను. ఆతనికి సోమనను నడుమ వెలువడిన కొలఁది కబ్బములలో పావులూరి మల్లన గణితము సంస్కృతమునుండి

పరివర్తింపఁబడిన శాస్త్రగ్రంథము. మల్లికార్జున
పండితుని శివతత్త్వసారము, స్వతంత్రగ్రంథమే
యయ్యు శతకవాఙ్మయములోఁ జేర్పఁదగినది.
అందుఁగూడ సంస్కృతపదబాహుళ్యమే కాననగును.
సోమునివలె జాను తెనుంగుపై కొంత మక్కువగొన్న
నన్నెచోడుఁ డాతనికన్నఁ బూర్వుఁడని తలంచినను,
ఆతని కుమారసంభవము చాలవఱకు స్వతంత్ర
కావ్యమేయైనను నదిగూడ గీర్వాణప్రాధాన్యమే
కల ప్రౌఢప్రబంధమై పండితజనైకవేద్యముగనుండి
జనసామాన్యమునకు దుర్గ్రాహ్యమయ్యెను. ఇట్టి
స్థితిలో నాంధ్రీకరణయుగప్రారంభదశయం దవత
రించినవాఁడయ్యు సోమనాథుఁ డట్టియుద్యమము
నకుఁ గడంగక, కేవలస్వతంత్రవిధానములతో
స్వతంత్రగ్రంథరచనములకే పూనుకొనుట యాతని
నవీనగుణములలో మునుముందు గణింపఁదగినది.
ఈతనియవతరణమే యొకప్రత్యేకప్రయోజనము
నకై నియుక్తమగుటగూడ దీనికిఁ గొంత కారణ
మని తలంపఁదగును. ఆంధ్రపద్యరచనములో నన్నయ
పాటించిన సంస్కృతపదబాహుళ్యము, సమాసపాట
వము నీతఁడు సడలించి యీవిషయమునఁ దన
తొల్లిటికృతియైన అనుభవసారమునందే కొంత
సంస్కారముఁ బ్రకటించెను. సమత్వమున వెలయు

సంస్కృతపదములతోను దేటతెనుఁగు నుడులతోను వెలయుచు నిందలి పద్యరచనము మత్తేభగమనము వలె మనోహరముగ సాగుచుండును. అటుతరువాత బసవ స్తవరూపములగు గద్యలు, రగడలు మున్నగు దేశీయగేయకృతులఁగూడఁ బెక్కింటిని సంస్కృత పదభూయిష్ఠముగ రచించినవాఁడయ్యు నట్టిరచనలు జనవశీకరణమునకు మతప్రచారమునకు నంతగా నుపకరింపవనెడి సత్యమును గ్రహించి, జనులవాడుకలో నిలుకడనంది, సహజమై వారికి సులభముగ నవగతమగు జానుతెనుంగుపై వలపుగొని తత్ప్రాధాన్యమును బాటించి, మతవాఙ్మయరచనమునకు సంస్కృతభాషనాధారముగాఁగొను ప్రాచీనమర్యాదను ద్రోసిరాజని, మాతృభాషయగు తెలుఁగు నెడ నెనలేని యభిమానమునుబూని తెలుఁగుఁ బలుకులనుగూడ వేదములపాటిగ గణింపుఁడని లోకమును హెచ్చరించి, సర్వసామాన్యము జాతీయచ్ఛందము నగు ద్విపదలోఁ దన ప్రధానగ్రంథరచనముల నిర్వహించెను "ద్విపదకావ్యంబు, ముదిలంజ, దిడ్డిగంత" అని యాంధ్రవాఙ్మయమున రాను రాను ద్విపదయెడ నేర్పడిన నిరసన మింతయో కొంతయో సోమనాథుని కాలమునాఁటికిఁగూడ నెలకొనియున్నట్లు గోచరించును. బసవపురాణమును ధూర్తవిప్రులు నిరసించి

యట్లు పిడుపర్తి సోమనాథుఁడు వాకొనిన కారణము
ఉలో నది ద్విపదయగుట యొకటిగదా! కాని సోమ
నాథుఁ డిట్టి ధూర్తజనాభిప్రాయముల నెఱుకొను
నంతటి పిఱికిపంద గాఁడు. సముచితమని తాను నమ్మి
నది నిర్వహించుటలో నాతనికి జంకు గొంకులు లేవు.
"క్రియాసిద్ధిః సత్వేభవతి మహతాం నోపకరణే"
అనునట్లు నవనవోన్మేషప్రతిభాశాలులగు కవివరు
లేఛందములో రచించినను దమకావ్యములచే లోక
రంజనము గావింపనేర్తురు. "అల్పాక్షరముల న
నల్పార్థరచన - కల్పించుటయ గాదె కవివివేకంబు."
అని బసవపురాణావతారికలోనే ఢంకా మ్రోగించి,
సోమనాథుఁడు ద్విపదకావ్యరచనమును మూల విపు
లముగ సమర్థించుచు నంట గూర్చి పండితారాధ్య
చరిత్రావతారికలో దీర్ఘోపన్యాసము గావించినాడు.
ఇందుచేతనే లఘుబుద్ధులగువారిదృష్టిలో గ్రామ్య
మునకుఁ దావలమైన ద్విపదయ లఘుమతియగు నీతని
చేతిలో నైహికాముష్మికరూపక ద్వివిధహేతువై
విరాజిల్లినది. సహజసత్వముతో స్వతంత్రాభిరక్తితో
సాగించిన యీ ద్విపదరచనమం దీతఁడు ప్రకటించిన
నవీనగుణముల సంఖ్యాకములు, అనిర్వచనీయములు.
శ్రుతి స్మృతి ప్రమాణముల లెక్కకు మిక్కిలిగ
గుప్పించుటయందేమి, గహనములగు నుపనిషద్రహ

స్యములఁ దేటతెల్లముగఁ జూపించుటయం దేమి, పలు
రూపములగు పరమతసిద్ధాంతములఁ బ్రదర్శించి
ఖండించుటయం దేమి, ఏకధాటిగ, హేరాళముగ,
ధారాళముగ, ఝురీవేగముతో సంస్కృతసమాస
ఘటితపదజాలములఁ బ్రవహింపఁజేయుట యం దేమి;
లలితములై యలఁతి యలఁతి తునియలుగ విడివడి
తేనియ తేటలై వెలువడు జాను తెనుంగునుడులజాలు
వార్చి, చదువరుల మదులఁ గరంచుటయం దేమి, ఇది
యది యననేల, దేనియందునుగూడ నడ్డాకింతయు
లేక సర్వవిధముల నాతనికి వశంవదమై ద్విపదయే
బహురూపకములగు వివిధసువిధానములం దొక్క
రీతిగ నుపకరింపనేర్చెను ఆంధ్రభాషాసతి తన ద్విప
దములతో నీతని ద్విపదకృతులందు బహుముఖము
లుగ, సంసతాసముగ నృత్య మొనర్చి కృత కృత్య
యయ్యెను. అందుచేతనే యీతని తరువాత వెలసిన
సుప్రసిద్ధకవులు పలువురు రచించిన పద్యకావ్యము
లందలి పలుతెలుంగుల మెఱుంగులకెల్ల నీతని ద్విపద
కావ్యములే మార్గదర్శకములై వన్నె కెక్కినవి.
కావ్యవ్యాకరణతీర్థులు, కీ॥ శే॥ శ్రీ పంచాగ్నుల ఆది
నారాయణశాస్త్రిగారు, ఆంధ్రపత్రిక పదియవ సంవ
త్సరాది సంచికలో "ద్విపదకవిత్వ"మను వ్యాసమున
సోమనాథుని బసవపురాణపండితారాధ్యచరిత్రముల

నుద్దేశించి లిఖించిన యీక్రిందివాక్యములు గమ
నింపఁదగినవి.

"ఈ రెండు గ్రంథములు నెక్కడఁ జూచిన నక్కడ
నవరసములు పొంగి పొరలి పోవునంతటి రసోదంచి
తములుగ ద్విపదలలోఁ గూర్పఁబడినవి. హిమవద్భూ
ధర గుహాగ్రములనుండి యనర్గళముగా దుమికి
వచ్చెడు గంగాప్రవాహమువలె నీమహామహుని
కవిత్వము పాఠకులమనంబుల నానందపూరమున
నోలలాడించుచుండును. భక్తశిరోమణియగు పోతన
భక్తిపారవశ్యపుఁ గవిత్వమునకు, కవిసార్వభౌముఁ
డగు శ్రీనాథమహాకవి నుడికారముల గడుసు-
దనంపు జిన్నెలకును, కర్ణాటరాజ్య రమానాథుఁ డు
నాంధ్రభోజుఁడు నాంధ్రకవియునగు కృష్ణదేవరాయ
మహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతుల
లోని యద్భుతవర్ణనాపటిష్ఠములగు సందర్భము
లకును, దీనికి దానికని యేల, ఇంతదనుక మనయాంధ్ర
సారస్వతమునఁగల హృద్యములగు గసవర్ణనో
దంచితములగు కావ్యపు మెఱుంగులన్నిటికిని, ఈ
రెండు ద్విపదకావ్యములే మార్గదర్శకములై
రాజిల్లిన వనుటలో నేమియు సందియము లేదు"

పద్యరచనావిధానమునఁగూడ నీతఁడు గొన్ని
సంస్కారములను గావించినాఁడు. నన్నియమార్గ

మున నీతఁడు నన్నియ పెట్టినవిధము కొంత యింతకు ముందే యుగ్గడించితిని. తిక్కనాదుల జాతీయకవితా నిర్మాణమునకు సోమనాథుని జానుతెనుఁగురచనము లే యుద్బోధకములనుట చెప్ప నక్కఱలేదు తెలుఁగు పద్యరచనమున నన్నయ తిక్కనల నడుమకాలమున జరిగిన పరిణామమున నీతని యనుభవసార మాదర్శ కము కా గలదు సీసపద్యరచనమున నీతఁడు నన్నయ యతినియమములఁ గొంతవఱకు సడలించెను. ఆ విషయమున నన్నెచోడ తిక్కనాదు లీతని మార్గ మునే యనుగమించిరి. మఱియు నీసీసపద్యరచన మున నీతఁ డొనర్చిన ముఖ్యసంస్కారము, ఏపాద మున కాపాదమునకుఁ బదములు తెగిపోయి ముందు పాదమందలిపదములతోఁ గలియకుండ రచించుట, ఆ యాపాదములందుఁ గూడఁ జాలవఱకుఁ బూర్వోత్త రార్థములు విడినడునట్లు రచించుట పాటింపఁదగి నది. దీనినే వరవడిగాఁగొని జక్కన, నాచన సోమన, శ్రీనాథుడు, మనోహరవిలాసభాసురముగఁ దమ సీసముల రచించి యందు సిద్ధహస్తులైరి సీసమునందు వలెనే కందపద్యరచనమునఁగూడ నీతడు చక్కని సంస్కారముఁ గూర్చినవిధ మనుభవసారమందలి కంద ములఁ జదివినఁ దెల్లమగును. ఆ చిన్నకృతిలో ద్విప్రాస, త్రిప్రాసకందములు గూడఁ గొన్ని రచించి

యీతఁడు చిత్రకవిత్వపుఁ దెరువులఁ బోఁడఁ గొన్నిటిఁ
ద్రొక్కినాఁడు తెలుఁగు నుడికారమునకుఁ దీయం
దనమునకు నెలవులగు బట్టైన సుమతిశతకపద్యము
లకు నతని నీతిసారమందలి కందములను సోమనాథుని
కందములే మూలకందములుగ గోచరింపఁగలవు.

ద్విపదవచనము దీతని వాక్ప్రవాహము హిమ
వత్పర్వత గుహాగ్రహములనుండి దుమికి వచ్చు
గంగాప్రవాహముతో సరిపోల్చిన శ్రీపంచాగ్నుల
ఆదినారాయణశాస్త్రిగారి వాక్యముల నింతకు
మున్నుగ్గడించితిని వేగమునందేమి, పావనత్వము
నందేమి, మఱి యితరగుణములందేమి యీసా
మ్యము సర్వవిధముల నంగీకృతముగ నున్నది. ఇం
దొకచో నామె కోమలకుటిలవిహారిణి. మఱి
యొకచో భక్తప్రసన్నమనోహారిణి. ఈతని కృతులఁ
జదువునపుడు కొన్నిచోట్ల నాభీలావేగముతో
శీతనగసానువుల నుండి ప్రవహించు భాగీరథియు,
మఱికొన్నితావులఁ గాశీపురిపరిసరముల సరళగతిని
జరగు జాహ్నవియుఁ దలపునకు వచ్చుచుండును.
సహజగంభీరత, సుప్రసన్నత యీతని శైలికి నైజ
గుణములు. ఈతని రచనలు ద్రాక్షాకదళీపాకములఁ
బరిణతములై, వైదర్భీపాంచాలీరీతులకాదర్శములై
వెలయుచుండును. ఈతని కవితయందలి ముఖ్యగుణ

ము లనన్యసామాన్యములగు సౌందర్యమాధుర్య ములు. భక్తిరసపరవశుఁడై భావమునే ప్రధాన ముగఁగొని, శ్లేషయమకాద్యలంకారములకై తడవు లాడక, జాతీయతను గణించి దేశీయచ్ఛందమగు ద్విపదలోఁ బ్రధానకృతుల వెలయించి యందు తీరుతీయములుగల తెలుఁగు పలుకుబళ్లను మేలుగ జాలువార్చుట యిందుకుఁ బ్రధానకారణములు. సరసమైన జానుతెనుంగుపై వలపుఁగొనినను సహజ గంభీరతాప్రసన్నములగు సంస్కృతపదములపైఁ గూడ నాతఁడు వ్యామోహము వీడలేడు, జాతీ యత వలసినపట్టులం దతఁడు నూటికి దొంబదిపాళ్లు జానుతెనుంగును బ్రయోగించి గాంభీర్యప్రకటన మవసరమైన మతసిద్ధాంతములు మున్నగుతావుల సంస్కృతపదబాహుళ్యమును బ్రదర్శించును. మఱి కొన్నిపట్టులఁ దెనుఁగుపదములను సంస్కృతపదము లను సమానముగఁ బరగించును. రసైకపరతంత్రుఁ డగుటచే రసవిజృంభణమునకై యెచ్చట నెట్టి పద జాలమును బ్రదర్శింపవలెనో యాతఁడు బాగుగ నెఱుంగును. శబ్దాలంకారములలో నాతని కను ప్రాసములపై మక్కువ యెక్కువ. అవి యైనను భావావేశములో వానియంతట నవి సాజముగ దొరలివచ్చినట్లు కన్పట్టును గాని వాని నాతఁడు

ప్రయత్నపూర్వకముగఁ బ్రవేశపెట్టినట్లు గానరావు. ఈతని తరువాత వెలసిన బమ్మెరపోతన మున్నగు తెలంగాణకవుల యనుప్రాసప్రియత్వమున కీతని కృతులే మార్గదర్శకములుగా నోపును పాత్రముల ముగ్ధత్వమును బ్రదర్శించుటలో నీతని జాణతన మెన లేనిది. ఇట్టి పట్టులం దాతఁడు ముద్దు మురిపెములు గురియు జానుతెనుఁగు బలుకులు జాలువార్చి వారి ముద్దతనము చదువరులకన్నులఁ గరడుగట్టునట్లు చిత్రించివారిని విముగ్ధులఁ గావించును. బసవపురాణ తృతీయాశ్వాసమందలి ముగ్ధభక్తులకథలఁ జదివిన నిది తెల్లమగును. కవితచిత్రకళయని తలంచి, యచ్చునగుద్దినట్లు పాత్రముల రూపవర్ణనమొనర్చి పాఠకుల మనఃఫలకముల హత్తించుటలో నీతని నైపుణ్యమగణ్యము. మచ్చునకై యిందలి మూఁడవ యాశ్వాసమందలి సకలేశ్వర మాదిరాజయ్యగారి కథలోని మల్లరుఘుగొల్ల వేసము, చెయువ్రలు చూడఁ దగును. ఈకవితావిశేషము తిక్కన, నాచన సోమన, శ్రీనాథుఁడు మున్నగుజాతీయకవుల కాదర్శక మయినది.

స్వాభావికములగు ప్రకృతివర్ణనము లీతనికి మంచినీళ్ళప్రాయములు అట్టిచోటుల నీత. డితరా లంకారములకన్న స్వభావోక్తినే మిక్కిలిగ

సంభావించును. కోఁడికూఁతనుగూర్చి యీతఁడు గావించిన

"తొలికోఁడి కనువిచ్చి - నిలిచి మైవెంచి
జలజల ఱెక్కలు సడలించి నీల్గి
గ్రక్కునఁ గాలార్చి కంఠంబువిచ్చి
ముక్కున నీఁకెలు చక్కొల్పి కడుపు
వెక్కించి మెడసాచి నిక్కి మిన్సూచి
కొక్కొరోకు ఱ్ఱనికూయకమున్న"

వంటి నిసర్గమనోహరవర్ణన మాంధ్రవాఙ్మయము నందు మఱెచ్చటను గనఁజాలము. సర్వజ్ఞతాశక్తి యీతని కృతులలోఁ బలుతావుల బహుముఖములఁ బ్రస్ఫుట మగుచుండును. అపరిచితములు నాత్మానుభవదూరములు నగు చౌర్యము, ద్యూతము, రసవాదము, వైద్యము మున్నగు నసాధారణ విషయముల వర్ణించునపుడు గూడ నీతఁడు ప్రకటించెడు ప్రతిభ పాఠకుల నాశ్చర్యచకితులఁ గావించును. ఇట్టి పట్టుల నాతఁడు ప్రయోగించు పదజాలము లాయాపారిభాషికనిఘంటువులుగ నుపకరింపఁగలవు. సకలేశ్వర మాదిరాజయ్యగారికథయుఁ బండితారాధ్య చరిత్రమందలి పర్వత ప్రకరణము తిలకించిన నీతని సంగీతశాస్త్రపారగత్వము గొంత వ్యక్తమగును.

ప్రతిపాదింపనెంచినవిషయము చదువరుల మదుల లెస్సగా హత్తికొని యందుమూలమున వారికి రసానుభవము గలుగుటకై సమానార్థకము లగు పర్యాయపదములను మార్చిమార్చి పుంఖానుపుంఖములుగఁ బ్రయోగించుట యీతని వితాగుణములలో గణింపఁదగిన మఱొక విశేషము. దీనిని భాషాసౌభాగ్య కళాసౌందర్యద్యోతకముగాఁ బలువురు సంభావించిరి. నాచన సోమనాథుఁడు, శ్రీనాథుఁడు మున్నగు సుప్రసిద్ధకవులు దమ కృతులలో దీని ననుకరించి యారాధించిరి. కాని నేఁటి విమర్శకు లొకరిందలి యింపు సొంపుల బాగుగాఁ బరికింపక సోముని యీ కావ్యగుణమును "దిక్కు, దశ, తల, తోఁక లేని పవాడముల పునరుక్తి" యని యవగణించుట శోచనీయము. ఉగ్గుఁబాలతోఁ గ్రోలిన మాతృభాషను మఱచిన మనకు సోమనాథుఁ డతివేలముగ వాడిన జాను తెనుఁగునుడులు రాను రాను వాడుకలో నశించి నేఁడు వాని నిజస్వరూపము, ప్రత్యేకార్థము నెఱుంగ రాకుండుటచే గొంద ఱదృష్టికవి పునరుక్తులుగఁ దోఁచుటలో నాశ్చర్యము లేదు. జాతీయతయే తన కవితకాలంబముగ గ్రహించిన వాఁడగుట నీతఁడు తన కృతులందెల్ల సందర్భోచితము

లుగ జాతీయములగు చక్కని లోకోక్తులను, పలుకుబళ్ళను విశేషముగ వాడియున్నాఁడు. కవిత కందచందములు, తళుకు బెళుకులు, తుఱంగలించు ఒక్కై జంటపదములను, ఆమ్రేడితములను, బలు తెఱంగులఁ బ్రయోగించుట యీతని కవిత యందలి మఱొక విశేషము. గ్రంథవిస్తరభీతిచే వీనికెల్ల నిచట నుదాహరణములు చూపనైతిని. బసవ పురాణ పండితారాధ్యచరిత్రములఁ గొంతవఱ కేపట్టులఁ బఠించినను నవి గోచరింపఁగలవు. అనంత ములై బహుముఖములుగఁ బలురూపముల వెలయు నీతని కవితావిశేషములనెల్ల విస్తరించుట దుస్తరము. కావ్యపఠనమునఁ జదువరులు వానిని స్వానుభవపూర్వకముగఁ గ్రోలి యానందించుటయే కర్తవ్యము. ఇందుఁగూర్చి యింకను విశేషవివరములు, విపులదృష్టాంతములు తిలకింపఁగోరువారు పూర్వోక్తమైన నా గ్రంథమందలి 14, 17, 18, 20 ప్రకరణములఁ బఠింపఁదగును.

## ఛందోవ్యాకరణ విశేషములు

ఆంధ్ర గ్రంథమాలిక వారి బసవపురాణ పీఠిక యందును, ఇతరత్ర ప్రకటితమైన మఱికొన్ని వ్యాసములందును శ్రీప్రభాకరశాస్త్రిగారు పూర్వాంధ్ర కవులందు శివకవులు, భవికవులు నను రెండు విభాగ

ముల నేర్పఱచి, శివునిమీఁదఁ దద్భక్తులమీఁదఁ దక్క నితరులగు భవులమీఁద నెప్పుడును గృతులు చెప్పనివారు శివకవులని, తదితరులు భవికవులని నిర్వచించి, మల్లికార్జునపండిత, నన్నెచోడ, పాలకురికి సోమనాథాదులను శివకవులుగను, నన్నయ తిక్కనాదులను భవికవులుగను బరిగణించి, కవితా మార్గమునందును, ఛందోవ్యాకరణాదులందును వీరు వేర్వేఱుమతములవారని, శివకవులు భవికవుల గర్హించిరని కొంత గ్రంథము లిఖించిరి. భవి యనఁగా నిష్టలింగధారి కాని వాఁడని స్థూల దృష్టితో నర్వాచీనులు కొందఱు వ్యవహరించు చున్నను, భవము (పాపము, పాశము) కలవాఁడు (శివభక్తిరహితుఁడు) అను నర్థమున, అభక్తవిషయ మున నే శివాగమములందును సోమనాథాదుల కృతు లందును భవిశబ్దము ప్రయుక్తమైనదని "పాలకురికి సోమనాథకవి" అను నాగ్రంథము తొమ్మిదవ ప్రకరణములో సకారణముగ నిరూపించియుంటిని. సోమనాథాదులు "శివకవు"లను పదమును దమ కృతులందు వాడినను నితరమతీయులగు కవులను వారు భవికవులని పేర్కొని నట్లుగాని, గర్హించి నట్లుగాని కానరాదు. బసవపురాణావతారికలో

"వెలసిన చదువులు వీటిచేఁ బోర్తిత
శాలిసిపోయిరి తమపురులు దూలఁగను
మృడుమహాత్త్వముఁ గానమిని బొంకులనఁగఁ
బడుఁ "గవయః కిం న పశ్యంతి"యనుట
యనుచుఁగుకవులఁగీటునఁ బుచ్చి పేర్చి"

అని వ్రాయునపుడుగూడఁ గుకవిశబ్దమునే యాతఁ డుపయోగించెనుగాని భవికవులనలేదు. వేమన పద్యములలోఁగూడ శివకవి, నవకవి శబ్దములున్నవే గాని భవికవి శబ్దముదాహృతము కాలేదు. ఇది శాస్త్రిగారు క్రొత్తగాఁ గావించిన నామకరణ మనియె తోఁచుచున్నది. "విశ్వశ్రేయః కావ్యమ్" అనునట్లు లోకకల్యాణము (శివము)గూర్చు సత్కా వ్యముల రచించు కవులు భవులెట్లవుదురు? అందు నను "మారువినుతుల బాసలాడఁజేసిన యట్టి భట్టుని నన్నయభట్టుఁబొగడి"యని చిమ్మపూడి యమరేశ్వ రుఁడు మన్నించిన నన్నయ్యను, "చిత్త నిత్యస్థిత శివుఁ డెవ్వఁడగున వీఁడను నాల్కకును దొడవైన వాఁడు" అని కేతనచే సన్నుతిగాంచి, "మహేశ్వ రాంఘ్రి కమలధ్యానైకశీలుండ"నని తానే వక్కా ణించుకొన్న తిక్కనను, శంభుదాసను బిరుదనామము ధరించిన ఎఱ్ఱనను భవులని యెవ్వరు గణింపనేర్తురు? నాదృష్టిలో నిట్టి వారెల్ల శివకవులే. వారికృతులు

భగవన్మహిమ ప్రతిపాదకములుగావా? వారి కృతి
పతులు భక్తులుగారా? ఇంతకు భాషసర్వసామాన్య
మైనప్పుడు, జీవేశ్వరజ్ఞాన సాధనరూపములగు మత
విషయములలో భిన్నమార్గము లవలంబించియుండు
నంతమాత్రమున నేభాషాకవులయం దైనను భాషా
విషయములందును, ఛందోవ్యాకరణబద్ధములగు
కావ్యసరణులందును భిన్నభిన్నమతములుండుట కవ
కాశమెట్లు కలుగును? తోడిదేశీయభాషలు తమి
ళము, కన్నడములలో లేని యీవిభేదము తెలుఁ
గులో నెట్లుండును? కావున సోమనాథాదులు కవితా
భాషావిషయాదికములలో నన్నయాదులకన్న భిన్న
మతమువారని శ్రీప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన
దానిలో సత్యముగాని సారస్యముగాని లేదనియే
నాతలంపు. కాలప్రవాహమువంటిదే భాషాప్రవా
హము. కాన రాను రాను గాలానుగుణముగు పరి
ణామములఁ గొన్నింటిని బడయుచుండుట ప్రతి
జీవద్భాషకును సహజలక్షణమే, నన్నయ తిక్కనల
భారతభాగము లొక్కతీరగు భాషాసరణివ్యాకరణ
మార్గములలో నున్నవని చెప్పఁగలమా? "ప్రయోగ
శరణం వ్యాకరణమ్" అను సూత్రము సమస్తభాష
లకు ననుశ్రుతముగ ననాదినుండియు వర్తిల్లు
చున్నదే. తనకాలమున శిష్టవ్యవహారముండుండిన

"ప్రాణగొడ్డము" మున్నగు సంస్కృతాంధ్ర మిశ్ర పదములఁ గొన్నిటిని నన్నయగ్రంథస్థ మొనర్పఁగా నిక్క తదుకాలమునాటికి వ్యవహారమునందున్న యట్టి శబ్దముల నన్నయకన్న నెక్కుడుగ నన్నెచోడుఁడు, సోమనాథుఁడు, తిక్కన, శ్రీనాథుడు మున్నగువారు తమకృతులందుఁ గైకొనియున్నారు. కావున "ఛందస్స్వాతంత్ర్యము" "అసాధారణ ప్రయోగములు" అను శీర్షికల క్రింద శాస్త్రిగారు నన్నెచోడ సోమనాథాదుల విలక్షణతఁ గూర్చి వెలువరించిన యభిప్రాయములు పెక్కింటిని నేనంగీకరింపఁజాలకున్నాను. సోమనాథుఁడు ఛందోవ్యాకరణాదులలో లక్షణసేతూల్లంఘన మొనర్చి సంప్రదాయ విరుద్ధముగ వర్తింపలేదనియే నాయభిప్రాయము. ద్విపదలలోఁ బ్రాసయతిని గూర్చుట సోమనాథుని ఛందస్స్వాతంత్ర్యములలో ముఖ్యముగా గణింపఁదగినదని శాస్త్రిగారు రుగ్గడించినారు. ఆంధ్రభాషలో సోమనాథుని కాలమునాటికి ఛందోవ్యాకరణలక్షణ గ్రంథము లేమైనవెలసినవో లేదో యెవ్వరు నింత వఱకు రూఢిగాఁ జెప్పఁజాలకున్నారు. ఇప్పటి కుపలబ్ధములైన వానిలోఁ బ్రాచీనములని మనము గణించు కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, ఆంధ్రశబ్దచింతామణి, ఆంధ్రభాషాభూష

ణము మున్నగునవియెల్ల సోమునకుఁ దరువాతివే గాని ముందటివి గావు. ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లదనులక్షణము సోముని తరువాతఁ జాలఁగాలమునకు వెలసిన చిన్నన్నలు చెప్పినదేగాని యాతనికి ముందుండిన తొల్లింటి పెద్దలేర్పఱచినదిగాదు. కవిజనాశ్రయములో నిందుఁగూర్చి యేమియుఁ జెప్పియుండలేదు. ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లుననుటకు సాధకముగ "అనియతగణైః" "యతిర్వా" "ప్రాసోవా" యను ప్రాచీనచ్ఛందస్సూత్రముల నాంధ్రభాషాచ్ఛందోలక్షణములఁ జెప్పుచు సంస్కృతభాషలో రచితమైన యేచ్ఛందోగ్రంథమునుండియో సోమనాథుడు పేర్కొనియేయున్నాఁడు. యతిప్రాసనియమములేని సంస్కృతశ్లోక రచనములకుఁగాని, యతినియమములేని కర్ణాట పద్యరచనములకుఁగాని యీసూత్రములు సంబంధించినవిగావని చెప్పనక్కఱలేదు. అక్షరగణబద్ధములై, చతుష్పాదనియతి గల వృత్తములందును, అనియతగణబద్ధములయ్యుఁ, జతుష్పాదనియతిగల కందము, ఉత్సాహము, అక్కర మున్నగుజాతులందును పాదద్వితీయాక్షర ప్రాసనియమమున్నదన్న కారణమునఁ గాఁబోలు వీనిలోఁ బ్రాసయతి పనికిరాదనియుఁ జతుష్పాదనియతిగల్గియుఁ బాదద్వితీయాక్షర ప్రాసనియమము

లేని సీసము, తేటగీతి, ఆటవెలఁది మున్నగు నుప జాతులందు, సంగీతమునందు నది చెల్లునని యుఁ దలంచు సంప్రదాయ మాంధ్రచ్ఛందోలక్షణగ్రంథ ములలో నేర్పడినది. అక్షరగణబద్ధములై చతుష్పాద నియతిగల లయగ్రాహి, లయహారి, లయవిభాతి, త్రిభంగి మున్నగు కొన్నివృత్తములవిషయమున మాత్రమందు లయప్రాధాన్య మున్నదన్న కారణ మునఁ గాఁ బోలు మరల నీలక్షణగ్రంథకర్తలు ప్రాస యతినే విధించియున్నారు. ఇవియన్నియు నర్వా చీనలక్షణములే యని తలంపఁదగును. అనియతగణ బద్ధరచనములలోఁ జతుష్పాదనియతితోపాటు పాద ద్వితీయాక్షరప్రాసనియమమున్న జాతులమాట యెట్లున్నను, ఇట్టి ప్రాసనియమముండియు ద్విపాద నియతిమాత్రమే గల ద్విపద, రగడ, అట్టి ప్రాస నియమము లేని మంజరీద్విపద మున్నగునవి పాట లుగాఁ బాడుకొనుట కనువగు గేయకృతులగుటచే సంగీతమునందుబలె వానిలోఁ గూడఁ బ్రాసయతిని వాడవచ్చుననుటయే ప్రాచీనచ్ఛందోలక్షణ కర్తల మతముగా గోచరించును. మనభాషలో గ్రంథస్థము గాక తరతరములనుండి పారంపర్యముగ జనుల నోళ్లలోఁబడి ప్రచారమందున్న యశేఖ్య గేయ వాఙ్మయ మెంతయో యున్నది. ప్రాఁత పాటలను

వేరితోఁ గొందఱు భాషాభిమానులు వీనిని సేక
రించి యిప్పుడందందుఁ బ్రకటించుచున్నారు. ఇవి
చాలవఱకు ద్విపదరూపములుగనో, తద్వికృతులు
గనో యుండును. వీనికాలమును నిర్ణయించుట
దుస్తరము. నన్నయకు ముందునుండియు వెలసినవి
గూడ నిందుఁ బెక్కులు చేరియుండును. వీనిలో
నందందుఁ బ్రాసయతి గాననగును. మచ్చునకుఁ
గొన్ని యుదాహరింతును

“అత్తింటికోడలు ఉత్తమురాలు
చేట జొన్నలుపోసి చేనిద్రపోను”
“చక్కనాన్నగారి ముక్కుపై చెమట
చేరుఁదేసిముత్యాలు చెదరిన ట్లుండు”
“చలికి వెఱచినట్లు పులికి నే వెఱవ
అలికి వెఱచినట్లు అమ్మకే వెఱవ”
“కొడుకులఁ గనని వాళ్ళకడు పేమికడుపు
కులముద్ధరించని కొడు కేమికొడుకు”

కావున నిట్టి ప్రాచీనమతము ననుసరించియే సోమ
నాథుఁడు ద్విపదలందు రగడలందుఁగూడఁ బ్రాస
యతిని వాఁడియున్నాఁడు. రంగనాథుఁడు, గౌరన
దీనిని వాడలేదని శాస్త్రిగారు వ్రాయుట సరిగాదు.
రంగనాథరామాయణమునందు, గౌరన నవనాథ
చరిత్రమునందుఁ గ్వాచిత్కముగఁ బ్రాసయతి

ప్రయోగము లున్నవి. ఈ రామాయణము నకు వాస్తవకర్తయని నేఁ దలంచు కవిరాజబిరుదాంచితుఁడు చక్రపాణిరంగనాథుఁడు సోమనాథునివలె రగడలందుఁగూడఁ బ్రాసయతిని గొన్నిపట్ల వాడియున్నాఁడు. శాస్త్రిగారే తిరుమలదేవస్థాన ప్రాచ్యపరిశోధనసంస్థవారిపత్రికలో (Vol VIII 1947 Part I) ప్రకటించిన రంగనాథుని "నయనరగడ" యందలి యీ క్రింది పంక్తులఁ జూచునది.

"పురవైరి నంధకాసురవైరిఁ బొడగంటి"
"రంగొందు పాతాళగంగ నేఁ బొడగంటి"
"అంగికమ్ముగనాడు భృంగీశుఁ బొడగంటి"

నన్నయ భారతభాగములో ద్విపదలు లేవుగాని తరువోజలు (రెండు ద్విపదపాదము లేకపాదముగాఁ గలవి) స్వల్పముగ నున్నవి వానిలోఁ బ్రాసయతి ప్రయోగములు గానరానంతమాత్రమున ద్విపదలోఁ బ్రాసయతి చెల్లదనునియమము మాతని నాఁటి కుండెనని చెప్పఁజాలము.

"ప్రాసవిశేషములు", "యతివిశేషములు"అను శీర్షికల క్రిందఁగూడఁ గొన్ని యసంగతములను సోమనాథుని విలక్షణత నిరూపించుటకై శాస్త్రిగారు వ్రాసియున్నారు. కర్ణాటభాషాలాక్షణిక మతము ననుసరించి సోమనాథాది శివకవులు తమకృతులందు

శాంతప్రాసము (పద్యప్రథమచరణ ద్వితీయాక్షరము
సంయుక్తాక్షరమైనప్పుడు వానిలోనున్న యన్ని
యక్షరములను బాటింపక తక్కినపాదములందుఁ
గతిపయహల్ సామ్యముతోమాత్రమే ప్రాసముఁ
గూర్చుట) వర్గప్రాసము (కవర్గాదికాక్షరములన్నిటికిఁ
బరస్పరము ప్రాసముకూర్చుట) సమీపప్రాసము
(శషసలకుఁ బరస్పరము ప్రాసముఁగూర్చుట) కూర్చి
రని, వానితోపాటు సంపూర్ణార్ధబిందుప్రాసమును
గూడ నంగీకరించిరని వారి యభిప్రాయము. కాని
యిది సరిగాదు. ఈవిషయమున గర్ణాటభాషా
మర్యాదనే పూర్తిగ ననుసరింపక యాంధ్రకర్ణాట
లాక్షణికు లిరువురకు సమ్మతములైన ప్రాసములను
మాత్రమే సోమనాథుఁడు మన్నించి, తనకృతులందు
నన్నయాదులతోపాటు ఆంధ్రభాషామర్యాదనే
పాటించెనని నేఁ దలంచుచున్నాను. బసవపురాణ,
పండితారాధ్యచరిత్రములం దేపుటలఁ దిలకించినను
నన్నయాదుల సంప్రదాయమునే పాటించుటకై
ప్రాసాక్షరములకొఱకు సోమనాథుఁడు, ఊఁతపద
ములను, వికృత్యాదిరూపములను బలుతావులఁ
బ్రయోగించినట్లు కానవగును. కర్ణాటకవుల వర్గ
ప్రాసాదిక సంప్రదాయములఁ బూర్ణముగ నంగీక

రించుచో నింత శ్రద్ధ నాతఁడు ప్రాసవిషయమునఁ బ్రదర్శింప నవసరమే లేదు.

మల్లికార్జునపండితుని శివతత్త్వసారమున

క లోకమ్ములఁ జోద్యముగాదె య
 ధర్మంబును ధర్మమయ్యెఁ దత్త్వాతీతా"

క సర్వజ్ఞ భక్తివిరహితుఁ
 డెవ్వఁడు నుత్కృష్టజాతుఁ డేటికిఁ గొఱయౌ"

అనుపద్యములందలి "ధర్మంబు", "సర్వజ్ఞ"వంటి పదములలోని రేఫసంయుక్తాక్షరము లానాఁటి వ్రాఁతలో "ధమ్మ్ఱంబు", "సవ్ఱ్వజ్ఞ"యను విధమున లిఖింపఁబడెడివనియు, నందుచే వలపలిగిలక ప్రాసమును వేరుగా నిట్టిప్రాసములు లాక్షణిక సమ్మతములేయని శ్రీకొమఱ్ఱాజులక్ష్మణరావు పంతులుగారు వ్రాసియున్నారు. "సర్పంబు పడగనీడను గప్పవసించిన విధంబు గదరా సుమతీ" అని బద్దెనకూడ నిట్టి ప్రాసమును వాడియున్నాఁడు. ఇది లాక్షణిక సమ్మతమే యైనను సోమనాథుఁడు మాత్ర మీప్రాసమును దాను గూడఁ దనకృతులలో వాడెననుటకుఁ బ్రబలాధారములు లేవు. ఆతఁడుకూడ దీనిని వాడెనని నిరూపించుటకై, కొన్ని బసవపురాణ వ్రాఁతప్రతులలో "కజ్జము", "నిజ్జీవి"యను వికృతిరూపములు గాన

వచ్చుచున్నను, 1896 సం॥ లో వెలువడిన బసవ పురాణ ప్రథమముద్రణములో నవియే గైకొనఁబడి నను శాస్త్రిగారు తమ యభిప్రాయము సమర్థించుటకై తమపరిష్కరణములో నిట్లు లీక్రిందిపాదములఁ బ్రకటించియున్నారు.

"కర్జంబునావుడు బిజ్జలుం డంత
లజ్జయుం సిగ్గును బుజ్జగింపంగ"
"బిజ్జలునకు వినిపింపంగ నతఁడు
కర్జమెం తేనియుఁ గలదు తేరాదు"
"బుజ్జగించుచు వెడ్డు బుడ్డును బెట్టు
నిర్జీవి క్రియఁబడు నివ్వెఱఁగందు"

ఇఁక శాస్త్రిగారు చూపిన

"మర్త్యలోకమునకు మఱి వేఱెయొకఁడు
కర్తయున్నాఁడె లోకత్రయవరద" 1
"మధ్యాహ్నమగుటయు మారయ్య లింగ
తద్ధ్యాన సుఖనిరంతరవర్తి యగుచు" 2
"అక్షణంబునఁ బంచభక్ష్యముల్ గుడిచి" 3

(భక్ష్యశబ్దమునకు భక్ష మను రూపాంతరము గూడ గలదు.)

"తత్త్రిపురాంతకస్థానవాస్తవ్యుఁ
డై త్రిపురాంతకుం డభినుతిఁ జేర్చు" 4

అను తావులందలిప్రాసములు నన్నయ తిక్క-నాదులకుఁగూడ సమ్మతములయిన త్రివర్ణప్రాసము (ప్రాసాక్షరములో మూఁడువర్ణములున్నప్పు డందలి యే రెండు వర్ణములతోఁగూడిన పదములనైనను దక్కినపాదములందుఁ గూర్చుట.) సంయుతాసంయుతప్రాసము నను రెంటిలో నెద్దానిక్రిందనైన గణింపఁదగినవేగాని కేవలము శాంతప్రాసములని శాసింపనైనవి గావు. మఱియు సోమనాథుఁ డిట్టిప్రాసములను స్వరోచ్చారణసామ్యముఁ గలిగి అంతస్థములు (Semi-Vowels) అని వ్యవహరింపఁబడు య, ర, ల, వ లతోఁగూడిన సంయుక్తాక్షరముల విషయమున నే ముఖ్యముగ వాడినట్లు కాననగును. నన్నయాదులుగూడనిట్టివి వాడిరనుట కుదాహరణములు.

ఉ క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియ వైశ్య శూద్రులనఁగాఁ దగు నాలుగుజాతులున్
స్వచ్చారిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితు గాచినయట్లు రామ
మాంధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగం
బునన్ (నన్నయ - భారతము, ఆదిపర్వము )

క కద్రువ గన్గొని సంతో
షద్రుతమతి యగుచుఁ బిలిచి - సవతికిఁ జూపెన్
భద్రాత్మక యవ్వినతయుఁ
దద్ద్రోహం బెఱుఁగలేమి - దైన్యము నొందెన్.
(తిక్కన - అనుశాసనికపర్వము

క. ఈక్షితికి వచ్చి వేగమ
దక్షారామమున వారతరుణుల నృత్యం
బీక్షించి యంతకంటెను
దక్షిణమున నేర్చి రంభతగ నేర్పడఁగన్
(వేములవాడ భీమకవి - నృసింహపురాణము)

సోమనాథుఁ డుపయోగించిన

"పాండురాంగంబైన పకఁతి గర్భమున
బోఁడిగా వెలుఁగుచుఁ బుత్త్రుఁ డీ క్రియను"

మున్నగు తావులందలి పూర్ణార్ధబిందుప్రాసములవిష
యముఁగూడ శాస్త్రిగారు ప్రకటించినయభిప్రాయ
ములు సరిగావు. తెలుఁగుపదములలో నేఁటి వ్యవ
హారమున దీర్ఘములమీఁదఁ గానవచ్చు నర్ధబిందువు
తొలుదొలుత ప్రాచీనకాలమున పూర్ణబిందువుగా నే
యుండెననియు, రాను రాను పూర్ణబిందూచ్చారణము
దీర్ఘాక్షరములపై సడలి నెఱసున్న యరసున్నగా
మాఱినదనియు, నర్ధానుస్వారతత్త్వవేదులు వచింతురు.
ఇందుకుఁ దార్కాణముగఁ బ్రాచీనశాసనములలోఁ
బద్యములందు వచనములందుఁగూడ దీర్ఘముల
మీఁది యరసున్న నెఱసున్నగా నే పెక్కు తావులఁ
జెక్కఁబడినది. నన్నయకాలమునాఁటి యీక్రింది
శాసనములఁ జూచునది.

గీ సకలవసుమతీశ మకుట లసద్రత్న
కిరణరుచి విరాజి చరణుఁడయిన
నిజభుజప్రధాని బెజయితదేవని
కూఁతు సరియె పోల్పఁ గాంత లెందు
(రాజరాజనరేంద్రునికూఁతురు సోమలదేవి దక్షారామ శిలాశాసనము—శా శ 987)

నారాయణభట్టు కుంతుఱుకుపమవెట్టిన అఖణ్డావర్తి"

పదుమూఁడు పదునాల్గుశతాబ్దులు దీర్ఘముల మీఁది పూర్ణానుస్వారము లర్ధానుస్వారములుగ మాఱుచుండినకాలమని పలువురు తలంచుచున్నారు. తిక్కనకు సమకాలికుఁడైన కేతననాఁటికిఁగూడఁ బద్యములలో నవసరమైనప్పుడు దీర్ఘములమీఁది యరసున్న నెఱసున్నగనే యూఁదఁబడుచుండెడిదని యాతని యాంధ్రభాషాభూషణమందలి యీక్రింది పద్యమువలనఁ దెల్లమగును.

క కుఱుచలపై నరబిందులు
నెఱయఁగ నూఁదినను జెల్లు, నిడుపులమీఁదన్
నెఱయవు గద్యంబులలో,
నెఱబిందువు లూఁదుఁ బద్య నికరములోనన్ ।

కావున సోమనాథుని కాలమునాఁటికి దీర్ఘముల మీఁది యనుస్వారము కేవలము పూర్ణముగానే

యుండియుండునని గాని యథవా యవసరమును బట్టి పద్యరచనములందు నెఱసున్న గా నది యుణ్డఁ బడుచుండెననిగాని తలంపనగును. సోమనాథుఁడే గాక నన్నెచోడుఁడు, వేములవాడ భీమకవి మున్నగువారుగూడ నిట్టి ప్రాసములు వాడి యున్నారు. "వాఁడిమయూఖముల్ గలుగువాఁడు" మున్నగుపద్యములలో నన్నయ తననాఁటి వాడుక చొప్పున దీర్ఘములమీఁద నెఱసున్నయే వాడి యుండునని తాళపత్ర ప్రతిలేఖకులుగాని ముద్రాపకులుగాని వానిని దరువాత నరసున్నలుగా మార్చి యుందురని నా యభిప్రాయము. ఇఁక సోమనాథుఁ డుపయోగించిన సార్థబిందు నిర్బిందు ప్రాసములు, రేఫద్వయప్రాసములు, నకారముతో శ ష లకుఁ గూర్చిన ప్రాసములు, వర్గాక్షరములలో ట ర, డ ఢ, ద ధ థ లకుఁ గూర్చిన ప్రాసములు నించుమించుగ సకలాంధ్రకవిసమ్మతములైనవే. వానిని గూర్చి చర్చ యనవసరము. నేఁటి వ్యవహారములో మనము లఘురేఫ శకటరేఫములుగా నెంచునవి నన్నయ సోమనాథుల కాలమున నెట్లు వ్యవహృతములయ్యె డివో యిదమిత్థముగ నిర్ణయింప నాధారములు లేవు. ద ధ థ ప్రాసములను నన్నయగూడ వాడి యున్నాఁడు. శ, ష, స ప్రాసములను తిక్కన,

భాస్కరుఁడు, జక్కన, శ్రీనాథుఁడు మున్నగువారు గూడ వాడియున్నారు.

యతుల విషయములో "మూఁకకు నెగయుచు ముస్సు ముస్సనుచు" అని బసవపురాణమందలి పాద ముదాహరించుచు, శాస్త్రిగారాసందర్భములో సోమనాథుఁ డిందువాడిన యనుకరణపదము "ముస్సు"గాని నేఁటివాడుక ననుసరించి కొందఱు భ్రమించునట్లు "బుస్సు" కాదని చెప్పుచు, ఆ కాలమున ఉత్వవిశిష్టములగు ప, ఫ, బ, భ లకు పదాంతమందలి ప్రథమావిభక్తి మువర్ణముతోనేగాని తదితరమైన ముకారముతో యతిఁ గూర్చెడివాడుక లేదనియు, ప్రథమావిభక్తి మువర్ణకము తొల్లింటి వ్రాఁతలలో "వనబు, వనంబు, వనమ్బు" ఇత్యాది రూపములతోఁగూడ లిఖింపఁబడుటచే దానితోనే పు, ఫు, బు, భులకు యతి గూర్చుట సంగతమయ్యె ననియు వ్రాసిరి. ఈపట్టున వీరు వెలువరించిన యభిప్రాయములుగూడ సరిగావనియే నా తలంపు సోమనాథుఁడు మువిభక్తి, ముకారములు రెండింటితోఁ గూడ పు, ఫు, బు, భు లకు యతినిగూర్చియున్నాఁడు.

"పుడమీశ! మీధనంబునకుఁ జేసాఁప"

"భువినరువాద్దడి మువ్వురలోన"

"భాందుగాఁ బసిఁడికొమ్ములు గొరిజయలు"

అప్పకవి ముకారయతికి లక్షణము చెప్పుచు

క. హెచ్చరికను పు ఫు బు భు లకు
న చ్చపుమా కొమ్ములే మహాకవు లాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట
నచ్చటను ముకారయతు లటంచును గృతులన్

అని పూర్వకవు లీయతిని దమకృతులలోఁ గ్వాచిత్కముగ వాడినట్లు చెప్పినాఁడు. ఆనందరంగ రాట్ఛందములో కస్తూరిరంగకవి దీనినే చక్కటి యతి యని పేర్కొని నన్నయభట్టు లక్షణసార ములోనిదని యీ క్రిందిపద్య ముదాహరించినాఁడు.

'పు ఫు బు భు లకు ముకారంబు పూర్వమునను
గాని పైఁగాని చెప్పఁ జక్కటి యతియగు
ముప్పిఁగొని కృష్ణుఁడురమునఁ బొడిచె ననఁగ
బుధుల వినుతులఁ దగె వ్యాసముని యనంగ"

మన సోమనాథుఁ డేగాక రంగనాథ, నన్నెచోడ, భాస్కర, నాచన సోమనాథాది పూర్వకవులుగూడ నీ ముకారయతిని దమకృతులలో నందందు వాడి యున్నారు.

బసవపురాణములో నీక్రిందితావుల గణభంగ ములు గానవచ్చునని తలంచి—

"ప్రేమం బెలర్పంగ 'భృత్యాపరాధ
స్వామి నోదండ' యన్పగవు నిష్ఠించి"

"పాయక శ్రుతి రసాన్భక్తస్య జిహ్వా
గ్రే యని యెప్రొద్దు మ్రోయుం గావునను"
"అంధక కరిదైత్యవ్యాఘ్ర లాలాజ
లంధరాసుల నిర్దళనము సేయండె"
"శునక గార్దభ మ్లేచ్ఛ శుక దర్దురాది
జనిత మునీంద్రాది జాతము లెల్ల"

వీనిలో 1, 2 తావులలో రాధ, జిహ్వా యను నవి సంయుక్తాక్షరపూర్వకము లగుటచే గలములకు మారు గగములగుటచే గణభంగ మేర్పడుచున్న దని, సంస్కృతమునఁ జరణాంతమందలి లఘువు గురువు కావచ్చు ననుటకు "పాదాంతస్థం వికల్పేన" అను విధియు నందు కనువుగఁ బ్రయోగములు కానగును గాని, పాదాంతమందలిగురువు లఘు వగుట కానరాదని, ఇత్యాదిగా నిందుఁగూర్చి శాస్త్రి గారు మఱికొంత గ్రంథము వ్రాసిరి. పాదప్రథమాక్షరము సంయుక్తాక్షరమైనప్పుడు తత్పూర్వపాదాంతవర్ణము నూఁది పలుకక యవసరమైనచో లఘువుగాఁ జేసికొనవచ్చును. వృత్తరత్నాకరమందలి యీ క్రిందిశ్లోకములఁ జిత్తగించునది.

"సానుస్వారో విసర్గాంతో దీర్ఘోయుక్త పరశ్చలః,
వాపాదాంత స్త్వసౌగ్వక్రో జ్ఞేయోన్యోమా త్రికోల్ఋజుః"
"పాదాదా విహవర్ణస్య సంయోగః క్రమసంజ్ఞకః.
పురస్థితేన తేన స్యాల్లఘుతాపి గురోః క్వచిత్"

బసవ—H

ఇందుచే "భృత్యాపరాధ" అనుచోట ధకారము లఘువే యగును. ఈలోకోక్తినే చతుర్వేదసారమున గూడ సోమనాథుఁడు వాడినాఁడు.

"నీ ధరధర్మ మిట్లు 'భృత్యాపరాధస్స్వామి
నోదండ'యనఁనీకకాదె సిగ్గు"

కాని యిప్పట అపరాధశబ్దమందలి ధకారము పాదాంతమున లేదుగాన గురువే యైనది. జిహ్వాశబ్దము ఆకారాంత స్త్రీలింగముగాన రెండవ తావున నిట్టిది కుదురదు. ఇప్పటిఁ గవి పాఠము మాఱు గుపడి యప పాఠము నెలకొనినది "భక్త జిహ్వాగ్రకే" యని యున్నచో గణభంగముండదని శాస్త్రిగారే వ్రాసినారు. ప్రథమముద్రణప్రతిలో నట్లేయున్నది. అట్లో "భక్తజిహ్వాంచలే" యని యో కవి పాఠమైయుండును. ఈ రెండవపాఠమే యీముద్రణమందు నేను గ్రహించినాను తక్కిన మూఁడు నాలుగు తావులఁగూడ శాస్త్రిగారు గ్రహించిన పాఠములు కవిపాఠములు గావని నా తలఁపు "కరిదైత్య" అనుటకు మాఱు కొన్ని వ్రాఁతప్రతులలో "మదగజ" "సామజ" "సింధుర" అను పాఠములు కానవచ్చుచున్నవి. భీమకవి తన కర్ణాటానువాదములో "సింధుర" శబ్దమునే గ్రహించియున్నాఁడు. "మ్లేచ్ఛ" శబ్దమునకు ముందు వెనుకల నున్నవన్నియు జంతు

వాచకములు. ఇచ్చట "మ్లేచ్ఛ" యను మానవ వాచకపదమునకు సంగతి లేదు కవిపాఠము "మచ్ఛ" మై యుండునని నా తలంపు. వనశబ్దమునకు జలమును నర్థముకూడ నున్నదిగాన భీమకవి, పిడుపర్తి సోమనాథుల యనువాదములలో నిందుకు వనచర, వనేచరశబ్దము లుపయుక్తమైనవి శాస్త్రిగారు ప్రకటించిన పాఠములం దైనను వ్యాఘ్ర, మ్లేచ్ఛశబ్దములందలి తొలిసంయుక్తాక్షరములు స్వరోచ్చారణసామ్యముగల యంతస్థములగుటచే వానిని దేల్చి పలికినయెడలం దత్పూర్వాక్షరములు త్య, భ యనవి గురువులుగాక లఘువులే యగును. యకార రకారములతోం గూడిన సంయుక్తాక్షరములకు ముందుండెడి యక్షరములయెడ్ల నీవిధి చెల్లునని కొందఱు లాక్షణికులు స్పష్టముగాం జెప్పియేయున్నారు అంతస్థములందలి తక్కిన లకార, వకారములవిషయమునంగూడ నిది చెల్లునని యే తోంచుచున్నది.

ఇంక వ్యాకరణవిషయములలోంగూడ సోమనాథుని యెడం బాటింపదగిన వైలక్షణ్యము లేదనియే నా యభిప్రాయము. ఆతని కృతులలో నందందుం గానగు ఇకారసంధులు, క్త్వార్థకేకారసంధులు, షష్ఠీసమాసాంతర్గతములైన అకారసంధులు, కుషష్ఠికి ముందఱి నుగాగమలోపములు, పదాంతములంగు

పదమధ్యములందు అకార, ఇకార, ఉకారములు మూఁటియెడఁగూడ అజ్లోపము గావించుట, వైరి పదములు (సంస్కృత దేశ్యపద మిశ్రసమాసములు) మున్నగునవి ప్రామాణికాంధ్రకవులు' పలువు రకృతు లలో సాధారణముగఁ గానవచ్చునవే. శ్రవణసుభగ ముగ నున్నంతవఱకిట్టివానిని దమనాఁటి శిష్టవ్యవ హారము ననుసరించి కవులు తమకృతులయందు వాడుట మొదటినుండియు వచ్చుచున్న మర్యా దయే. సోమనాథుఁడు ఛందోవ్యాకరణాంశము లలోఁ దదితరపూర్వాంధ్రకవులకన్న భిన్నమతము గలవాఁడు కాఁడనుటయే నేఁజెప్పెడి సారాంశము. ఇందుఁగూర్చి యింకను విపులముగ విశేషాంశముల నెఱుంగ నెంచువారు నాగ్రంథమందలి 19-వ ప్రక రణము చూడఁదగును.

## శివైక్యము

మహాపురుషులు పలువురకువలెనే పుట్టినచోటం గిట్టుట సోమనాథునకు ఘటిల్లదయ్యెను. ఈశ్వర సంకల్పములు దుర్గ్రాహ్యములు గదా! బిజాపూరు జిల్లా బాగెవాడిలో పుట్టిన బసవేశ్వరుఁడు కూడ లిసంగమేశ్వరమందును, గోదావరిజిల్లా దక్షారామ మున జనించిన మల్లికార్జున పండితుఁడు శ్రీశైలమం దును లింగైక్యమైరి. ఇట్లే త్రిలింగదేశమున పాలు

కురికిలో నుదయించిన సోమనాథుఁడు కర్ణాటదేశ
మునఁ దారకాద్రి యను నామాంతరముగల కల్యా
క్షేత్రమున శివైక్యమయ్యెను. ఇది బెంగుళూరుజిల్లా
మాగడితాలూకాలో బెంగుళూరునకు నాలుగు
యోజనములదూరమున నున్నది. సోమనాథుఁడు
చరమదశలోఁ గన్నడభూమికిఁ దరలినది రెండవ
ప్రతాపరుద్రునికాలములో నాంధ్రదేశము తురుష్కా
క్రాంతము కానున్నదను కారణముచేతనని చెప్పెడి
సంగతిలో సత్య మేమాత్రము లేదని మున్నే యుగ్గ
డించితిని. ఆతని యనంతరము రమారమి యొకయర్ధ
శతాబ్దికిఁబైఁగాఁ గాకతీయసామ్రాజ్య మవిచ్ఛిన్న
ముగ వర్ధిల్లినది. పరదేశమున శివైక్య మొందవలె
నని యాతఁడు స్వయముగ వాంఛింపలేదు. ఇందు
కేర్పడిన వాస్తవపరిస్థితులు తోఁటదార్యుని సోమే
శ్వరపురాణమున వర్ణితములైనవి. సోముని వీరశైవా
చారధౌరేయత, చతుష్షష్టి శీలసంపన్నత, నిరుప
మానములని ముందే చెప్పియుంటిని. దేశసంచార
మొనర్చు చరమూర్తి యొక్కరుఁ డొకనాఁడు పాల
కురికి కేతెంచి సోమనాథునిపూజల నొంది యాతని
యాచారశీలముల కానందించి, కర్ణాటదేశమున కల్యా
క్షేత్రమందున్న "చెన్నమ్మ" యను మహాభక్తురాలి
యగణితశీలసంపన్నతఁగూర్చి యాతనియెదుట

విశేషముగఁ బ్రశంసించెను. ఇది విన్నంతనే యామెను సందర్శించు వేడ్క సోమనాథునకు పొడమె. యందుపై పుత్త్రుఁడు చతుర్ముఖబసవేశ్వరుని, శిష్యుఁడు చక్రపాణి రంగనాథుని, మిత్త్రుఁడు పాలకురికి సూరనామాత్యుని వెంటఁగొని కల్యమునకుఁ బ్రయాణమయ్యెను. చెన్నమ్మయు వారిరాక కానందించి వారిని భక్తి గౌరవములతోఁ బూజించి కొంతకాల మచ్చట నుండి తనపూజాదికముల గ్రహించి, తన్నుఁ గృతార్థురాలిని గావింపుఁడని సోమనాథునిఁ బ్రార్థించి విభూతి పీఠ్యమును సమర్పించెను. ఆమె యాదరానురోధమునఁ గాదనలేక యట్లేయని యాతఁడు దానిని స్వీకరించెను. కాని తనయనుచరుల తొందరచేఁ గాఁబోలు గడువు ముగియకయే కొన్నిదినములైన తరువాతఁ బాలకురికికి మరలుటకై బండికి నెద్దులఁ గట్టించి కట్టాయిత్తమై చెన్నమ్మగృహాంగణమందుంచి యామెసెలవు గైకొనుటకై లోనికేఁగి తమకనుజ్ఞ నిమ్మని యామెను బ్రార్థించెను. ఆమె నివ్వెఱపడి “మహాత్మా! పెద్దలకు నేనేమి చెప్పఁగలను? తమ వాగ్దానమునకు భిన్నముగ గడువుకుముందే మరలి పోవుట న్యాయమా? తొందర యేమి?” అని విన్నవింపఁగా, నాతఁడు “తల్లీ! నాశిష్యులునాకై పరితపించుచుందురు. నీవు దయతో సమ్మతించి యనుజ్ఞయొసంగిన

గడువుతోఁ బనియేమి? కాదనక సెలవొసంగుము."
అని ప్రార్థించెను. ఆమెయు మాటాడలేక "మీ
చిత్తము" అనెను. అంత బండియెక్కి ప్రయాణమున
కాయత్తముకాఁగా వృషభములు స్తంభించి ముందున
కొక్కయడుగైనఁ గదలవయ్యెను. అందఱు ఆశ్చర్యపడి
యావృషభస్తంభనవృత్తాంతమును విచారింపఁగా
నచ్చటిపెద్దలు కొందఱు విభూతిపీఠ్యము యొక్క
మర్యాద మహిమములనుగ్గడించి వానిని పాటింపక,
గడువునకుముం దిట్లు ప్రయాణమగుటయే దీనికిఁ
గారణమనిచెప్పి పూర్వైతిహ్యములఁగూడఁ గొన్ని
టిఁ బేర్కొనిరి. అంత విధిలేక యాతఁడు ప్రయా
ణముమాని, యప్పటనే యాఁగి గడువుసమాప్తికై
నిరీక్షించుచుండెను. ఇంతలో నొకనాఁడు శివుఁడు
సోమునకుఁ బ్రసన్నుఁడై, "వత్సా! నీ వవతరించిన
ప్రయోజనము నెఱవేఱెఁది. నాలోకమునకుఁ గొని
పోయెద రమ్ము" అని యాదేశించెను. సోముఁడు
మహాదేవునకుఁ బ్రణమిల్లి "దేవా! ఈ భౌతికదేహ
మును భూగర్భమున నిక్షిప్తమొనర్చి యాపిమ్మట
నిన్నుఁ గలియుటయే నా యభిమతము. రాఁబోవు
సోమవారమునాఁ డట్లుగావించి నిన్నుఁ జేరెద" అని
విన్నవించెను. చిఱునవ్వుతో నట్లేయని యీశ్వరుఁ
డంతర్హితుఁడయ్యెను. ఈవృత్తాంత మచ్చటి భక్త

మాహేశ్వరులకు నివేదించి యిందువాసరము రాఁగానే సమాధి నేర్పఱించి మహావైభవముతో భక్తమండలి పూజించుచుండ సోమనాథుఁడు శివ యోగముచేఁ బ్రాణములు విడిచి బయలయ్యెను. వీర శైవపంచాచార్యపీఠములలో శ్రీశైలసింహాసనము నకుఁ జెందిన శాఖామఠ మీకల్యక్షేత్రమునఁ గలదు. ఆమఠావరణమునందు సోమనాథునిసమాధి యిప్పటికిని భద్రపఱుపఁబడియున్నది. అందే యొక వైపున చెన్నమ్మగవి యనుపేరితో నాభక్తురాలిసమాధి గూడఁ గలదు. నా గ్రంథము 1-వ పుటలోని చిత్ర పటము చూడఁదగును. నేడు పాలకురికిలోనున్న సోమనాథలింగాలయమందలి లింగము సోమనాథుని సమాధిపైఁ బ్రతిష్ఠితమైనదై యుండునని తలంచి యాతఁడు పాలకురికియందే శివైక్యమయ్యెనని కొందఱు భ్రమించుచున్నారు. తోంటదర్యని గ్రంథ విషయములకుఁ బిడుపర్తి సోమనాథుని వ్రాఁతలకు, కల్యములో నేడు గానవచ్చు ప్రత్యక్షప్రమాణ మునకు నిది విరుద్ధము. అన్యవాదకోలాహలశతకకర్త పద్యములలో "యుష్మదీయాశ్రమాభ్యున్నతిం జెందెనే భాగ్యంబు చేసెనో పాలకురికి" అని యున్నదే గాని యందుఁగూడ సోమనాథునిసమాధి ప్రశంస లేదు. కావున రోగనివారణకామితఫలప్రదాన

శక్తులు గలిగి భక్తులకు యాత్రారంగమై పాలకురికి యందు నేడు వెలయుచున్న సోమనాథలింగము, కారణాంతరములచేఁ గల్యమున కేఁగి మరలిరాక సోమనాథుఁడు దైవగతిచే నచ్చటనే లింగైక్యమగు టకు విలపించి పాలకురికిలోని శిష్యవర్గ మాతనియనం తర మాతని యాశ్రమస్థలిపైఁ దత్స్మారకముగఁ బ్రతి ష్ఠించినదనియు, చిరకాలము సోమనాథుని యాధ్యా త్మికబల మాహాత్మ్యము హింది యుండి పవిత్రస్థానముపైఁ బ్రతి ష్ఠితమగుటచేతనే యాలింగమున కట్టి శక్తిమహిమ ములు గల్గినవనియు మనము గమనింపదగును.

## బసవపురాణము - తద్రచనాక్రమము - పరివర్తనములు

ప్రకృతగ్రంథమగు బసవపురాణములో సోమ నాథుఁడు బసవని చరిత్రముతోఁ బూసలలో దారమువలెఁ బలువురు పురాతనభక్తుల చరిత్రము లను బసవని సహచరులగు మఱికొందఱు సమకాలీన భక్తుల చరితములను మేళవించి రచించినాఁడు. ఇందు చేతనే దానిని సకలభక్తకథామణి సూత్రభాతిగాఁ గూర్పుమని శివుఁడే భృంగి కాదేశింపఁగా నాతఁడు పాలకురికి సోమనాథరూపమున నవతరించినట్లు పిడు పర్తి సోమన చెప్పినాఁడు. ఇందు వర్ణితులైన పురా తనభక్తులు చాలవఱకు ద్రవిడదేశమందలి యఱు

వత్తు మూవురులోనివారు. వారు కర్ణాటవాఙ్మయ
మునఁ బ్రత్యేకకృతిరూపములను హరీశ్వరుని శివ
గణావరగళె మున్నగు కృతులందుఁగూడ బ్రస్తుతి
కెక్కినవారు. వారిలోఁ బలువిధశైవు లున్నారు.
అందఱు వీరశైవులు కారు. ఇంక బసవని సమకాలీ
నులలో అల్లమప్రభువు, ముగ్ధసంగయ్య, మడివాలు
మాచయ్య, సిద్ధరామయ్య, సకలేశ్వర మాది
రాజయ్య, కిన్నర బ్రహ్మయ్య, కన్నదబ్రహ్మయ్య,
కలకేత బ్రహ్మయ్య, మోళిగ మారయ్య, మసిడి
చౌడయ్య, సురియ చౌడయ్య, తెలుఁగు జొమ్మయ్య,
ఏకాంతరామయ్య, షోడ్డలదేవు బాచయ్య, శివనాగు
మయ్య ముఖ్యులు. ఈవచనములోఁగూడ నొకవిధ
మైన ప్రక్రమమున్నది. నందీశ్వరుఁడు బసవేశ్వరరూప
మున నవతరించుటకుఁగల కారణము, ప్రయో
జనము, బసవని జననము, తలిదండ్రుల విడియాతఁడు
వీరశైవులలోఁ గలియుట, వివాహము, కూడలి సంగ
మేశ్వరుని ప్రసన్నతఁ బడసి యుద్యోగ్యథలొందుట
ప్రథమాశ్వాసమునను, బిజ్జలునియొద్ద ప్రధాన
మంత్రిగాఁ జేరుట, అల్లమప్రభునకు విందొనర్చి
యాతని యనుగ్రహ మొందుట, కొన్ని మహిమలు
చూపుట ద్వితీయాశ్వాసమునను వర్ణితములైనవి.
అటుతరువాత మిండజీక మనసేమారయు అంగక

ఋశ్యశృంగునివలె వేశ్యను మహాయోగినిగా సంభా
వించిన ముగ్ధసంగయ్యగారి ముగ్ధచర్యలను పురస్క
రించుకొని బసవేశ్వరుఁడు మేనల్లుఁడు చెన్నబస
వన్నకు నుగ్గడించిన పురాతన ముగ్ధభక్తుల చరిత్ర
ములతో ముఖ్యముగా మూడవయాశ్వాసము
గ్రథితమైనది నాల్గవయాశ్వాసము బసవని భక్తి
సువర్ణమునకు గీటు ఱాయిగానుండి నిష్ఠురవాది
యని పేర్వడసిన మడివాలు మాచయ్యచరితముతో
నారంభమైనది. బసవేశ్వరుఁడు రచించిన గీతమొకటి
యొకభక్తుఁడు వినిపింపఁగా నందహామికచ్ఛాయ
లించుక గోచరింప మాచయ్య యాగ్రహముతో
బసవని మిక్కిలి తూలనాడ నాతఁడు పాదాక్రాం
తుఁడై పరిపరివిధముల ఆత్మనిందాపరముగఁ దన
యజ్ఞానమును వెలువరించి క్షమింపుమని ప్రార్థింప,
మాచయ్య ప్రసన్నుఁడై యాతని లేవనెత్తి కౌఁగి
లించికొని యెట్టిభక్తులకు నహంకార మెంత
మాత్రము తగదని, విద్యకుంబలె వినిర్మలభక్తికిం
గూడ వినయమే వెలలేని భూషణమని చెప్పి భక్తి
రహస్యముల నాతని కుద్బోధించి యందుకు దృష్టాం
తముగానుదాహరించిన పూర్వభక్తులచరిత్రములతో
నీయాశ్వాసము చాలవఱకు విస్తృతమైనది. బసవని
సమకాలీనులు కిన్నర బ్రహ్మయ్య మున్నగువారు

నెఱపిన యద్భుతమహిమోద్ఘాటన ప్రకటనపూర్వక ముగఁ బంచమాశ్వాసము రచితమైనది. బిజ్జలుని యాస్థానమున జైనవాదముల విటతాటమాడి శిర మిచ్చి పడసి విశేషమహిమలు వెల్లడించిన ఏకాంత రామయ్య కథతో నారంభమై షష్ఠాశ్వాస మట్లే జైనుల నోడించి వారివసదులఁ గూల్చిన పూర్వ భక్తులచరిత్రములతో నిండియున్నది. సప్తమా శ్వాసము కులముచే నంత్యజుఁడయ్యు, శివభక్తికలి మిచే నుత్తమస్థితిఁగాంచి బసవనిచే పూజింపఁబడిన శివనాగుమయ్యచరిత్రముతో నారంభమై యేతా దృశులగు పూర్వభక్తుల చరితములతోఁ జాలవఱకు నిండి, కాలవశుఁడై బిజ్జలుఁడ కారణముగ అల్లయ్య, మధుపయ్య యనుభక్తుల కన్నులఁ దీయించిన కార ణమున బిజ్జలుని శపించి బసవేశ్వరాదులు కల్యాణ పట్టణమును విడనాడుట, బసవఁడు సంగమేశ్వర లింగమం దైక్యమగుట, జగదేవాదులచే బిజ్జలుఁడు సంహరింపఁబడుట, అనతికాలములో నాతని సంతతి గూడ నశించి రాజ్య మస్తమించుట మున్నగు వృత్తాంతములతో నంతమైనది.

ఈ ద్విపదకావ్యమునకుఁ దెలుఁగుబాసలో నేర్ప డిన యనువాదములలో పిడుపర్తి సోమనాథుని పద్యకృతియే యిప్పుడు ప్రచారమందున్నది. దాని

సాతఁడు సంగ్రహానైపుణితో రచించినాఁడు. ఇది గాక విజయవాడ వాస్తవ్యుఁడు శ్రీపతి పండితా రాధ్యవంశ్యుఁడు మహాదేవారాధ్యుఁడు మఱియొక పద్యానువాద మొనర్చినాఁడు. కాని యిది ముద్రిత మైనట్లు లేదు. ఏలూరులో నారాధ్యబ్రాహ్మణులు, కందుకూరివారి పూర్వులెవరో వ్యాసప్రోక్తముగా స్కందాగస్త్య సంవాదరూపముగ సోమనాథుని కావ్య మనుసరించియే బసవేశ్వరపురాణ మను పేర నొక సంస్కృతగ్రంథము నవతరింపఁజేసిరి. అదియు నముద్రితమే. కన్నడపరివర్తనముల ముందే యుగ్గ డించితిని. అందన్నిఁటికన్న మును ముందు రచితమైన భీమకవి పరివర్తనమే యథామాతృకముగ సర్వవిధ ముల మిన్నగ నున్నదని సన్నుతిఁ గన్నది.

## బసవేశ్వరుఁడు - బిజ్జలుఁడు

బిజ్జలునిశాసనము లనేకములు లబ్ధమైనను వానిలో నెందును బసవేశ్వరుఁ డుదాహృతుఁడు గాకుండుట, బసవేశ్వరునిపేరనైన శాసనమొకటియుఁ గానరాకుం డుట కారణములుగాఁ జాలఁగాలము బసవేశ్వరుని చారిత్రక వ్యక్తిత్వమును బలువురు శంకించుచుండిరి. బసవేశ్వరుఁ డవతారపురుషుఁడు. మహిమశాలి. అసా ధారణంబగుశివభక్తి యరచేతిచింతామణియై యుండ దాని యందనే యాతండు తన యాశ్రయుల వాంఛి

తార్థముల ఘటింపఁగల్గెడివాఁడు. అందుచే రాజుతోఁ
జెప్పి వారిని సత్కరింపఁజేయవలసిన యావశ్యకత
యాతనికేమాత్రము లేదు. అందునను నాతఁడు నిత్య
వ్రతముగ సాగించిన జంగమారాధన మున్న ప్రదాన
రూపకమైనది. ఆకాఁటిశరణులుగూడఁ దృణీకృతహరి
బ్రహ్మపురందరులు బసవేశ్వరుఁడు వారియెడఁ గావిం
చిన యుత్సవములో దాత, యర్థియను తారతమ్యమే
లేదు. ఆతనిభక్తి కానందించినవా రాతనియొద్దఁ
జేరి పూజల నొందినవి. అట్టివారి సహము మపలినబస
వఁడు స్థిరవసతి రూపకదానము లొసర్చినను, నిజ
యశః ప్రశస్తికై శాసనములే వెలయించియున్న
నాతనిగౌరవ మానాఁటి భక్తులయెదుట నేమాత్రము
దక్కియుండెడిది కాదు మడివాలు మాచయ్య,
మోళిగ మారయ్యగారల కథలఁ జదివిన నిందలి
తత్త్వము వ్యక్తము కాఁగలదు. పూర్వోక్తమైన శాసనా
భావముల కివియే ముఖ్యకారణములని మనము
గమనింపవలెను. బిజ్జలుని శాసనములలో సుదాహృ
తుఁడుగాకున్నను నాతని యనంతర మొకశతాబ్దిలో
శా. శ. 1177—1202 నడుమ వెలువడిన హిరి
యూది, చౌడదానుపుర, కల్లెదేవరపుర, మరడీపుర,
కన్ననూరు, శాసనములలోఁ బూర్వభక్తులు కొంద
ఱతోపాటు సంగన బసవ యనుపేరితో బసవేశ్వ

రుఁడుగూడఁ బేర్కొనఁబడియున్నాఁడు. బసవేశ్వరుని జన్మస్థలమగు బాగెవాడికి సమీపమందున్న అర్జునిగి (అర్జునవాడ)లోని శివాలయమున శా. శ. 1182లో యాదవకన్నర నృపాలుని దండనాథుఁడు చావుండసెట్టి బసవేశ్వరునికి నాల్గవతరమువాఁడైన హాల బసవదేవునకుఁ గావించిన దానమును బ్రకటించు శిలాశాసనమే లభించినది. అందు బసవేశ్వరుని నామోల్లేఖనమిట్లున్నది.

(Epigraphia Indica Vol XXI Part I)

వ. మత్తాంతర్దవాడి మధ్యగ్రామ బాగవాడి పురవరాధీశ్వర మాదిరాజన తనూజం బసవరాజనమహిమ యెంతెందడె

క. సంగళకీర్తి పురాతన
జంగమ లింగైకభక్తి నిర్భరలీలా
సంగం సంగన బసవం
సంగతి యంమాశ్కాభక్తి యొళగ నవరతమ్"

ఇట్లు శిలాశాసనములఁ జూచిన పిరువాత బసవేశ్వరుఁడు చారిత్రకపురుషుఁడే యని యిప్పుడు నిర్వివాదముగ నందఱు నంగీకరించుచున్నారు. శాసనప్రమాణములచే కూడ నిర్ధారితమైనఁగాని నేఁటి విద్వాంసులు మహాకవుల గ్రంథములందలి విషయముల నమ్మకుండుట శోచనీయము.

బసవేశ్వరుని యనంతర మనతికాలములో సోమనాథాదులు రచించిన గ్రంథవిషయములకు విరుద్ధ

ములగు నంశముల నటుతరువాత నాలు గైదువందల సంవత్సరములకు వెలువడిన బిజ్జలరాయచరిత్ర మున్నగు గ్రంథములలో జైనులు లిఖించియున్నారు. బిజ్జలుఁడు జైనమతావలంబి యను దురూహతోఁ గట్టి యసత్యకల్పనముల నందు వారు గావించియుందురు. బసవని తోఁబుట్టువు పద్మావతి యను సుందరాంగి సౌందర్యమునకు వ్యామోహితుఁడై బిజ్జలుఁడామెను బెండ్లాడి బసవనికిఁ బ్రధాన మంత్రిత్వ మొసంగి యాతనిచేతిలోని కీలుబొమ్మయై వ్యవహరించెననియు, నిది యవకాశముగాఁ గొని బసవఁడు బిజ్జలుని భాండాగారమందలి ధనమునెల్ల విచ్చలవిడిగ వెచ్చించి తుదకు రాజద్రోహియై బిజ్జలునిఁగూడఁ జంపించె ననియు, నిట్లు తమ బసవద్వేషమును వెడలఁగ్రక్కుచుఁ బెక్కు సంగతుల నందు వ్రాసియున్నారు. బిజ్జలుని సోదరి నీలలోచనను బసవఁడు పరిగ్రహించెనని మఱికొందఱు వ్రాసిరి. ఉపనయన మొల్లక తండ్రితో వివదించి బసవఁడు వీరశైవులలోఁ గలిసినప్పు డతనితోపా టాతనిసోదరి నాగాంబికగూడ వెడలెననియు, నవివాహితయైన యామెకు మహాభక్తుఁడగు కక్కయ్యగారి ప్రసాదకణభక్షణమహిమమునఁ గర్ణములనుండి చెన్నబసవేశ్వరుఁ డవతరించెననియు చెన్నబసవపురాణాదులు

చెప్పుచున్నవి. నాగమాంబికకు శివస్వామి యను భర్తవరునితో వివాహమైనదని, యీదంపతులకే చెన్నబసవఁ డుదయించెనని మఱికొన్ని వీరశైవ గ్రంథములవలనఁ దెలియుచున్నదఁట. బసవేశ్వరుఁడు జనకులనుండి వేర్పడి వీరశైవులలోఁ జేరినప్పు డాతని మేనమామయు, బిజ్జలుని ప్రధానమంత్రియు నగు బలదేవుఁ డాతని శివభక్తికి సంతసించి తన సుత గంగాంబ నాతనికిఁ బరిణయమొనర్చెనని, బలదేవుని యనంతర మాతనిపదవినే బిజ్జలుఁడు బసవని కొసంగె నని బసవపురాణము చెప్పుచున్నది. బసవనికి మఱి యొకభార్య యున్నట్లు సోమనాథాదులు చెప్పలేదు. బిజ్జలుఁడు జన్మతః వీరశైవుఁడనిగాని, యాతరువాత నైనఁ దన్మతమును స్వీకరించెననిగాని జైనులుగాని మఱెవ్వరుగాని వ్రాసియుండలేదు వీరశైవులు కాని కారణమునఁ దలిదండ్రులనే విడనాడిన బసవనకు మతాంతరుఁడగు బిజ్జలునితో వైవాహికసంబంధము లేర్పడియుండుట యసంగతమని చెప్పనక్కఱలేదు. వా రొకరితోఁబుట్టువుల నొకరు పెండ్లియాడిరనుట కేవల మసత్యకల్పనమనియే తలంపనగును. తత్సమ కాలికగ్రంథములయం దిందు కెట్టి ప్రమాణములు లేవు.

ఇప్పుడు నిజామురాష్ట్రమున గుల్బర్గాప్రాంతమం

దలి కల్యాణపట్టణము చిరకాలము పశ్చిమచాళుక్యుల రాజధానిగా నుండుట చరిత్రప్రసిద్ధము. బిజ్జలుఁడు మొదటఁ బశ్చిమచాళుక్య చక్రవర్తియుఁ త్రైలోక్యమల్ల బిరుదాంచితుఁడు నగు మూఁడవ తైలపదేవుని సామంతుఁడుగానుండి యాతని ప్రతినిధిగా క్రీ. శ. 1145—1162 ప్రాంతముగ అకు తర్దవాడి మున్నగు సీమల నచ్చటి మంగళవేఢ (మంగళవాడ) ప్రధానపట్టణముగాఁ జేసికొని పరిపాలించుచు క్రీ. శ. 1162 సం॥వ స్వాతంత్ర్యుఁడై కాకతి ప్రోలరాజు మున్నగువారి సాయముతో తైలపదేవు నోడించి కల్యాణపట్టణ మాక్రమించి దానిని బశ్చిమచాళుక్యరాజ్యమందలి కొంతభాగము నపహరించెను. అప్పుడు తైలపుఁడు కల్యాణపట్టణమును విడిచి యన్నిగేరి, బనవసిమున్నగు ప్రాంతములందుండి మిగిలిన రాజ్యభాగములఁ బరిపాలించుచుండెను. బిజ్జలుఁడు క్రీ. శ. 1168 ప్రాంతమున మరణింపఁగా నాతనిపుత్త్రులు రాయమురారిసోవిదేవుఁడు మున్నగువారు క్రీ. శ. 1182 వఱకుఁ గల్యాణపట్టణమునుండియే తండ్రి సంపాదించిన చాళుక్యరాజ్యమును బరిపాలించిరి. తైలపుని కుమారుఁడు నాలుగవసోమేశ్వరుఁడు క్రీ. శ. 1182 లో బిజ్జలునిపుత్త్రుల నోడించి తండ్రి గోల్పోయిన రాజ్య

భాగమును మరలఁ గైకొని కొన్నివత్సరములు పరి
పాలించెను. అతని యనంతరము దేవగిరి రాజు
యాదవజైతుగి, హొయసలరాజు ఇమ్మడి వీరబల్లా
ళుఁడు చాళుక్యరాజ్యము నాక్రమించి తమరాజ్య
ములలోఁ గలిపికొనిరి. అంతతోఁ గల్యాణమునఁ
జాళుక్యపరిపాలనము పూర్తిగా నంతరించెను.

బిజ్జలుఁడు చంద్రవంశక్షత్రియుఁడని, హైహ
యాన్వయుఁడని, కలచుర్యవంశ్యుఁడని, సువర్ణ
వృషభ ధ్వజ లాంఛనాదులు గలవాఁడని యాతని
శాసనములవలన గాననగును. ఆతఁడు జైనమతావ
లంబి యనుట కెట్టియాధారములును లేవు బసవ
పురాణమునుబట్టియు నట్టిసూచన లించుకేనిఁ
గాన్పింపవు. ఆతఁడు నాతని పుత్త్రులు, అద్వైతమత
స్థులో, సామాన్యశైవులో యై యుందురు. వారి
శాసనప్రసక్తదానములు వివిధమతీయులకు గావింపఁ
బడినవి బసవనికి, బిజ్జలునకు మతసంబంధికవైష
మ్యము లేమాత్రము లేదనియే బసవపురాణమువలన
గోచరించును. తోడిమంత్రులు బసవనిమీఁదను,
నాతని యనుచరులమీఁదను కొండెములఁ జెప్పి
నప్పుడుగూడ బిజ్జలుఁడు వాస్తవస్థితులు విచారించి,
వారు నిర్దోషులని గ్రహించి వారు ప్రకటించిన
మహిమాదికముల కబ్బుర మొందెడివాఁడు. సోమ

సాధునకు బిజ్జలుఁడు పుట్టుకచే కలచుర్యుఁడా, హైహయుఁడా, చాళుక్యుఁడా యను విచారముతోఁ బనిలేదు. మనకవుల కిట్టి సూక్ష్మచరిత్రాంశములపై దృష్టియుండెడిది కాదు. కల్యాణపట్టణమందుండి బిజ్జలుఁడు తత్పుత్రులు పరిపాలించినది చాళుక్యరాజ్యము. వారియనంతర మది యచ్చటఁ గొలఁదికాలములో నంతరించినది. సోముఁడు బసవపురాణము రచించునాఁటికిఁ గల్యాణమున బిజ్జలుని సంతతివారు రాజ్యమొనర్చుటలేదు. ఈ కారణములచేతనే యాతఁడు బిజ్జలుని నతనిసుతులను జాళుక్యులుగనే భావించి నమస్కారగద్యలో బసవేశ్వరునిఁ గూర్చి "సాధితచాళుక్యేంద్రాయ నమో" "శాపనిహితచాళుక్యాయ నమో" అనియు, పండితారాధ్యచరిత్రమున

"అవనిలోఁ జాళుక్య లనుపేరు వారుని
కవిలెను దుడిపించి కల్యాణకటక
మీఁడితభక్తి మహిష్ఠతపేర్మిఁ
బాడుగా శపియించె బసవనమంత్రి"

అనియు వ్రాయుటకుఁ గారణమైనది. (బసవేశ్వరుని పేరనున్న కన్నడవచనములు కొన్నిటిలోఁగూడ బిజ్జలుఁడు చాళుక్యుఁడనియే పేర్కొనఁబడియున్నాఁడు.) మఱియు బిజ్జలుని కొమరులు తండ్రితోపాటూవెనువెంటనే నశింపక కొలఁదివత్సర

ములు జీవించియున్నను, దద్విషయమును సరిగాఁ బాటింపక సోమనాథుఁడు బసవపురాణములో

"అంతరాజ్యార్థమై యని చేసి యతని
సంతానమెల్ల నిస్సంతాన మయ్యె"
"భ్రమసి యమాత్యాది భటవర్గ మెల్లఁ
దమలోనఁ జచ్చిరి సమరంబు సేసి"
'బసవని సత్యశాపమునగాఁ జేసి
పసచెడి కటకంబు పాడయ్యె నంత"
"వినియె నంతయు నట సనియెఁ గూడలికి"

అని వ్రాసి యంద ఆవెంటనే చచ్చిరని వారి మర ణమును కల్యాణపురనాశనము విన్న తరువాతనే బస వఁడు సంగమేశ్వరునం దైక్యమయ్యెనని సూచించి నాఁడు. మల్లికార్జున పండితుని శాపమునంజేసి వెల నాటిచోళుఁడు నాతని సంతతి నశించిరని చెప్పుటలో స్వల్పకాలవ్యత్యాసముల గణింపక పండితారాధ్య చరిత్రములోఁగూడ నాతఁ డిట్లే వ్రాసియున్నాఁడు. కావున నిట్టిపట్ల స్థూలదృష్టితోఁ గవులు వ్రాసిన దంతయు- చారిత్రక ప్రమాణముగా గణింపరాదు. బిజ్జల వెలనాటిచోడుల మరణానంతరము వారిసంతతి కొంతకాలము పరిపాలించినను, వారందఱు నశించు వఱకు బసవేశ్వర పండితారాధ్యులు జీవించియుండి రని మనము తలంప నక్కఱలేదు. చరిత్రజ్ఞులు నిర్ణ

యుంచినట్లు బిజ్జలుఁడు బసవడు నించుమించుగా నేక కాలమున క్రీ. శ. 116౭ ప్రాంతమునను, బస వేశ్వరనిర్యాణమును విని యాతనియనంతర మొకటి రెండువత్సరములలో పండితారాధ్యుఁడు మరణించి రనుటయే సత్యసమ్మతము. శాసనాదికములఁబట్టి చూచిన బిజ్జలుఁడు కల్యాణపురమునఁ బరిపాలించి నది రమారమి యాఱుసంవత్సరములు మాత్ర మేయని కానఁగును. అంతకుఁ బూర్వ మాతఁడు తైలప దేవుని సామంతుఁడుగా మంగళవాడయందే పాలన మొనర్చెను. ఏకాంత రామయ్య జైనుల నోడించి బిజ్జలునియొద్ద జయపత్రమును గొన్నది యాతఁడు సామంతుఁడుగా నున్నప్పుడే యని యబ్లూరు శాస నమునుబట్టికూడఁ గానఁగును బసవపురాణమునుబట్టి బసవఁడు తన మేనమామ బలదేవుని యనంతరము బిజ్జలునియొద్ద మంత్రిత్వము గ్రహించినది కల్యాణ పట్టణముననే యని కన్పట్టును బిజ్జలుఁ డిచట రాజ్య మొనర్చిన యాఱేండ్ల స్వల్పవ్యవధిలోనే బసవేశ్వ రుఁడు బలదేవుని కొమరితను బెండ్లియాడి యనంతర మాతనిపదవిని బడసి వీరశైవమతోద్ధరణ మొనర్చి యుండుట యసంభవము. కావున నీవిషయమునఁ గూడ మనము సోమునివాక్యములకు సంపూర్ణ ప్రామాణ్య మొసంగరాదు. మంగళవాడ పండర

పురసమీపమునఁ గల్యాణపట్టణమునకు రమారమి
నూఱుమైళ్ళదూరమం దున్నది. బసవని జన్మస్థలము
బాగెవాడి కది కొంతదగ్గఱయే. కావున బిజ్జలుఁడు
మంగళవాడలోనున్నప్పుడే బసవఁ డాతనిమంత్రిగాఁ
జేరి యచ్చటనున్న కాలముననే వీరశైవమతోద్ధర
ణమును గొంత సాగించి బిజ్జలుఁడు కల్యాణమునకు
వచ్చినపు డాతనితో డనే యచ్చటికిఁ దానుగూడ
వచ్చియుండునని తలంపఁదగును. హరీశ్వరుఁడు, శివ
గణదరగళెలో బిజ్జలుని మంత్రిగా బసవఁడు కుదిరి
నది మంగళవాడయందే యని చెప్పియున్నాఁడు.
యథార్థమిట్లుండఁగ జారిత్రకప్రమాణములకు, బసవ
పురాణవాక్యములకుఁ బూర్వోక్తవిధమున సమ
న్వయము చేసికొనక, తద్విషయమునఁ గానగు
స్వల్పవైరుధ్యములఁబట్టి లేనిపోని శంకలు గల్పించి
కొని, దానికి దోడు హరీశ్వరుఁడు, సోమనాథుఁడు
బసవని సమీపకాలమువారు గాక చాలఁ దరువాత
రెండవప్రతాపరుద్రునికాలమం దుండినవారని
భ్రమించి, బసవేశ్వరునియేలిక పూర్వోదాహృతుఁ
డైన బిజ్జలుఁడుగాక యాతని యనంతరము కల్యా
ణమున క్రీ. శ. 1177 వఱకు రాజ్యమేలిన యాతని
తనయుఁడు రాయమురారి సోవిదేవుని సామంతుఁ
డుగా తరికాడు ప్రాంతముల క్రీ. శ. 1169—74

నడుమఁ బరిపాలించిన సింద్ వంశ్యబిజ్జణుఁడో, రాయమురారి నాల్గవయేల్బడివత్సరముగు క్రీ. శ. 1171 లో వెలయింపఁబడిన మాడగిహాళు శాసనమున (Epigraphia Indica Vol XV) సుదాహృతుఁడైన చతుర్థకులజుఁడు మాళిగ బిజ్జనాయకుఁడో యైయుండునని భావించి, సింద్ బిజ్జణుని యధికారులు బలదేవనాయక సౌర టూ రి దా సి మయ్యలు అమృతరాశిదేవునకు క్రీ. శ. 1174 లో దానముచేసిన ట్లొక శాసనముందున్నందున నందలి బలదేవనాయకుఁడే బసవని మేనమామ యైయుండునని యందుచే సింద్ బిజ్జణుఁడే బసవేశ్వరుని యేలిక కాఁదగునని యూహించుచు శ్రీయస్. శ్రీకంఠశాస్త్రి ఎం. ఏ. గారు కన్నడ సాహిత్యపరిషత్పత్రిక బహుధాన్యవత్సర మార్గశీర్ష సంచికలో వ్యాసమొకటి ప్రకటించియున్నారు. పై యిరువురిలో మాళిగ బిజ్జనాయకుఁడు మంగళవాడ రాజధానిగాఁ బరిపాలించెనని శాస్త్రిగారు వ్రాసియున్నారు కాని యది సరిగాదు వారు పేర్కొన్న మాడగిహాళు శాసనముందాతని రాజధాని మాళిగపట్టణమని స్పష్టముగాఁ జెప్పఁబడినది. అదియే తరువాత మాడగిహాళు నామమున వ్యవహరింపఁబడుచున్నది. సింద్ బిజ్జణునకైనను మంగళవాడ రాజధానిగానుండి

నట్టు లాధారములు లేవు. శాస్త్రిగా రట్టివేవియు నుదాహరింపలేదు. మఱి యాశాసనమందే రాయమురారితండ్రి బిజ్జలుఁడు తత్పూర్వులు మంగళవాడయందే రాజ్యమొనర్చిరని విస్పష్టముగా నున్నది. ఆకాలమం దది పశ్చిమచాళుక్యరాజ్యమున నొకప్రధానస్థానముగా నుండెను. ఇంచుమించుగ నేకకాలమున బిజ్జణ, బిజ్జలనామధేయులు పలుతెగలలోఁ బలువురున్నట్లే బలదేవనాయకులుకూడనుండి యుందురు. కావున సింద్ బిజ్జణుని యధికారి బలదేవనాయకుఁడే, బిజ్జలుని ప్రధానమంత్రియు బసవని మేనమామయు నగు బలదేవమంత్రి యని తలంపరాదు. శ్రీశాస్త్రిగారు పేర్కొన్న సింద్ బిజ్జణుఁడు గాని, చతుర్థకులజుఁడగు మాళిగబిజ్జనాయకుఁడు గాని చాళుక్యులనుటకు, వారొకవేళ మంగళవాడ ప్రాంతమున రాయమురారి సామంతులుగా నేలుబడి గావించినవారయ్యు వారిలో నెవ్వరు నెప్పుడు కల్యాణపట్టణమునఁగూడఁ బాలించిరనుటకు నెట్టి యాధారములు లేవుగదా! పరంపరాగతమైన కల్యాణపట్టణసంబంధము బసవేశ్వరునుండి విడఁదీయుట సరిగాదు. శాస్త్రిగారు చూపెడి దుర్బలకారణము లందుకు సాధకములు కాఁజాలవు. తరతరములనుండి భక్తలోకమున వ్యాప్తిగాంచిన పాట

లందు, కీర్తనలయందు "సంగనబసవ", "కల్యాణ బసవ"యను పేర్లతోనే బసవేశ్వరుఁడు కీర్తింపఁబడు చున్నాఁడు కల్యాణమున బసవేశ్వర సంబంధికము లగు సన్నివేశములిప్పటికిని గలవని స్థలజ్ఞులు చెప్పు చున్నారు బసవని గద్దె యని పిలువఁబడు స్థలముపై దుకాణములు పెట్టి వ్యాపారము సేయువర్తకులకు మంచిలాభము కలిగెడిదనియు, నంగడిచే నాప్రదేశ మేటేట వేలము వేయుదురని, వర్తకులు దాని నెక్కువ సొమ్మునకు పాడెదరని తెలియుచున్నది. కావునఁ గొంతకాలము తైలపదేవుని సామంతుఁ డుగా మంగళవాడలో రాజ్యమొనర్చి క్రీ. శ. 11 62 ప్రాంతమం దాతని పశ్చిమచాళుక్యరాజ్యము నందుఁ గొంతభాగ మపహరించి యంతటనుండి కల్యాణపట్టణము రాజధానిగాఁ బరిపాలించిన కడి చుర్యబిజ్జలుఁడే (రాయమురారి సోవిదేవునితండ్రి) బసవేశ్వరుని యేలికయని ఘంటాపథముగఁ జెప్పఁ దగును. సుప్రసిద్ధచరిత్రజ్ఞులందఱి నిర్ణయ మదియే. జైనులువ్రాసిన గ్రంథములలోఁ గూడ నీవిషయమున మాత్రము వైరుధ్యమేమియు లేదు. బసవేశ్వరుని యనుచరులు బిజ్జలుని వధించినప్పు డాతనిపుత్రుఁడు రాయమురారియే బసవేశ్వరుని పట్టికొనుటకై సైన్య ముతో వెన్నాడెనని యాగ్రంథములం దున్నది.

కావున శ్రీకంఠశాస్త్రిగారి యూహలు నిరాధార ములు, భ్రమప్రమాదజనితములనియే గమనింపఁదగు ను. కన్నడసాహిత్యపరిషత్పత్రికయందలి వారివ్యాస మున కాంధ్రానువాదము "బసవేశ్వరునిగూర్చి క్రొత్తచరిత్ర" అనుపేరితో విభూతిపత్రిక సంపుటము 1 సంచిక 3 లోఁ బ్రకటితమైనది. ఈవిషయములఁ గూర్చి విశేషాంశము లెఱుఁగఁ గోరువా రా వ్యాసమును, ఆపత్రికయందే సం॥1 సంచిక 7, సం॥ 2 సంచిక 4 లలోనే ప్రకటించిన "బసవేశ్వరుఁడు. బిజ్జలుఁడు," "బసవేశ్వరునిగూర్చిన శాసన సామగ్రి" యను వ్యాసములఁ జూడనగును.

వీరశైవమతోద్ధరణము - బసవని సంస్కారణములు

అద్వైతమతోద్ధారకుఁడైన యాదిశంకరునివలెనే బసవేశ్వరుఁడుగూడఁ జిరకాలము జీవింపలేదని తెలియుచున్నది. శివతత్త్వచింతామణి యనుగ్రంథ ములో నాతఁడు క్రీ. శ. 1159 సిద్ధార్థిసంవత్సర ములో జన్మించిన ట్లున్నదఁట. మఱికొందఱాతఁడు క్రీ. శ. 1132 లో జనించెనని వ్రాసియున్నారు. వైశాఖశుద్ధతదియ యాతని జన్మతిథి యని కర్ణాట దేశీయు లాదినమున బసవజయంతి జరుపుచున్నారు. ఏది యెట్లున్నను బసవఁడు జీవించినది నలుబదియేండ్ల లోపుమాత్రమేయని తెలియుచున్నది. వీరశైవము

బసవేశ్వరోపజ్ఞ మెంతమాత్రము కాదని యది యత్యంత ప్రాచీనమైనదని శివపంచవదనోద్భవులగు పంచాచార్యులే తన్మతస్థాపకులని మున్నే చెప్పి యుంటిని. అది క్షీణదశను బ్రాపింపఁగాఁ దదుద్ధరణమునకయియే బసవేశ్వరుఁ డవతరించెనని బసవపురాణము చెప్పుచున్నది. బసవని వివాహసందర్భమున బసవపురాణమునఁ జెప్పఁబడిన

"రండు భక్తులఁ బిలువుండు మీ రెదురు
వాండు వేగమ తోడితెండు తెం డనుచు
నిటవచ్చు నయ్యల కెదురు వచ్చుచును
నటవచ్చు నయ్యల కర్థి మ్రొక్కుచును
సింహాసనస్థులఁ జేసి యాకర్మ
సంహారమూర్తుల చరణముల్ గడగి"

అనువాక్యములవలననే బసవేశ్వరుఁడు కర్మసంహారులైన వీరశైవులలోఁ గలిసి వారి నర్చించెనని స్పష్టమగుచున్నది. వీరశైవమునకుఁ బ్రధానాంగము లింగధారణము. ఆదీక్షనొంది శివజీవైక్యజ్ఞానరూపకమగు మోక్షము సాధించుటకు నందఱకు నధికారము గలదు. భరతఖండమునఁ జాతుర్వర్ణ్యవ్యవస్థ యెప్పు డేర్పడెనో యిదమిత్థముగ నిర్ణయింపఁజాలము. కాని యేకులజులైనను భక్తిజ్ఞానవైరాగ్యములచే నుత్తమస్థితిని గాంచుటకు వేదాంతమత

మెన్నఁడు నెట్టి యాటంకములను గలిగింపలేదు. వీర శైవదీక్షితులకు, ఆణవకార్మికమాయామలములు దగ్ధములై తొంటికులములు నశించుటచే నట్టివారి పూర్వజాతిఁ జింతింపరాదనుసిద్ధాంత మనాదినుండియు నున్నదేగాని నూతనముగాదు. కాని మనదేశమున వర్ణవ్యవస్థ చిరకాలమునుండి నెలకొనియున్న కారణమున బ్రహ్మ క్షత్త్రియ వైశ్య శూద్రులనుండి క్రొత్తగా వీరశైవదీక్షనొందువారికి వారివారి కులముల ననుసరించి మునుముందు తన్మతాచార ధర్మశీల నిర్వాహణావిషయమున బ్రాహ్మణున కిన్నివత్సరములు, తక్కినవారి కిన్నిన్నివత్సరములునని కొంత కొంతకాల వ్యవధి నేర్పఱచి యాగడువు గడచిన మీఁదటనే దీక్షనొసంగు నాచారము చాలఁగాలము నుండి పాదుకొనియుండినట్లు కన్పట్టును. ఇట్టి కాల నియమాది నిర్బంధములవలననే వీరశైవము గుంటుపువ్వులుపూయుచు విస్తరింపక బసవేశ్వరాదులకుఁ బూర్వము క్షీణదశయందుండియుండును. బసవేశ్వరుఁ డీనియమముల సడలించి ప్రధానసూత్రమునే ముఖ్యముగఁ బాటించి, "సంఘేశక్తిః కలౌయుగే" అనుసూక్తిని గణించి, ఏకులజులైనను వారి పూర్వాచారధర్మముల విడిచి సదాచారముఖ్యములగు పంచాచారము లవలంబించి యష్టావరణములు

గ్రహించినచో, సత్వరముగనే వీరశైవమతావరణ మునఁ జేరదగునని యుపోద్ఘాదించి, తనదివ్యశక్తి ప్రభావములచే సనతికాలము లోనే యసంఖ్యాక జను లీమత మవలంబించు నవకాశములు గల్పించి, కర్ణాటమహారాష్ట్రదేశములందు దానిని విస్తరింపఁ జేసెనని, యిదియే పంచాచార్యుల మతవ్యవస్థ కాతఁడు గావించిన ప్రధానసంస్కారణమై యుండు నని తోఁచుచున్నది. మద్యమాంసాహార విదూర మైన శౌచము సదాచారమునకు ముఖ్యము అష్టా వరణపంచాచారసంయుతులే సరియైన వీరశైవులు. కావునఁ దము పూర్వాచారము లెట్టివైనను వానిని విడనాడి, సదాచారాదుల స్వీకరించి వీరశైవదీక్ష నొందినవారు జీవనోపాధికే యేవృత్తులఁగైకొన్నను, ఆచారాదికములలో సాధర్మ్యము నొందుటచే వారి తొంటికులముల విస్మరించి యందఱకు సహభోజ నాదిరూపకమైన పొత్తును గలిగించి బసవేశ్వరుఁ డామూలకముగ సంఘాభివృద్ధిని సత్వరముగ సాధించియుండును. భ్రమరకీటన్యాయమున గీటము భ్రమరమై తాదాత్మ్య మొందినపుడు దాని పూర్వ స్థితికిఁ బ్రసక్తి యుండనేరదు గదా! "స్వమార్గ నిరతాచారైః సహవాసం సమాచరేత్" (స్వమార్గా చారనిరతాః స్వజాతీయా ద్విజాస్తుయే" అని

పాఠాంతరము) "తేషాం గృహేషు భుంజీతఁనే
తరేషాం కదాచన" అను సిద్ధాంతశిఖామణి ప్రోక్త
ధర్మ మిందుకు సాధక మేగాని బాధకము గాదనియే
నాతలంపు. లింగధారులయ్యు సదాచారశీలములు
లేనివారు కొందఱు కర్ణాటాంధ్రదేశములం దిప్పు
డున్నారు. వారు వీరశైవసంఘమున సదాచార
సంయుక్తులతో సహభోజనాదిరూపకమైన పొత్తు
లేక వేర్పడియేయున్నారు. అట్టివారు గొంద ఱా
నాఁడుగూడ సంఘాభివృద్ధికై యీమతావరణమునఁ
జేరియున్నను నిప్పటివలెనే యప్పుడుగూడ వారు
సదాచారసంపన్నులతో భోజనపుబొత్తు లేకయే
యుండియుందురు. ఎట్టినియమములులేక సదా
చారముగలవారికి లేనివారికిఁగూడ బసవేశ్వరాదు
లానాఁడు పొత్తు గుడిపిరనుట కెట్టియాధారములు
లేవు బసవేశ్వరుని పూజల నొందిన శివనాగుమయ్య
ప్రభృతులు వారో వారిపూర్వులో మొదట హీన
వంశజులయ్యు వీరశైవదీక్షితులైనవెంటనే సదా
చారసంపన్నులైన తదితరవీరశైవులతో సమాన
ధర్మము వహించినవారే యని యెన్నఁదగును.

"ఎట్టి దుర్జాతిని బుట్టిన నేమి
యెట్టును శివభక్తుఁ డిలఁ బవిత్రుండు"
"శునక గార్దభ మచ్ఛ శుక దర్దురాది
జాతములెల్లజనితమునీంద్రాది

శివభక్తిఁగారె విశిష్టులయ్యె"
"వేదంబులాదియో యధికల్పితంబు
లాదియో జాతుల కది యెట్టులనినఁ
జను వేద చోదిత జాతులు రెండు
వినుము ప్రవర్తకంబును నివర్తకము
భవకర్మసంస్కారి భువిఁ బ్రవర్తకుఁడు
శివకర్మసంస్కారి భువిని వర్తకుఁడు
సన్నుత వేదార్థచరితంబు లుండ
మొన్నఁబుట్టిన కులమ్ముల మాటలేల
ప్రవృత్త మగునట్టి జాతులు గావె
యష్టాదశంబులు నవియేల చెప్ప
మిక్కిలి పదునెనిమిది వర్ణములకు
నిక్కమారయ భక్తనిచయంబు కులము"
"అతిశయలింగదీక్షితుం డైనయట్టి
వ్రతినంత్యజుండని మతిఁ జూడనగునె"
"గురుకరస్పర్శచేఁ గులమొక్కఁడౌట
యరిదియే యట్టి యంత్యజుఁడు నగ్రజుఁడు"
"ధర 'నుమా మాతాపితారుద్ర' యనఁగ
సరినొక్క దల్లి ప్రజలకు వేఱద్ది"

ఇత్యాదిగా బసవేశ్వరుఁడొనర్చిన తర్కములఁ బర్యాలోచింప నాతఁడు గావించిన సంస్కరణములు వేదవేదాంతార్థసమ్మతములే యని గోచరించును.

ఇట్టిసంవాదము లే వయస్సులో బసవనికన్నఁ బెద్దయై
యాతని కించుకపూర్వుఁ డనఁదగు కెరెయపద్మ
రసు రచించిన దీక్షాబోధయందును గాననగును.
కావుననే సోమనాథుఁడు "బసవలింగ" మకుట
ముతోఁ దాను రచించిన చతుర్వేదసారము సవైదిక
మని యుగ్గడించుటయేగాక బసవోదాహరణములో
బసవేశ్వరు నిట్లు స్తుతించినాఁడు.

"దివ్యాగమ మార్గవర్తి" వేదాంతార్థ
రహస్యభేద పిశునవ్యాపారపారంగత
ప్రౌఢప్రక్రియ వాక్ప్రపంచరచనాచాతుర్య ధుర్యాశయం"
"వేదాంతోదిత వీరశైవ సమయాచారవ్రతప్రక్రియా
చర్యాదేశికసార్వభౌమ మహిమభ్రాజిష్ణవే జిష్ణవే"
"వేదవిరుద్ధాచార పరిద్విషి
నాద సుధాప్రీణిత పురద్విషి"

బసవేశ్వరుఁ డుద్ధరించిన యీ వేదాగమసమ్మత
సంస్కరణము నుద్దేశించియే

"ఉర్వి వారికెల్ల నొక్కకంచము పెట్టి
పొత్తుఁగుడిపి కులము పొలియఁజేసి
తలను జేయిపెట్టి తగనమ్మఁ జెప్పరా
విశ్వదాభిరామ వినురవేమ!"

అని వేమన శివయోగికూడ గాన మొనర్చినాఁడు.

బసవేశ్వరుఁడే గాక యాతనికి ముందుండిన శ్రౌత మార్గశైవులలో విజ్ఞులైనవారు ఉద్భటారాధ్యుఁడు, శ్రీపతిపండితుఁడు మున్నగువారుగూడ నిట్టి ధర్మమును బాటించినట్లు వారిచరిత్రములఁబట్టి కానన గును. "నిస్త్రైగుణ్యే పథివిహరతాం కోవిధిః కో నిషేధః" అని హలాయుధుఁడు వ్రాక్రుచ్చెను. బసవేశ్వరునివంటిసంస్కర్త యవతరణము కతననే వీరశైవమతోద్ధరణము దక్షిణహిందూస్థానమున జరిగి యామత మచ్చట విస్తృతిఁ గాంచినది. అట్టివాఁ డవతరింపని లోపముననే యుత్తరహిందూస్థానమున నట్టిది జరుగలేదు. అచ్చటఁ గాశీకేదారములందలి పంచాచార్యసింహాసనములు నిలిచియున్నను, వీరశైవసంఘముమాత్రము నామావశిష్టముగ నున్నది.

—● పూర్వముద్రణములు - ప్రస్తుతముద్రణము ●—

సోముని బసవపురాణమును మొట్టమొదట 1836 సం॥లో ఏలూరు వాస్తవ్యులు శ్రీకందుకూరి శ్రీశైల వీరభద్రవరప్రసాదరావుగారు ప్రాఁతకాగితములపై, ఒకేపోఁతగల యచ్చులో ముద్రించియున్నారు. అట్టి యచ్చులోనే 1909లో వరంగల్ వాస్తవ్యులు శ్రీముదిగొండశంకరారాధ్యులవారు పండితారాధ్య చరిత్రమును ముద్రించియున్నారు. రెండునుగూడ సరిగాఁ బరిష్కృతములుగాక యచ్చుతప్పులతోఁ

గూడ నిండియున్నవి. మతగ్రంథములు ద్విపద కావ్యములు నగుటకుఁదోడుగా నివి యిట్టిస్థితిలో ముద్రితమగుటచే పాఠకలోకమున కాకర్షకములు కావయ్యెను. ఇందుచే సోమనాథుని కళాప్రతిభానైపుణ్యములలోకము బాగుగా గుర్తించు నవకాశము లేకుండెను. ఈపరిస్థితులఁజూచి మతదృష్టితోఁ గాకున్నను గావ్యకళాదృష్టితోనైన నీగ్రంథములను బరిశుద్ధముగఁ బరిష్కరించి చక్కగా ముద్రింపవలసిన యావశ్యకతను హెచ్చరించుచు, ఆంధ్రపత్రిక దుందుభి (1922) సంవత్సరాది సంచికలో సోమనాథునిఁగూర్చి యొకవ్యాసమును బ్రకటించియుంటిని. దానిపై కీ॥ శే॥ శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగా రభిమానముతో నీయుద్యమమునకుఁ బూనుకొని 1926 లో తమ యాంధ్రగ్రంథమాలికలో బసవపురాణమును పెద్దసైజున శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణముతో ద్విపదపాదములు రెండేసి యొకపంక్తిగాఁ గూర్చి ముద్రించియున్నారు. అప్పటికిఁగూడఁ గాగితముల కఱవుండుటచే పంతులుగా రాముద్రణమును మంచి కాగితములపైఁ గావింపరైరి. అటుతరువాత నిరువదియైదువత్సరములు గడచినను నిది పునర్ముద్రితము కాలేదు. సుప్రసిద్ధసంస్కృతాంధ్రగ్రంథ

ప్రకాశకులు, భాషోద్ధారకులు శ్రీవావిళ్ల వేంకటే
శ్వరశాస్త్రులుగా రీగ్రంథమును చిన్నసైజున పంక్తి
కొక్కపాదమే కూర్చి గ్లేజుకాగితములపై చక్కగాఁ
బునర్ముద్రణము గావింపఁదగిన యావశ్యకతను
గ్రహించి నన్నీముద్రణమునఁ దమకుఁ దోడ్పడ
వలసినదని యాదేశించిరి. ఇందుకు నా యశక్తి, యన
ర్హత లెస్సగా నెఱింగినవాఁడనయ్యుఁ గాదన్న వా
రన్యథా తలంతురన్న భయముచే వారి యాజ్ఞకు
బద్ధుఁడను గావలసివచ్చినది. ప్రభాకరశాస్త్రిగారు
పరిష్కరించిన ముద్రణములో ముద్రితపాఠములు
గొన్నిటికి పుటలయడుగున వ్రాఁతప్రతులందలి
పాఠాంతరములుగూడఁ గొన్ని చూపఁబడినవి. ఈ
ముద్రణములో శ్రీవేంకటేశ్వరశాస్త్రిగా రట్టిపనికిఁ
బూనుకొనలేదు. దేశము నలుమూలల వ్రాఁతప్రతు
లనేకములున్నప్పుడు వానిలో మనకు దొరకిన యే
కొలఁది ప్రతులనో చూచి చేసెడిపాఠాంతర సూచన
లెప్పుడు నసమగ్రముగనే యుండఁగలవని చెప్పక
తప్పదు. అందువలనఁ బూర్వముద్రణములను, కొన్ని
వ్రాఁతప్రతులను బురస్కరించికొని యర్థసంగతము
లగు నుత్తమపాఠములనే గ్రహించి యీముద్ర
ణము గావింపఁబడినది. ప్రభాకరశాస్త్రిగారు కొన్ని
యెడలఁ గవిహృదయ సమ్మతములని తలంపఁదగు

పాఠములనడుగునఁ బాఠాంతరములుగఁ గన్పఱచి తద్వ్యతిరిక్తపాఠములను, సోమనాథుని ఛందోవ్యాకరణరీతులఁగూర్చి తమ యభిప్రాయములను సమర్థించికొనుటకుఁగాను గ్రంథమునందు గ్రహించియున్నారు. ఈసంగతి కొంతముందే ముచ్చటించియుంటిని. ఇందుకు మఱొకదృష్టాంత ముదాహరింతును. బసవేశ్వరుని జన్మఘట్టములో

"షోడశదళ పద్మసురుచిర సౌఖ్య
క్రీడావిలోలుఁడై కేరి యాడుచును"

అని కొన్ని వ్రాఁతప్రతులందలి పాఠము ఏలూరు ప్రథమముద్రణములోఁ గైకొనఁబడియుండఁగా, సోమనాథునకు ల, డల ప్రాసము సమ్మతమని నిరూపించుటకుఁ గాఁబోలు రెండవపాదమును "కేలివిలోలుఁడై యోలలాడుచును" అని శాస్త్రిగారు ముద్రించినారు. సోమనాథుని కీప్రాసము సమ్మతమైనను గాకున్నను ద్వితీయపాదారంభమందలి "క్రీడా" శబ్దములోని సంయుక్తాక్షరము రేఫయగుటచే ప్రథమపాదాంతమందలి "సౌఖ్య" శబ్దములోని యంతిమాక్షరము గురువు కానప్పుడాపాదము నట్లు మార్చుట యనవసరము గాదా! అవతారికాభాగములో శివస్తుతిప్రతానసేవితుండగు మండెగ మాదిరాజునొక

గురూత్తముని విషయమున "అని వినుతింపంగ నా చార్యమహిమ" అని ప్రథమముద్రణములో నుండఁగా "ఆశ్చర్యమహిమ" అను నొక వ్రాఁతప్రతి యందలి యపపాఠమును శాస్త్రిగారు స్వీకరించి నారు. గ్రంథారంభమున ప్రమథుల విషయమున "త్రిభువన ప్రమథుల" అనెడి యపపాఠవిశేషణము పూర్వముద్రణములు రెంటియందునుగూడ నున్నది. ఇచ్చట "త్రిభువన ప్రథముల" అనునదియే సరియైన కవిపాఠము. చివరనున్న యర్థవివరణము చూడఁదగును. ఒండు రెండుచోట్లఁ గొన్నిపాదములు గూడ శాస్త్రిగారి ముద్రణములో లుప్తమైనవి. ముద్రాపకుల ప్రమాదముననే యది జరగియుండును. ఆపాదము లచ్చటనున్నఁగాని యర్థమందర్భము చెడుటయేగాక ప్రాసభంగములుగూడ వ్యక్తమగును. "అక్షణమ" అనురూపము (తత్క్షణముననే యను నర్థమున) శాస్త్రిగారిముద్రణములో గ్రంథమందంతటను గైకొనఁబడినది. పండితారాధ్యచరిత్ర ముద్రణములో శ్రీచిలుకూరి నారాయణరావుగారు గూడ నిట్లేయుంచిరి. ఈరూపము సాధువనితోఁచదు. "ఆక్షణమ" అనియే సోమనాథుఁడు దానిని వ్రాసియుఁడునని నాయభిప్రాయము. క్షకారము సంయుక్తా

ఢురమునియే యెల్లరు నంగీకరించుచున్నారు. అట్టిచో త్రికసంధిసూత్రములచే "అఢుణము" అనురూప మెట్లు సాధువు కానేర్చును? నన్నయ్య, వేములవాడ భీమకవి "ఈఢుణమ", "ఈఢీతి" ఇత్యాదిగా ఢుకార మునకు ముందు దీర్ఘస్వరమునే వాడినట్లు కాన వచ్చును. కావున నేను "ఆఢుణమ" అనురూపమునే యిందుఁ గైకొంటిని "చాఁపఁదడవ", "ప్రవేశింపఁ దడవ" ఇత్యాదిరూపములు సోమనాథుఁడు "చాఁపఁ గనే", "ప్రవేశింపఁగనే" యనునర్థములలోఁ బలు తావులఁ బ్రయోగించియున్నాఁడు సాధారణ ముగా నిట్టివి పాదాంతమునందే కానవచ్చును. ఇట్టి చోట్ల శాస్త్రిగారు "తడవ"శబ్దమును కళగానే సర్వత్ర గ్రహించియున్నారు. నారాయణరావుగారిది అవ్యయమని వ్రాసిరి. క్రియాపదమైనను, అవ్యయ మైనను "మొదలుపెట్టఁ", "యత్నింపఁ" అనునర్థ ముననే సోమనాథుఁ డీశబ్దము వాడియుండినని యది ద్రుతప్రకృతికమే కాఁదగునని తలంచి యిం దట్లు గ్రహించితిని. సప్తమీవిభక్తిప్రత్యయమైన "అందు" సముచ్చయార్థక ద్రుతముందుపైఁ జేరి నప్పుడుతప్ప "కళ"యే యని, "ఎందు వోయెదు" మున్నగు భారతప్రయోగములు, "ఇందు ప్రత్యక్ష

మయ్యె" అను యుద్ధమల్లుని శాసనమందలి ప్రయో
గము నిందుకు దృష్టాంతమని మద్గురువర్యులు శ్రీ
మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు "ఆంధ్ర
భాషానుశాసనమున" వ్రాసియున్నారు. కాని యం
దుకు సాధకములైన ప్రయోగములు ప్రాసస్థానము
లందు భారతాదులలోఁ గానరావనియే తోఁచు
చున్నది. సోమనాథుని ద్విపదలలోనిది తఱచు
పాదాంతమునందే కాననగుచు. దీని నాతఁడు కళ
గానే గ్రహించియుండునని తలంచుటకు సాధకమైన
ప్రయోగములు నా కాతని యనుభవసార చతు
ర్వేదసార పద్యములందును ప్రాసస్థానములలోఁ
గానరాలేదు. ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణములో
నిది సర్వత్ర ద్రుత ప్రకృతికముగనే గ్రహింపఁబడి
నది. ఈగ్రంథమునను "ఎందు వోయెదు" అనురూప
ములు పారమధ్యకులం దెడనెడఁ గొన్ని వ్రాత
ప్రతులందు, ఏలూరుముద్రణప్రతియం దున్నవి.
కాని శాస్త్రిగారవి పాఠాంతరములుగాఁజూపి
"ఎందు, అందు, ఇందులు" ప్రథమాంతములుగాఁ
గళగాఁ జెప్పఁదగియున్నవి యని వ్రాసి గ్రంథము
నందుమాత్రము "ఎందు బోయెదు" అనియే
ముద్రించియున్నారు. ఇందుచే నే నీవిషయమున

మూర్పేమియుఁ గావింపనై తిని. సప్తమాశ్వాస మందలి యుద్భటుని కథలో నాతఁడు పొత్తు సేసిన భక్తురాలే కులమువాఁ జెందినదో పూర్వ ముద్రణములందలి "ప్రాణేశ సద్భక్తి పరురాలు" అను పాఠమువలన వ్యక్తము కాదు. ఉద్భటుఁడు భోజుని గురువు, మహాభక్తుడు, పండితుఁడు. అట్టివాఁడు కులహీనులనుగూడి నాఁడేమి పాపమని బ్రాహ్మణులు భోజునకు మొఱపెట్టిరి. రాజది విని వినియు విననియట్లూరకుండెను. "ప్రాణేశ" అనునది కవిపాఠమై యుండదు. సప్తమాశ్వాసము అంత్యజుల యొక్క శివ భక్తికలిమిచే విశిష్టతఁ గాంచిన భక్తుల కథలతో నారంభమైనది. ప్రభాకరశాస్త్రిగారు "బాణిస" అను పాఠాంతరమును పుటయడుగునఁ జూపినారు. అదియు సరిగాదు ఇచ్చట కవిపాఠము "పాణిసి" (చండాలస్త్రీ) అయియుండును. ఈపదము నిట్టి యర్థ మున గౌరన, శ్రీనాథుడుకూడ వాడియున్నారు. పిడుపర్తి సోమనాథుడు తన పద్యానువాదములో నీ పాఠమునే గ్రహించినాఁడు. కాని యచ్చులో "బాణిస జాహ్మనమనుసతి" అని తప్పుగా ముద్రిత మైనది. ఈసందర్భమున సరియైనపాఠములను శుద్ధ పత్రికలోఁ జూపినాఁడను. ఈ క్రింది పాదములందు

యతిభంగము కాన్పించును. పూర్వముద్రణములు రెంటియందు నివి యట్లే చూపఁబడినవి. సోమనాథునకు నామాఖండయతి, సిద్ధసమాసాంతర్గత పదాఖండయతి సమ్మతములేగాని రెండవపాదమునఁ గానవచ్చునట్టి యతి సమ్మతముగాదు. ఇచ్చట పాదారంభమందలి నకారము ద్రుతముయొక్క కూడికచే వచ్చినదే గాని యచ్చటి తొలియక్షర మచ్చే గదా! ఇట్టిది యఖండయతికి లక్ష్యమే కాఁజాలదు. కావున నీరెండు తావులనుకూడ కవిహృదయ మనుసరించి శుద్ధపత్రికయందు సవరణల సూచించితిని. ఇట్లే పలు తావుల పూర్వముద్రణపాఠములకు, భిన్నపాఠములను గ్రహించియుంటిని.

ఆ 5 —

*"వ్రస్సి యెంతయును శ్రమంపడి యిట్లు"

పుట 348

"నిచ్చటి మృగముల నెరిఁ బొలియించి"

పుట 396

---

* పండితారాధ్యచరిత్ర పీఠికలో శ్రీ చిలుకూరి నారాయణ రావుగారు వ్రాసిన కొన్ని యంశములపయి శ్రీ ప్రభాకరశాస్త్రి గారు తిరుమలదేవస్థాన ప్రాచ్యపరిశోధనసంస్థ వారి పత్రికలో (Vol. IV 1943 Part I) విమర్శనము ప్రకటించి

ప్రస్తుతముద్రణపాఠములను సావధానముగా పూర్వముద్రణపాఠములతోఁ బోల్చి గుణదోషములను నిర్ణయింప సహృదయులే ప్రమాణము. నా యశక్తి, యజ్ఞానము, అనారోగ్యము, దూరనివాసము కారణములుగా నిందనేక దోషములు దొరలి యుండును. కృపామతితో వానిని సరిచేసికొన విద్వద్రాజహంసములకుఁ గైమోడ్పు లర్పింతును. విశేష వ్యయప్రయాసములతో నీముద్రణమును నిర్వహిం

---

యున్నారు. దానిలో "మామిడి, మావిడి" శబ్దముల నిష్పత్తిని గూర్చి చర్చించు సందర్భమున, ఆంధ్రకర్ణాటభాషలలోఁ గొన్ని శబ్దములందు మ, వ, లకు మాఱుపాట్లు గల్గెడివని, "వ్రస్ఫి .." అను పాఠమునఁ గొన్ని వ్రాఁతప్రతులలో "శ్రవంపడి" యను రూపమే యున్నదని, కావ్యాలంకార చూడామణిలో విన్నకోట పెద్దనగూడ "వసుమతి గారవించుచు శ్రవంపడకుండిన ..." "క్రవముగాఁ దత్సమమును దద్భవము ." అని శ్రమ, క్రమ, రూపములకు మాఱు వాడి యుండెనని వ్రాసియున్నారు. కాని వారి బసవపురాణ ముద్రణములోఁ బైపాదమున "శ్రమంపడి" యనియే యున్నది పయి పక్షములో దానిని "శ్రవంపడి" యని మార్చికొన్నఁ జాలును ఇట్టి ప్రయోగములు మఱికొన్ని సోమనాథుని కృతులలోఁ గానరానందునఁ దత్సమపదములం దిట్టి మాఱుపాటు తాతనికి సమ్మతమో కాదో రూఢిగఁ జెప్పఁ జాలము.

చిన శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారికి నిరంతర రాయురా రోగ్య సౌభాగ్యములఁ బ్రసాదించుఁగావుతమని సోమశేఖరుని, నాతనియం దైక్యమైన సోమనాథునిఁ బ్రార్థించుచున్నాను.

ఏలూరుప్రతిలో నీక్రిందిపాదము లాయా తావుల నధికముగానున్నవి. ఇవి కొన్ని వ్రాఁతప్రతులలోనుండి మఱికొన్నిటిలో లోపించియుండును. ప్రభాకరశాస్త్రిగారి ముద్రణమందును, ప్రస్తుత ముద్రణమందునుకూడ వానిని జేర్పలేదు. అవి లేకున్నను గథాసందర్భమునకుఁగాని యర్థసంగతికిఁ గాని లోపములేదు. వలయుచోఁ బాఠకులు వానిని గూడఁ జేర్చికొని పఠింపఁదగును.

| కాకినాడ,<br>నందన, మార్గశీర్ష,<br>శుద్ధసప్తమీ<br>సోమవారము | ఇట్లు,<br>విద్వద్విధేయుఁడు<br>బండారు తమ్మయ్య. |
|---|---|

---

ఏలూరిప్రతిలోని అధికపాఠములు
164-వ పుట చూచేది.

# వి ష య సూ చి క

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

| విషయము | పుట |
|---|---|

# ఏలూరు ప్రథమముద్రణనుండలి

## అధికపాదములు

| ఆశ్వాసము | పుట | పంక్తి తరువాత | |
|---|---|---|---|
| 1 | 56 | 2 | సడిసన్న భసితాది శాసనధరుల<br>మృడుఁడుగా మది నమ్మిమి! బసవన్న |
| 2 | 86 | 17 | సౌందర్యంబు బసవ, సాధ్యుల బసవ!<br>నందీశ బసవ! యానందంబు బసవ! |
| ,, | 93 | 10 | ఏనప్రాణంబుగా క్రీప్రమథులకు<br>మానుగాఁ బ్రాణంబు మఱొకండు గలదె? |
| 3 | 182 | 4 | వలపలి కింకొకవనితఁ గామించి<br>యల నాఁటితపము సేయంగ వచ్చితివొ |
| ,, | 210 | 20 | పుణ్యాయతనములఁ బుణ్యతీర్థములఁ<br>బుణ్యనదీనద భూప్రదేశముల<br>వనదుర్గ గిరిదుర్గ పరదుర్గములను<br>ఘనతర బిలగుహాగహ్వరంబులను |
| ,, | 221 | 2 | పరమకాష్ఠీభూత భావనఁ దగిలి<br>ధరఁ గాష్ఠముల భాతిఁ దనరు సన్మునులు |
| 7 | 544 | 20 | ఊరకుండుఁడు మీర లుర్వీశునొద్ద<br>వీఱిఁడి మాటలు విడఁబుచ్చి యనిన |

శ్రీ శివాయగురవేనమః.

# శ్రీ పాలకురికి సోమనాథ ప్రణీత

# బసవపురాణము

## ప్రథమాశ్వాసము

శ్రీ గురుదేవు నంచితగుణోత్తంసు
యోగీంద్రహృదయపయోజాతహంసుఁ
బరమకృపామూర్తి భక్తజనార్తి
హరుఁ ద్రిజగత్స్ఫూర్తినానందవర్తి
భవరోగవిచ్ఛేది భక్తవినోది
శివతత్త్వసంపాదిఁ జిరతరామోది
నిత్యస్వరూపు నున్మీలత్ప్రతాపుఁ
బ్రత్యయగతపాపు భక్తప్రదీపు
భావనాతీతు సద్భావనోపేతు
పావయవఖ్యాతు నమితు నజాతు
నాద్యంతరహితు వేదాంతార్థసహితు
విద్యాత్మసహితు సంవిత్సౌఖ్యమహితు
భక్తపరాధీను భక్తనిధాను
భక్తసమాధాను భక్తావధాను
భక్తపరంజ్యోతి భక్తవిభూతి

భక్తదుఃఖారాతి భక్తానుభూతి
భక్తప్రజత్రాణు భక్తధురీణు
భక్తజనప్రాణుఁ బరమకళ్యాణు
మన్మనోరమ్యు నిర్మలభావగమ్యుఁ
జిన్మయు సౌమ్యు భజించి కీర్తించి,
యుల్లమున మదీయవల్లభుఁ జెన్న
మల్లికార్జునదేవుఁ దెల్లగా నిలిపి,
సముదితసారూప్యశాశ్వతతనులఁ
బ్రమథులఁ ద్రిభువనప్రథములఁ దలఁచి,
ప్రకటలింగైక్య పురాతనభక్త
నికరంబు శివునంద నిష్ఠించి కాంచి,
వ్యక్తలింగముల సద్భక్తిరసాభి
షిక్తుల నూతనభక్తులఁ దలఁచి,
బసవచరిత్ర యివ్వసుమతి మీఁదఁ
బసరింతుఁ దత్కథాప్రౌఢి యెట్లనిన:—
శ్రీమన్మహాదేవుసింహాసనంబు
హైమవతీశువిహారస్థలంబు
హరునిభక్తులకు నేకాంతవాసంబు
పరమయోగులకు హృత్ప్రమదావహంబు
నరులకుఁ గర్మసంహారణైకహేతు
వరయంగ సురలకు నాశ్రమభూమి
సకలతీర్థములకు జనయిత్రి యగుచుఁ

బ్రకటింప నొప్పు శ్రీపర్వతేంద్రంబు,
ఉర్విఁ దత్పర్వతసార్వభౌమునకుఁ
బూర్వవక్త్రాంకవిస్ఫురణ దొల్కాడ
నొలసి కుమారశైలోత్తంసలీలఁ
దిలకించి పెంపారుఁ ద్రిపురాంతకంబు;
తత్త్రిపురాంతకస్థానవాస్తవ్యుఁ
డై త్రిపురాంతకుం డభినుతిఁ బేర్చు,
నాపురసంహారు నపరావతార
రూపితఖ్యాతినిరూఢిఁ దలిర్చు
నాసదాశివమూర్తి యవితథైశ్వర్య
భాసురచరలింగపటుదీప్తిఁ బరగు
నాకాలకంధరు ననవద్యహృద్య
సాకారవిభ్రమవ్యాప్తిఁ బెంపారు
నాదేవువీరవ్రతాచారసార
మేదురస్ఫురణమై మించి వెలుంగు
జంగమరత్నంబు శరణసమ్మతుఁడు
లింగైక్యవర్తి గతాంగవికారి
పండితారాధ్య కృపాసముద్గతుఁడు
మండితసద్భక్తిమార్గప్రచారి
విలసితపరమ సంవిత్సుఖాంభోధి
నలిఁ గరస్థలి సోమనాథయ్యగారు;
బసవనికారుణ్యరససుధావార్ధి

నసదృశలీల నోలాడుచు నిత్య
నియమవ్రతాచారనిరుపమనిష్ఠ
క్రియఁగొనఁ దత్త్వనిర్ణయము సంధిల్ల
నతులగోష్ఠీసుఖస్థితిఁ బేర్చుభక్తి
మతినియమంబుల మల్లినాథుఁడును,
నాదివేదాంతసిద్ధాంతపురాణ
వేదశాస్త్రాగమవిహితమార్గములఁ
దనమనోధననివేదనసమగ్రతయుఁ
బనుగొన జంగమార్చనలు సేయుచును
నోలిమై గ్రామసీమాలంఘనవ్ర
తాలంకృతిని బేర్చి యాచారలీల
యసలారఁగాఁ గుమారాద్రికిఁ దూర్పు
దెసను సోపానముల్ దీర్చి పొల్పార
మహితసద్భక్తి సమంచితవృత్తి
మహిఁ జను రెంటాల మల్లినాథుఁడును,
నిరతిశయప్రీతి నిత్యంబు నైదు
కరవీరపుష్పముల్ హరున కర్పింప
నొక్కనాఁ డొక పువ్వు దక్కువయైన
గ్రక్కునఁ దననేత్రకమల మర్పించి
భవునిచే నసదృశంబవుకన్ను వడసి
శివకీర్తిఁ బేర్కొన్న దోచమాంబయును;
ధీరుండు మున్నయదేవయోగీశు

కూరిమిశిష్యుండు నారయాంకునకుఁ
బుత్త్రుండుఁ బరమపవిత్రుండు విమల
గాత్రాంచితుఁడు నీలకంఠాగ్రజుండు
జగదభినుతుఁడు ప్రసాదావధాని
నిగమార్థవేత్త గోడగిత్రిపురారి,
లోనుగా సకలభక్తానీక మెలమి
మానితభక్తిసామ్రాజ్యసంపదలు
సిలివిలివోవంగఁ జిరతరమహిమ
నలరారుచుండంగ నం దొక్కనాఁడు
మండితాసంఖ్యాతమాహేశ్వరులకు
దండప్రణామంబు దగ నాచరించి
భక్తదయారసపరమామృతాభి
షిక్తుండ నగుచు గోష్ఠీప్రసంగతిని
"నసదృశంబై యొప్పు బసవపురాణ
మెసకంబుతోఁ జెప్ప నిష్ట మయ్యెడును
వరకథాసూత్రంబు వెర వెఱిఁగించి
చరితార్థుఁ జేయరే కరుణతో" ననుచు
సన్నుతి సేయుచు సప్పృహత్వమున
విన్నవించుడు భక్తవితతి హర్షించి
సముదితప్రీతిఁ బ్రసాదావలోక
నము నివ్వటిల్లంగ నన్ను వీక్షించి
"బసవపురాణంబుఁ బసరించుశక్తి

నసలార నొసఁగితి మట్లు గావునను
రచియింపు బసవపురాణంబు నీవు
నచలితభక్తహితార్థంబుగాఁగ."
నావుడు భక్తజనావలియాజ్ఞ
వావిరిఁ దల మోచి వర్ణింతుఁ గవితఁ
పాటింపఁదగిన కర్ణాటభూమికిని
గోటీరమై యొప్పు గొబ్బూరనంగ
నాయగ్రహారమహాజనోత్తముని
కాయపూజితపాదకమలద్వయుండు
శాంభవ వేధదీక్షాసద్విశేష
సంభావితాశ్రితజనసముత్కరుఁడు
సురుచిరప్రణవవిస్ఫురితోపదేశ
చరితార్థ నిఖలశిష్యవ్రాతుండు
కింకరనిచయహృత్పంకేరుహాంత
రాంకిత వరసచ్చిదానందమూర్తి
పాత్రుండు భవలతాదాత్రుండు విషయ
జైత్రుండు విమల చరిత్రుండు సకల
భువనపావనమూర్తి బుధచక్రవర్తి
ప్రవిమలకీర్తి సద్భక్తిప్రపూర్తి
యని వినుతింపంగ నాచార్యమహిమ
మనుచుండు మండెఁగమాదిరాజనఁగ,
నామహాత్ముని సముద్యత్కృపాపూరి

తామృతహస్తకృతావతారుండు
నా గురుదేవు పాదాబ్జ సౌరభ్య
భోగలీలా వరపుష్పంధయుండు
నాశివయోగి యుదాత్తమూర్తి ప్ర
కాశితహృత్పద్మ కర్ణి కాంతరుఁడు
నాదివ్యదేహు దయాకలితప్ర
సాదపాదోదకాస్వాద తత్పరుఁడు
గురు పరతంత్రుండు గొబ్బూరి విభుఁడుఁ
బరమ శివాచారపథవర్తనుండు
లింగైక్యనిష్ఠావిలీనమానసుఁడు
సంగనామాత్యుండు జగదుపకా
యని యిట్లు భక్తసభాభ్యంతరాళ
మున నిన్నుఁ జెప్పంగ విని లసత్ప్రతి
వసరింప జంగమభక్తుండ వనియు
బసవపురాణైకపాత్రుండ వనియు
నచలితప్రీతి మా కనుగులం బనియు
రచియింతు బసవపురాణసత్కవిత
యవధానవంతుండ వై నెమ్మి వినుము
సవిశేషభక్తిమై సంగనామాత్య!
ధర "సుమా మాతా పితా రుద్ర" యనెడు
వరపురాణోక్తి నీశ్వరకులజుండ
శరణగణాశ్రయ సకలస్వరూప

గురులింగవరకరోదరజనితుండ
భక్తకారుణ్యాభిషిక్తుండఁ బాశ
ముక్తుండఁ గేవల భక్తిగోత్రుండ
భ్రాజిష్ణుఁ డగు విష్ణురామిదేవుండుఁ
దేజిష్ణు వగు శ్రియాదేవి యమ్మయును
గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ
వీరమాహేశ్వరాచార వ్రతుండ
ఖ్యాత సద్భక్తిమైఁ గలకట్టకూరి
పోతిదేవరపదాంబుజషట్పదుండ
సత్కృపాత్ముఁ డగు కరస్థలి విశ్వనాథు
ప్రకటవరప్రసాదకవిత్వయుతుఁడ
వడగాము రామేశువరశిష్యుఁ డనఁగఁ
బడు చెన్నరాముని ప్రాణసఖుండ
సంభావితుఁడ భవిజనసమాదరణ
సంభాషణాది సంసర్గ దూరగుఁడ
నలిఁ బాల్కురికి సోమనాథుఁ డనంగ
వెలసినవాఁడ నిర్మల చరిత్రుండ
గురుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ
దెలుఁగుమాటలనంగ వలదు, వేదముల

కొలఁదియ కాఁజూడుఁ డిల నెట్టు లనినఁ
బాటి తూమునకును బాటి యానేనిఁ
బాటింప సోలయుఁ బాటియకాదె.
అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయె కాదె కవివివేకంబు
అలరుచు బసవనిఁ దలఁచుతలంపు
బలుపునఁగాఁ జేసి భావమ్ము మెఱసి
యకలంక లింగ రహస్యసిద్ధాంత
సకల వేద పురాణ సమ్మతంబైన
యాతత సకలపురాతనభక్త
గీతార్థసమితియే మాతృక గాఁగఁ
బూరితం బై యొప్పు పూసలలోన
దారంబు క్రియఁ బురాతన భక్తవితతి
చరితలలోపల సంధిల్ల బసవ
చరిత మే వర్ణింతు సత్కృతి యనఁగ
నసదృశలింగ దేహస్థుఁడై యున్న
బసవని వేఱొక్కభావంబు గాఁగఁ
దగిలి వర్ణించుట దప్పనవలదు
తగు భక్తివర్ధనార్థంబు దా నగుట
బసవని శరణన్నఁ బాపక్షయంబు
బసవని శరణన్నఁ బరమపావనము
బసవని శరణన్నఁ బ్రత్యక్షసుఖము

బసవని శరణన్న భవరోగహరము
బసవని శరణన్న భక్తి సేకూరు
బసవని శరణన్న బంధములూడు
బసవని శరణన్న భాగ్యములొందు
బసవని శరణన్నఁ బరగు శీలంబు
బసవని శరణన్నఁ బాయు నాపదలు
బసవని శరణన్నఁ బ్రబలు సంపదలు
బసవని శరణన్న నసలారుఁ గీర్తి
బసవని శరణన్న ఫలియించుఁ గోర్కి
బసవని శరణన్న నెసఁగు వాక్సిద్ధి
బసవని శరణన్న భాసిల్లు బుద్ధి
వే యేల తగ "బసవా"యనఁ బరగు
నీయక్షరత్రయం బిటు లొక్కమాటు
చదువు నెవ్వండేని ముదముతో నతని
వదనంబు శివునకుఁ గుదురు దా ననఁగఁ
బాయక బసవనిఁ బ్రస్తుతించినను
బాయుట సోద్యమే భవబంధనములు
బసవండు కేవలభక్తుఁడే తలఁప
నసమాక్షుఁ డారూప మై నిల్చెఁగాక
బసవఁడు వసుధపైఁ బ్రభవించు నంత
బసవని నరుఁ డని పలుకంగఁ దగునె?
హరుఁడు నిరాకారుఁ డైనచో బసవఁ

డరయంగ సాకారుఁడై చరియించు
వాఁడు సాకారుఁడై యలరుట సూచి
శరణుఁడై బసవండు సందు లేకుండు
శరణుఁ డై పరముండు సరినెలకొన్న
బరమభక్తస్థితి బసవన్న గొలుచు
భక్తుఁ డై లింగంబు ప్రకృతి నేకొన్న
వ్యక్తిగా బసవన్న వరవుడు నేయుఁ
బరమాత్మరూప మాబసవఁడే యెఱుఁగుఁ
బరమేశుఁ డెఱుఁగు నాబసవనియనువు
సాలోక్యసామీప్యసారూప్యపదవు
లోలిని బొంద సాయుజ్యంబుఁ జెంద
వచ్చుఁ గా కిల బసవస్వామి గాఁగ
వచ్చునే పెఱపెఱవారల కెల్లఁ
బ్రమథాగ్రగణ్యుండు బసవఁ డీశునకు
సమశీలభక్తుండు జంగమంబులకు
లింగదేవునకు ననుంగు బసవఁడు
జంగమకోటికి సడిసన్నదాసి
యెక్కంగ వాహనం బెప్పుడీశ్వరున
కెక్క సింహాసనం బీశుభక్తులకుఁ
గాలకంధరు కరవాలు బసవఁడు,
శీలంబు భక్తులచేతియద్దంబు,
బసవని నెవరికాఁ బ్రస్తుతి సేయ

వసమె యెవ్వరికైన బసవని నెఱుఁగ
సంపన్నుఁడై లింగజంగమంబులను
బొంపిరిగొని పువ్వుఁగంపునై యుండుఁ
గావున బసవని గణుతింపరామి
దేవాసురుల కైనఁ దెల్లమై యుండు,
నెన్నంగ వేదకర్తాఁ దెలియనే దోస
మన్నట్లు గాక యీహావణి గీర్తింప
నిదియుఁ గోటికిఁ బడగెత్తినవానిఁ
బదివేలకాఁపవై బ్రదుకు మన్నట్టు
లాపరంజ్యోతి స్వరూపంబునకును
దీపకంభంబు లెత్తించినయట్లు
భవనిర్మితము లైన పత్రపుష్పములు
భవునకుఁ దగ సమర్పణ సేయునట్లు
గాక కీర్తింపఁగా నాకుఁ దరంబె
ప్రాకటంబుగ భక్తబండారి చరిత
మైనను లోకహితార్థంబు గాఁగ
నానేర్చుకొలఁది వర్ణన సేయువాఁడ
నవరస రసికత భువిఁ బేరుగొన్న
శివకవిప్రవరులచిత్తంబు లలర
నిప్పాట నితరులఁ జెప్పెడి దేమి
తప్పుడు దారులు దడఁబడఁ బలికి
వెలసినచదువులు వీటిఁబో రిత్త

పొలిసిపోయిరి తమపురులు దూలఁగను
మృడుమహత్త్వముఁ గానమినిబొంకులనఁగఁ
బడుఁ"గవయః కిం న పశ్యంతి" యనుట
యనుచుఁ గుకవుల గీటునఁ బుచ్చి పేర్చి
వినుతింతుఁ దత్కథావిధ మెట్టు లనిన

కథారంభము

శ్రీకీర్తిసంచితాంచితవరభక్తి
సాకార! వినమితామాత్య సంగాఖ్య!
శ్రీరజతాచలశృంగంబునందు
మారారి యుమయును మానితక్రీడఁ
దగిలినసుఖసంకథావినోదమున
పొగయుచు నున్నెడ శుద్ధశివైక
మానసులగు నుపమన్యుఁడు భృంగి
యానంది కేశ్వరుఁ డాదిగాఁ గల్గు
ప్రమథులు గొలువంగఁ బరిమితంబైన
సమయోచిత మెఱింగి చనుదెంచి ప్రీతి

నారదుఁడు కైలాసమున కేఁగుట

నారదుం డను మునినాయకోత్తముఁడు
భూరిసర్వాంగముల్ భువిఁ బొంద మ్రొక్కి
ముకుళితహస్తుఁడై మ్రొక్కుచు మఱియు
సకలలోకాలోక చరితంబులెల్ల

విన్నవింపఁగ నున్న కన్నెర్గి శివుఁడు
వెన్నెలఁగలకంట వీక్షింపుచున్న
యవసరోచితమున నంబికాదేవి
శివునను మతమునఁ జేసన్నఁ బిలిచి
"పోయివచ్చినకార్యములు విన్నపంబు
సేయు మీ వున్నట్లు శివునకు" ననిన
నమ్మునీశ్వరుఁడు మహాలింగదేవు
సమ్ముఖుఁడై కరాబ్జమ్ములు మొగిచి

నారదుఁడు శివునకు భూలోకవృత్తాంత మెఱిఁగించుట

"సకలలోకాలోకచరితంబు లెల్లఁ
బ్రకటితభక్తి నెప్పటియట్ల పరగు
నరలోకమున నుమానాథ! మీభక్తి
చరిత మేమియుఁను విస్పష్టంబు గాదు.
తవిలి శివాచార తత్పరు లగుట
భవులతోఁ గొందఱు వలుక కున్నారు
లోకప్రపంచంబులోఁ గొంద ఱుండి
లోక బోధకు లోను గాకున్నవారు
మఱికొంద ఱానందమగ్నులై తమ్ము
మఱచి లోకములకు మఱపడ్డవారు
ఉన్నతసద్భక్తియుక్తులై కొంద
ఱున్నారు తమతమయొడళులు డాఁచి
యిది కారణముగాఁగ నీశ! మీభక్తి

తుద మొద లిది యనఁ దోఁప దెవ్వారికి
నందు దృష్టప్రత్యయంబులవలన
సందియంబులు దక్కి సద్భక్తియుక్తి
సుస్థిరలీల లింగస్థలజంగ
మస్థల తత్ప్రసాదస్థలంబులను
సంపన్ను లై జగజ్జను లెల్ల భక్తి
సొంపునఁ జొబ్బనఁజూఱలఁ దేల
నీవ ప్రసన్నుండవై వచ్చి లోక
పావనంబుగ భక్తిఁ బాలింపవలయు”

శివుఁడు పార్వతితో నందికేశ్వరుని వృత్తాంతము చెప్పుట

నని విన్నవించిన నద్దేవదేవుఁ
డనురాగచిత్తుఁడై యతని కిట్లనియె
“నందికేశ్వరునకు నాకు నొక్కింత
సందు లేకునికి నిస్సందేహ మగుట
నీతనిఁ బుత్తెంతు నితనిచేఁ బరమ
పూతమై లోకంబు బోధంబు వడయు”
ననవుడు గిరిరాజతనయ ప్రాణేశుఁ
గనుఁగొని ముకుళితకరకంజ యగుచు
“నందికేశ్వరునకు నాకు నొక్కింత
సందు లేకునికి నిస్సందేహ మనుట
భక్త్యైకతనుఁడవై పలికిన విధమొ?
వ్యక్తిగా నతఁడు నీవై యున్న విధమొ

యానతి యిమ్మని యంబిక యడుగ
నానారదుఁడు విన నభవుఁ డిట్లనియె
"అగు నగు నట్టిద యంబుజనేత్రి
తగుఁదగు భక్తైకతనుఁడ నట్లగుదుఁ
జెప్పెద వినుము విశేష మిం కొకటి
దప్పదే నతఁడని తర్కించి చూడ
నేమి కారణ మనియెదవేని వినుము
తామరసానన! తత్కథాయుక్తి

## శిలాదుని తపస్సు

యాది ననేకయుగాదులనాఁడు
నాదరికమున శిలాదుఁ డనంగఁ
దాపసముఖ్యుండు దప మొనరించె
శ్రీపర్వతంబు నైరృత్యభాగమునఁ
గందమూలాదులు గాలియు నీరు
నిందురశ్ములును దినేశరశ్ములును
నాహారముగఁ ద్రికోట్యబ్దముల్ సలిపి
సాహసంబున మఱి శతకోటియేఁడు
లావంతశిల తన కాహారముగను
భావించి ఘోరతపం బర్థిఁ జేయ
నతనికిఁ బ్రత్యక్షమై యేము నిలిచి
మతి నిష్ట మెయ్యది మము వేఁడు మనిన
నత్తఱి నతఁడు సాష్టాంగుఁడై మ్రొక్కి

చిత్తంబులోఁ బ్రీతి సిగురొత్తి నిగుడ
"సర్వజ్ఞ! పశుపతి! శంకర! శర్వ
సర్వలోకేశ్వర! శాశ్వత! సాంబ!
అవధారు వేదవేదాంతావగమ్య!
అవధారు విన్నపం బాశ్రితసులభ!
శ్రీమన్మహాదేవ! శివలింగమూర్తి!
యేమిటఁగొఱఁతయే స్వామి! మీకృపను
నైనను నాకొక్క యభిమతంబైన
దానివేఁడెద మహాదాని! యీక్షణమ
నీయఁట్టివానిని నిజభక్తజనప
రాయత్త! సుతుఁగా దయామతి నొసఁగు"
మనవుడు నతనికి నభిమతార్థంబు
నొనరింప నున్నంత వనజాక్షి! వినవె!
అంతటఁ బోవక యాశిలాదుండు
నెంతయు భక్తితో నిలఁ జాఁగి మ్రొక్కి
"యభిమతంబగు పుత్త్రు నర్థి నిత్తేని
యభవ! నీ భక్తియం దణుమాత్రమైనఁ
దక్కువ గలిగినఁ దల ద్రుంచివైతు
నక్కుమారునకు నీ వడ్డమైయున్న
నట్టేని గొడుకు నిమ్మటు గానినాఁడు
నెట్టణ నే నొల్ల నీయిచ్చువరము."

### శివుఁడు శిలాదునకు వర మొసఁగుట

నంచు విన్నప మాచరించుడు నతని
సంచితభక్తికి సంప్రీతిఁ బొంది
యాదిసృష్టికి మున్ననాది యై పరగు
నాదిమదీయాంశమగు వృషభంబు
ధర్మరూపమునఁ గృతయుగంబు నందు
ధర్మంబు నాల్గువాదంబుల నడచు
రమణతోఁ ద్రేతాయుగమునను ధర్మ
మమరఁగ మూఁడువాదములను నడచు
జగములో ద్వాపరయుగ మందుఁ బాద
యుగమున ధర్మనియుక్తమై నడచుఁ
బొనరుచుఁ గలియుగంబున నొక్కవాద
మునను జరించు ధర్మనిరూఢి వెలయఁ
దగిలి యిమ్మాడ్కిని ధర్మస్వరూప
మగుట లోకహితార్థుఁ డగు నట్లుఁగాక
పూని ద్వితీయశంభుం డను పేరఁ
దా నిత్యుఁ డై పరమానందలీల
మాకు వాహనమై ప్రమథముఖ్యుఁ డయ్యె
గోకులపతియయ్యె శ్రీకరమహిమ
వెలసిన యయ్యాదివృషభేంద్రుఁ జూచి
"నలి శిలాదునకును నందీశుఁ డనఁగఁ
బుట్టుము, నీవాండెఁ బుట్టంగవలయుఁ

దేవ! దేవస్తుత్య! దివ్యలింగాంగ
భావనాతీత! సద్భావసన్నిహిత!
శంకర! దురితభయంకర! శౌరి
పంకజప్రభవాదికింకరోల్లసిత!
శుభకర! చిన్మయ! జ్యోతిస్స్వరూప!
ప్రభువ! పరాపర! భక్తవత్సలుఁడ
సర్వకల్యాణ! సంసారవిదూర!
సర్వజ్ఞ! జియ్య! సాక్షాత్సంగమేశ!
నెట్టణ నిష్ఠించి నీ కారగింపఁ
బెట్ట నాశక్యమే? పృథుదయా భావ!

## అల్లమప్రభువు బసవనికి వరము లిచ్చుట

యనుచుఁ బ్రశంసింప నల్లమ మెచ్చి
వినుతదయామృతవనధి నోలార్చి
"సురభి చింతామణి సురభూరుహములు
వరవులై యుండంగ వరమిఁకేయొంత
పెద్ద నా" కనుచు సంప్రీతి సిత్తమునఁ
దద్దసంధిలఁ బ్రసాదము గృప సేసి
తలఁచిన పదపదార్థములు నేకూడ
వలె నన్న వస్తువు లిలఁ దాన పొందఁ
బలికిన బాసయుఁ బాటిరై తనర
నిలిచినమార్గంబు నిలుకడ గాఁగఁ
బట్టినపదదైనఁ బసిఁడియై వెలుఁగ

ముట్టివబయలైన మూర్తి సేకొనఁగఁ
దెలిసినశివు నైన వెలువక గెలువఁ
దఱిమినజంగమఘట్టన కోర్వఁ
జాలు నక్షయలింగసంపద లిచ్చి
లీలఁ దత్త్వార్థసమ్మేళనం బొలయ
మోహమాయాదితమోరాశిఁ ద్రుంచి
దేహేంద్రియాది విద్వేషం బడంచి
మున్ను దత్త్వస్థితిఁ దన్నుఁ దా నెఱిఁగి
తన్నును సత్క్రియోదాత్తఁ గూర్చి
లీనమై ప్రాణంబు లింగమం దొలయఁ
గా నాథుఁ డాప్రాణలీనమై యుండఁ
గా నిరంతరపరమానందసుఖము
నూనిన శివభక్తియుక్తిమార్గమున
వడి "దివారాత్రౌచ వర్జయే" త్తనఁగఁ
బడుసదాంతరోద్యగభాతి గైకొలిపి
ఘనబహిరంగ శృంగారాంతరంగ
వినుత ప్రమథన సంవిత్సుఖలీల
దివ్యానుభవవార్ధిఁ దేల్ప నబ్బసవఁ
డవ్యయశివతత్త్వ మనువు నెఱింగి
యుప్పుముల్లియ నీర నుంచినయట్లు
గప్పురంబున నగ్గిఁ గప్పినయట్లు
వడగళ్లవర్షంబు వారాశిఁ గురియు

వడువునఁ దా లేక వర్తింపుచుండెఁ
బ్రభువుచరిత్రంబు భక్తిమై భక్త
సభలందుఁ జదివిన సంప్రీతి విన్న
సరససముంచిత సచ్చిదానంద
సురుచిరలింగైక్యసుఖము వర్త్రిల్లు

## వంగకాయలు లింగములైన కథ

వెండియు నొకనాఁడు దండనాయకుఁ డ
ఖండితభక్తివికస్వరలీల
జంగమార్చన సేయుసమయంబునందు
దొంగలు బందివెట్టంగ నూహించి
లింగవంతులు గాని లెంగుల కతని
యంగణాంతరమున కరుగరా దనుచు
వంగకాయలు గట్టుకొంగులఁ బొదివి
లింగసన్నిహితులభంగి వర్త్రిల్లఁ
జను దెంచి యాబసవనదండనాథుఁ
గని భయంపడి మ్రొక్కఁ గన్నుల నవ్వి
"లింగవంతులు గాని లెంగుల కీశ్వ
రాంగణంబున కెట్టు లరుదేర వచ్చు
నింక భక్తుల కాక యీశ్వరార్చనలు
కొంకక చేయుఁడు కూర్చుండుఁ"డనిన
నుల్లములో గలఁగ నొండొరులఁజూచుచును
జల్లన గుండె దిగుల్లన నవయ

భావించి "మన మెట్టు బందఁ జిక్కితిమి
దేవర గలిగెనా చావు దప్పెడిని
మన కింక నెమ్మెయి మగిడిపోఁ బోల"
దని కృతనిశ్చయులై కూరుచుండి
సరసర మును లింగసహితులపోలెఁ
గరములు సాఁచుడుఁ గట్టుకొంగులను
భంగి నాబసవయ్య భావసంగతిని
వంగకాయలు ప్రాణలింగంబు లయ్యె

### బల్లేశుమల్లయ్య కథ

అట్టిద కాదె మున్వ్యవహార మేఁగి
నట్టిచో లింగాలయంబు లేకున్న
"సంతతలింగ సంస్పర్శన నియమ
మంతరించినఁ జచ్చునఁటె సెట్టి" యనుచుఁ
గుంచితమతిఁ బూరిగుడి వన్నియచటఁ
గుంచంబుఁ గొండగోఁగులఁ బూజసేసి
"కలికఁడుగుడి యిదెకంటి మే"మనుచుఁ
జెలికెసె ట్లాతనిఁ బిలిచి చూపుడును
నాయతభక్తి "శివాయ నమోన
మో" యని యందంద మ్రొక్కి ముమ్మాఱు
వలగొని యింటికి వచ్చి కుడ్చుడును
"నిల లింగ మనుచు నిహీ! మల్ల భావ
గుంచంబునకు మ్రొక్కి కుడిచెఁ బోట్టారఁ

గుంచంబుఁగొనిరండుగొలువఁగవలయు
నాఁకటి కక్కఱకైనదె వేల్పు
వేఁకువఁ గుంచంబు వెండియు వలయు"
ననుచు నాశివదేవు నపహాసింపంగ
"వినఁ గూడ"దని చేయి వీనులఁ జేర్చి
"ఛా!కుక్కలార!సాక్షాల్లింగమూర్తి
గాకకుంచమె?యెఱుంగక మొఱంగెదరు
నమ్మరే రండు పినాకిఁ జూపెదను
గ్రమ్మన" నని యేఁగఁగాఁ దొంటియెడను
బ్రాకారమును ముఖభద్రమంటపము
శ్రీకరంబుగ స్వర్ణశిఖరంబు గుడియు
విరచితంబై యొప్ప వృషభేంద్రుఁ డెదుర
నరయఁ గుంచము లింగ మయ్యెనతండు
నెల్లలోకములను బల్లేశుదేవు
మల్లయ్యనా నొప్పె మఱి యట్లుఁగాక

## కాటకోటని కథ

కాటకోటఁడు నాఁగఁ గలఁ డొక్కగొల్లఁ
డేటపెంట్రుక దన కీశ్వరుం డనుచుఁ
బాలెల్లఁ బెంట్రుకపైఁబోయఁ దంద్రి
గేలి సేయుచువచ్చి కాలఁ దన్నుడును
ఖ్యాతసద్భక్తిమైఁ గాటకోటండు
నాతని కలుగుచుఁ జేతిగొడ్డటను

భూతలంబునఁ బడి పొరిఁబొరి డొల్ల
నేతరి వెనుకముం దించుక లేక
తల దెగిపడ వ్రేసెఁ దా భవంబనెడు
పులితలఁ దెగవ్రేయుపొలుపు వట్రిల్ల
నిక్కడ నితఁడు దా నిట్లు వ్రేయుటయు
నక్కడఁ గైలాసహర్మ్యకవాట
జాలముల్ గూడ జర్జరితమై పడియెః
గీలాక్షి! గొడ్డలి "కైలాసమునకుః
గడుఁజోద్య" మనినరుల్ బుడిబుళ్లువోవ
నడరఁబెంట్రుకలింగమయ్యె నంతటను
బంబిన బాపూరిబ్రహ్మయ్యభావ
నంబునఁ గాదె జొన్నలు లింగమయ్యెఁ
గావున భక్తులభావంబు లింగ
దేవునకును జన్మదేశంబు గాదె
బసవనిభక్తిసౌభాగ్యప్రభాతి
యొపకంబు దలపోయ నిది యెంతవెద్ద ?
చపలులు శివునిలాంఛనపరు లగుచు
నపవర్గకారణులై రదెట్లనిన.—
నేణాంకధరుభక్తి కెక్కు "ననాద
రేణ శార్వేన" యన్ క్రియఁ దలపోయ
ననుచు భక్తానీక మచ్చెరువంద
ననుషక్తి మ్రుచ్చుల నబ్బసవయ్య

యచ్చులఁగాఁ జూచి యభిమతార్థంబు
లిచ్చి భక్తులఁ జేసె నిజ్జగం బెఱుఁగ

### జొన్నలు ముత్తెములైన కథ

మఱియును నొకజంగమం బేఁగుదెంచి
యఱిముఱి నభ్యంజనావసరమున
"నిత్యనేమం బిది నేఁటిప్రొద్దునకు
ముత్యాలపాడి మూఁకు ముక్కాస వలయుఁ
గదలక మెదల కీక్షణమాత్రలోనఁ
బదివుట్లముత్యముల్ బసవ! యి" మ్మనిన
సరసర లింగపసాయితశస్త్ర
కరతలుఁడై చూడఁ గనుదృష్టి నున్న
జొన్నల ప్రోఁక విశుద్ధముక్తాఫ
లోన్నతరాశియై యున్న నవ్వుచును
"సన్నుత! పదివుట్లసంఖ్య మీ కేల ?
యెన్ని మీ వలసిన వన్ని గైకొనుఁడు"
అనవుడు "నట్లకా"కనుచు ముత్యములు
గొనిపోయెఁ బెఱికలఁ దనర నన్నియును.

### మొఱటద వంకయ్య కథ

మొఱటద వంకయ్య మ న్నొక్కనాఁడు
కఱకంఠభక్తుఁ డొక్కరుఁ డర్ధరాత్రి
నరుదేరఁ బొడగని యడుగుల కెరఁగి
సరసోచిత క్రియా సంతుష్టుఁ జేయ,

"మాలింగమునకుఁ నేము మ్రొక్క మొదవు
పాలును మారేడుఁబత్త్రి వలయు,
నటుగాని యవసరం బలవడనేర,
దిటనెల్లునో యని యేఁగుదెంచితిమి
ఎడసేయఁగా దింకనీక్షణంబునను
గడియింపకుండినఁ గాదు గార్యంబు
హరభక్తు లూర లే రొరుల నే నడుగఁ
బొరుగూరి కీవేళఁ బోవంగరాదు
ఇంక నెట్లన నాత్మ నించుకేసియును
గొంకక వంకయ్య గొడ్డు నక్షణము
కొనివచ్చి యొకవట్టికొఱట సంధించి
మనసిజహరభక్తమండలిఁ దలఁచి
"యీకొఱటన పత్తి రీగొడ్డునంద
ప్రాకటంబుగఁ బాలువడయుదు" ననుచుఁ
గుండ వేగమ కడ్గికొనివచ్చి పిదుకఁ
గుండ నిండఁగఁ బాలు గురిసె నాగొడ్డు
కొఱటనె పత్త్రి యంకురితమై పరగె
వఱల నామొఱటదవంకయ్య గోసి
తెచ్చి యాభక్తున కిచ్చి నేమంబు
సెచ్చెరఁ జెల్లించెఁ జెప్పఁ జిత్రంబు
అనఁగ విందుము దొల్లి యాదొక్కభక్తులందుఁ
గనుఁగొంటి మిప్పు డీకటకంబునందు

బసవని దృష్టిసంస్పర్శనంబునన
యొసఁగు జొన్నలప్రోఁక యిందఱుఁ జూడఁ
బొనరుచు ముత్యాలప్రోఁకరై తనరె”
నని భక్తమండలి వినుతింపుచుండఁ

సంగమేశ్వరుఁడు బసవని మూఁడవకన్నడుగు కథ

జెచ్చెర మఱియు నీప్సితవస్తువితతి
నెచ్చుగా బసవఁ డిట్లిచ్చుటఁ జూచి
“వేడు కయ్యెడు నాకు వేఁడంగ” ననుచు
రూడిగా జంగమరూపంబుఁ దాల్చి
చక్కన సంగమేశ్వరుఁడ యేతెంచి
గ్రక్కున మూఁడవక న్నడ్గఁ దడవ
నాయతలింగ పసాయితహస్తుఁ
డై “యెఱుఁగనె నీదుమాయ నే” ననుచు
ముకురంబుఁజూపుచు “ముక్కన్ను నీకు
నకలంక! సహజంబ యదెచూడు” మనిన
నద్దంబులోన ఫాలాక్షుంబుఁ గాంచి
యద్దేవదేవుండు దద్ద లజ్జించి
యప్పు డక్కడన నిరాకార మగుడుఁ
జప్పరింపుచుఁ జూచి “చా! పంద! పంద!
యోడకు మోడకు మోరోరి! సంగ!
యోడకు మోడకు మొకటియు నొల్ల
నెఱుఁగవే సత్యమాహేశ్వరులిండ్ల

నెఱియంకకానిని నిజగతి నన్ను
దాసయ్యవలె నిన్నుఁ దవనిధి వేఁడ
నాసిరియాలున ట్లాత్మజుఁ గోరఁ
గనకవృష్టి యడుగఁ గరికాలునట్ల
వనితకు నెడవుచ్చు మన నంబిభాతి
వెండియుఁ గుమ్మరగుండయ్య కిచ్చు
మిండప్రాయంబుఁ గామింపఁ గాదేని
స్వర్గాపవర్గాది సౌఖ్యంబు లొల్ల
భర్గ! నీప్రముఖుల భక్తులయిండ్ల
నలరుచు డించిన యాప్రసాదంబె
కలదు భోగింపఁగాఁ గలకాల మెల్ల
సర్వభక్తాత్మ! మీజలకంబువాఁడు
గుర్వగా మాకాటకోటయ్యగారు
హర! మీనగరిమాలకరి పుష్పదంతుఁ
డరిదిపూజారి కన్నప్పదేవయ్య
యిండెగట్టెడిది మా యిండెరేకవ్వ
ఖండదీపమువాఁడుగా నమినంది
నెట్టణ దీవించి నీకు విభూతిఁ
బెట్టెడువాఁడు మాపిళ్లనైనారు
అనుషక్తిమై గంధ మర్పించువాఁడు
మనసిజసంహార! మాయణుమూర్తి
వరద! మీధూపంబువాఁడు మాచయ

వరకీర్తి! మీఁగంటవాఁ డోహిళయ్య
ధర మంగళారతుల్ దరిసించువాఁడు
వరద! సోమయ్యగారు శరణవత్సలుఁడు
వంటకట్టెలు దెచ్చువాఁడు మారయ్య
పంటింపఁ గరికాలు పడిపెట్టువాఁడు
కలకంఠ! యడబాల సిలుతొండనంబి
మఱి బానసమునది మాసంగళవ్వ
కరికాలచోడు వల్లెర మిడువాఁడు
గరగ కావటివాఁడు ఘనుఁడు హొన్నయ్య
రమణీయమగు నోగిరంబుల పరిసె
నమువాఁడు సెన్నయ్య విమలదేహుండ!
యారగింపఁగఁ బెట్టునవసరంబులది
వీర చోడవగారు విశ్వైకవినుత!
అడపంబువాఁడు రేచయ మునుపాలు
పడుప్రసాదులు బిబ్బబాచయ్యగారు
మృడుఁడ!మానాట్యనమిత్తండి వైద్యుఁ
డడరంగఁ గల్లిదేవయ్య! వెండిఁడు
మలహర! సామవేదులు పురోహితులు
వెలయఁ బౌరాణికుం డిల మాయిభట్టు
కోరి మీపరిహాసకులు గళియంబ
గారు వాగీశనైనారు వారకుఁడు
శ్రీపతిపండితుల్ శివుఁడ! మీ కవులు

నాపండితయ్యగా రనుఁగుఁబండితులు
నాదివీణెలవాఁడు మాదిరాజయ్య
నాదరసజ్ఞుఁడు నలి శంకరయ్య
కరణంబు గర్మసంహార! కేశిరాజు
ధర జగదేవుండు దండనాయకుఁడు
గణనాథుఁ డిందుశేఖర! మీప్రధాని
ప్రణుతించి చూడ మాప్రభువు మీప్రభువు
ఇఱవత్తుఁడు గజసాహిణి యశ్వసాహి
యొఱపుగాఁ జేరమ యోగియొడయఁడు
అనఘ! రామయ్య యేకాంతంబువాఁడు
నొనర బల్లహుఁడు గుంటెన, సఖి నంబి
శంకర! నీబంటు శంకరదాసి
యంకంబువాఁడు సేనాధినాథుండు
లెంక దా మంచయ్య లీల మీనగరి
సుంకీఁడు సుంకేశుబంకయ్యగారు
సుదియఁ బట్టెడువాఁడు సురియచౌడయ్య
పోరిఁ గులచ్చిరియారు భువి హేళగీఁడు
హర! నీకు బెజ్జమహాదేవి దాది
ధర రుద్రపశుపతి దామంత్రవాది
సువిధాని కక్కయ్య, భువి జాలగాఁడు
శివరాత్రి సంగయ్య, సెలి బోగతండె
దేవరదాసయ్య దేవ! దాసీఁడు

భావింపఁ గిన్నరబ్రహ్మయ్య బచ్చు
మడివాలు మడివాలుమాచిదేవయ్య
కడములనంబి సొప్పడ దివ్వెలాఁడు
తెల్లంబు గోడలు దీర్చెడువాఁడు
సల్లిల గోడలమల్లయ్యగారు
కుమ్మరి గుమ్మరగుండయ్యగారు
జొమ్మయ్య వేఁటకాఁ డిమ్మహిలోనఁ
గమ్మరమ్ములవాఁడు ఘనుఁ డిల్లహాళ
బొమ్మయ్య గీలారి నెమ్మిఁ జండండు
మాయావి! బల్లేశుమల్లయ్య గొట్టు
బోయీఁడు, బాచయ్య భూరికోటారి
పాలువిదుకువాఁడు లీల వంకయ్య
పాలుగావంగ నేర్పరి గొడగూచి
కావున నీదు సకలనియోగంబు
మావారలై యుండ మన్ననోరమణి!
యేమిటఁ గొఱఁత? నా కేమిటఁగడమ?
యేమైన నడుగు నీ కిచ్చెద నింక
మానంబు వదలిన మదిఁ దల్లడిలిన
మానుగాఁ బ్రమథులయాన నీయాన
కాలకూటము గుత్తుకకు రాకమున్న
క్రాలుపురంబులు గాలకమున్న
గౌరివివాహంబు గాకటమున్న

యాఁర నజాండంబు లలరకమున్న
తివిరి మూర్తులు నెన్మిదియు లేకమున్న
భువి హరిబ్రహ్మలు పుట్టకమున్న
యటమున్న యటమున్న యటమున్న మున్న
యిట నీవు నాస్వామి వేనునీబంట
కలకంఠ! యిది యేమి గళవళించెదవు
వలల నాచేతఁ బోవచ్చునే” యనుచు
నసమాక్షుతోడ మాఱంకమై గెలిచె
బసవఁ డుదగ్రదర్పస్ఫూర్తిమై నిట్లు

బసవఁడు గొల్లెతచల్లకడవఁ బడకుండఁబట్టిన కథ

వెండియు నిర్మలాఖండితకీర్తి
దండనాథాగ్రగణ్యుండు పుణ్యుండు
సజ్జననుతుఁడు బసవఁ డొక్కనాఁడు
బిజ్జలుకొలువునఁ బ్రీతిఁ గూర్చుండి
“యోడకోడకు”మనియొకకడ వెత్తు
మాడికి బాహుయుగ్మముఁజాఁపఁ దడవ
“నిసుమంత బూడిద నొసలఁ బూసినను
మసలక కొండంతమరు లెత్తెననుట
తెల్లం” బనుచు రాజు మెల్లన నగుచుఁ
“జెల్లఁబో బసవయ్య! శివమరుల్ గొంటె

బ్రమసితే తలకెక్కి భక్తిరసంబు
గుమతిపై నిండినకోలువులోపలను
"నోహా"యనుచు"నోడకోడకు"మనుచు
బాహాయుగ్మము సాఁచిపట్టుతే"మనిన
"స్వగుణసంకీర్తన దగదు సేయంగఁ
దగదని యున్నను నగు సభ" యనుచుఁ
"త్రిపురారిగుడితూర్పుదెస నేఁటినేలఁ
గపిలేశ్వరంబందుఁ దపసి యొక్కరుఁడు
ఆలింగమునకు నిత్యము నాలువుట్ల
పాల మజ్జనమార్పఁ గాలువల్ గట్టి
వీదివీదుల వెల్లివిరియ నేసుఁగుల
పాదఘట్టనములఁ బంకంబు రేఁగ
నావీధిఁ జల్లఁ దా నమ్ముచుఁ గణఁకఁ
బోవుచోఁగాళవ బోయిన దోసఁగఁ
గడురొంపిఁ గాలుజాఱుడుఁజల్లకడవ
పడఁ బోవ గొల్లెత"బసవరో"యనినఁ
బట్టితి నచ్చుటఁ బడకుండఁ గడవఁ
జట్టన చేతులు సాఁచి యే ననుచు
గొల్లెతరూపంబు గొల్లెతయిల్లు
గొల్లెత యున్న యిక్కువయుఁ జెప్పాటయు
రప్పించి గొల్లెత రాజు దా నడుగఁ
దప్పక బసవయ్య సెప్పినయట్ల

చెప్పుచు నొఱగినచేతి రోంపియును
నప్పుడు జాఱంగ నంటినకాలి
రోంపియుఁ జూపి రొఱుంగ రె యితని
పెంపున కిది సెప్పఁ బెద్దయే తొల్లి

## తిరుచిట్టంబలుని కథ

ప్రవిమలభక్తి విభ్రాజితలీల
భువి నఱువత్తూండి ముప్వురిలోన
శ్రీనిలయుఁడు దిరుచిట్టంబలుండు
నా నొక్కభక్తుఁ డనశ్వరకీర్తి
కరమర్థితో వర్ష కాలంబునందు
హరపూజనార్థమై యట్లొక్కనాఁడు
చని పుష్పములు గోసికొని వచ్చునెడను
వననిధితీరంబునను గాలు జాఱి
పడి వడిఁ బుష్పముల్ పడకుండ భక్తుఁ
డడరుచుఁ "జిట్టంబలాధీశ!" యనుడుఁ
బరముఁడు భక్తునిఁ బడకుండఁ బట్టు
పరుసున ననుఁ బట్టె బసవలింగంబు
వడి నట్టులును గాక వసుధేశ! వినుము
పుడమిని పొన్నలి పురవరంబునకుఁ
బోయినచోటఁ దత్పురి సుఖగోష్ఠి
నాయతభక్త సభాభ్యంతరమున
సిద్ధరామునిఁ జూచి శివభక్తవితతి

"సిద్ధుండ! లోకప్రసిద్ధంబు గాఁగ
నభినవశ్రీగిరి యనఁగ నిప్పురము
నభినవలీల సొంపార రచించి
యాపర్వతము మల్లికార్జునదేవు
నేపారఁ గొనివచ్చి యిచ్చట నిలిపి
ధ్రువముగా లక్షయుఁ దొంబదివేలు
శివలింగములను జెచ్చెరఁ బ్రతిష్ఠించి
దానికిఁ దగఁగ మర్త్యములోనియన్న
పానముల్ ముట్టక భక్తిపెంపునను
సహజమకుటము నొసలికన్నుఁ దనర
మహితయోగానందమహనీయలీల
మేనినీడయు భువి మెట్టినయజ్జ
గానఁగఁబడ దనఁగాఁ జరింపుచును
నమితసమాధియోగాంతంబునందుఁ
బ్రమథలోకమునకుఁ బన్నుగా నేఁగి
యక్కడఁ దత్త్వరహస్యసద్గోష్ఠి
మక్కువ నెక్కొన మసలి యేతెంతుఁ
ప్రఖ్యాతమిది మాకుఁ బ్రమథలోకమున
నాఖ్యాతసత్కీర్తి యగుబసవాఖ్యుఁ
బొడగంటిరే భక్తభూరిసద్గోష్ఠిఁ
గడు నొప్ప నిక్కడఁ గలుగు నక్కడను
నతఁ డుండు నా విందు ముఖిలలోకముల

సతతసాన్నిధ్యానుప_క్తిమై" ననిన
శివభ_క్తతతిఁ జూచి సిద్ధరామయ్య
"ప్రవిమలగతి నేఁడు ప్రమథలోకమున
నరసి వచ్చెద" నంచు నాక్షణంబునను
నరిగి కైలాసనగాగ్రహర్మ్యమున

సిద్ధరామయ్య కైలాసమున కరుగుట

నజ కాలబుద్ధ క్షయాంత రజోద్యతి
నిజ బలప్రియ యామ్య నీల రుద్రేశ్వ
రేశాన శర్వ సర్వేశ భర్గ ప్ర
కాశ సురాధీశ గౌరీశ ధన్య
వామదేవ భవోద్భవ ప్రచండ ధర
వామదేహోగ్ర సంవాహ పినాకి
ధాతృ విధాతృ హుతాశన శివ మ
హాతేజ సూక్ష్మ లయ క్రూరదంష్ట్ర
క్షేమేశ వికరణార్చిష్మంత దమన
భీమాభిధానోగ్ర పింగాక్ష క_ర్తృ
విషధరానంత నివృ_త్తి నిధీశ
వృషభగణాధ్యక్ష విభు వాయువేగ
హార రత్నకర బభ్రు హంతాగ్ని దుఃఖ
కర సుఖకర సుదుంబర కాలరుద్ర
హరిహర బ్రహ్మసౌమ్య స్వామి మృత్యు
హార భయానక హాలాహల పరంధామ

వజ్రదేహావ్యయ వట రుద్ర దీర్ఘ
వజ్రదంత వియోక్త్ర వట విరూపాక్ష
సహానేశ శంభు పంచశిఖ నియోక్త్ర
గుహా దుద్ర బాధక గోప తీశాన
పింగళాసాధ్య మాతంగ రోహితసు
రంగ కపాలధర స్థూలరుద్ర
శాశ్వతే శోర్ధ్వకేశ త్రిదశేశ
విశ్వేశ చండేశ విత్తేశ వృషధ
రాక్షయరుద్ర కాలాగ్నిరుద్ర త్రి
యక్షఫణీంద్ర విచక్షు లాదిగను
రుద్రచిహ్నాలు గ్రాల రుద్రాత్ములైన
రుద్రగణాధీశ్వరుల్ సేరి కొలువ
శ్రీనంది నందినాథానంద వృషభ
సానంద గోముఖ హాయ ముఖాభంగ
దండపాణీశాన చండీశ రుద్ర
రుండాభరణ రుద్ర పుండరీకేశ
పర్వతాభరణ దర్ప సుభద్ర శర్వ
సర్వజ్ఞ సర్వాత్మ సర్వసంహరణ
దారుక రేణుక ధవళాక్ష వీర
వీరక వీరభద్రారూఢ భద్ర
త్రిజటి ధూర్జటి లోకవిజయాట్టహాస
నిజబల విషబల నీల నిశ్శంక

నీలలోహిత నిత్య నిష్కళ శాంత
కాల మహాకాల కాల కాలోగ్ర
రూప నిరూప విరూపాక్ష విశ్వ
రూప పుష్కళ శాంతరూప వృషాంక
ఉగ్రాక్షభర్గాసితగ్రీవపింగ
ళోగ్రకాయాతి కాయోత్తుంగవిముఖ
కరిముఖ నరముఖ కపిముఖ ద్విముఖ
శరభముఖాముఖోష్ట్రముఖ శార్దూల
ముఖ చతుర్ముఖ పంచముఖ సుముఖాష్ట
ముఖ నవముఖ దశముఖ షణ్ముఖైక
ముఖ సహస్రముఖ దుర్ముఖ వికటాక్ష
ముఖహార విషహార మలహార మృత్యు
హార యమహార గజాసురహార సకల
సురహా రాసురహార పురహార భృంగి
గజకర్ణ శార్దూల కర్ణాశ్వకర్ణ
విజయఘంటాకర్ణ వీరగోకర్ణ
లాదిగా బలసి సదైశ్వర్యలీల
నాదిప్రమథగణేంద్రావళి గొలువ
సనకసనందన సన్మునీశ్వరులు
ననుఁగులై తమహృదయాబ్జముల్ పూన్ప
నుపమన్యు వామదేవ పవిత్రపాణి
కపిల కణ్వాగస్త్య కౌశిక సుబల

శ్వేత దధీచి వసిష్ఠ కణ్వాత్రి
గౌతమ కశ్యప సూతానిలాత్మ
మాండవ్య హారిత మార్కండేయ పులహ
శాండిల్యవత్సకుత్సపులస్తికశక్తి
బాదరాయణ భృగు బకదాల్భ్య రురు శి
లాద మౌద్గల్య పర్ణాద శాకల్య
గర్గ శౌనక చతుష్కర్ణమృకండు
భార్గవాంగిరస విభాండక శునక
మైత్రేయ బల్లకి మంకణ చ్యవన
మిత్రావరుణ నారదాత్రి సౌవర్ణ
పైలసుమంతుసుబ్రహ్మణ్య మంద
పాల సుమిత్ర రైభ్యక సత్య సుమహ
పర్వత జైమిని పౌలస్త్య గార్గ్య
దుర్వాసు లాదిగా సర్వ సన్మునులు
వెలుఁగ నాశీర్వాదవేదనాదముల
నలరుచు నందంద యనుకీర్తిసేయ
సుర నర దనుజ ఖేచర సిద్ధ సాధ్య
గరుడ గంధ ర్వోరగ ప్రకరంబు
ద్వాదశాదిత్యు లేకాదశరుద్రు
లాది నవబ్రహ్మ లష్టవసువులు
సురపాగ్నియమదైత్య వరుణగంధవహ
నరవాహ హరదిశానాథయూథంబు

శ్రీవాగ్వధూనాథ జిష్ణులు నవిక
లావరణస్థులై యభయముల్ వేఁడఁ
దుంబురునారదాదులు సుగీతామృ
తంబున నెయ్యంబు దనర నోలార్ప
నంబికాసహితుఁడై యాస్థానమంట
పంబునఁ బేరోలగంబున నున్న —
శివదేవుఁ గనుఁగొని సిద్ధరామయ్య
యవిరళభక్తి సాష్టాంగుఁడై మ్రొక్కి
"విన్నపం బవధారు విశ్వలోకైక
సన్నుత!" మర్త్యంబు సద్భక్తజనులు
"ప్రమథలోకంబున బసవండు గలఁడో
ప్రమథేశుకొలువునఁ బరికింపు"మనిరి
"బసవసంస్తుత్య! సద్భక్తైకదేవా!
యసలార నున్నరూ పానతి" మ్మనిన

శివుఁడు తనహృదయమున బసవనిఁ జూపుట

నాలోక మీలోక మననేల బసవఁ
డేలోకమునను లే? డెల్లచో నుండుఁ
బ్రమథులయందు సద్భక్తులయందు
నమరంగ నాహృదయాబ్జకర్ణికను
సతతంబు గురులింగచరములయందు
నతిముదమున నుండు నాదిబసవఁడు
అట్టౌట కిటుసూడుమా"యని శంభుఁ

డిట్టలంబుగఁ దనహృదయంబుఁ దెలివ
సంగతంబగు కరస్థలము లింగంబు
జంగమావళికిని శిర ణానుకరము
ననిమిషుఁడై చూచు హరుమీఁదిదృష్టి
గనుఁగవహర్షాశ్రుకణవితానంబు
దరహసితాస్యవిస్ఫురణయుఁ దనరఁ
బరమశివధ్యానపారవశ్యమునఁ
బద్మాసనస్థుఁడై పరమేశుహృదయ
పద్మంబునం దున్న బసవనిఁ జూచి
ప్రమథులు హర్షింప నమరులు మ్రొక్క
నుమబోటి యత్యద్భుతోపేతగాఁగ
నామూర్తిఁ గని సిద్ధరామయ్య యుద్గ
తామితానందపూర్ణాత్ముఁ డై తనర.
హరుఁడు పర్వతపుత్త్రి నరవిరికంటఁ
బోరిఁ బోరిఁ జూచుచుఁ “బూర్ణేందువదన!

### శివుఁడు పార్వతికి బసవనిమహిమ తెలుపుట

చూచితే బసవనిసురుచిరమహిమ
యీచెల్వనిల్కడ యేరికిఁ గలదె?
వెలయఁగ నయ్యాదివృషభేంద్రుఁ డనఁగ
నలి నేన రెండుమూర్తులు ధరించితిని
విను “తవపుత్త్రో భవిష్యామి” యనుచు
నెనయ శిలాదున కేన పుట్టితిని

ఆసలార భక్తహితార్థమై యేన
వసుధ జనించితి బసవం డనంగ
నెసఁగ నిట్టిదకాన యీశుండ నేన
బసవఁ డిట్లేరి సద్భక్తుండ నేన
మున్నును మన బసవన్న సద్గుణ మ
హోన్నతి యెఱుఁగవే యొగి నట్లుఁగాక
లోకాధిపతి నేను లోలాయతాక్షి!
ప్రాకటంబుగ లోకపావనుఁ డితఁడు
కారణలోకసంహారుండ నేను
కారణలోకోపకారి యితండు
భక్తవత్సలుఁడ నేఁ బర్వతపుత్త్రి!
భక్తరత్నములకు బండారి యితఁడు
భక్తైకదేవుండ భావింప నేను
భక్తజనప్రాణి బసవఁ డీక్షింప
ముక్తికి రాజఁజూ ముద్రియ నేను
భక్తికి రాజసూ బసవఁ డీక్షింపఁ
బసరింప నే లింగపట్టబద్ధుండ
బసవండు సద్భక్తిపట్టబద్ధుండు
అచరలింగంబ నే నచలేంద్రతనయ!
సచరాచరక్షోణిఁ జరలింగ మితఁడు
సనునాది నాపేరు శంభుం డనంగఁ

బొనర ద్వితీయశంభుఁడు వీనిపేరు.
స్థిరభక్తి మమ్ముఁ గొల్చినఁగాని లేదు
ధర వీనిఁ దలఁచినంతనె ముక్తి గలదు.
అలరుచుఁ బ్రాణదేహార్థముల్ నాకు
నిల నిత్తు రఖిలభక్తులు నొక్కయెడను
నచ్చుగాఁ బ్రాణదేహార్థముల్ బసవఁ
డిచ్చుచునుండుఁ దా నెల్లభక్తులకు
నాయతమతి బసవా యనఁబరగు
నీయక్షరత్రయం బి ట్లొక్కమాటు
సదువు నాతని ముఖసదనంబు నందె
కదలకుండుదుము మాగణములు నేము
పొదలు నెవ్వని యాత్మ నుదితసద్భక్తి
యదియు బసవనిమహత్త్వంబ కాదె
పరికింపనెవ్వఁడు వడయుఁ బ్రసాద
పరముక్తి యది బసవనికృప గాదె
మదిలోన నెవ్వఁడు మముఁ దలపోయు
నదియెల్ల బసవనియంశంబ కాదె
పసరించు జంగమభక్తి యెవ్వండు
వసుధలో నది బసవనివృత్తి గాదె
భక్తిపట్టము దాల్చ బసవఁడు దక్క
శక్తిసమేతులు జగతిపైఁ గలరె

యది గాక యొక్కనా యందేల భక్త
హృదయస్థుఁడై చూడ నిట్లున్నవాఁడు
అంచు వెండియుఁ బ్రస్తుతించుచు శంభుఁ
డంచితమతి బసవయ్యకి ట్లనియె
"బసవ! మర్త్యమునందు భక్తులు గలరె?
యొసకమై సంసార మిష్టమే నీకు?"
నని యానతిచ్చుడు సద్దేవు హృదయ
వనజస్థుఁ డగు బసవం డిట్టు లనియె
"ముందునకైనను మర్త్యలోకమున
నిందుశేఖరుభక్తుఁ డెందును లేఁడు
భక్తుండ నేన చూ భక్తు లిందఱును
భక్తాత్మ! మీ స్వరూపంబ కావునను
వెండియుఁ గల దొక్క విన్నపం బింకఁ
జండేశవరద! ప్రసన్నత వినుము
జంగమలింగప్రసాదోపభోగ
సంగతసుఖసుధాశరధి నోలాడు
నిటువంటిభవము లెన్నేనియు లెస్స
యిట యపవర్గమహిమ్మతకంటెఁ
గావున శునకసూకరకృమికీట
కావహాజన్మంబు లైనఁ గానిమ్ము
సుప్రసిద్ధముఁ జంగమప్రసాదంబ

యేప్రొద్దు భోగింప నెట్లు గల్గినను
జాలుఁబో భవకోటిశతసంఖ్యలందు
నోలి నన్ బుట్టింపు మొకటియు నొల్ల"
ననవుడు గౌరీశుఁ డతిదయాదృష్టిఁ
గనుఁగొని సిద్ధరామునకుఁ జూపుడును
శివునకు మ్రొక్కుచు సిద్ధరామయ్య
భువికి నేతెంచి యద్భుతము నెక్కొనఁగ
భక్తసమూహికి బసవయ్యమహిమ
వ్యక్తిగాఁజెప్పంగ నట్లు నేవింటి"
ననవుడు బిజ్జలుఁ "డట్టు లౌటకును
జనులకునెల్ల దృష్టం బిప్పు డిదియ"
యనుచు నమూల్యవస్త్రాభరణములఁ
బొనరంగఁ గాళవ్వబోయిని గొసఁగి
"యవికలాజాండతత్త్వాత్మకుఁడైన
శివుఁడు గరస్థలాసీనుఁడై యుండ
సర్వగతుండైన శంభుభక్తునకు
సర్వగతత్వంబు సహజంబ కాదె
సర్వమయుండైన శర్వభక్తునకు
సర్వమయత్వంబు సహజంబకాదె
దూరేక్షణంబును దూరశ్రవణము
దూరవిజ్ఞానసిద్ధులు మొదలైనఁగ

నణిమాదిసిద్ధులు నభవుభక్తునకు
గణుతింప నెంత శ్లాఘ్యంబు దా" ననుచు
సకలమానవులు మస్తకతటన్యస్త
ముకుళితహస్తులై మ్రొక్కుచునుండ
"నల్లవో" యనుచు భూవల్లభుఁ డతులి
తోల్లాసచిత్తుఁడై యెల్లవస్తువులు
దట్టుఁడు బసవనదండనాయకున
కిట్టులంబుగఁ గట్టనిచ్చె సంప్రీతి
గురుభక్తిశృంగార ! గుణగణాధార !
వరదయాలంకార ! సురుచిరాకార !
ఖ్యాతగంభీర ! దుష్కర్మవిదూర !
గీతమహోదార ! ధూతసంసార !
అకుటిలచిత్త ! శివాచారవేత్త !
ప్రకటతత్త్వాయత్త ! ప్రవిమలవృత్త !
అజ్ఞానజైత్ర ! యుదాత్తచరిత్ర !
విజ్ఞానపాత్ర ! సంవిత్సుఖామాత్ర !
రూఢవ్రతోత్తుంగ ! రుచిరాంతరంగ !
గూఢప్రసాదాంగ ! గొబ్బూరిసంగ !
ఇది యసంఖ్యాతమాహేశ్వరదివ్య
పదపద్మసౌరభభ్రమరాయమాణ

జంగమలింగప్రసాదోపభోగ
సంగతసుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ
సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగఘనకర స్థలివిశ్వనాథ
వరకృపాంచితకవిత్వస్ఫూర్తిఁ జేర్చి
చను బసవపురాణ మనుకథయందు
ననుపమంబుగ ద్వితీయాశ్వాసమయ్యె.



# తృతీయాశ్వాసము



శ్రీరుద్రభక్తాంఘ్రిశేఖర! శుద్ధ
వీరమాహేశ్వరాచార! సంగాఖ్య!
దండిమై మఱియొక్కమిండజంగమము
వెండియు బసవనదండనాయకుఁడు
మంత్రులుఁ దానును మహీపతి వనుపఁ
దంత్రంబునకు జీవితము వెట్టునెడను
"వచ్చి యీయర్థంబు వలయు నింతయును
నిచ్చినఁగాని యొం డేనొల్ల" ననుచు
ఘట్టించి యడుగుడుఁ బెట్టెలమీఁద
లట్టున్నభంగి నాయయ్యకు నొసఁగఁ
దంత్రసమేతులై ధరణీశుకడకు
మంత్రివర్గం బేఁగి మఱి యిట్టులనిరి.
చెప్పినఁ గొండెమౌఁ జెప్పకయున్నఁ
దప్పగు నటుగాన చెప్పఁగవలసెఁ
బనిసేయ వెఱతుము బసవయ్యతోడ
ధనమెల్ల నొక్కమిండని కిచ్చె" ననుచుఁ
గొండెంబుసెప్పినఁ గోపించి రాజు
బండారిబసవనదండనాయకుని

రప్పించి "మాయర్థ మొప్పించి పొమ్ము
దప్పేమి? సాలుఁ బ్రధానితనంబు
'దండింపరా' దనుతలఁపున నిట్లు
బండార మంతయుఁ బాడు సేసితివి
పరధనం బపహరింపనిబాస యుండ్రు
పరధనం బెట్లొకో బసవ! కైకొంటి
వేయుమాటలు నేల వెఱతుము నీకు
మాయర్థ మొప్పించి నీయంత నుండు"
మనవుడుఁ గించిత్ప్రహసితాస్యుఁడగుచు
జననాథునకు బసవనమంత్రి యనియెఁ
"బరమేశుభక్తియన్ సురతరు వుండ
హరుభక్తియన్ కనకాచలం బుండఁ
గామారిభక్తిచింతామణి యుండ
సోమార్ధధరుభక్తిసురధేను వుండ
బగుతుఁ డాసించునే పరధనంబునకు
మృగపతి యొద్దెస మేయునే పుల్లు?
క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించుహంస
గోరునే పడియలనీరు ద్రావంగఁ?
జూతఫలంబులు సుంబించుచిలుక
బ్రాఁతి బూరుగుమ్రానిపండ్లు గన్గొనునె?
రాకామలజ్యోత్స్నఁ ద్రావుచకోర
మాకాంక్షసేయునే చీకటిఁ ద్రావ?

విరిదమ్మివాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే బబ్బిలివిరుల?
నెఱుఁగునే యలదిగ్గజేంద్రంబుకొదమ
యొఱపంది చను నీక? నెఱుఁగవుగాక
యరుదగు లింగసదర్థులయిండ్ల
వరవుడ నాకొకసరకె యర్థంబు
పుడమీశ ! మీధనంబునకుఁ జే సాఁప
నొడయల కిచ్చితి నొడయలధనము
పాదిగ దలఁగిన భక్తుండఁ గాను
గాదేని ముడుపు లెక్కలుసూడు" మనుచు
దట్టుఁడు బసవనదండనాయకుఁడు
పెట్టెలు ముందటఁ బెట్టి తాళములు
పుచ్చుడు మాడ లుప్పొంగుచుఁ జూడ
నచ్చెరువై లెక్క కగ్గలంబున్న

నక్కలు గుఱ్ఱము లైకథ

'మధుర పాండ్యుఁడు దనమంత్రిచే నిట్టు
లధికమర్థం బిచ్చి హయముల విలువఁ
బనుచుడు నతఁడు సద్భక్తి పెక్కువను
జని చని జంగమార్చన సేయఁజేయ
నర్థమంతయుఁ బోవ హయముల విలువ
నర్థంబు లేకున్న ననుమాన ముడిగి
పొలమునక్కలనెల్లఁ బిలిచి తెప్పించి

నలిఁ బాండ్యభూనాథునకుఁ బోడసూపఁ
జొక్క నైనారులమిక్కిలికరుణ
నక్కజం బంద నానక్క లన్నియును
నిలఁ గంకణములతేజాలు నయ్యెఁ గాదె
మలహారుభక్తులమహిమ దలంప
నిది సోద్యమే" యంచు నెల్లభక్తులును
సదమలచిత్తులై సంతసంబంద
నతివిస్మయాక్రాంతుఁడై బిజ్జలుండు
"ఇతఁ డీశ్వరుఁడ కాక యితరుండె?" యనుచు
వరవస్త్రభూషణావళి సమర్పించి
పరమానురాగుఁడై నరులెల్ల వినఁగ
"బండారిమీఁద నెవ్వండేని యింకఁ
గొండెంబు సెప్పునాకుక్కలఁ జెండి
నాలుక ల్గోసి సున్నము సాలఁ బూసి
పోల వేఁచినయిస్సు వోయింతు నోళ్ల"
ననుచు నబ్బసవసింహము వీడుకొల్పఁ
జనుదెంచె నగరికి జనులు నుతింప.

బసవఁడు తనభార్యచీర విప్పించి యొకజంగమున కిచ్చిన కథ

వెండియు నొక్కయ్య వేశ్యాలయమున
నుండి బానిసఁ బిల్చి "బండారినగర
మున నిత్యపడి వేఁడికొని వేగరమ్ము"
అనవుడు "నట్లకా" కని పోయి యచటఁ

బడఁతి యబ్బసవయ్య పట్టంపుదేవిఁ
బొడగని కట్టినపుట్టంబు సూచి
యసలారఁ బడి వేఁడు డంతఁ జాలించి
మసలక బొనిస మగిడి యేతెంచి
యక్క! యేమందు నీయాన నేనిప్పు
డొక్కసోద్యముఁ గంటి నక్కడి కేఁగి
యట్టి దివ్యాంబరం బఖిలలోకములఁ
బుట్టదు బసవయ్యపట్టంపుదేవి
కట్టినపటవళిపుట్టంబు సూచి
నెట్టణ వచ్చితి నీ కెఱిఁగింప
బావ వేఁడినఁ జాలు బసవయ్య యిపుడ
యావస్త్ర మొసఁగెడు నరగలిగొనఁడు
పరగు మహాదేవుభక్తులచేత
నరుదరు దనఁగ గణారాధనములఁ
గొనివచ్చి జంగమకోటి సస్నేహ
మున నిచ్చినట్టి యమూల్యవస్త్రములు
వెంజావళియు జయరంజియు మంచు
పుంజంబు మణిపట్టు భూతిలకంబు
శ్రీవన్నియయు మహాచీని చీనియును
భావజతిలకంబు పచ్చనిపట్టు
రాయశేఖరమును రాజవల్లభము
వాయుమేఘము గజవాళంబు గండ

వడము గావులు సరిపట్టును హంస
పడియు నీణావళి పల్లడదట్టి
వారణాసియు జీకు వాయుఁ గెందోగరు
గౌరిగనయమును క్షీరోదకంబు
పట్టును రత్నంబుపట్టును సంకు
పట్టును మరకతపట్టు పొంబట్టు
నెఱపట్టు వెలిపట్టు నేత్రంబుపట్టు
మఱి తవరాజంబు మాందోళిరవియుఁ
జంద్రాతపంబును సాంధ్యరాగంబు
నింద్రనీలంబు మహేంద్రభూషణము
సన్ననడంచును శరధియు మేఘ
వన్నెయు రుద్రాక్షవన్నె కాంభోజి
పులిగోరుపట్టును భూపతి రుద్ర
తిలకంబు సరిపట్టు మలయజసిరియు
గౌలనిమేఘము గజావళి హయావళియు
వలిపంబు సరి గష్మితెలుపు దివ్యాంబ
రంబును నుదయరాగంబు దేవాంబ
రంబు పొత్తియు గుజరాష్ట్రంబుపట్టు
మొదలుగా నెఱుఁగమే మును దరతరమ
పదపడి మనవారు వడసినయట్టి
మానితవస్త్రవితానముల్ గలవు
గాని యావస్త్రసమానముల్ గావు

తథ్య మిట్టిద” యని దాసి సెప్పుడును
మిథ్యసేయక వేశ్య మిండనిఁ జూచి
నలి దలిర్పంగ నీవు నా తోడివలపు
గలవేని బసవయ్య కాంత గంగాంబ
కట్టినపుట్టంబుఁ గ్రక్కునఁ దెచ్చి
నెట్టనా నా కిమ్ము నేర్పు దల్పిర”
ననవుడు ‘నట్లకా” కనుచు మిండండు
సని కాంచి! బసవ “నీవనిత గంగాంబ
కట్టినపటువలిపుట్టంబు మాకు
నిట్టున్న భంగిన యిప్పింపవలయు”
ననవుడుఁ దనసతి స్నానసదన
మునకుఁ బిల్వంగఁబంచి ముద్దియఁ గదిసి
“పుట్టు సా వెఱుఁగనియట్టిమహాత్ముఁ
డిట్టలంబుగ నీదుపుట్ట మడ్గెడిని
పుట్ట మీవేగ మీపుట్ట మిచ్చినను
బుట్టము మన” మని యట్టిచందమున
లజ్జయు సిగ్గు దలంపక బసవఁ
డజ్జలజాక్షివ ల్వఱిముఱిఁ బట్టి
యొలువంగ నొలువంగ నొక్కవస్త్రంబు
దలితాంబుజానన మొలఁబాయకున్నఁ
గనుఁగొని యద్భుతాక్రాంతాత్ములైన
జనములఁ గనుఁగొని జంగమం బనియె

"గహనమే చూడ జగద్ధితసూత్ర
సహజవాహనులగు శంభుభక్తులకు
నలి నిడిగుడినయనా రను భక్తుఁ
డిల నాలిచీర లోల్పీఁడె భక్తులకుఁ
బంద్రెండువర్షముల్ వాయక నేసి
పంద్రెండుమూరల పసిఁడిపుట్టంబు
విపరీతగతిఁ దన్ను వేఁడుడు నొక్క
దపసికిఁ దేడరదాసయ్య యీఁడె
యది గాక బల్లహుం డఖిలంబు నెఱుఁగ
సదమలచిత్తుఁడై సతిని మున్నీఁడె?
యఱలేక రూపించి యడుగంగఁ దడవ
మఱి మొన్నయధరుండు మాణిక్య మీఁడె?
దండిమై మొన్నయధరుఁ డిమ్మడించి
మిండభక్తునకు నర్మిలి నర్థమీఁడె?
మహి నిడుగుడిని బెర్మాణి యఱగణము
గహనంపుదుర్భిక్ష కాలంబునందుఁ
జాటించి సకలార్థ సంపదల్ సంద్ర
జూటుభక్తుల కిలు చూఱవెట్టండె?
తనయపెండిలి సేయుతత్ప్రస్తవమునఁ
జనుదెంచి యొకతపోధనుఁడు వేఁడినను
నక్కాంత వెంద్రుక లప్పుడ కోసి
చక్కన మానకంజారుఁ డీఁడెట్టు?"

లనుచు గీటునఁబుచ్చుచును మిండగీఁడు
కినియునో తడవైనఁదనవేశ్యయనుచు
బసవని వారించి వసుధఁ బ్రోవైనఁ
బసిఁడిచెఱంగుల పట్టువస్త్రములు
మోపిడి తనమోవనోపి నన్నియును
నేపారఁ గొనివచ్చి యిచ్చె లంజియకు
"నిక్కంబు బసవని నిజభక్తిమహిమఁ
దక్కవగాదయ్యెఁ దరుణిమానంబు"
అని భక్తమండలి వినుతింపుచుండ
వనిత యంతర్వాసమున కేఁగె నంత.

## సూర్యాస్తమయ వర్ణనము

బసవనిభక్తి ప్రభాపటలంబు
దెసల వసుంధర దివి దీటుకొనఁగ
దినకరుఁ డాత్మీయతేజంబు దఱుఁగు
డునుమది లజ్జించి చని యపరాబ్ధిఁ
బడియెనో యన్నట్లు భానుండు గ్రుంకెఁ
జెడిమిత్రుఁ డరుగ రాజీవముల్ మొగిచె
భేరులు శంఖముల్ ఘోరనఁ జెలఁగె
మార సంహారు నాగారాంతరముల
నలరుచుఁ బంచమహాశబ్దరావ
ములుమ్రోసె భక్తసమూహాలయముల
ఘనధూపధూమసంజనితమేఘములు

సెనసి కప్పినమాడ్కిఁ జీకటుల్ వర్వె
వరముక్తిసతి బసవనికి నారతులు
పరువడి నెత్తు దీపంబులో యనఁగ
నక్షత్రచయ మంతరిక్షంబు నిండి
యక్షీణతరకాంతి యసలార వెలిఁగెఁ
జంద్రునిచేటు దైత్యేంద్రునిపాటు
నింద్రునిభంగంబు నెఱిఁగి యొఱంగి
గొఱయ ముచ్చిలి శూద్రకుండను రాజు
నఱుకు వడుటతొల్లి యెఱిఁగి యొఱంగి
జారులఁ జోరులఁ జర్చించుకవుల
భూరివివేకంబుఁ బొగడంగ నేల?
యనఁగ సంధ్యావేళయందు సద్భక్త
జనులు లింగార్చనల్ సలుపంగ నంత
మిండజంగమకోటి నిండారుభక్తి
దండనాయకుఁ డంపఁ దండతండములు
ఘనసారతాంబూలగంధప్రసూన
వినుతాభరణవస్త్ర వితతులు గొనుచుఁ
గరమర్థి లంజెఱికంబు సేయంగ
నరిగెద మేమంచు ననురక్తి నరుగ

### ముగ్ధ సంగయ్యకథ

లింగసర్వేంద్రియలీనుండు ముగ్ధ
సంగయ్య నానొక్క శరణుఁ డీక్షించి

భక్తి ననుచువాఁడు బసవభండారి
వ్యక్త మిట్లే గెడు వా ర్జంగమములు
కొనిపోవునవి గంధకుసుమకర్పూర
వినుత తాంబూలాదివితతు లట్లయ్యెఁ
జను నిది లింగావసరవేళ యున్న
పనులకు నేఁగెడు పగిది గా" దనుచు
నదియును నొక్కలింగార్చన గాఁగ
మది నిశ్చయించి సమ్మదము దుల్కాడఁ
గలనైన లంజెటికం బనునట్టి
పలు కెఱుంగమిఁ జేసి బసవయ్యఁ జూచి
"యేనును బోదునా యీయయ్యగాండ్ర
తోన లంజెటికంబు మానుగాఁ జేయ"
ననవుడు గించిత్ప్రహసితాస్యుఁ డగుచుఁ
"జను జియ్య! నాముగ్ధసంగయ్యదేవ!"
యని గారవింపుచు నాయయ్య కపుడుఁ
గనుఁగొన సహజశృంగారంబు సేసిఁ
పరిచారకులఁ బిల్చి పటుభక్తి గల్గు
తరుణియింటికిఁ బంపఁ దత్సతిఁ జూచి
"గణుతింపఁ బ్రమథలోకంబుకన్యకయో?
గణిక సాక్షాద్రుద్రగణికయో? తలఁపఁ
జిత్తరురూపమో? చెలువయో పసిఁడి
పుత్తడియో" నాఁగఁ బొలఁతి యేతెంచి

ముగ్ధమిండనిపాదములమీఁద బడి వి
దగ్ధ మిండెత సముద్యద్భక్తి మెఱసి
పడిగంబు వెట్టించి పాదముల్ గడిగి
కడువేడ్కఁ బాదోదకంబు సేవించి
ప్రీతియొలర్ప విభూతివీడియము
లాతన్కి దాన సమర్పణ సేసి
యనుపవచ్చినవార లరుగ మిండనికిఁ
దనహస్త మిచ్చి తోడ్కొని పోవునెడను
స్ఫాటికసోపానపంక్తి నొప్పారు
హాటకకుట్టిమహార్మ్యస్థలమునఁ
గలయంగఁ గస్తూరికలయంపి మీఁద
వెలుఁగు ముక్తాఫలంబులమ్రుగ్గు లమరఁ
గంభకట్లను మేలుకట్లను బోలుచు
గంభీరపుష్పకాగారంబునందు
మహీతలంబితరత్నమాలికానిచయ
బహుమణిదీపవిభ్రమకాంతి వర్వ
మించి వెల్గెడుపట్టెమంచంబు పుష్ప
సంచితంబగు నండజముపాన్పు దనర
వివిధసౌరభసుఖాన్విత మగుమంద
పవనంబు జాలకపంక్తిఁ దన్పార
శ్రీరుద్రవరదివ్య సింహాసనంబో ?
గౌరీమనోహరు చారుపుష్పకమొ ?

గంగావతంసుని శృంగారగృహమొ ?
యంగజవిజయుని యనుఁగుమంటపమొ ?
యన నతిరమణీయమగు సజ్జఁ ట్టుఁ
గని మిండఁ డద్భుతాక్రాంతాత్ముఁ డగుచు
నదియును నాతి లింగార్చనసేయు
సదనంబుగాఁ దనమదిలోనఁ దలఁచి
యుత్తుంగసింహాసనోపమంబైన
యత్తన్వీచారు పర్యంకంబు డిగువ
నవనిపైఁ గంబళి యాసనంబుగను
శివసమారాధన సేయఁ గూర్చుండి
భూతి సర్వాంగముల్ పూయుచో నతఁడు
"భూతిపూయవదేమి వాలఁతి నీ"వనిన
"నిచ్చెఁ బార్వతి పూయుపచ్చవిభూతి
యిచ్చె నొక్కయ్య నా కీముసిమూపు
పూసితి సర్వాంగములఁ జూడు" మనుచు
భాసురంబగు మేనిపసుపుఁ జూపుడును
వలయుచో రుద్రాక్షములు ధరింపుచును
"లలన! రుద్రాక్షముల్ దాల్పవే" యనినఁ
"గడుఁ గందు లవణసాగరతీరమునను
బొడమిన రుద్రాక్షములు సహింపమిని
దెల్లంబు క్షీరాబ్ధితీరమం దుండు
తెల్లరుద్రాక్షముల్ దెచ్చె నొక్కయ్య

యొప్పుడుఁ దాల్ప నున్నెక్కిన" వనుచు
నప్పాత్రి ముత్యాలహారముల్ సూప
నక్కజం డగుచు ముత్యాలసూసకము
ముక్కునఁ దాల్చిన ముత్యంబుఁ జూచి
"యుత్తమాంగంబున నువిద! రుద్రాక్ష
లుత్తమంబయ్యెఁ బో క్రొత్త మూ కిదియు
నెక్కడ వినఁబడ దిట్లు రుద్రాక్ష
ముక్కునఁ దాల్చినముఖ్యమే?" యనిన
"దేవ! యేమని చెప్ప? దేవుఁడే యెఱుఁగు
నావిశేషంబు వేదాతీత" యనుఁడు
నురుజటావలి విచ్చి యొత్తిచుట్టుచును
"దరళాక్షి! జడ లేల తాల్ప వీ" వనిన
సగము ప్రసాదపుష్పములకు నునిచి
సగమునఁ దాల్చితి సన్నంపుజడలు
సన్నుతతద్భస్మసమ్మిశ్రమగుచు
వెన్నున నిదె చూడు వ్రేలెడి" ననుచు
పటుగళాభరణసంఘటితమై యొప్పు
పటవలికుచ్చులు వడఁతి సూపుడును
"భువి నిట్టిభక్తురాలవు గచ్ఛడంబు
ధవళాక్షి! మఱి యేల తాల్ప వీ" వనిన
'లింగవంతులు గాని లెంకల దృష్టి
నంగిగా నాపయిఁ బాఱకయుండఁ

గట్టితి సర్వాంగకచ్ఛడం" బనుచుఁ
గట్టిన సమకట్టుఁ గాంత సూపుడును
వనిత యపూర్వలాంఛనధారిగాఁగ
మనమునఁ దలపోసి మహిఁ జాఁగి మ్రొక్కి
"యిట్టిలాంఛనకున కేశ్వ రాచార్య?
లెట్టివి నియమంబు? లెట్టిది సర్య?
తరుణి! మీగురుసంప్రదాయంబు వారు
ధరణి నేతావునఁ దపము సేయుదురు?
సంతతంబును నేరి సద్గోష్ఠి నుందు
రింతయుఁ జెప్వు మాకేర్పడ" ననిన
"నాగమనిగమోక్తి నవ్వామదేవ
యోగిచే శివదీక్ష యొప్పంగఁ బడసి
కైలాసమునఁ దపోవేళ మెప్పించి
శూలిచేఁ బడసె ము న్నీలాంఛనంబు
అది గారణముగఁ బూర్వాచార్యరాలు
సదమలాత్మక హిమశైలతనూజ
శ్రీనందనునిఁ గెల్చి శివుని మెప్పించి
మేన నర్ధము గొన్న మెఱతవర్గంబు,
జగములన్నియుఁ దనశక్తిఁ బాలించు
జగదేకసుందరి సంతతి మేము,
శివరహస్యాదిప్రసిద్ధశాస్త్రములు
శివునిచేఁ బడసిన చెలువశిష్యలము,

ఆకాంక్షతోడ జన్నావులపాలు
సేకొని యష్టావశేషంబు సేసి
చెఱకుకట్టెలపాడి సేరెఁడు సల్లి
మఱి యిష్టలింగసమర్పణ సేసి
తప్పక యీప్రసాదం బింతగొందు
మెప్పాటఁ గలనైన నెఱుఁగ మోగిరము
గలిగనే వెండియుఁ గందమూలాది
ఫలపత్రశాకముల్ భక్తు లిచ్చినను
స్వామి కర్పించి ప్రసాదంబు గొందు
మేమని చెప్పుదు మీతపశ్చరణ ?
తనువును మనమును ధనమును విడిచి
ఘనికులై రసికులై మగ్నులై గోష్ఠి
తవులంబు గలిగినతజ్జంగమాను
భవమందు నెప్పుడుఁ బాయకుండుదుము
అనఘ! త్రికాలలింగార్చన మీఁది
పనులు దక్కఁగ లేవు బగళులు రేలు
గతి మాకు వేఱొండు గలదె జంగమకు
గతి మనోవాక్కాయకర్మంబులందు
ఇట్టిది గురుమార్గ మిది నిజవ్రతము
ఇట్టిది సారిత్ర మిది లాంఛనంబు
తలఁప మాగురుసంప్రదాయంబువారు
గలరు శ్రీగిరి యాదిగా నెల్లయెడల

నధిప! సాక్షాజ్జగదంబాసమాన
లధికంబు గలరు దక్షారామమునను”
అని సమంచితవిదగ్ధాలాపములను
వినుపింప నాయయ్య విస్మితుండగుచుఁ
జెలువ పర్యంకంబు సింహాసనముగఁ
దలఁచి గంధద్రవ్యతాంబూలవితతి
యొడఁబడ నంత నొండొండు శోధించి
“పడఁతక్ష్యపణ్యముల్ వట్టు”నావుడును
“దనరఁగ నీయయ్య మనసు వచ్చుటయుఁ
గనుఁగొనవా నేర్పుకలిమిగా”కనుచు
హాసనంబు దళుకొత్త నక్ష్యపణ్యములు
పసిఁడిబిందెలఁ బట్టి పడిగము ల్వెట్టి
గ్రక్కున సకలోపకరణంబు లోలిఁ
జక్కొల్పి యమ్ముగ్ధసంగయ్య కలరఁ
గరమొప్ప గంటలుఁ గాంస్యతాళములు
నరుదొంద మ్రోయ ధూపానంతరంబు
దెలివ యుదంచిత దృగ్దీధితులను
నతిలిహారంబుల యంశుజాలములఁ
బొలుపగు కంకణస్ఫురితరోచులను
మిళితమై కన్నులు మిఱుమిట్లు గొనఁగ
వెలుఁగు నీరాజనంబులపళ్లెరముల
నలర నందిచ్చునయ్యవసరంబునను

## చంద్రోదయ వర్ణనము

"మలసంహారుఁడు జటామకుటంబు మీఁద
నిలిపియు నాకందు నెఱిఁ బుచ్చలేఁడు
భక్తులపాదసంస్పర్శనంబునను
వ్యక్తిగా నిర్మలత్వంబుఁ బొందుదును"
అనియాత్మఁ దలపోసి యరుదెంచుమాడ్కి
వనజారిప్రాఙ్ముఖంబున నుదయించె
బసవనిసితకీర్తి వర్వెనా, శివుని
భసితాంగరాగప్రభలు వర్వెనాఁగ,
నారుద్రునట్టహాసాంశులు దనరె
నా, రజతాచలచారుదీధితులు
విలసిల్లెనా, నభోవీథి నెల్లెడల
నెలకొని యచ్చవెన్నెల వెల్లివిరియ
నక్కాంత ముగ్ధసంగయ్యకుఁ బ్రీతి
నెక్కొని యాత్మలో నివ్వటిలంగ
ననయంబు లింగపూజవల నటించు
తనదువిలాసినీజనుల రావించి
"యక్కమహాదేవి! యల్లమద్దెలలు
సక్కొల్పి వేగంబ సంధించుకొనుము
స్వరమానమున బసవప్రమథవ్వ!
కరమర్థిఁ బట్టుము కామాళ లోలి,
సకళవ్వ! నీవును సంగళవ్వయును

వొకరీతి నిలువుఁడు సుకరంబుగాఁగ,
బాలరుద్రమ! యొత్తుపట్టఁగ వాసె
గ్రోలు వాయింపుము! గుడ్డవ్వ! నీవు
సిట్టితాళము పట్టు శివదేవి! నీవు
సట్టిన నృత్యంబు సరసం బెఱింగి,
సంగుదాసమ! మహేశ్వరి! వీరభద్ర
లింగవ్వ! మీరు గేళికలు సేయుండు,
రమణాదుకూలాంబరమును గంచుకము
నమరించికొని చల్లడము బిగియించి
యేతెమ్ము నీవు పురాతమ్మ! శీఘ్ర
మూతతెమ్ముగ నృత్యమాడుదు గాని
తాళము ల్వాట్టుఁడు దాళగింపుండు
నాళతివేళకు నందఱు! ననుచు
నవిరళంబుగ నంత నార్భటం బిచ్చి
జవనిక రప్పించి సరసమై నిలిచి
పొలుపగుముఖరసంబును సౌష్ఠవమ్ము
లలియు భావంబు ధూకళియు ఝుంకళియు
మఱియు రేవయు విభ్రమమును రేఖయును
నెఱయంగ నీరీతి నృత్యంబు సలుప
లింగార్చనంబు సల్లీలఁ జేయుచును
మంగళారవములు సంగడి నులియ
వెల్లవేగుడు స్వచిత్తోల్లాస మమర

సల్లీల నమ్ముగ్ధసంగయ్య కిట్టు
లంగన పరిచర్య లాచరింపంగ
లింగావసరము సెల్లించునంతటను
నాగి మనోహరుని పాదోదకసేవ
నగణితలీల దివ్యాంగుండ నైతి
నఖిలమాహేశసదుగ్రప్రసాద
సుఖసేవ నా కింకఁ జొప్పడు నేని
నిలుకాల నిలువంగనేరక తిరుగు
నలమట వాయుఁ బొమ్మని తలపోసి
వచ్చినమాడ్కి దివాకరుం డంతఁ
జెచ్చెర నుదయాద్రిశిఖర మెక్కుడును
బసవనియాత్మ కింపెసఁగ మిండండు
వెస నేఁగుదెంచి తా వెండి యిట్లనియె
“బసవ! యేమని చెప్ప భర్గుఁడే యెఱుఁగు
నెసఁగ లంజెఱిక మే నీరాత్రి సేఁత
నీవును మాతోడ రావైతి గాని
వేవునంతకు నొక్కవిధమైనసుఖము
ఐనను లంజెఱ్క మచ్చోటఁ జేయు
చో నిన్నుఁ దలఁచితిఁ జుమ్మయ్య బసవ!
పుట్టితిఁగాని ము న్నిట్టి సుఖంబు
నిట్టిలంజెఱికంబు నెఱుఁగ నెన్నఁడును
మలహరుకృపలేని మత్తికాండ్రకును

గలుగునే లంజెతికం బిట్లు నేయఁ
బగలు రాత్రియు నెడఁబడక లంజెతిక
మొగి నెన్నియుగములి ట్లొప్పఁగఁ జేసి
పడసితి చెప్పుమా పరమేశుచేతఁ
గడునొప్పు లింగజంగమసంపదలను
సడిపన్న శివభక్తి సౌభాగ్యమహిమ
లొడఁగూడునే వెండి యొండుమార్గమున
నాకును నీకారణమునఁ గాఁ జేసి
చేకూరె నిట్టిలంజెతిక యీరాత్రి
బండారి! నీయాన పసిబిడ్డనాఁట
నుండియు శ్రీగిరి నుండుదు నచట
ననుపమకదళివనాంతరబిల్వ
వనముల నేకాంతవాసంబునందుఁ
బన్నుగా నఱకాలఁ గన్నును నొసలఁ
గన్నును గలమహాగణములు గలరు
చూతుము గాని యెచ్చోట ము న్నిట్టి
భూతిశాసనధారిఁ బొడగాన మేము
పొలుపగు పచ్చవిభూతిపూఁతయును
దెలుపగు రుద్రాక్షములు నెఱ్ఱజడలు
నంతకుఁ దగినసర్వాంగకచ్చడము
వింతయై యున్నది యింతివేషంబు
నిట్టిలాంఛనదారి నిట్టివిరాగి

నిట్టినిష్ఠాశాలి నేమనవచ్చు
నింతి నొక్కతెఁ జెప్పనేల తత్సతికి
సంతతంబును బరిచర్యలు సేయు
లలనలందఱు నిట్టిలాంఛనధరులు
చెలువలమహిమంబు శివుఁడె యెఱుంగు”
ననుచుఁ దత్సతుల లాంఛనములు నచటి
తనమిండతనమును దప్పక చెప్పఁ
బలుమాఱు నడుగుచు నలి జంగములు
సెలఁగుచు నొండొరుఁ జేవ్రేసినవ్వ
బసవం డసమసముల్లసనుఁడై చెన్న
బసవని దెసఁ జూచి పసరింపఁ దొడఁగె
“నిట్టి నెట్టణభక్తి యిట్టిముగ్ధత్వ
మిట్టిమహత్త్వంబు నెందును గలదె?
నిక్క మీశ్వరుఁగాని నిజ మెఱుంగమిని
ముక్కంటిభక్తులు ముగ్ధలు గారె?”
యని ప్రశంసింపంగ నా చెన్నబసవఁ
డనురక్తి ముకుళితహస్తుఁడై మ్రొక్కి
“పరగు నీనూతనప్రాక్తనభక్త
వరగణంబులలోన వచియింపఁ జూప
నిల నిట్టి ముగ్ధలు గలరొకో?” యనుచు
నలి దీటుకొనఁగ విన్నపము సేయుడును
బరమానురాగసంపదఁ దేలి సోలి

కరమర్థి మఱిముగ్ధగణముల కథలు
పసరింపఁ దలఁచి సద్భక్తి బండారి
బసవయ్య యాచెన్నబసవని కనియె.

రుద్రపశుపతి కథ

సద్భక్తం బెఱుంగవే యయ్యళయూర
భక్తుండు మును రుద్రపశుపతి నాఁగఁ
బ్రథితమౌ నాకిపురాణమం దబ్ధి
మథనావసర మొక్క కథకుండు సమువఁ
గమలజ కమలాక్షు లమితదైత్యాదు
లమరులు సెడి పాఱ నం దుద్భవించి
పొరి నజాండములెల్ల దరికొని కాల్చు
గరళంబు మ్రింగె శ్రీకఱకంఠుఁ డనిన
నారుద్రపశుపతి యాలించి భర్గుఁ
డారగించుట నిక్కమా విషం? బనుడు
'ననుమానమా! త్రావె హరుఁడు విషంబు
బనుగొన నటమీఁదిపను లెఱుంగమన
విని యుల్కిపడి వీఁపువిఱిగి "హా! చెడితి"
నని నేలఁబడి పొర్లి యక్కటా! నిన్ను
వెఱ్ఱిఁ జేసిరిగాక! విశ్వేశ! యెట్టి
వెఱ్ఱివా రైనను విషముఁ ద్రావుదురె?
బ్రదుకుదురె? విషమ్ముపాలైన వార?
లిది యెట్లు వినవచ్చు' నేమి సేయుదును?

నిక్క మెవ్విధమున నిన్నెకా కెఱుఁగ
ముక్కంటి! నా కింక దిక్కెవ్వరయ్య?
నాకొఱకైన బినాకి! యివ్విషము
చేకొన కుమియవే నీకు మ్రొక్కెదను
గటకటా! మేన సగంబున నుండి
యెట వోయితవ్వ! నీ వెఱుఁగవే గౌరి!
ప్రమథగణములార! పరమాప్తులార!
సమసిన వెండి మీకాశక్యమే కావ?
శతరుద్రులార! యసంఖ్యాతులార!
క్షితిధరకన్యకాపతిఁ గావరయ్య!
వీరభద్రయ్యరో! విషముఁ బ్రాణేశుఁ
డారగించె నిఁ కెట్టు లవునోకదయ్య!
యోపురాతనులార! యొడయండు బ్రదుక
నోపు నొకో! విషం బోగి నారగించెఁ
జావు దప్పింపరే సద్గురునాథు
దీవన లీయరే కావరే శివునిఁ
దల్లి లేని ప్రజలఁ దలఁతురే యొరులు
తల్లి యున్న విషముఁ ద్రావ నేలిచ్చు!
పరమేశుఁ డీబారి బ్రదికె నేనియును
మరణంబు లేదువో మఱి యెన్నఁటికిని!
యని ప్రలాపింపుచుఁ బసవుచు నొండు
వినఁజాలఁ బ్రాణము ల్విడుతు నే ననుచుఁ

బడయక ఘనజలాంతరమున నుఱుకఁ
బడకుండ నారుద్రపశుపతిఁ బట్టి
పార్వతీసహితుఁడై ప్రమథరుద్రాది
సర్వసురాసురసంఘంబు గొలువ
హరుఁడు ప్రత్యక్షమై "యడుగుము నీకు
వరమిత్తు నెయ్యది వాంఛితం"బనుడుఁ
గడుసంభ్రమంబున మృడుపదాబ్జములఁ
బడి రుద్రపశుపతిభట్టారకుండు
"ఏమియు నే నొల్ల నీవిషసేవ
నేమేమి పుట్టునో యే వినఁజాల
గ్రక్కున నుమియవే కాలకూటంబు
నిక్కంబు నాకెక్కె నీయాన"యనిన
దశనకాంతులు దశదిశలఁ బర్వంగఁ
బశుపతి యారుద్రపశుపతి కనియె
"యిట లోకములలోన నెన్న నే కాక
యట మ్రింగ నుమియంగ నది యెంత పెద్ద
యణుమాత్ర నాకంఠమందుఁ జిక్కినది
గణుతింప నున్నదే కాలకూటంబు
ఇంత సంతాపింప నేల నీ"కనుచు
చింతన వ్యాలయంగ సంతరించుడును
"నమ్మంగఁ జాలఁ బినాక! యివ్విషము
గ్రమ్మన నొక్కింత గడుపు సొచ్చినను

శౌద్ధయుఁ బుట్టునో పిమ్మటివార్త
దద్దయు విన నోపఁ దా మున్న చత్తు
సమయని మ్మొండేనిఁ జావనీవేని
యామియు మివ్విష మొండె నొండు నెప్పకుము
తక్కినమాటలు దన కింప" వనుచు
నిక్కంబు తెగువమై నిష్ఠించి పలుక
'సమియకుండినఁ జచ్చునో ముగ్ధ'యనుచు
సమ బోటి యాత్మలో నుత్తలపడఁగ
"సమిసినఁ గాని కాల్చునో తమ్ము"ననుచుఁ
గపలాతిముఖ్యులు గడగడ వడఁకఁ
బ్రమథు లాతనిముగ్ధభక్తికి మెచ్చి
యమితమహోత్సవులై చూచుచుండ
నొక్కింత నవ్వుచు నుడురాజధరుఁడు
గ్రక్కున లేనెత్తి కౌఁగిటఁ జేర్చి
ప్రమథులయాన నీపాదంబులాన
సమయ నివ్విషమున సత్య మిట్లనిన
నమ్మవే వలపలినాతోడ యెక్క
నెమ్మిఁ జూచుచునుండు నీలకంఠంబు"
నని యూరుపీఠంబునందు ధరించె
మును గుటియున్న దే ముగ్ధత్వమునకు
నది గాక కుత్తుక హాలాహలంబు
కదలినంతటనె చచ్చెదఁగాక! యనుచుఁ

దనకరవాలు ఱొమ్మున దూసి మోపి
కొని కుత్తుకయు చూచుచును తెప్ప లిడక
పశుపతితోడ మీఁదఁ బాయక రుద్ర
పశుపతి నేఁడును బాయకున్నాఁడు.

### నక్కనైనారు కథ

ఇల నొప్పుచోళమండలమున మఱియు
నలి నీలనక్కనైనా రనుగణము
ఉవిదయుఁ దాను శివలింగపూజ
సవినయప్రీతిమైఁ జలుపు చున్నెడను
శివదేవుపై నొక్కసాలెఁడి వ్రాలుడును
"శివశివ! ప్రేలునో శివునకు" ననుచు
నావార్తి యప్పుడ తూఁపొడ్వఁ దడవఁ
గోపించి యాతఁడు గొంతి కిట్లనియె
"పాపికా! బ్రమసితే ప్రాణవల్లభునిఁ
దూఁపొడ్వఁగూడునే తుంపురు ల్నిండ
నిటుగాని నీభక్తి యెఱుఁగంగరాదె!
యెటయేనిఁ బొమ్ము నిన్నేనొల్ల" ననుచు
వెడలంగ నడిచి యవ్విభుఁడు దా రాత్రి
మృదు నర్చనము సేయునెడ లింగమందు
నక్కాంత దూఁపొడ్చు చక్కటిఁ దక్కఁ
దక్కెల్లఁ బ్రేలిన నక్కజంబంది
పతి వేగ సతివెంటఁ బాఱి పాదముల

కలితభక్తియుక్తి సాష్టాంగుఁడై మ్రొక్కి
"పాపి! పో"మ్మని నన్నుఁ బలిపినయట్టి
పాపంబు సైరింపు పటుభక్తినిరత
నీవు దూపాడిచినరావు దక్కంగ
దేవునిమేనెల్లఁ జూపె ప్రేలినది.
యీదిక్కు దూపాడ్చి యీసంకటంబు
నాదేవునకు మాన్పవే దయతోడ"
ననుచు వెండియు మ్రొక్క సంగన వచ్చి
తనపతి ప్రాణేశుతనువున నున్న
పొక్కులు వాడఁగని పురపురఁ బొక్కి
యక్కటా! యీపొక్కు లణఁగునే యింకఁ
బెనిమిటి దన్నుఁ జంపినఁ జంపనిమ్ము
అనుచుఁ దూపాడువ కే నరిగితి నపుడు
కాన నాతప్పునఁ గాఁజేసి శివుని
మేనఁ బొక్కులు గడు విక్కుటం బయ్యెఁ
బోవవే మున్ను దూపాడిచినచోట
నీవలెఁ బొక్కు, లింకెన్నియు నేల ?
నానిమిత్తమునఁ బినాకి కిట్లయ్యె
నీవిరోధం బింక నేఁ జూడఁజాల
ననుచుఁ బరిచ్ఛేదియై భక్తురాలు
దనశిరంబున కల్లఁ దత్ప్రి స్తవమునఁ
దెలిపె ముగ్ధత్వంబు దేటతెల్లముగ

మెఱయింతుఁ బొమ్మని మెచ్చి యత్క్షణము
భవరోగవైద్యుఁడు పార్వతీకాంతుఁ
డవినాశుఁ డజుఁడు ప్రత్యక్షమై నిలిచి
ప్రమథులురుద్రులు బ్రహ్మాచ్యుతేంద్రు
లమరసంఘము యథాక్రమమునఁగొలువఁ
గరుణానిరీక్షణస్ఫురితసుధాబ్ధి
నిరువుర నోలార్చి యీప్సితార్థములు
వేఁడుఁడిచ్చెద"నన వెలఁదియుఁబతియుఁ
బోఁడిగాసర్వాంగములుఁబొంద మ్రొక్కి
'దేవ! దేవాధీశ! దివ్యలింగాంగ!
నీవు ప్రత్యక్షమై నిలిచినమీఁద
వెండియు మఱి యొండు వేఁడెద మనుట
యొండేమి? యదియుని న్నొల్లమిగాదె!
కావున మీపాదకమలాంతరంగ
భావసంపూర్ణసంపద కృపసేయు'
మని విన్నవించుడు నతివకుఁ బతికి
ననుపమపరమపరానందమూర్తి
ముఖ్యాపవర్గసముదితోపభోగ
సౌఖ్యమ్మునపుడు ప్రసాదించె శివుఁడు

బెజ్జమహాదేవి కథ

మఱియును విను బెజ్జమహాదేవి యనఁగఁ
గఱకంఠ శ్రీపాదకమలాంతరంగ

"యెల్లని యోగంబు లెల్ల బాంధవులు
నెల్లవారలు గల్గ నిట్లు భర్గునకుఁ
దల్లి లేకుండుట దా విచిత్రంబు
దల్లి లేఁ డది యెట్లు దా నుదయించె?
దల్లి సచ్చెనొ కాక త్రైలోక్యపతికిఁ
జెల్లఁబో! యి ట్లేమి సేయంగవచ్చుఁ?
దల్లి సచ్చినఁ గాదె తాను డస్సితిని
యెల్లవారికి దుఃఖ మిట్టిద కాదె
తల్లి గల్గిన నేల తపసి గానిచ్చుఁ
దల్లి గల్గిన నేల తల జడల్గట్టు?
దల్లియున్న విషంబుఁ ద్రావ నేలిచ్చుఁ?
దల్లియుండినఁ దోళ్లు దాల్ప నేలిచ్చుఁ?
దల్లి పాముల నేల ధరియింప నిచ్చుఁ?
దల్లి బూడిద యేల తాఁబూయ నిచ్చుఁ?
దల్లి వుచ్చునె భువిఁ దనయునిఁ దిరియఁ?
దల్లి వుచ్చునె మృతు వల్లకాటికిని
దల్లి లేకుండినతనయుండు గాన
ప్రల్లదుఁడై యిన్నివాట్లకు వచ్చెఁ
జన్నిచ్చి పలుమాఱు వెన్నయుఁ బెట్టి
పన్నుగా నిన్నియుఁ బాలును బోసి
యాకొనఁగాఁ గడు పరసి పాలిచ్చి
సాఁకించి పెంపదే జనని గల్గినను

దా నింతవాఁడయ్యెఁ దల్లి లేకయును
దా నెంత యెఱుఁగునో తల్లి గల్గినను?
బెండిండ్ల నోములఁ బేరంటములను
బండువుదినములఁ బాటిజాతరలఁ
దగినపోఁడిమి సేయుతల్లి లేకున్న
వగవరే మఱి యెట్టినగబిడ్డలైన
నూర కుపేక్షించి యుండంగఁ దగునె?
యారంగఁ దల్లినై హరుని నేనైన
నరసెదఁగాక, యి ట్లఱలేక పెనుచు
తరుణియుకా దెట్లు దల్లి దా" ననుచు
ననయంబు బెజ్జమహాదేవి దాన
జననియై పరమేశుఁ దనయుఁ గావించి
తొంగిళ్లపై నిడి లింగమూర్తికిని
నంగన గావించు నభ్యంజనంబు
ముక్కొత్తుఁ జెక్కొత్తు ముక్కన్నుఁ బులుము
నక్కొత్తుఁ గడుపొత్తు నటవీఁపు నివురుఁ
బెరుఁగంగవలె నని తరుణి వీడ్వడఁగఁ
జరణము ల్కరములుఁ జాఁగంగఁ దిగుచు
నలుఁగులు నలుచు నర్మిలి గట్టిపెట్టి
జలములు వీఁపునఁ జఱచు నంతంత
వెగచి బెగడకుండ వెన్నువ్రేయుచును
నొగి మస్తకమున సిరొత్తు దోయిటను

వదనంబు సొచ్చునో యుదకంబు లనుచు
నదుముఁ బొట్టను నోరికడ్డంబువట్టుఁ
జెన్నుగాఁ బసుపార్చి చేయు మజ్జనము
గన్నులుఁ జెవులును గాఁడంగనూఁదు
నంగిటిము ల్లొత్తు కందంద వ్రేల
దొంగిళ్ళఁ గార్నీరు దోనెత్తి మిడుచు
బడఁతిచే నీరఁ దూఁపొడిచి బొట్టిడును
మడఁది యంగుష్ఠంబుమున్నింత మెదిచి
కడవ నంటినమట్టి పిడుకవిభూతి
యడరఁ బుత్త్రుని నొసలారంగఁ బూయు
నెత్తు గ్రుంగెడు నని యొత్తంగ వెఱచి
యుత్తన్వి ఱొమ్మున నక్కున నదుము
కాటుక యిడనింత గన్నగు ననుచుఁ
గాటుకయిడు మూఁడుగన్నులఁ గలయఁ
జన్నిచ్చుఁ బత్తులఁ జననీదు మీఁద
నన్నాతి గొండొక వెన్నయుఁ బెట్టుఁ
జెక్కిలి గీఁటుడుఁ జెలఁగి యేక్వంగ
నొక్కవే లిడి పోయు నొకకొన్నివాలు
ఉగ్గులు వోసియు నువిద సంప్రీతి
నగ్గించు నొగియించు నట బుజ్జగించు
ముద్దాడు నగియించు ముద్దులు వేఁడు
నద్దిరొ వీ రెవ్వ రయ్యరో యనుచుఁ

బన్నుగా నుదరంబుఁ బొన్నుగాఁ జేసి
కున్న జోసలఱచుచు సన్నుతిఁ బాడుఁ”
గొడుకని యుబ్బంగిఁ గొనియాడుచుండఁ
బడఁతి నిశ్చలముగ్ధభావంబునకును
శివుఁడును మెచ్చి తాఁ జేకొనియుండె
సువిదగావించు బాలోక్యపచారములు
శ్రుతి “యేకయేవహి రూపేణ”యనియు
స్మృతి “సాధకస్సంస్మరేత్సదా”యనియు
ధర “తస్య తన్మయతాంయాతి” యనియు
హరునివాక్యము గాన యది యేలతప్పు
భక్తు డెబ్భంగిగా భావించు శివుఁడు
వ్యక్తిగాఁ దద్రూపుఁడై యుండు టరుదె?
యని భక్తమండలి వినుతింపఁ గొన్ని
దినములు సనఁగ నద్దేవదేవుండు
వెండి యమ్మకుఁ బ్రసన్నుండు గాఁ దలఁచి
దండిరోగంబైన తలుచంటి క్రియను
జన్నును గుడువక సంధిల్ల నోరు
వెన్నకుఁ దెఱవక యున్న యతఁడు
బి ట్టుక్కపడి తల్లి బిమ్మిటి నొడలుఁ
బట్టలే కాపద గిట్టి “నాయన్న!
నాకున్న! నాపట్టి! నాచిన్నవడుగ!
నాకుట్టి? చన్నేలరా కుక్షవైతి

నీచెమటయుఁ జూచి నెత్తురనవుదు
నోచెల్ల! యెటు సూడనోపుదునన్న!
తల్లిఁగదన్న! యింతటి కోర్తునన్న!
యెల్లెడ నొరుల నే నెఱుఁగఁగదన్న!
కలిగితి లేక యొక్కఁడవు గదన్న!
తలరక యే నెట్లు దరియింతునన్న!
నేలపై నాకాళ్లు నిలుకవుగన్న!
యేల పల్కవు సెప్పవే యన్న! నీకు
నఱిమిదెయో? కోపదెయో? యంగిటిముల్లో!
యెఱుఁగనుమందు మ్రాఁకేమియుఁ" ననుచుఁ
బసవుఁ బలవరించుఁ బయి బడి పొరలుఁ
గనుఁగొను మైవుడుక్కఁ గౌఁగిటఁ జేర్చుఁ
గప్పుఁ దెఱచుఁ గప్పుఁ గ్రమ్మఱఁ దెఱచుఁ
దప్పక వీక్షించుఁ దల్లడం బందుఁ
బొంగెడుఁగడుపుముప్పానకు 'బొప్పనికి
నంగిటిముల్లయ్యె' నని నరుఁ డనఁగ
నడలుచుఁ గడుశోకజడధి దేలుచును
బసఁతి పుత్త్రుం డున్న భావంబుఁ జూచి
కడుపు వెలితియైన నొడయనంబికిని
నెడవోయి యచ్చటఁ గుఱువ లేకున్నఁ
గునియుచుఁ గుమ్మరగుండయ్య వాద్య
మున కాడి యచ్చటఁ గొనఁ దిన లేక

వచ్చి చేరమచక్రవర్తి వాయింప
నచ్చెరువుగ నాడి యాఁకట బడలి
‘వెడయాట లివియెల్ల వేఁగి యాడినను
గడుపు నిండునె’ యని గ్రక్కున వచ్చి
పిట్టవ్వకై రాచవెట్టికిఁ బోయి
యొట్టకేలకు నింతపిట్టారగించి
సామవేదులయింటఁ జచ్చినపెయ్యఁ
బ్రేమంబుతో వండి పెట్టంగఁ గుడిచి
కామింపఁగాఁ గరికాళవ్వయింట
మామిడిపండులు మఱుఁగున నమలి
పోయి చెన్నయయింటిఁబులియంబకళముఁ
జేయుఁ దీయక జుర్రి చిఱుతొండనంబి
కొడుకుమాంసము వేఁడికొని విందుసేసి
యొడపక నిమ్మవ్వయింట భుజించి
యారగింపఁగఁ జవిదైనఁ జోడవ్వ
కోరతో నిచ్చినఁ గొని యారగించి
యాసక్తి సురియచౌడయ్య చేకళ్లి
కాసించి తఁట వెండి యంతటఁ బోక
నిన్న నింతయు నొక్కనెలఁతుక సెప్పెఁ
గున్న! యాఱడిపుచ్చఁగూడునే నన్ను
మలమల మఱుగుచు నిల నాడనేల
కొలఁదిదప్పినకుడ్పు గుడువంగ నేల?

బ్రదుకున్నదే యిట్లు వైకుప్పలందు
నది యేల కడుపూఁదదయ్యెడుఁ జెపుమ.
చన్నిత్తుఁ బలుమాఱు వెన్నయుఁ బాలు
నెన్నఁడుఁ దప్పింప నెంద్రైనఁ దెత్తుఁ
గుడుపు నీకెయిదదే కొడుక యిట్లేల?
యడిగి కుడువఁబోయి తాదట లేక
యిన్ని దినంబులు నేరితి. జాలె
నిన్న నీకడు పేల నిండదు సెపుమ
యేయెడ వంచింప రేయును బగలుఁ
జేయి దిగం డిట్టిసితగుండు గలఁదె?"
యని యొండు వేసర నాసరఁ గన్న
జననిగదా యని చనవున బలుకఁ
దెల్ల మిప్పుడు మీఁదఁ దొల్లి నాయట్టి
తల్లులు గలరె యీాముల్లోకములను
బనుగొన నీవు నాప్రాణంబు గాఁగ
ననురక్తి గొనియాటి కది నీవె సాక్షి
యెట్టేని మాయుంచినట్టుల యుండి
పెట్టినంత గుడిచి యట్టుండి తేని
యెప్పాట నినుఁ బొందునే తెవు ల్నొప్పి?
నిప్పునఁ జెదలంటునే నీకు నీవ
చేసికొనఁగఁ దెవు ల్సిద్ధించెఁ గాక
యీాసంకటంబు నీ కేల తావచ్చుఁ

బనియేమి? మాటలఁ బాయునే తెవులు
నినుఁ గొంత వీఱేఁడితన మద్ద నేల?
చాలఁ జూడంగ నీసంకటం బింక
బాలుండ! నీమీఁదఁ బ్రాణము ల్విడుతు"
నని తనశిరమున కలుగ నున్నంతఁ
దనతల్లి కపుడు ప్రత్యక్షమై నిలిచి
యడుగు మిచ్చెదనీకు నభిమతంబనుడుఁ
గొడుక! నాకొకకోర్కె కొఱంతయుఁ గలదె?
నీవు నిరోగివై నిత్యుండవై సు
ఖావాప్తి నుండు నా కంతియె చాలు
కన్న మోహంబునకంటె నగ్గలము
ఎన్నఁ బెంచినమోహ మెందు నటండ్రు.
అటుగాన నినుఁ గన్నులారఁ జూచుచును
నిట యుండుటయె నాకు నీప్సితం బనిన
మందస్మితముఖారవిందుఁ డై తల్లి
నందంద కౌఁగిట నప్పళింపుచును
'ముల్లోకముల కెల్ల ముత్తవ! నాకుఁ
దల్లివి గాన నాతల్లి! నీయట్టి
తల్లివి గలుగంగఁ దనకు రోగంబు
లెల్లెడఁ బొందఁగ నెట్లుండవచ్చు'
ననుచు నిత్యత్వ మాయమ్మకు నొసఁగె
ననుపమపరమపరానందమూర్తి

యమ్మరై శివుఁ గొనియాడుటఁ జేసి
యమ్మవ్వ యనునామ మర్యొ వెండియును

## గొడగూచి కథ

"శివదేవుఁ డననొక్క శివభక్తియుతుఁడు
సువిదయుఁ దానుఁ బొర్గూరి కేఁగుచును
ధూపించి కడగొట్టు పాపఁ దా రింటి
కాపిడి 'యటయింట కదలకు మమ్మ!
పడుచులతో నాడఁ బఱవకు మమ్మ!
నొడివినమా వ్రతం బెడపకు మమ్మ!
గుడి కేఁగి నిత్యంబుఁ గుంచెఁడుపాలు
బడరున కారగింపఁగఁ బెట్టు మమ్మ!
నమ్మిపోయెదము సుమ్మమ్మ! మఱాకు
మమ్మ! మాయమ్మ!మాయక్క! మాతల్లి
కొమ్మ! నీకొకమంచిబొమ్మయు నిన్ని
బొమ్మపాత్రికలును బోయి తెచ్చెదము"
అని యప్పగించుచు నరిగిన, వారి
తనయ గాల్గొ మొగంబు దాఁ గడిగికొని
మంచిగంగులపాలు మరగంగఁ గాఁచి
కుంచెఁడు గోరతోఁ గొలిచి చేపట్టి
కోరయుఁ *బొత్రిక కొంగునఁ గప్పి
భోరునఁ జని శివాగారంబుఁ జొచ్చి
కోర ముందఱఁ బెట్టి ధారుణి మ్రొక్కి

* పాత్రిక=సన్నని వస్త్రము.

"యారగింపవె దేవ!"యని విన్నవించి
పిఱుసని యొక్కింత మఱువున నిలిచి
మఱి వచ్చి చూఁచుడు గఱిగొఱి గాని
బాల దల్లడమంది భయమునఁబొంది
హా లేల యారగింపవు లింగమూర్తి
కాఁచుట సాలదో కమ్మ పల్వామినో
ప్రాఁచియో విఱిగెనో పడుచ నేననియొ?
ప్రొద్దెక్కెనో యొండెఁ బొగయువల్చెడినో?
బుద్ధిపుట్టదొ నెయ్యివోయకుండితినో?
కడు వేఁడియో నీరు గలసినవనియొ?
యొడవాద్యములు లేక యేనె తెచ్చిననో?
చాలవో యివి యాలపాలు గావనియొ?
పాలపైఁ జిత్త మేఁ బఱపితి ననియొ?
కోర బెడంగనో కుంచెఁడు లేవో?
యారగింపఁగఁ బెట్ట నేరకుండితినో?
వీఁడువోయినవనో వీఁగడ లేదో?
యేఁ దెచ్చునెడ నెవ్వరేఁ జూచిరనియొ?
యూర కేమిటికిఁ బా లొల్లవు ద్రావఁ
గారణం బేమేనిఁ గలదేనిఁ జెపుము
నిక్కంపుటాకలి నీకు లేదేని
గ్రక్కఁదైనను గొని చిక్కించు నాకుఁ
గుటుపున కియ్యెడ గుడగుడ లేల

కుడికెఁడు దెత్తు నా గుజ్జనోగిరము
మూలపన్నారులయాలోవిలోనఁ
బోలె లున్నవి వంపు వోయి తెచ్చెదను
ఉట్టిపై బానలో నున్నది నెయ్యి
యిట్టున్నఁ దెచ్చెద నిష్టమే చెపుము
కుండె డున్నది వోయి కొనివత్తుఁ బుల్ల
కండంబు వలెనేని గ్రక్కునఁ జెపుము
యచ్చున యొల్లి మాయయగారినగరఁ
జెచ్చెరఁ బిల్వవచ్చెద నారగింపు
మాశివసోదరిమరమునఁ గలదు
పాసెంబు దెచ్చెదఁ బాలు మున్రావు
షోడశపండువు సూడఁ బోదండు
పోఁడిగా నీపాలు పురహర! కొనుము
వీరభద్రునిజాత్రవేళ ని న్బండి
యే రొప్పఁ బనిచెద నీపాలు ద్రావు
మొడమడు గేమిటి కీపాలలోని
కడుకులు దెచ్చెద నట్లైనఁ జెపుము
యిత్తఱి శిశువుండ నెట్టులం టేని
పొత్తునన్నైనను నెత్తి త్రావుదము.
పిన్నపన్నారులు సిన్నిబొమ్మలును
నిన్ని గూడ డడుకులు నెన్నేనిఁ బండ్లు
నా కెల్లి మావారు నలిఁ దెత్తు రపుడు

నీకు నిచ్చెదఁ గాని నీయాన! త్రావు
పాలును జల్లారెఁ బలుకవు దోడ
నేలయా లింగ! న న్నేఁచెద వనుచుఁ
బాప యీశ్వరునకుఁ బలుమాఱు మ్రొక్కుఁ
గోపించు భంగించుఁ గుప్పించునఱచుఁ
గటకట వాపోవుఁ గరములు విఱుచుఁ
దటతట నేలతోఁ దాఁకించుఁ గాళ్లు
ధారుణిఁ బడి బయ ల్దన్నుచు నేడ్చుఁ
గోరదిక్కును జూచు మాఱారిఁ జూచు
బుజ్జగించును వెఱ్ఱు బుద్ధును బెట్టు
నిర్జీవి క్రియఁ బడు నివ్వెఱఁ గందు
నెప్పటియ ట్లొడ్డు నెలుఁగెత్తి పిలుచుఁ
దొప్పనఁ బడుఁ గోరఁ దొలఁగంగ నూకు
వెఱచి ముందఱఁబెట్టు మఱి పలుమాఱు
నెఱఁగుఁబాదంబుల కెట్లు ద్రావమిని
నిట్లైనఁ గాని పా లేఁ ద్రావ ననవు
ముట్టవు మూర్కొన వట్టె యున్నవియు
నీ వారగింపమి మావారు విన్నఁ
జావనద్దురు నను సంశయం బేల
తనకు నెప్పుడుఁ జావు దప్పదు మగిడి
చన నిచ్చుటనె చత్తుపరివోదు" ననుచుఁ
దనతల శివునితోఁ దాఁకించుకొనఁగఁ

జనునంతలోనన చక్కనఁ బట్టి
యారుద్రుఁ డతిదయాహాసితాస్యుఁ డగుచుఁ
గోరతోఁ బా లెత్తుకొని యారగింప
"నన్నింత యేఁచితి పిన్నగాఁ జేసి
మిన్నకపోదు మాయన్నకుఁ జెప్పి
మఱికదా యున్నది మాట లింకేల
కటకంఠ! యింతయు మఱవకు" మనుచుఁ
గుడుక దెమ్మని పుచ్చుకొనుచు నబ్బాల
వడిగొని యింటికి వచ్చి నిత్యమ్ము
నిట్ల కొంపోయి తా నిచ్చుచు నుండ
నట్ల శివుండుఁ బా లారగింపంగ
నూరికిఁ బోయినవా రెదుర్గాఁగఁ
దా రేఁగుదెంచు నత్తఱిఁ దొంటియట్ల
మృడుఁడు వా లారగించుడు బాల రిత్త
కుడుకఁ జేతను బట్టికొని యేఁగుదేరఁ
బొడగని 'యిట యెందుఁ బోయెదు రిత్త
కుడుక యెచ్చటనుండి కొనివచ్చె'దనిన
'మీరు సెప్పినయట్ల మృడునకుఁ బాలు
కోరతోఁ గుంచెఁడు గొలిచి కొంపోవ
నారగింపఁగ మ్రొక్కి యనయంబు నిట్లు
కోర యిమ్మని పుచ్చికొని వత్తు' ననిన
"నేనాఁటఁ ద్రావుఁ బా లీశుండు వడుచ

కానీవ త్రావితో కాదేని తోడ
నాడెవు పశుచుల కచటఁ బోసితివొ?
యేడఁ జల్లితివొ మైయెఱుగవు గాక
తన్ను మహాభక్తతతి యుద్దేసించి
పన్నుగా 'నారగింపవె దేవ!' యనుచు
నతిభక్తిఁ బ్రార్థింప నారగించుటయు
క్షితి దుర్లభం బన్న నితరులతరమె?
యెట్టు నమ్మెడి దంచుఁ బట్టిదిట్టుచును
'నట్టెనఁ జూత'మం చామఱునాఁడు
బాలచేతనె తండ్రి వట్టించుకొనుచు
లీలతోఁ గూడి కేఁగి పాలతోఁ గోర
ముందటిక్రమమున ముందటఁ బెట్టె
నందికొనండయ్యె నాలింగమూర్తి
బాలముగ్ధత్వంబు ప్రవిమలభక్తి
యీలోకమున వెలయింపంగఁ దలఁచి.
యాశివదేవుఁడు నంతఁ గోపించి
"యోసి! నేఁ డేల పాలొల్లండు ద్రావ
ముక్కంటి ముట్టెనే మూర్కొన్నె చెపుమ
వెక్కలు వ్రేలితి వక్కజంబుగను
శివునకు నని యుద్దేసించినపాలు
దవిలి నిత్యంబును ద్రావిన ద్రోహి!
పొట్టవ్రచ్చెద నెంమఁబోయెద"వనుచుఁ

గట్టుగ్రమ్మనఁగూడ ముట్టుడు మున్న
బాల వాపోవుచు బలువిడి నేఁగి
హాలింగ! హాలింగ! హాలింగ! యనుచుఁ
జేతికోరకు మున్ను సేయిసాఁచుచును
నాతని కొడుఁకుఁడు నంతలోపలను
వారుఁ డోడకోడకు మనుచు నాక్షణమ
వరదయామతిఁ దనపక్షంబుఁ దెలుప
జగదభినుతకకడిగ భోగనాథు
నగణిత దివ్యలింగాంగంబునొరఁగ
సమ్మాత్రలోనహాహా! హోయి ననుచుఁ
గ్రమ్మనఁ దండ్రి గూఁకటి పట్టుటయును
వెలుపలఁ గూఁకటి వెండ్రుకల్ సిక్కి
వెలయ లింగంబు లోపలఁ జిక్కి బాల
యిల నేఁడు నాలునెలల కొక్కమాఱు
నలరి కూఁకటివెండ్రుకలు గత్తిరింప
'బాల నిశ్చలముగ్ధభావ సంపదకు
నీ లోకమున దృష్ట' మిది యని పొగడ
గొడగూచి యని చెప్పఁబడి మహామహిమ
నడరెఁ దా నాముగ్ధ యదియునుగాక

## దీపదకళియారు కథ

ఏపార మఱియుఁ గాంచీపురంబునను
దీపదకళి యన దృఢభక్తియుతుఁడు

పొరుగూరి కొక్కనాఁ డరుగ నొక్కెడను
పారుఁడు జీర్ణాలయం బందుండఁ జూచి
"కటకటా! యీశుఁ డొక్కఁడ యున్నవాఁడు
పటుతరాటవిలోనఁ బగయును బెద్ద
కచ్చపడంబులు గూడఁ గట్టించె మునులఁ
జెచ్చెర ముక్తులఁ జేసె దానవులఁ
గనుమూయ నెడయులే దనఁగ ముప్పెట్టి
గొనియె నవ్వ్యాసవాద్యనిమిషవరులఁ
దిరముగా ద్వాదశాదిత్యుల నొక్క
దెరువునఁ బోకుండఁ దిరువుడుకొలిపె
వెలయ ననంగుఁ గావించె నంగజుని
వెలుఁగనిపురములు వెలిగించెఁ బేర్చి
చెనసి దామోదరుఁ జేసె దామోద
రుని విధిపాలు సేసెను విధిఁ బట్టి
కరుణాకరుం డని గారవింపంగ
నరుదగు సర్వసంహారంబు చేసెఁ
గావునఁ బగ పెద్ద దేవదేవునకు
నీవిపినంబులో నెట్లుండవచ్చు
గుడియును వ్రస్సియుఁ గూలిపోయినది
యెడరుమంటపమును నరిపిరైనయది
కోటయుఁ బడ్డది గూడ నయ్యైక
వాటంబులును జిక్కి వసుధఁ ద్రెళ్లినవి

రొండల నర్థము గొన్న యుమబోటి వుట్టు
పొడ లేదు శివునంద యడఁగెనో కాక
భయమునందియొంటిగోదయు మీఁదఁగసవు
వయిచుకొన్న దియునువనరుచు నెదుర
మును శివుఁ డిచటఁ బుట్టిననాఁటనుండి
చెనసి తమ్మళి భజించినచొప్పు లేదు
ఇది యేల వేయును నిచ్చట నునికి
యది ప్రమాదము యసహాయంబుగాన
నిక్క మీశుండపో యొక్కటి వీరుఁ
డొక్కఁడు నిక్కడ నున్నయప్పటికి
నూరక వట్టివిచారంబు లెల్లఁ
దా రక్షయగునె సంహారరుద్రునకు"
నని నిశ్చయించి తా నచ్చోన యుండి
తనయింటి యావత్తుధనమును మున్న
సంచితంబగువస్తుసమితియుఁ జిల్ల
పెం చాదిగా మట్టుగించి తెప్పించి
గుడియు మంటపమును గ్రొత్త గావించి
కడునొప్పఁ జొట్టు నగడ్తఁ ద్రవ్వించి
కోటయుఁ గొమ్మలుఁ గొత్తడంబులుఁ గ
వాటంబులును దగువంకదారలును
బెట్టించి వంపుడుగట్టి యగడ్త
చుట్టును బోయించి యట్టళ్లు దీర్చి

పోలుపొందఁ డెంకణంబులు వెక్కువన్ని
నలిఁ బడగలుఁ దోరణంబులు గట్టి
కొత్తడంబులఁ గోటకొమ్ముల గొడుగు
లెత్తించి బలుమగ లెందఱొసనిచి
వ్రాలినకుసులును వసులుదూలములు
ఱాలు గుండ్లను నిస్సు సాలఁ దెప్పించి
కోటకొమ్ములఁ దగుచోటఁ బంచించి
కోట యీక్రమమునఁ బాటెంచి యంత
లోఁతుగా నడబావి లోనఁ గట్టించి
పాఁతర్లఁ గొలుచు నేర్పడ సంగ్రహించి
యగ్గుడిచుట్టు బిల్వాశోకసురభి
గుగ్గులు క్రముకాదికుజములు వెట్టి
మరువంబు దవనంబు మాచిపత్తిరియు
వరుసను బహుపుష్పవాటికల్ నాఁటి
జాలవారిని దివ్వటీలను బల్ల
గోలలవారిని గుడిపూజరులను
నొడిసెలకాండ్రను నోజులవారి
బడిపని జనులను బంతంబుబంట్ల
ద్వారపాలుర సువిధానుల వింద్ల
వారిఁ దలారుల వారక యేలి
వారును వాను నవారితశక్తి
గోరంతవొద్దు మేకొని కట్టు బిగిచి

య్యాయతపంచమహావాద్యరవము
పాయక రేయును బగలును మ్రోయఁ
గోటరులగు నజాంభోజనాభులకుఁ
గోట సాధింప నగోచరం బనుచు
మనుజు లక్కజమంది వినుతింపుచుండ
ఘనకీర్తి నటు గొంతగాలంబు సనఁగ
ధనమెల్లఁ దన్నిమిత్తమునను సమయ
మునుకొని పరివారమునకు జీవితముఁ
బెట్టలేకున్నను బెగడక జగతి
చుట్టును జాల రాచుచుఁ దిరుగుచును
అంతంతఁ గవదివియల నాఁటఁ బొడిచి
యంతఁ దొల్లిటికంటె నగ్గలికముగ
మొలనున్నగంటలు మ్రోయఁ దాళంబు
లులియ నొడ్డణము గుబ్బలు గజ్జియలును
ధ్వనియింప నల్లన తాటన వుచ్చు
చును సువిధానంబు సువిధాన మనుచు
గుడిని మానిసి గొమ్మకొమ్మ దప్పకయ
యడుపరిపై నున్నయ ట్లొక్కరుండు
వేయుముఖంబుల వేనవేల్విధులఁ
బాయక యట్టుల బలము సేయుచును
నీవిధంబున రాత్రులెల్ల వేగింపఁ
గా వెండి నూసియ గవదివియలకు

నొక్కింతయును లేకయున్న నూహించి
గ్రక్కున బ్రాఁకుల కణికలు వేర్చి
కవదివియలభాతిఁ గాల్చుచు మంట
లవిరళంబుగఁ బెట్టి యట్లు వేగింప
నొక్కకొఱడు గొట్రయొక బ్రానుమట్ర
యొక్కబడియ బట్ర యొక కట్టె గిట్టె
మందునకైనను బ్రాఁకనువేరు
నెందును లేకుండ నేఁగుడు నంత
కసవునఁ జిరి వెంట్లుగాఁ దాల్చి చేత
నేసలారఁ గవదివియలభాతిఁ బట్టి
యిలఁ దీగదీపంబుపోలుపు వట్రిల్ల
నలిమనోవేగంబున జగతిచుట్టు
దిరుగుచు మఱి కొన్నిదినములు నడవఁ
బోరిఁ బల్లు గుట్టెడుపూరియుఁ బుడుక
సదసట్రనలి నట్ర సరి గస్వగట్ర
వెదకియుఁ గానక మది విచారించి
కచ్చడం బాదిగాఁ గలచీరె లెల్లఁ
జెచ్చెర వెంట్లుగాఁజేసి ముట్టించి
దివి వెలింగెడు మెర్గుదీగెలో నాఁగఁ
గవదివియల భాతిఁ గరము లఁ బట్టి
వెసఁగొని తిరుగ న వ్వెంట్లుజెల్లుడును
మసలక చీకటి మఱువుఁ జేసి

పగవారు పొత్తురో పరికింపరామి
నగుఁ బ్రమాదం బంచు నాత్మలోఁ దలఁచి
గ్రక్కునఁ దలవెండ్రుకల జడయల్లి
చక్కన దీపంబు సంధించిపట్టి
యింతట వేగుఁబో యింకఁ బ్రొద్దనుచు
నెంతయు రయమున నెప్పటియట్ల
జగతిచుట్టుఁ దిరుగ జడ యెల్లఁగాలి
బగబగయనఁగ దీపదకళియారి
తలగూడ దరికొనఁ దడవ శంభుండు
జలజాక్ష జలజజ శతముఖార్చితుఁడు
కంతుసంహారుఁ డంతకాంతకుఁ డతని
శాంతసదానందుఁ డంబికాధవుఁడు
త్రిభువనారాధ్యుండు దివ్యశరీరుఁ
డభవుండు శివుఁడు ప్రత్యక్షమై నిలిచి
ధీరుమహోదారు దీపదకళియ
నారసు గారుణ్యవారాశిఁ దేల్చి
"యిచ్చ యెయ్యది నీకు మెచ్చితి
వేఁడు మిచ్చెద"నావుడు నిలఁజాఁగిమ్రొక్కి
"మెచ్చులు వేయును వచ్చె నొండొల్ల
నిచ్చమై విన్నపం బేర్పడ వినుము
ఈవిపినంబులో నెక్కడి బసుగు
దేవరో యనఁగ శ్రీదివ్యలింగాంగ

లోకాశ్రితుఁడ! భక్తలోకకుటుంబి!
యేకాకివై యుండు టిది నీతిగాదు
అనయంబు రజతాద్రి యట్టిదుర్గంబు
మనకుఁ గల్గఁగ వేఱ మన్నెముల్ సేసి
కొనియుండ నేలయీవనదుర్గమందుఁ"
జనుసనుమనుచుఁ బుష్పకవిమానంబుఁ
జక్కన నద్దేవు నెక్కించి తాను
నెక్క దీపదకళి యెంతయునొప్ప
గుడియు మంటపమును గోటయుఁ గూడఁ
గడునర్థిఁ గొనిపోయెఁ గైలాసమునకుఁ
బురహరు మెప్పించి బొందులతోన
యరుగుభక్తులు గల రన్నిలోకముల
గుడితోన లింగంబుఁ గొనిపోవుభక్త
డడరఁగఁ గలఁడయ్య! యఖిలలోకములఁ
గడుఁగడుఁ జోద్యంబుగాదె తలంపఁ
బుడమిఁ బుట్టనిభక్తిఁ బుట్టెఁదా ననుచు
దేవదానవమానవావలి వొగడఁ
గా వీరభక్తశిఖామణి యైన
యట్టిదీపదకళియారి ముగ్ధత్వ
మిట్టలంబై యొప్పె నిల" నట్టుగాక

### నాట్యనమిత్తండి కథ

"కడునొప్పు వెండియుఁ గంపిలోపలను
మృడుమూర్తి నాట్యనమిత్తండి యనఁగఁ
బోఁడిగా శివభక్తపుంగవుఁ డొక్క-
నాఁడు శ్రీయేకామ్రనాథునిగుడికి
నాయతభక్తిమై నరిగి కూత్రాడి
నాయనారిని సదానందస్వరూపిఁ
దాండవమూర్తి నత్యద్భుతాకారు
దండిగజాసురదళనావతారు
బాలేందుశేఖరు ఫాలలోచనుని
గాలకంధరు శూలఖట్వాంగధరునిఁ
బొడగని పూజారి నడిగె "నీశ్వరుని
నడుమటు వీఁగియున్నది యొక్కదెసకు
వారక కొంకరవంకర లోవయి
గారిశుచేతులు పూరించి నవియు
ముక్కొంకులును బోయి మోచియుం మోవ
కొక్కవాదం బట్టు లున్నది శివున
కున్నపాదంబును నూరుమధ్యమున
నున్నది యీచవో యున్నభావమున
నిలువులువడి శివునేత్రత్రయంబు
వాలుపుగా తెప్పలు వొందకున్నవియు
ములవారుశిరమును నిలువక యొక్క-

వలని కయంతయును వ్రాలియున్నదియు
మృడదేవు కెంజడ ముడివీడినదియుఁ
గడుఁజోద్యమిదియేమిగారణం?" బనుడు
నాశివబ్రాహ్మణుఁ డల్లన నగుచు
"నీశివునకు రోగ మిట్టులైనదియు
వాయు దోషము దీని వారింపకున్నఁ
గాయజహరునకుఁ గడుఁ బ్రమాదంబు
దడసిన నింకొండు దలఁచిన శివుని
యొడలెల్లఁ గూడ నిప్పుడ కొంకు వొవ్వు
దీనికి నౌషధం బే నెఱుంగుదును
బూని చేయింపుమా మానెడు" నంచు
నాలిసేయుచుఁ బల్క నది దథ్యగాఁగ
నాలింగవంతుఁ డట్లాత్మఁ దలంచి
తనయింటఁ గలపదార్థమ్ములు ధనము
మునుకొని కొనివచ్చి ముందటఁ బెట్టి
"కోరి యింతయును జేకొనియైన నిపుడు
మారారిరోగంబు మాన్చితేనియును
నాసతియును నేను నాసుతు లీకు
దాసులమయ్యెద మాసక్తితోడ
నెట్టైన నీ వింతవట్టు పుణ్యంబు
గట్టికోవే" యనఁ గల ధనంబెల్లఁ
గొని "వాయుతైలంబుఁగూర్చి యౌషధము

లెనయంగవండితి" ననుచునాముదము
నూనియ నొక్కింత నులివెచ్చఁ జేసి
చేనిచ్చఁ దత్క్రియ సెప్పుచు నతఁడు
వాయుతైలముఁ గొనివచ్చి యాతఁడాము
మాయాపహారుమేన మర్దనసేసి
తవిలి యావావిలిచివుళు లుమ్మెత్త
చివుళులు దక్కెడిచివుళు లాముదము
చివుళులు పండినజిల్లేడాకులును
నివి యాదిగా మందు లిన్నియుఁ గూర్చి
చెచ్చెరఁ దనువెల్ల నేకంబుసేసి
పొచ్చెంబు లే కిస్సుపొట్లాలఁ గాఁచి
పుచ్చుచు నరచేత వెచ్చఁ జూపుచును
నిచ్చ యొఱఁగి కాఁక లిచ్చుచు వలయు
పథ్యంబు లారగింపంగఁ బెట్టుచును
దథ్యంబుగా వెండి తగుక్రియ ల్సేయఁ
గొన్నిదినంబులు సన్నఁ దద్భక్తుఁ
డన్నిలగళుఁ జూచి "యిన్నినా ళ్లయ్యె
నాపోవ నొక్కింతయైనను గుణము
సూపదు పార్వతీశుశరీర మందు
ననవేల! నిక్కము నట్టిద కాదె,
పనుగొన నే నెంత భ్రాంతిఁ బొందినను
నారంగ నడవులయాకులు నలము

వేరు వెల్లంకియు మారసంహారుని
యొడలిరోగము మాన్ప నోపునే యింక
నెడసేయ నేటికి నేఁగాక శివుని
వాయుదోషమునకు వైద్యుండ" ననుచు
నాయయ్య గడునిశ్చితాత్ముఁడై యంతఁ
దలఁ కించుకయు లేక తనప్రాణమునకు
నలుగంగఁ బ్రత్యక్షమై నిల్చి శివుఁడు
పార్వతీకాంతుఁడు భక్తవత్సలుఁడు
శర్వుఁ డర్వాచీనసౌమ్యస్వరూపి
గీర్వాణవంద్యుండు సర్వేశ్వరుండు
సర్వజ్ఞుఁ డజహరిశతముఖార్చితుఁడు
నాట్యలోలుండు బినాకహస్తుండు
నాట్య నమిత్తఁడి నలిఁ గౌఁగిలించి
"మేదురకీర్తి! నీకు మెచ్చితి వేఁడు
మాదట నిచ్చెద నభిమతార్థములు"
ననుడు "నేమియు నొల్ల నభవ! మీదివ్య
తనువు వేఱొండ సందంబైనయదియు
వెండి వంకలువోయి వెడరూపుగాక
యొండేమి గడుఁజూడనొప్పియున్నదియు
రోగమో! సహజమో! యోగీంద్రవంద్య
యీగరిమంబు నాకెఱిఁగింపు" మనిన
"నిది దాండవాకార మెట్టులంటేని

ముదమున నాట్యాభిముఖు డనై నిల్చి
'హో'యనిడమరుగంబొగినొక్కమాటు
వాయింపఁదడవసర్వములయం బొందఁ
జరణంబు దొంగలి చలనగాఁ జేసి
పరగంగ నక్షత్రపంక్తులు డుల్ల
వినుతమహోద్రేకవీక్షణాటోప
మున నజాచ్యుతదేవముఖ్యు లడంగ
మూవలగంటల మ్రోతకు వెఱచి
దేవి యున్న సగంబు ధృతిఁ దన్నుఁగలయ
ఖ్యాత మహోద్ధత కరతాడనముల
నాతతవిక్షతి యచలఁ జనంగ
వడి మహోచ్ఛ్వాసనిశ్వాసోపనిహతి
బడబాలనం బొఱ జడనిధు లింక
గలిని మెట్టెడుపాదఘట్టనచేత
నతులధాత్రీతలం బది ధూళి గాఁగ
నురవడిమై జిఱ్ఱ దిరిగి నిల్చుడును
బోరి మూలి దిగ్గజంబులు వోడవడఁగ
గ్రక్కున జాఱె టంకారంబుచేత
నెక్కొన్న కుఁగిదుల్ నెఱఁ బొడిగాఁగ
నొందంగఁ బాదాగ్ర మూఁది నటింపఁ
గ్రిందటికూర్మంబు గిజిగిజిగాఁగ
మహితజటాచ్ఛటా విహతి నజాండ

బహులకటాహంబు వఱియలుగాఁగ
సురకిరీటవిఘాతనోద్వృత్తిఁ జేసి
పొరిఁ దత్త్వ సందోహములు వెల్లగిలఁగఁ
దాండవోద్ధతిఁ జేసి ధరియింపఁ బడిన
దండిఫణీంద్రుండు దలరి రోఁజంగ
నిటురోఁజుచున్న ఫణీంద్రు నూర్పులకు
స్ఫుటఫాలనేత్రాగ్ని భుగులన నెగయు
వడి నెగసెడినేత్రవహ్నిరోచులకు
జడలపైఁ జంద్రుఁ డాసగముచు గరఁగఁ
గలయ సుధాసూతి గరఁగినకతన
బలువిడి నమృతంబు దల డిగి పఱవఁ
దలడిగి పఱతెంచు తత్సుధాపూ
ములరి ముంచుడు జీవములు వచ్చి యంత
నురమున శిరమున నొగి గళంబునను
గరముల భూషణోత్కరములై వెలిఁగి
పరగుసురాసుర బ్రహ్మాచ్యుతాది
వరకపాలావళుల్ శరణు వేఁడుచును
బొబ్బలు వొడువంగఁ బొంగి యార్వంగ
నుబ్బి యాళతిసేయ నొగిఁ దాళగింపఁ
గ్రీడ వట్రిల జతిగీతముల్ వాడ
నాడుదుఁ బ్రమథులు సూడఁ దాండనము
కావునఁ దాండవాకార మత్యర్థి

భావించి కొలుతురు భక్తు లెప్పుడును"
ననుచు నానతియిచ్చి యద్దేవదేవుఁ
డనురాగలీలమై నతుల మార్గమున
మించిన నాట్య నమిత్తండి మహిమ
నంచితకనక దివ్యవిమానమునను
గొనిపోయెఁ గైలాసమునకు సద్భక్త
జనులు సజ్జనులును వినుతింప" మఱియు.

ఉడుమూరి కన్నప్ప కథ

"శ్రీకాళహస్తిగిరి ప్రదేశమున
శ్రీకంఠభక్తుండు లోకైకనుతుఁడు
ఉడుమూరి కన్నప్పఁ డొక్కనాఁ డర్థి
నడవికి వేఁటమై నరిగి యొక్కెడను
దోడెలుకులుఁ దాను దోఁపున నుండి
యూడ నొక్కింత నిద్రావస్థ దోఁపఁ
గలయఁగ రుద్రచిహ్నలతోడ నీశుఁ
డలరుచుఁ దపసియై యరుదెంచి తన్ను
జవుకమం దనిచి నొసల భూతివెట్టి
శివతీర్థకలశాభిషిక్తుఁ గావించి
"చనఁజన ముందట ఘనలింగమూర్తిఁ
గనియెద, ప్రాణలింగంబు నీకదియు"
నని యుపదేశించినట్లు స్వప్నమునఁ
గని మేలుకాంచి నల్గడలు వీక్షింప

మును లేని దొకద్రోవ ముందట నున్నఁ
‘బోనరనిక్కలయయ్యెఁబోకల’యనుచు
వన తోడి యెఱుకుల నునిచి యొక్కండ
చనఁ జన ముందటఘనలింగమూర్తి
యున్న సంతోషించి కన్నప్పదేవుఁ
డున్నత భక్తి సంయుక్తుఁడై మ్రొక్కి
“కలగన్న చోటికి గంపఁ గొంపోవ
ఫలసిద్ధి యగుటెల్ల భాగ్యంబుగాదె?
మును దపోమూర్తి సెప్పిన లింగ మిదియ
తన ప్రాణనాథుఁడో” ననినిశ్చయించి
“బాస గా దింక నీ ప్రాణలింగంబు-
బాసి పోఁ దగదు మా పల్లియ కితని
గ్రక్కునఁ గొనిపోయి కట్టుదుఁ బాక
నిక్కడ నునుపరా దెండఁ గాలంగ
బుద్ధులు సెప్పియు బుజ్జగించియును
దద్దయుఁ గీడ్పడఁ దగ వెడ్డు వెట్టి
వలసిన వస్తువు లిలఁ దెచ్చి యిచ్చి
వలపించి కొని పోవ వలె”నని తలఁచి
పరమహర్షమున విస్ఫారాంగుఁ డగుచు
వరముగ్ధ భావన వారున కిట్లనియె
“‘అక్కటా! యిది యేమి హరుఁడయొక్కరుఁడ
విక్కడనుండుట యేమిగారణమొ?

తల సూప కేయూరి తమ్మళ్ళ తోడ
వలిగి వచ్చితె సెప్పు మలుక దీర్చెదను
గోరక లుమ్మెత్తపత్తిరి బూజసేయు
మరులెత్తి వచ్చితో చూరుత రాటువిడి,
పరసలత్రొక్కఁగఁ బడఁ జాలకీవు
సిరిగిరి నుండక సురిఁగి వచ్చితివొ?
జటలకు నోడలికి సవతులు వోర
నుడుపఁ జాలక వచ్చి యడవిఁ జొచ్చితివొ?
చెన్నయ్య గలసినఁ జెడెఁ గులంబనుచు
నిన్నులోకులు వెలి యన్న వచ్చితివొ?
పలుమాఱు నంబికి బడిపను ల్సేయ
నొలసి వచ్చితివొ యిచ్చోట డాఁగంగ
నాఁటి బ్రహ్మము నేఁడు నాయంబు దప్ప
వేఁటాడ వచ్చితో వేయును నేల
నాతోడి మోహంబునను నన్నుఁ బ్రోవ
నేతెంచితో వేడ్క యొసఁగ నిచ్చటికి!
యొట యుండి వేంచేసి తెట్లు నీ బ్రదుకు?
ఇట యుండఁ జొచ్చి తీవెంతగాలంబు?
ఎక్కడుఁగోడ నిన్నిక్కడ వైచి
యొక్కడ వోయె నేనేఁగదఁ జెపుమ?
ఒడల నర్థము గొన్న యమకోటి యొద్ది?
యొడ్డరైన నవ్వారె యొక్కడివారు?

కట్టిన గోఁచి యెక్కడ నొల్వవడితి?
వట్టైల వచ్చితి వడవి కొక్కఁడవ?
చంక బొక్కసమును సడలియున్నదియు
శంకింప కొంటెట్టు సరియించెదయ్య!
కొండలలోన నొక్కండ వీవిట్టు
లుండంగ వెఱవవా ఖండేందుమౌళి?
మృగములు నురగము ల్మితి మేరలేవు
నగవు గాదిచటనున్నను బ్రమాదంబు
ఎఱుకుఁ బన్నలు గన్న నేఁతురు నిన్నుఁ
గఱకంఠ! మాపల్లెఁ గలదెల్ల సుఖము
అడవుల మనుబిళ్ళ కడు మంచిపాలు
నొడిపిలి పాసెంబు నుడుప నేతులును
నిప్పపూవును దేనె లెల్ల ఫలాదు
లొప్పెడు వెదురుఁ బ్రాలోగిరంబులును
మఱి యట్లుఁ గాక నీ మనసు వచ్చినను
నెఱచులుఁ గఱకుట్లు లెన్నైనఁ గలవు
రావయ్య! మ్రొక్కెద దేవదేవుండ!
ప్రేవులు మాడంగఁ జావ దప్పినదె?"
యనుచుఁ బాదాక్రాంతుఁడైన నీశ్వరుఁడు
దనతోడఁ బలుకమి మనసులోపలను
"నింత గాలము నుండి యిట గుడువండొ?
కంతునిర్దళనుఁడాఁకటఁ బల్కలేఁడు

చెవులు సిల్లులు వోవఁ జీరంగ నేల
శివునకే మేనిఁ దెచ్చెదఁ గాక" యనుచుఁ
జని కందమూలాదిశాకముల్ మృగము
లును దృష్టి మాత్రలోనన పరిత్యజింప
మునుకొని "యంతకుమున్న ధరిత్రిఁ
జనిన జీమూతవాహనుఁడును శిబియుఁ
గీర్తి ముఖుండును గీర్తింప నాది
కర్తకు నర్పింపఁగా నెఱుంగమిని
దమ శరీరము లొంక్షుక్రమమున సమసి
యమితసాహసవంతులనఁగ నిబ్బువిని
నవిశేషకీర్తిభాజను లైరి గాని
ప్రవిమలమతి లింగభాజనుల్గార
యనుచు సౌందర్యమహాకాయులనఁగ
దనుజేశు లతిఘోరతప మాచరింప
నెంతయుఁబరితోష హృదయుఁడై భర్గుఁ
డంత దైత్యులకుఁ బ్రత్యక్షమైనిలిచి
"యాంమధోక్షజ కమలాసనవాస
వాయతస్వర్గ మోక్షాది భోగములు
చెచ్చెర వేడుఁ డిచ్చెద" నని యాంచ
లిచ్చుడు సాష్టాంగమెరఁగి దానవులు
"మాజలంధరుఁ డభిమానంబుగొన్న
యాజనార్దను పద మరిదియే మాకు

మాగజాసురునిచే మడిసినయట్టి
వాగీశ్వరత్వంబు వలెనె నిన్నడుగ
మాతారకునిచే విఘాతమై చెడ్డ
యాతని యింద్రత్వ మది యేలచెప్ప
నటుగాక వ్యాఘ్రాంధకాది దానవులు
నిటలాక్షు పగతులై నీచేతఁదొల్లి
నడసిన మోక్షంబు భక్తిమైఁదలగిలి
పడయుట సోద్దెమే పాన లొండేల
దేవ! నిత్యానంద! దివ్యలింగాంగ!
దేవ! మహాదేవ! దేవాధిదేవ!
యెల్లదైవత్వంబు లెల్ల భోగంబు
లెల్లవి యొల్లఁగుదు మొల్ల మేమియును
నీరమ్యమగు మాశరీరము ల్మీకు
నారగింపంగ నాహారము ల్గాఁగఁ
గరుణింపుఁ"డనుచు శ్రీకంఠు డిట్లనియె
"ధరఁ గాళహస్తి భూధరసమీపమున
మృగములై పుట్టుఁడు మిమ్మువధించి
బగుతు డొక్కఁడు వరిపక్వంబుసేసి
యర్పింపఁ నేర్పుఁ గన్నప్పఁ డనంగ
నర్పింప నపుడు మి మ్మారగించెదను"
అనియానతిచ్చుడు నసురు లాక్షణము
చను దెంచి ప్రజలును వనితలుఁ దారు

మృగములై లింగసమీపంబునందుఁ
దగిలి జన్మించి యెంతయుఁ బ్రీతిఁదమ్ము
నొరులకుఁ గానరాకుండ వర్తింప
వరమృగావలి సేరవచ్చిన నుబ్బి
యొక్కొక్కకోలన యొక్కొక్కమృగము
నుక్కడఁగింపుచు నుత్సాహం బలరఁ
జెచ్చెరఁ గోలలు దెచ్చియాతూణమ
త్రెచ్చి మెల్లన మంట దరికొల్పి కాల్చి
మంచి మాంసముగ శోధించి శోధించి
పంచినమాడ్కి ఖండించి ఖండించి
కాల్చుచుఁ బక్వంబుగాఁ ద్రిప్పి త్రిప్పి
ప్రేల్చుచు వెరడియుఁ గ్రియకొల్పికొల్పి
తవిలి ఖండింపుచుఁ దాఁజవిసూచి
చవియున్నలెస్స మాంసము దొప్పఁబెట్టి
చిఱుతయుఁ గరినంబు ఛిద్రంబుమొఱకు
కఱకును గారాకు గాకుండఁజూచి
యింపారి నునుపారి కంపు సొంపారి
పెంపారి చాలనొప్పెడు బిల్వపత్రి
నలి దీటుకొనఁ గోసి తలసజ్జఁజేసి
యలరు జంజూఱు వెంద్రుకలమీఁదఁ దాల్చి
చక్కనమొగలేటి సదమలోదకము
లక్కజంబుగ రెండుపుక్కిళ్ళఁ బట్టి

దాపలికరమునఁ జాపంబు శరము
లేపార వలచేత నిట మాంసమున్న
దొప్పయుఁబట్టి కన్నప్పఁ డేతెంచి
చెప్పుఁగాలను దొంటి శివుమీఁది పూజ
పోనూకి తెచ్చిన పుక్కిటి నీట
మానుగా శివునకు మజ్జనంబార్చి
పటికివెండ్రుకలపైఁబత్తిరి రాల్చి
మఱి దొప్పఁ దెచ్చిన మాంస మర్పించి
యనయంబు నట్లు గన్నప్పదేవుండు
ననురాగమునఁ గొల్వ, మును గొల్చుతపసి
యేతెంచి యప్పరమేశ్వరు మ్రోల
నీతెఱంగంతయు నేర్పడఁజూచి
యొక్కడి మ్లేచ్ఛుఁడో యెన్నఁటిఁగోలె
నిక్కడ నన్యాయ్య మీట్లు సేసెడిని
నేమిసేయుదు నంచు, నేవగింపుచును
నామాంస ఖండంబు లటు వాఱఁదూకి
యపవిత్రమయ్యె శివాగార, మనుచుఁ
దపసి పంచామృత స్నపనంబుసేసి
పాదోదకములు దత్ప్రాంతంబునందు
వేదోక్తముగఁ జల్లి వెండి పూజించి
వేగుండి యాతనివిధ మెల్ల నరసి
వేగినఁ దపసి యుద్వృత్తిమై వచ్చి

"యక్కటా! యెంగిలి యదియు మాంసంబు
పుక్కిటినీరును బూజ్యమే పూజ,
చెప్పుఁగాలను నూకు శివభక్తిగలదె?
యెప్పాట వినఁబడునే? యెట్లు సైఁప
వసుధ మృగాదుండు వాఁడు, నేఁ దపసి
ననుమానవిగ్రహం బన నెట్లువచ్చు?
నిచ్చటఁ దొల్లియు నేమంగుతోడఁ
జెచ్చెరఁ బోరదే చెలఁది యెట్లవిన
హారు డెండఁ గాలెకి నవుచు నచ్చెలఁది
పసువడిఁ దననూలు దెరచీరభాతిఁ
దిరిగివచ్చిన వృక్ష తృణగుల్మలతలఁ
బురికొల్పి మీఁదఁ గపోతముల్ దీర్చి
కరువుఁ బ్రతిష్ఠించి గంటయు వేది
విరచించి శిఖరంబుఁ గరమొప్పనిలిపి
ద్వారబంధంబులు దగిన వాకిళ్లు
నారంగ గర్భగృహాదులు దీర్చి
యకలంక కరవీరముకుళ ప్రభాతి
ప్రకటించి దేహాళీబంధంబునందు
రమణీయ శతసహస్రదళాబ్జపంక్తు
లమరు పూజాప్రబంధానేకరచన
గావించి చెలఁది త్రికాలంబు భక్తి
భావనమై శివుఁ బాయక కొలువ

హరుమీఁదఁ జెలఁది మున్నల్లిన నూలు
గరి యంత నేతెంచి గాంచి కోపించి
"పాయక శివుమీఁదఁ బాదో ట్రు వెట్టి
పోయెడునిది యేమివుర్రవో కో" యనుచు
ఘనకర్ణ చలిత సంగత మారుతమునఁ
బొనరినపాదో ట్రుఁబోవంగఁ ద్రోచి
వెండి తాఁదెచ్చిన తుండాంతరమున
నిండారుమొగలేటి నిర్మలాంబువుల
నంబికాధవునకు నభిషేకమార్చి
యింబులఁ గుంభస్థలంబుపైఁబెట్టి
తెచ్చినకలువల నచ్చఁదామరల
నిచ్చలుఁ బూన్చుచు నిటలలో చనునిఁ
గరియును నిట్లు త్రికాలంబుఁగొలువ
నరుదెంచి చెలఁది దా నాగ్రహంబంది
"కమనీయలీల నా కట్టినగుడియు
నమరుమదీయ నిత్యార్చనావలియు
నెట్టికర్మియొచెర్చి యేఁగెడు నింక
నిట్టి శివద్రోహ మెట్టునైరింతు"
ననుచు నొక్కెడఁబొంచికొనియుండగజము
సనుదెంచికోపించుచందంబు సూచి
యంతరాంతర మించుకైనఁ దలంప
కంతఁ బరిచ్ఛేదియై యుపాయమున

దుండాగ్రమునఁ జొచ్చి తొలుచుచు - జెలఁది”
దండిమదేభంబు తలకెక్కి చంపెఁ
గానయిక్కడ నమార్గము సేయుధీర
మానసుఁ డెంతవాఁడైనఁ గానిమ్ము
అట్లు నేఁడును వాఁడు నరుదెంచెనేని
యొల్లైనఁ జంపక యేఁ బోవననుచు”
వెనుకదిక్కునఁ బొంచికొని సమీపమునఁ
దనపొడసూపక తపసి యున్నెడను
గన్నప్పదేవుని ఘనముగ్ధతయును
సన్నుతభక్తియు సంస్పృహత్వంబుఁ
దపసికిఁ జూపఁగఁ దలఁచి శంకరుఁడు
విపరీతగతిఁ ద్రినేత్రపరీతమైన
వదనంబు ధరియించి వలపలికంట
నుదకంబు గాఱంగ నున్నయత్తఱిని
అరుదొందఁ దొల్లిటియట్ల కన్నప్పఁ
డరుదెంచి యరుదెంచి హరుకంటినీరు
పొడఁగని బిట్టుల్కిపడి భయభ్రాంతిఁ
దొడరుచు నరుదారఁ దొల్లింటిపూజ
గ్రక్కునఁదనచెప్పుఁగాలఁ బోనూకి
పుక్కిటి నీరును బుగులున నుమిసి
తలవంచి పత్తిరి దులిచి మాంసంబుఁ
దలరుచు నర్పించు తదవసరమున

నా నేత్రజల పరిహారార్థముగను
దా నీశ్వరునకు నంతర్ధార యొత్తు
భంగి జలంబులుఁ బత్తిరిబ్రుంగి
మంగళంబై యొప్పె మఱియట్లుఁ గాక
తలఁగంగ నతనిపాదహతిఁ దొలంకి
యలరి పాదోదకంబై వెల్లివిరియఁ
బొలుపుగఁ గన్నప్ప పుక్కిటనీరు
గలయఁ బ్రసాదోదకం బయి తనరఁ
నాలింగమూర్తి యపాంగోదకముల
పోల లింగోదకపూరమై తనరఁ
ద్రివిధోదకంబులుఁ ద్రినయను మేనఁ
బ్రవిమలంబై యిట్లు భాసిల్లె నంతఁ
దవిలి ప్రసాదికిఁ ద్రివిధోదకములు
ప్రవిమలమతిఁ బొందఁ బాడియ నంగ
సర్వాంగములుఁగూడ జలములు వర్వ
సర్వేశుభక్తుఁ డాశ్చర్యంబు నొంది
యగ్గలంబయ్యె నపాంగాశ్రు లనుచు
బెగ్గలి నేత్రమ్ము దగ్గఱి చూచి
"యటకటా! యిదియేమి గర్జంబువుట్టె
నిటలాక్ష! నీకంట నీరుగా తెడిని
నీనింద విని గౌరి నీరైన నాఁడు
దానించు కేనియుఁ దడి గంటలేదు,

జనకుచేఁ దనయునిఁ దునిమించునపుడు
కనికరంబునఁ గంటఁ గ్రమ్మదు నీరు
చీర సించుచు విప్రు లాఱడివైచి
కారించుతఱి నుదకము లేదు గంట
సాఱాల వాట్లు ఱివ్వనఁ దాఁకునొవ్వఁ
గాఱవు నాఁడును గంటఁ బాష్పములు,
పరసతికై పట్టువడ్డ భంగమునఁ
దొరుగవు నాఁడును దోయముల్ గంట
వెట్టికేఁగెడు తట్టఁ బట్టి యొత్తుడును
నట్టిచో వెడల వపాంగోదకములు
నేఁడు నీకడఁ గంట నిర్నిమిత్తంబ
పోఁడిగా జలములు పూరించుటేమి ?
ఆలుబిడ్డలఁ బాసి యడవుల గిరుల
పాలై తినని దుఃఖపడి యేడిచెదవా ?
యేకాకినైతి నింకేక్రియఁ బ్రోతు
లోకంబులని ధృతిలేక యేడ్చెదవా ?
కడుపుగాలంగ నాఁకటికోర్వలేక
తడవయ్యె రాఁడని తలఁచి యేడ్చెదవా ?
యెక్కడ దండిమ్ము గాలిచే నాదు
చక్కట నూహించి నిక్కమేడ్చెదవా ?
పనిపాటు సేయనోపక యొంటివిడిచి
చనియెనో తమపల్లె కనుచు నేడ్చెదవా ?

అఱిముఱినొకపువ్వుమఱిమూరుకొన్న
నెఱయఁ బ్రాణమునకు వెఱచి యేడ్చెదవా?
కారణం బేమి? గన్గంటఁ బుట్టెండు
నీరు గాఱఁగ నేడ్వ నీకేమి వలసె?
చెప్పవే నా" కని చేర్చుఁ గౌఁగిటను
నప్పళింపుచును 'నాయట్టి పుత్త్రుండు
గలుగ నీకేల యప్పుల బ్రుంగ'ననిన
పొలుపునఁ గంటి యప్పులు వాఱఁ దుడిచి
"పాసియుఁ బాయను వ్యాసంగ" మనుచు
నీసరి లింగముల్ నిను నగరయ్య!
ఊరకో నాయన్న! యూరకో తండ్రి!
యూరక్కో నాస్వామి! యూరకింతేల?
యుమ్మలికము తగ దుడుగవే" యనుచు
ఱొమ్మున నేత్రోదకమ్ములట్లొత్తు
'నెసఁగ నాముగ్ధత కీకంటిలోని
సువ పొమ్మన్నట్లు గన్ను శోధించుఁ
రతలాంగుళములఁ గను ఱెప్ప లెత్తి
'నెర సున్న'దనిపాఱనిక్షించి యూఁదుఁ
గ నాలుక గ్రుడ్డుపైఁ ద్రిప్పిత్రిప్పి
దయుచు నోఁ యుచు నొయ్యనఁ జూచుఁ
[illegible]రావిఁ గొని కంటఁ జేర్చి హత్తించి
చీరెల్లఁ దడిసినఁ జిక్కు వెండిముచు

నీకడకంట ప్రేలిడి యొత్తనొత్త
నాకడకంట ధారావలి వర్వ
నాకడకంట ప్రే లదుము నల్లదుము
నీకడకంట నీరెంతయుం దొరిగెఁ
గొలుకులు రెంటను నంగుళములనదుముఁ
గలయుఁగఁ గన్నెల్లఁ గొలుకులై కాఱ
నక్కన్నుఁగొలుకులు నరచేతమూయఁ
బక్కిళ్లఁ బింజించి పాఱంగఁ దొడఁగె
నెట్టును నేత్రాశ్రు లెడతెగకున్న
నెట్టణ దుఃఖించి బిట్టువాచఱచు
నడుగులఁబడి మ్రొక్కు నంజలియొగ్గు
నడలు నిల్చును నిల్వఁబడు లేచు జూచుఁ
'కటకటా!' యనుచు లింగముఁ జుట్టిచుట్టి
యటయిటయేఁగుచు నాత్మ లోపలను
"నానంద బాష్పమ్ము లంద మేనియును
నాననంబునఁ దోఁప దానందచిహ్న"
సారకటాక్ష వీక్షణ జాలమైనఁ
గారుణ్య జలములు గావ యుష్ణములు
ఘర్మ జలంబుల క్రమ మంద మేని
ఘర్మ జలంబులు గన్నులఁగలవె?
యొండు దుఃఖం బేని యూహించి చూడ
రెండుగన్నులఁ గాఱ కుండునే నీరు?

ఈనొక్క కంటనె ధార వర్వెడిని
గానొప్పు నక్షిరోగంబ యెమేని
చెప్పఁ జిత్రము! గోడిఱెప్ప వెర్గినదొ?
తప్పవోనొప్పునో? తడికంటివిధమొ?
నొవ్విరేయో పొరగప్పెనో? మాదతెవులో?
పువ్వొచ్చ త్రిల్ల నాపువుకంటి పోటొ?
ముయిలవడ్డదియొ దుర్మాంసదోషంబొ?
అయిరయో వెండియు నక్షిరోగంబొ?
కానొప్పు నిట్లనుమానంబు లేదు
దీనికి మందుమ్రాఁకే నే మెఱుంగ
నాయన్న! నాతండ్రి! నాయిష్ట సఖుఁడ!
నాయయ్య! నాజియ్య! నాప్రాణనాథ!
సర్వాంగసుందర! శంకర! యీవి
గుర్వాణంబెటు దొరకొనెనయ్య! నీకు
ముక్కంటి వాఁడని మూఁడు లోకముల
నిక్కంబు వెఱతురు నిటలలోచనుఁడ!
యెన్నఁడు నీకొక్క బన్నంబు లేదు
గన్నుఁ జూచిన నిట్టుగైకొండ్రె సురలు
కంటి చిచ్చున మున్ను గాలిన వారు
కంటివార్తకు నిఁకఁ గనలరే మగుడ,
విను మెంత గన్ను గానని వలపైన
వనిత లిట్లంగ హీనునకు జిక్కుదురె?

రూపింప నిట్లు కురూపివై యున్న
నేపార భక్త 'లిఫీ' యని నగరె
నేఁడెందుఁ బోయెనో నేత్రంబు హారికి
నాఁడిచ్చి నట్టి యనశ్వరమహిమ
పాలమున నాఁ బోతుఁ బులి గొన్న యట్టి
పాలుపయ్యె నె నెట్లు నిలువంగ నేర్తు
నెవ్వరి కెఱిఁగింతు? నెట్లు ధరింతు
నెవ్విధిఁ బోవుదు? నేమిసేయుదున?
జెప్పంగ లే దొండు సేయ లే దొండు
నిప్పాటఁ జూచుచు నేనుండఁ జాల
నాకంటఁ బుట్టిన నాఁటను గోలె
శ్రీకరు రోగంబు సెంద దెన్నఁడును
నొప్పని కన్నుతో నున్నట్లుగాఁగఁ
గప్పెద నాలెస్సకంట నీకన్ను
నాకన్న చూ! మందు నీకంటి కనుచుఁ
జేకొని శరమున ఛేదించి పుచ్చి
కలికందు కంటిపైఁ గన్నప్ప దేవుఁ
డలిముఱిఁ దననేత్ర మర్పింపఁదడవ
నక్కంటఁ దొరుగు ధారావళి యడఁగి
గ్రక్కున డాపలికంట నుప్పొంగఁ
గించి తృప్తిహాస సంకలితా ననస
మంచితాంభోజాతుఁడై తననేత్ర

కమలంబుశివునేత్ర కమలమైయునికి
కమితమహోత్సాహ మాత్మఁదుల్కాడఁ
గ్రేకంట లింగంబు డాకన్నుఁ జూచి
యీకంటి కిని మందు నీకన్నె కాక
యనుమాన మింకేల యనుచుఁ దన్నేత్ర
జనితవినిర్మలజలధారదొరుగఁ
గందువఁ దనచెప్పుఁ గాలి యుంగుటము
వొందించి డాకన్ను పుచ్చఁ గైకొనుడు
నంతలోపలన ప్రత్యక్షమైయప్పు
డంతకసంహారుఁ డనురాగ మెసగఁ
గన్నప్పదేవర కరయుగగ్రహణ
సన్నుత హస్తుఁడై చక్కన నిలువఁ
గలిత సమావలోకనమాత్ర యంద
యలరెఁ గన్నప్పని వల పలి కన్ను
నాతనిచేఁ గొన్న యాకన్ను నిచ్చె
నో తన క న్నిచ్చెనో శివుఁడనఁగ
నంతకమున్ను వామాంబకజనిత
సంతతఘన బాష్పజలధార లుడిగి
కన్నప్ప దేవుని కన్నులు శివుని
కన్నులు వోల నొక్కండైన యట్లు
కన్నప్ప దేవుని కన్నుల నపుడు
సన్నుతానంద బాష్పంబులుదొరిగె

హారకంటఁ దొలి త్రిపుర వీక్షణమునఁ
దొరిగిన జలములు దోడయ్యె ననఁగఁ
గరుణానిరీక్షణ స్ఫురితాంబుధార
విరచింప నానంద కరమగు టరుదె?
యంతటనిఖిలసురాసుర ప్రముఖు
లంతంత మ్రొక్కుచు నభయాంబు వేఁడ
మస్తక విన్యస్తహస్తులై మునులు
ప్రస్తుతం బెలుఁగుచుఁ బ్రస్తుతుల్ సేయ
శివదుందుభులుమ్రోయ భువిఁబుష్పవృష్టి
ప్రవిమలంబై కురయ్యఁ బ్రమథులుప్పొంగ
గన్నప్ప శుద్ధ ముగ్ధతయు మహాగు
ణోన్నతియును భక్తియోగ సంపదయు
నాపరాపరుఁడు ప్రత్యక్షమైయునికిఁ
గోపించి మును వొంచికొనియున్న తపసి
కనుఁగొనిసంభ్రమాక్రాంతాత్ము డగుచు-
జను దెంచిభువి జక్కఁజాఁగిలి మ్రొక్కి
"తలఁప నీసహజ ముగ్ధత్వ మెఱుఁగమిఁ
దలఁచితి నీకహితంబు సేయంగఁ
దప్పుసైరింపు గన్నప్ప! దయాత్మ!
చెప్ప నున్నదె నీవు శివుఁడవుగాక
యిట్టి ముగ్ధత్వంబు నిట్టి వీరత్వ
మిట్టి మహత్త్వంబు నెందును గలదె?

విందుమే యవికలవేదశాస్త్రములఁ
గందుమే మూఁడులోకంబులఁ దొల్లి?
బాపురే! కన్నప్ప! పరమ లింగంబ!
బాపురే! కన్నప్ప! ప్రమథవిలాస!
నల్లవో! కన్నప్ప! నాలింగముగ్ధ!
నల్లవో! కన్నప్ప! నల్లనైనార!"
యనుచు ని ట్లాతపోధనుఁ డతిభక్తి
వినుతింప మునుకోటి విస్మయంబొందఁ
గన్నప్ప! శివుఁడు నాకాంతుకొందోరులఁ
గన్నులఁజూచుచు నున్నయత్తఱిని
దవిలి యొండొంటితోఁ దగునన దొరసి
నివిడి యొండొంటితో నిద్దమై చెరసి
చూపులు సూపుల లోపలఁ జొచ్చి
యేపార నేకమై యొంతయు నొప్పి
కన్నప్పదేవుని కన్నుల సఖులో!
యన్నీలకంధరు కన్నుల కవలో?
తవిలి కన్నప్ప కన్గవ దర్పణములో?
భవునయనంబుల ప్రతిబింబ యుగమొ?
నెమ్మిఁ గన్నప్ప నేత్రమ్ములపాయ
గొమ్ములో? శివునేత్రగుప్తాంకురములో?
రమణఁ గన్నప్ప నేత్రముల బీజములో?
యమృతాంశుశేఖరు నతిఫలములో?

యనఁగఁ గన్నప్ప దేవునిలోచనములు
మనసిజహరునిలోచనములై శివుని
కన్నులు గన్నప్ప కన్నులై యిట్లు
సన్నుతి గడచి సమున్నత స్ఫురణ
నాల్గుఁ గన్నప్ప నైనారినేత్రములో ?
నాల్గు నీశ్వరునయనంబులో యనఁగ
మృడుని మూఁడవ కంటిక్రింద నిగ్గడల
నడర రెండును రెండునై మించి వెలుఁగఁ
జూపును జూచు తద్రూపముదారు
నేపారఁ ద్రివిధంబు నేకమై యునికిఁ
దమ నేత్రములఁ దమ్ము దార వీక్షించు
క్రమమయ్యె శివునికి గన్నప్పనికిని
నెఱి నాల్గు గన్నుల నిజదీప్తి నంత
పఱగప్పి నట్లుండె ఫాలలోచనము
'కాలునే యింక నీకంటఁ జూచినను
నోలిఁబురత్రయంబొండు గల్గినను
గాలునే యింక నీకంటఁ జూచినను
నాలక్ష్మీ నందనుం డంగంబుగొన్నఁ ?
గాలునేయింక నీకంటఁ జూచినను
గాలుఁడు వెండియుఁ గ్రమము దప్పినను ?
గాలునే యింక నీకంటఁ జూచినను
నేలోకమును నంత్యకాలంబునాఁడు ?

కన్నప్ప సదయాంబకము మున్ను శివుని
కున్న నట్లును గాక యుగ్రాక్షుఁ డండ్రె ?
నాఁ డయీ కన్నప్ప నయన ముండినను
వేఁడునే సిరియాలు విందారగింప ?
నాఁడ యీ కన్నప్ప నయనముండినను
బోఁడిగా సైఁచునే భ్రూణహత్యకును
ఈచారునేత్రాబ్జ మీశునకున్నఁ
జూచునే నిమ్మవ్వసుతుచావు నాఁడు ?
పంబి యీయమృతాంబకం బున్న శివుఁడు
నంబి కన్నులు సెడ నాఁడేలచూచు ?
నీనేత్రమున్న ము న్నీశుండు బాలుఁ
బోనిచ్చునే పాముపుట్టఁ దోడ్కొంగ ?
నితని నేత్రంబున్న నిన్నియు నేల ?
యతిదయాపరుఁ డన నుతికి నెక్కుండె ?
యితని నేత్రంబు ము న్నీశున కున్న
నతిభూమిసౌందర్యుఁ డన భువిఁ జనఁడె ?
యిట్టి నేత్రంబు ము న్నెప్పుడు నున్న
నెట్టి కాంతల మెచ్చునే హరు." డనఁగఁ
గన్నప్పనేత్రంబుకతమున నీశుఁ
డెన్నంగ సర్వసంపన్నుఁడై నెగడె.
గన్నప్పపాదరజోస్పర్శ శివుఁడు
సన్నుతభక్తవత్సలుఁ డనఁ బరఁగె

నీచెప్పు నాఁడు దన్నింతసోఁకుడును
నాచంద్రుఁ డభినంద్యుఁ డయ్యె లోకముల
నీచెప్పునాఁడు దన్నింతసోఁకుడును
నేచిన తీర్థమై యిల నొప్పె గంగ
యీచెప్పుదానయ్యె నేఁ బద్మభవుఁడు
చూచున కాదె యీశునిపుస్తకంబు
శ్రీపతి గానని శ్రీమహాదేవు
శ్రీపాదభక్తుల శ్రీపాదరక్ష
పరమేష్ఠి గానని యురులింగమూర్తి
శిరమున నొప్పు విశిష్టభూషణము
చెప్పెడిదేమి? గన్నప్పపాదంబు
చెప్పు మహాత్త్వంబు సెప్పఁ జిత్రంబు
ఇతని పాదోదకాయత సిద్ధిఁ గాదె
సితకరమౌళి ప్రసిద్ధుఁ డై పరగ
నితనినిర్మాల్యసంగతిఁ జేసి కాదె
రతిపతిహరుఁడు నిర్మలదేహుఁ డయ్యె
నితనిగండూషాంబు కృతసేవఁ గాదె
జితపురత్రయదైత్యుఁ డతిలోకుఁ డయ్యె
నితనిప్రసాదవిహితభుక్తిఁ గాదె
క్షితిధరకన్యకాపతి నిత్యుఁ డయ్యె
నీదేవుఁ డితనిప్రసాదంబుఁ గుడిచి
వేదశాస్త్రముల వివేకంబు గడఁచె

శివుఁడు గన్నప్పయుచ్ఛిష్టంబుఁ గుడిచి
యవికలవిధి నిషేధాతీతుఁ డయ్యె
లింగంబు గన్నప్ప యెంగిలిగాన
యంగమంతయు నుత్తమాంగమై యొప్పె
గణనాథుచేత లింగసమేతు డయ్యె
గణుతింప నంబిచే ఘనభక్తుఁ డయ్యె
సన్నుతికెక్క మాకన్నప్పచేత
సన్నుతసర్వప్రసాదాంగుఁ డయ్యె
ననుచు భక్తానీక మసమానలీల
వినుతింప జగములు విస్మయం బంద
నన్నగజాధీశుఁ డంత నాఁదంద
కన్నప్పదేవునిఁ గౌఁగిటఁ జేర్చి
పరగు చతుర్వర్గఫలము లాదిగను
వర మిత్తు నడుగుము వాంఛితార్థము
లనవుడు మందస్మితాననుండగుచు
ననుపక్తిముకుళితహస్తుఁడై మ్రొక్కి
"యెఱుఁగ మోక్షములవే రెఱుఁగ వాంఛితము
లెఱుఁగ వేఁడెడుమార్గ మెఱుఁగ నేమియును
ఎఱుఁగుదు నెఱుఁగుదు నెఱుఁగుదు మఱియు
మఱియును మఱియు ముమ్మాఁటికి నిన్న
కావునఁ గోరికి కడమయుఁ గలదె?
దేవ! మూలస్తంభ దివ్యలింగాంగ!

నీయతులితదయాన్వితదృష్టి యిట్లు
నాయందు నాఁటి కొనలు వసరింప
నాదగు సంస్పృహాపాదితదృష్టి
నీదృష్టిలోనన నెక్కొని పాదలఁ
గరుణింపు దక్కిన వరము లేనొల్ల
బరమాత్మ!" యని విన్నపం బాచరింప
నభిమతార్థప్రదుఁ డట్లు కన్నప్ప
కభిముఖుఁడై నిల్వ నంత సిద్ధులును
వెలయఁ దా రన్యోన్యవీక్షణానంద
కలితాత్ములై తిరుకాళత్తిపురిని
గన్నప్పదేవుఁడు గౌరీశ్వరుండు
సన్నిరీక్షణలీల నున్నవా రిపుడు
నిక్కంబు గన్నప్ప పుక్కిటినీరు
ముక్కంటి కభిషేకమున కెల్లప్రొద్దు
నేఁడును గన్నప్ప నిర్మాల్యమందుఁ
బోఁడిగా శివునకుఁ బూజసేయుదురు
మృడుఁడు గన్నప్ప కర్పించినఁగాని
యడరంగ నేఁడును నారగింపండు
కన్నర్పితముసేసె గాన లోకములఁ
గన్నప్పఁ డనఁగ మహోన్నతి కెక్క
నచ్చుట నేఁడు గన్నప్పండు శివుఁడు
నచ్చెరువందంగ నట్లున్నవాఁడు.

కావునఁ దొల్లి ముగ్ధస్వభావులకు
దేవుండు కృపసేయుఁ దెల్ల మి" ట్లనుచు
బసవయ్య ముగ్ధగణసమూహికథలు
పసరింప నాచెన్నబసవయ్య వినఁగఁ
"బృథివి నీముగ్ధులకథలు దాఁ జెప్పఁ
గథ లయ్యె"నని కథకథకు నవ్వుచును
నతులితానందసంగతి నున్న భక్త
వితతికి బసవఁ డున్నతలీల మ్రొక్కి
"యిప్పురాతనులందు నెఱుఁగరే తొల్లి
యొప్పార నిత్యంబు నొక్కభక్తుండు

### కళియంబనాయనారు కథ

నలరేఁగి కళియంబనయనా రనంగ
నిల మిమ్ము నగియించు నిదియె నేఁడుముగ
మెచ్చించె శివదేవు మీ రొక్కమాటి
కిచ్చు నవ్వుట చాలదే నన్ను మనుప"
ననుచు నవ్వించుచు నవిరళభక్తి
జనితసుఖామృతవనధిఁ దేలుచును.
బసవఁడు జంగమప్రకరంబు నిట్టు
లసలార నోలగంబై యుండి రంత

### సకలేశ్వరు మాదిరాజయ్య కథ

"పెద్దలతేఁడు పెన్నుద్దుల మొదలు
బుద్ధులప్రోక విబుధనిధానంబు

నమితవచోరాశి సుమనోనురాగుఁ
డమలినచిత్తుఁ డుదగ్రగుణాన్వితుండు
సకలవీణాప్రవీణకళావిదుండు
నకలంకనాదవిద్యాపండితుండు
వేదవేదాంతసంపాదితతత్త్వ
వాది సంసారదుర్వ్యాప్తిసంహారి
యమనియమాదివ్రతాచారవర్తి
శమదమసద్గుణాశ్రయచరిత్రుండు
ధీరమహోదారదిక్పూర్ణకీర్తి
కారుణ్యమూర్తి నిర్గతసకలార్తి
మహితసజ్జనశిఖామణి నాఁగఁ బరగు
మహి సకలేశ్వరమాదిరాజయ్య
గారి సద్భక్తి విఖ్యాపితమహిమ
ధారుణి నెట్లన్నఁ దా విస్మయంబు
నగణితకీర్తిమై నంబెయన్పురము
దగు రాజధానిగా ధరణి యేలుచును
శ్రుతి వీర్య వితరణ రూపవివేక
చతురతరూఢి, రాజ్యంబు సేయుచును
జంగమలింగైక్యసద్భక్తియుక్తి
నంగీకరించుచు నర్ప లిచ్చుచును
నోడఁబడ రాజవదుపచారములను
గడియగడియదప్ప కెడ భజింపుచును

వివిధపుష్పదళ సద్భవనాంతరమున
శివదేవు సంస్తుతి సేయుచున్నంత
రమణ బత్తీసాదిరాగంబులకును
నమర నన్నియు దండియలు నియోగించి
యేరాగమున సకలేశున కర్థి
యారాగ వీణ దా నలరి ధ్వనింప
రావణహస్తంబు బ్రహ్మవీణయును
లావణ్యవీణ కైలాసవీణయును
నాకాశవీణ పినాకివీణయు వి
వేకింప సారంగవీణయుఁ గూర్మ
వీణయు స్వాయంభు వీణయు గౌరి
వీణయుఁ గిన్నరవీణయు జనక
యనునివి మొదలుగా నందులో మున్న
ధ్వనియించినట్టి యాదండియల్ దివిచి
తనరుచు మొగచాళమును నచరాణ
మును మఱి సచరాణమును దీపు బెరయఁ
దాళపట్టియుఁ గత్తరి చోళవణియు
లీల సారణయుఁ దలిర్ప సంప్రీతి
నిపుడంగ "సకలేశ ! నిత్యకల్యాణ !
యవధారు ప్రాణనాయక ! నాదమూర్తి !
యంచును వాయించు నారాగమంద
యంచితాళప్తికి నభిముఖుం డగుచు

సదములచిత్తుఁడై సప్తస్వరముల
నుదయించు శ్రుతు లిరువదిరెండుఁ గూర్చి
ఘనతర నారాటకావృళం బనెడు
ధ్వనిగూడఁ జౌదళంబను శారీరమున
ననిబద్ధరూఢిమై నాళతి జేసి
తనరెడు గమకసప్తకము సంధిల్ల
మానితంబగు మంద్రమధ్యతారములు
దానొంద లయలంకితంబులు నిగుడ
లాలిత శుద్ధసాళగములు బెగయఁ
గ్రాలుచుఁ దేశిమార్గంబులు వెలయ
లలి ద్రుతమధ్య విలంబితంబులను
నలిఁ దాళమానమానంబులు సూపి
ధాతులసంగతుల్ జాతులరీతి
ఖ్యాతిగఁ గూర్చి నిబద్ధరూపమున
లాలితంబుగను వైళంబుఁ దాళంబు
సాళి పెళ్లాపెళ్లి జాయనుజాయి
యుచితమొయ్యారంబునొగిఁ బంజళంబు
ఖచరంబువిషమంబు గ్రహమోక్షణంబు
భుజవణి రవణియు భరణి మిరాయి
నిజవణి నివళంబు నివయవైధసము
నిగిటి సుధాయి సన్నిగితంబు మిశ్ర
మగు గ్రహ త్రితయంబు నంశుకలిత

గాఢంబు లలి రాఁగ కాకును బౌచ్ఛ
గాఢంబు మఱి దేశికాకును సింధు
నలిఁ గరుణాకాకు నఖకర్తరియును
హాళువాయియును ధరహారసమవాయి
పరగ గుండాగుండి భ్రమరలీలయును
గురుడి మోడామోడి పొరిరవాళంబు
తిక్షాయిహోయలును రిక్షిలవిళగు
చౌక్షాయియాదిగాసొగయురాయములు
దళుక్షొత్త దేశాక్షి ధన్నాసి దేశి
మలహారి సకలరామక్రియ లలిత
సాళంగ నాట గుజ్జరి మేఘరంజి
వేళా వుళియుఁ జిత్రవెళా వుళియును
మాళవి సిరియు వరాళి కాంభోజి
గౌళపంచకము బంగాళంపు గురిజ
భైరవిద్వయమును బడపంజరంబు
నారంగ గుండక్రియయు గౌళికయును
దేవక్రియయు మధ్యమావతితోడి
యావసతంబును నాదిగాఁ గలుగు
విరచితస్త్రీరాగపురుషరాగములు
సరసమై లక్ష్యలక్షణనిర్వికార
పూరితనాదగంభీరవిన్యాస
సారోక్తిగీతంబు లారఁ బాడుచును

దమితము కఖిలవాద్యంబులు మ్రోయఁ
గ్రమ మొందఁ గేళికగతి నటింపుచును
వాతివాతికి హర్షపూరము ల్గాఁగఁ
గోరి భక్తాలి కింపార మ్రొక్కుచును
బాయక రేయును బవలు లింగార్చ
నాయతామృతవార్ధియం దోలలాడ
నఖిల సామ్రాజ్య సమంచిత సరస
సుఖముల కెమ్మెయి సొగయకున్నెడను
మల్లరసను నొక్క మండలేశ్వరుఁడు
దొల్లి యిట్టుల రాజ్య మొల్లక విడిచి
శ్రీగిరి కేఁగి నిశ్చింతాసమాధి
నాగిరి బిల్వవనాభ్యంతరమున
నున్నవా రని వారియురుభక్తిగుణము
మహోన్నతికయు ధ్యానయోగసంపదయు
శివభక్తితత్త్వానుభవసమగ్రతయు
శివభక్తగణములచే వినఁబడుడు
నప్పుడు శ్రీగిరి కరుదెంచి రర్థిఁ
జూప్పరు మల్లరసును జూచువేడ్క
రయ మందఁగా మాదిరాజయ్యగారు
క్రియ దులుకాడ నగ్గిరి శృంగములను
స్ఫాటికపర్వతబహుశృంగములను
హాటకరత్నమయాంచితాద్రులను

ఘాతాళగుహల నభ్రంకషశిలల
భూతలప్రచ్ఛన్నపురవరంబులను
స్పర్శవేదుల మణిపర్వతంబులను
దర్శనముక్తిప్రదస్థానములను
ఖగమృగనాగసంకరనివాసముల
నగణితోద్యానవనాంతరంబులను
బర్వతచూడానిపతితధారాంబు
నిర్వికల్పప్రవాహోర్వీస్థలముల
నంతంత నిలిచి యేకాంతదేశముల
సంతతలింగపూజనలు సల్పుచును
జనుదెంచి చనుదెంచి యనుపమబిల్వ
వన సమీపంబున ఘనతరంబైన
రుద్రాక్షశైలముల్ రుద్రాక్షతరులు
రుద్రాక్షగనులును రుద్రాక్షనదులు
భసితంపు గిరులును భసితంపుఁ దరులు
భసితంపు గనులును భసితంపు నదులు
లింగ పర్వతములు లింగ వృక్షములు
లింగాకరంబులు లింగతీర్థములు
జంగమశైలముల్ జంగమతరులు
జంగమగుల్మముల్ జంగమలతలు
సల్లాపశైలముల్ సల్లాపతరులు
సల్లాపగుల్మముల్ సల్లాపలతలు

గాయకశైలముల్ గాయకతరులు
గాయకగుల్మముల్ గాయకలతలు
గాయకమృగములు గాయకాలులును
గాయకపక్షులు గాయకఫణులు
నాట్యపర్వతములు నాట్యవృక్షములు
నాట్యగుల్మంబులు నాట్యవల్లరులు
నాట్యమృగంబులు నాట్యపక్షులును
నాట్యోరగంబులు నాట్య వానరులు
దనరు కాష్ఠజ్యోతులును దృణజ్యోతు
లును వాలుకాజ్యోతులును జ్యోతినదులు
జలపర్వతంబులు జలవృక్షములును
జలవిహంగంబులు జలమృగావలులు
బహువర్ణవృక్షముల్ బహువర్ణశిలలు
బహువర్ణగుల్మముల్ బహువర్ణలతలు
బహురూపవృక్షముల్ బహురూపశిలలు
బహురూపగుల్మముల్ బహురూపలతలు
ఖేచరవృక్షముల్ ఖేచరగిరులు
ఖేచరగుల్మముల్ ఖేచరలతలు
హర్మ్యపర్వతములు హర్మ్యవృక్షములు
హర్మ్యగుల్మంబులు హర్మ్యవల్లరులు
మృగరూపవృక్షముల్ మృగరూపశిలలు
మృగరూపగుల్మముల్ మృగరూపలతలు

ఖగరూపవృక్షముల్ ఖగరూపశిలలు
ఖగరూపగుల్మముల్ ఖగరూపలతలు
నరరూపవృక్షముల్ నరరూపశిలలు
నరరూపగుల్మముల్ నరరూపలతలు
సురరూపవృక్షముల్ సురరూపశిలలు
సురరూపగుల్మముల్ సురరూపలతలు
సూతవృక్షములు ప్రసూతవృక్షములు
సూతశైలములు ప్రసూతశైలములు
గంధర్వవృక్షముల్ గంధర్వశిలలు
గంధర్వగుల్మముల్ గంధర్వలతలు
నీడలు దిరుగని నిత్యశైలములు
నీడలు దిరుగని నిత్యవృక్షములు
నీడలు లేని సాన్నిధ్యశైలములు
నీడలు లేని సాన్నిధ్యవృక్షములు
దూరంబునను నీడ దోఁచు శైలములు
దూరంబునను నీడ దోఁచు వృక్షములు
ప్రొద్దొక్కసాయరైపొలుచుశైలములు
ప్రొద్దొక్కసాయరై పొలుచువృక్షములు
తరులును గిరులును దగిలి రమింపఁ
బరగనప్పుడె పుట్టు బాలశైలములు
తరులును గిరులును దగిలి రమింపఁ
బరగ నప్పుడె పుట్టు బాలవృక్షములు

శైలము ల్గొలువఁగ శైలము లెక్క
లీలనేఁగెడు రాజశైల సంఘంబు
వృక్షము ల్గొలువంగ వృక్షము లెక్క
యీక్షితిఁ జను రాజవృక్షసంఘంబు
ఎక్క వీక్షింప నీ రేడులోకములు
నక్కజంబుగఁ గాంచునట్టి శైలములు
ఎక్క వీక్షింప నీరేడులోకములు
నక్కజంబుగఁ గాంచునట్టి వృక్షములు
ఎక్క యూఁగించిన నెక్కడికైనఁ
జక్కనఁ గొనిపోవఁ జాలు శైలములు
ఎక్క యూఁగించిన నెక్కడికైనఁ
జక్కనఁ గొనిపోవఁ జాలు వృక్షములు
ఎక్క తలంచిన నేరూపమైన
గ్రక్కున నప్పుడ కాఁజేయు గిరులు
ఎక్క తలంచిన నేరూపమైన
గ్రక్కున నప్పుడ కాఁజేయు తరులు
సగము వృక్షంబులు సగము శైలములు
సగము మృగంబులు సగ మండజములు
పండువృక్షములట్లు ప్రబలుశైలములు
గొండలక్రియ గిరికొన్న వృక్షములు
ఒక్కొకగడియ కొక్కొకపండు రాలు
నక్కజం బగు గడియారవృక్షములు

ఒక్కొకగడియ కొక్కొకమాటు చెలఁగు
నక్కజం బగు గడియారశైలములు
మొదలికి నఱికిన నదికికొన్తరులు
మొదలికిఁ ద్రుంచిన నదికికోలతలు
వైచినఁ గ్రమ్మఱ వచ్చి యచ్చటన
పై చని నెలకొను పాషాణములును
రవితోన యుదయించి దివి దాఁకఁ బెరిఁగి
రవితోన దిగజాఱి భువిఁ గూడుగిరులు
నాలుగువాఁకిళ్లు నలిఁ గానుపించు
నాలుగుచఱుల యానను మెక్కి చూడఁ
బురములు గాన్పించు భూరిమహత్త్వ
మరుదగు శ్రీగిరి గిరు లన గిరులు
నాలుగువాఁకిళ్లు నలిఁ గానుపించు
నాలుగు కొమ్ముల నడు మెక్కి చూడఁ
బురములు గాన్పించు భూరిమహత్త్వ
మరుదగు శ్రీగిరి తరు లనఁ దరులు
సంగతంబుగ నెక్కు జనులఁ బాతాళ
గంగ నాడించు గంగాశైలములును
సంగతంబుగ నెక్కు జనులఁ బాతాళ
గంగ నాడించు గంగావృక్షములును
చని యొక్క నయ్యష్టషష్టితీర్థములు
సనక చూపెడు నష్టషష్టిశైలములు

చనిరెక్కు నయ్యష్టషష్టితీర్థములు
సనకచూపెడు నష్టషష్టివృక్షములు
పారిపారిఁ దములోన నోరయఁగ నక్కి
దరిగొని కాలంగఁ దనరుశైలములు
పారిఁబారిఁ దములోన నోరయంగ నక్కి
దరిగొని కాలంగఁ దనరువృక్షములు
క్షీరపర్వతములు క్షీరవృక్షములు
క్షీరతటాకముల్ క్షీరదీర్ఘికలు
దధిపర్వతంబులు దధివృక్షములును
దధితటాకంబులు దధిదీర్ఘికలును
ఘృతపర్వతంబులు ఘృతవృక్షములును
ఘృతతటాకంబులు ఘృతదీర్ఘికలును
నమృతపర్వతములు నమృతవృక్షములు
నమృతతటాకంబు లమృతదీర్ఘికలు
రసపర్వతంబులు రసవృక్షములును
రసతటాకంబులు రసదీర్ఘికలును
కనకపర్వతములుఁ గనకవృక్షములు
గనకతటాకముల్ గనకదీర్ఘికలుఁ
గనకమృగంబులుఁ గనకోరగములుఁ
గనకభృంగంబులు గనకపక్షులును
గనకంపుగుల్మముల్ గనకంపులతలుఁ
గనకంపురేణువుల్ గనకంపుటిసుముఁ

కనకంపుఁబురములుఁ గనకహర్మ్యములుఁ
గనకంపుఁగోటలుఁ గనకంపుగుళ్లు
మణిపర్వతంబులు మణివృక్షములును
మణిగుల్మవితతులు మణిలతావళులు
రత్నపర్వతములు రత్నవృక్షములు
రత్నగుల్మంబులు రత్నవల్లరులు
ఒకగొమ్మశోకంబు నొకగొమ్మసురభి
యొకగొమ్మ న్యగ్రోధ మొకగొమ్మసింత
యొకగొమ్మగురవక మొకగొమ్మ గ్రముక
మొకగొమ్మఘనసార మొకగొమ్మసెఱకు
నొకగొమ్మనందనం బొకగొమ్మదిలక
మొకగొమ్మసంపకం బొకగొమ్మ గ్రోవి
యొకగొమ్మమందార మొకగొమ్మవకుళ
మొకగొమ్మమారేడు నొకగొమ్మపొన్న
యొకపువ్వు విరవాది యొకపువ్వు మల్లె
యొక పువ్వుసేవంతి యొకపువ్వుగోఁగు
నొకపువ్వు గరవీర మొకపువ్వుగలువ
యొకపువ్వుదామర యొకపువ్వు మొల్ల
యొకపువ్వుగోరంట యొకపువ్వుజాజి
యొకపువ్వుసెంగల్వ యొకపువ్వు మొగలి
యొకపండు సహకార మొకపండునిమ్మ
యొకపండునారింజ యొక్కపం డనఁటి

యొకవండు నేరేడు నొకవండు వెలఁగ
యొకవండు ఖర్జూర మొక్కవం డీత
యొకవండు దాడిమం బొకవండు మావి
యొకవండు గంగరే గొకవండు పనస
వ్యాపించి మొదలొక్కలై యిట్లుగూడ
రూపితం బగుబహురూపవృక్షములు
ఒకదిక్కు మణిశ్వేత మొకదిక్కు పీత
మొకదిక్కు మాంజిష్ఠ మొకదిక్కు రక్త
మొక్కదిక్కు గపోత మొకదిక్కు నీల
మొక్కటఁ దోఁపంగఁ బెక్కువర్ణముల
వఱలియొప్పెడు బహువర్ణశైలములు
వఱలి యొప్పెడు బహువర్ణవృక్షములు
కొంత విద్రుమమును గొంత ద్రాక్షయును
గొంత దారదవల్లి గొంత దాంబూలి
యేపార మొద లొక్కలై యిట్లుకూడ
రూపితం బగు బహురూపవల్లరులు
నడర నేతెంచి లింగాంగణంబున
సుడిగొని సువులు దుడుచుమారుతము
లిమ్ముల లింగాలయమ్ములఁ గలయ
సమ్మార్జనము సేయు స్వల్పవర్షములు
చట్టన నేతెంచి సర్వలింగముల
చుట్టును ముగ్గులు వెట్టుసస్యములు

ఎలమి లింగము లున్నయెడల కేతెంచి
జలకంబు లార్చుచుఁ జనుతీర్థములును
నందంబుగఁ దిగిచి యాలింగములకుఁ
జందనంబులు పూయు చందనతరులు
భావింపము ప్రోద్దు వటులింగములనుఁ
బూజింప నేతెంచు పుష్పవాటికలు
వేడుక నెప్పుడువివిధ లింగములకుఁ
గూడి ధూపములిచ్చు గుగ్గులతరులు
దనర లింగములకుఁ దగ నివాళులిడి
చనుతృణజ్యోతి కాష్ఠజ్యోతి చయము
నలర లింగములకు ననయంబు వచ్చి
ఫలము లర్పణసేయు బహువిధతరులు
నమరలింగములకు ననయంబు వీడి
యములునివేదించు క్రముకాదితరులు
ధరణి వెండియుఁ దమతమ పేళ్ల మీఁదఁ
బరగ నీశ్వరనామ మరుదుగా నిలిపి
"వృక్షేశ! శర" ఱని వృక్షాలయముల
వృక్షలింగముల నర్చించు వృక్షములు
"గిరినాథ! శర" ఱని గిరిగహ్వరముల
గిరిలింగములఁ గొల్చు గిరిసమూహంబు
"మృగనాథ! శర" ఱని మృగనివాసముల
మృగలింగములఁగొల్చు మృగసమూహములు

"ఖగనాథ శర"ణని ఖగమండలముల
ఖగలింగములఁగొల్చు ఖగసమూహంబు
"నురగేశ! శర"ణని యురగాలయముల
నురగలింగములఁ గొల్చురగసంఘములు
"భృంగేశ! శర"ణని భృంగాలయముల
భృంగలింగముల నర్చించు భృంగములు
"జలనాథ! శర"ణని జలజాకరముల
జలలింగములఁగొల్చు జలజాకరములు
"తీర్థేశ! శర"ణని తీర్థాలయములఁ
దీర్థలింగములఁ బ్రార్థించుతీర్థములు
"మునినాథ! శర"ణని మునిపల్లెలందు
మునిలింగములఁగొల్చుమునిసమూహంబు
"శబరేశ! శర"ణని శబరాలయముల
శబరలింగము గొల్చుశబరసంఘములు
నుపమకు మిగిలిన యురువీరఘోర
తపము లాపాదించు తాపసవరులు
నిట్టలంబుగ మీఁద బుట్టలు పెరిఁగి
మెట్టలక్రియ నున్న మేటిసన్మునులు
విరచితంబై మీఁద వృక్షముల్ మొలవ
నురువృక్షములభాతి నున్నసన్మునులు
శిలలతోడనకూడఁ గలయఁగఁ బెరిఁగి
శిలరూపములభాతి నలరు సన్మునులు

ముక్తకేశము లొడఁ ల్లుంచిపైఁ బెరుఁగ
వ్యక్తనీలాద్రుల ట్లలరు సన్మునులు
మేదిని దలమోపి మీఁదికి నూర్ధ్వ
పాదులై తపము లాపాదించు మునులు
నేకపాదాంగుష్ఠ మిలమీఁద మోపి
ప్రాకట తపము లాపాదించుమునులు
పంచాగ్నినడుమను బయల దీర్ఘికలు
ముంచి పాటిగఁదపములు సేయుమునులు
జలపత్రవాలుకానిలకందమూల
ఫలశిలాహారులై పరగుసన్మునులు
వృక్షము ల్వెట్టంగ భిక్షము ల్గుడిచి
యక్షయకాయులై యలరుసన్మునులు
పర్వతంబులువెట్ట భైక్షము ల్గుడిచి
నిర్వికల్పస్థితి నిల్చుసన్మునులు
నొనర జలక్రీడయును వనక్రీడఁ
దనరుచుఁ దనియు గంధర్వదంపతులు
నమితస్వయంభు లింగార్చనాసక్తి
నమరంగ నేతెంచు నమరవర్గములు
జలకన్యకలు నొప్పు బిలకన్యకలును
జలపురుషులు నొప్పు బిలపురుషులును
గరినివహంబులుఁ బురుషమృగములు
శరభశార్దూలాదివరమృగావలులు

గండమృగములు భేరుండ తండములుఁ
జండోరగములు శిఖండి యూథంబు
దొడరి యన్యోన్యశత్రుత్వంబు లుడిగి
యడరుచుఁ దమలోన నాడుచు నెపుడుఁ
దనరి యొప్పెడు బిల్వవనమహత్త్వంబు
గని వినుతింపుచు వనమధ్యమందు
వినయస్థుఁడై తన్ను వెదకుచువచ్చు
"ననఘుని మాదిరాజయ్య మనంబుఁ
జూచెదఁగాక" యంచును మల్లికార్జు
నాచార్యుఁ డపరిమితాంగంబుఁ దాల్చి
తెరువున కడ్డమై దివియును భువియుఁ
బరిపూర్ణముగఁ జాఁగఁబడి యున్నఁ జూచి
పరమయోగీంద్రుఁడో? భసితంపుగిరియొ?
ధరఁ బడ్డ రుద్రాక్షధరణీరుహంబొ?
సదమలజ్యోతియో శంభురూపంబొ?
విదితచిదబ్ధిసముదితపూరంబొ?
యెచ్చోటఁ బోవరాదెట్లొకో" యనుచు
నచ్చెరువంది మాదాఖ్యుఁ "డీక్రమము
నరయుదు"నని యుత్తమాంగంబు దిక్కు
పరిగొని మూఁడేఁడు లరసికానకయుఁ
బదపద్మములమీఁదఁ బడ కేటువచ్చు
టిది దప్పు దా నంచుఁ బదపడి మగిడి

యచ్చోటనుండి యయ్యడుగులదిక్కు
గ్రచ్చర వర్షాష్టకమునకు వచ్చి
యంత భయభ్రాంతుఁడై "నీదురూప
మంతసూపక యేలయా! యిటు లేఁప
నే నెంతవాఁడ నిన్నెఱుఁగెద ననఘ
నానందమూర్తి! నీయడుగులు సూపి
రక్షింపవే" యని ప్రస్తుతింపుచును
బక్షుద్వయము సాఁగఁబడియున్నఁ జూచి
యయ్యవసరమున నమ్మల్లికార్జు
నయ్యగా రంతఁ బ్రహసితాస్యుఁ డగుచుఁ
దనతొంటిభావంబుఁ దాల్చి "నీమనసుఁ
గనుఁగొన నిట్లైతి"యనుచు మాదాఖ్య
"లెమ్మ"ని చెయి సాఁచి లేవంగనెత్తి
క్రమ్మఱ నందంద కౌఁగిటఁ జేర్చి
"యిట్టి సాహసి వౌదువే మమ్ముఁ జూడ
నెట్టయా వచ్చితి విచ్చటి" కనుచుఁ
దననివాసస్థానమునకుఁ దోడ్కొనుచుఁ
జని యంతలింగావసరము సేయించి
తనప్రసాదము వెట్టి యనుపమతత్త్వ
జనితానుభవసుధావనధిఁ దేల్చుచును
గొంతవ్రొద్దటయుంచుకొని యుండి "యింకఁ
గొంతకాలము గ్రియాభ్రాంతిమైధరణి

నుండఁగఁదగు" నని యురుతరకీర్తి
మండితసద్గురు మల్లికార్జునుఁడు
నానతియిచ్చుడు నప్పాదిరాజు
"తా నెట్లు వోవుదు నానందమూర్తి
తగు నిఱువేద నిధానంబుఁ గాంచి
దిగవిడ్చి యేఁగునే మగిడి కూలికిని?
కంటి మీ శ్రీపాదకమలంబు లేను
మంటి నింకేటికి మగుడుదు ననిన
మెల్లన నవ్వుచు మేలు గా కనుచు
మల్లికార్జునుఁడు సముల్లాసకీర్తి
నిత్యస్వరూపవినిశ్చితంబైన
ప్రత్యయంబుల నొడఁబఱపఁగఁ దలఁచి
"యక్కటి ర"మ్మని యట యొక్కదుమ్ము
చెట్టు గావించి నిశ్చింత సమాధి
నిట యుండు మీవని యట యేఁగి తాను
గుటిలవేషంబున గొల్లనిభాతి
బఱపువ్రేళ్లును మొద్దుపాదముల్ గుజ్జు
చిఱుతొడలును దొప్పచెవులును బరడు
ప్రక్కలు బీరనరములును జివక
ముక్కును ముడిబొమల్ మొగిదోనికడుపుఁ
బొక్కిళ్లు వోయిన చెక్కిళ్లు వలుద
బొక్కటొమ్మును బెద్దనిక్కిన మెడయుఁ

బల్లమీసములు నేర్పడు కాయకన్నుఁ
బిల్లిగడ్డంబును నల్లనిమేనుఁ
బ్రాఁకువట్టినపండ్లు బ్రద్దచేతులును
వీఁక కాళ్లును నడ్డివీపును దనర
ములుగత్తి యుచ్చుఁగోకలు జూఁడుఁగోడుపు
మొలతిత్తి నిడిదొడ్డ మొలకచ్చగట్టి
గాలిదప్పపు వెండ్రుకల్ దూలియాడ
నీలవెట్టుచు నుఱేఁ మెట్టుఁ జూచుచును
గుక్కలఁ బిలుచుచు ఱెక్కవెట్టుచును
నెక్కొన నొరగాల నిలుచుచుఁ జనుచు
గొడ్డలి బరిగమ్మి గూటికుండయును
దుడ్డుఁగోలయుఁ బట్టి తోడిఁదోడిఁ గొన్ని
మేఁకపిల్లలఁ దనచా కిట సిఱకి
వీఁక దబ్బఱవాట్ల విసరివ్రేయుచును
గొన్నిమేఁకల రొప్పికొని వచ్చి తుమ్మ
నున్నకాయలు రాల్పియును నంతఁ బోక
యిమ్ములఁదనమీఁదికొమ్మొక్కగొల్ల
గ్రమ్మఱ నఱకంగఁ గలుషించిచూచి
"నామీఁదికొమ్మేల నఱకెదవోరి
గామిడిగొల్ల! యీకాననంబునను
మాఁకు నీకై యున్న యీకొమ్మెకాని
చేకొని నఱకంగఁ జెట్టులు లేవె?

శంకమాలితి క్రొవ్వి చక్కమైమఱచి
యింక నాచేత నీ వెట్లు పోఁగెదవు
పాపపుగొల్ల నీ బఱతుఁగా క''నుచుఁ
గోపించి తిట్టుడు గొల్లండు నవ్వి
"బాపురే నిర్వాణి! బాపురే తపసీ!
బాపురే బాపురే కోపపుంజంబ!
పాపంబుఁ నొందెడుకోపించువాఁడు
పాపిగాఁ కేనేల పాపి నఘాఢ్యదను
క్షలియించు కోపాగ్నికణములఁజేసి
కలఁగదే మానసఘనసరోవరము
యెసఁగెడు కోపాగ్ని నింకదే చెపుమ
మసలక హృదయాబ్జమకరందధార
వెలువడు కోపాగ్ని వేఁడిమిఁజేసి
వలఁగదే సచ్చిదానందపద్మంబు
జ్ఞానంబు సొంపా! విచారంబు పెంపా?
ధ్యానంబుఫలమొ యీతామసగుణము?
నా కేమి సెప్పెద, వీకాననమున
లేకున్నవే చెట్లు నీరుఁ గూర్చుండ
నిట్టిశాంతాత్మకు లెచ్చోటఁ గలరు!
పుట్టుదురే నినుఁ బోల సంయములు!
వఱదవోవు నెలుఁగు గొఱుపడంబనుచు
నెఱుఁగక యీఁత కాఁడేఁగి పట్టుడును

వడిఁ బాఱునెలుఁగంత వానినపట్టఁ
గడనున్న వాఁ 'డోరి! విడువిడు' మనుడు
'విడిచితి నది దన్ను విడువ' దన్నట్టి
వడువున విడిచిన విడుచునే మాయ
పొంగి చిచ్చుఱుకంగఁ బోవుచుఁ జీర
కొం గోసరించు పెన్వెంగలియట్ల
చెల్లుఁ బొమ్మని సన్న్యసింపఁబోవుచును
నిల్లప్పగించు నయ్యిబ్బందియట్ల
పదపడి నూతిలోఁ బడఁబోయి తాప
వెదకుచు మెట్టెడిపేటి డియట్ల
జ్ఞానాత్ముఁడై సర్వసంగముల్ విడిచి
తా నాశ్రమముఁ గోరు తపసిచందమున
నిల మరు ల్వోయి రోఁకలి గొనిరంపు
తలఁ జుట్టుకొనియెదఁ బా నన్నయట్లు
పానలేల చెఱకుపం డెమం దొక్క
యీనె సిక్కిన నోడు టేకాదె తలఁప
రోసి సంసారంబుఁ బాసి యొక్కింత
యాసించెనేనిఁ గు నది వెఱ్ఱిగాదె?”
యని తన్ను మదలించుచును నెట్టయెదరఁ
దనతొంటి భావంబుఁ దాల్చినఁ జూచి
కనుమూసి తలవంచి కలయ లజ్జించి
ఘనతరశోకాశ్రుకలితాస్యుఁ డగుచు

"నెక్కడిభక్తి? నా కెక్కడిముక్తి?
యెక్కడఁ జూచినఁ దక్కనే మాయ
గతి మతిచైతన్య కర్మక్రియాదు
లతిశయంబై కల్గు నంతకుఁ దనదు
క్రియ యెట్టు లట్లు వర్తింపక శివుని
దయ వడయంగ నిశ్చయ మెట్లు వచ్చుఁ
గనుఁగాయఁ ద్రెంచినఁ గా యగుఁగాక
పసనిపండగునయ్య శాంతిఁ బొందినను
శాశ్వత కీర్తి నిశ్చల భక్తియుక్తి
యీశ్వరుకృప లేక యేల సిద్ధించు?
కటకటా! నాయట్టి కర్మికి నిట్టి
పటునిస్పృహత్వంబు ప్రాప్తవ్య మగునె?"
యనుచున్న మాదిరాజయ్య గారలను
గనుఁగొని మల్లయ్య కౌఁగిటఁ జేర్చి
"కర్మవిదూర! దుఃఖం బింత వలదు
కర్మల కేల మాకడకు రావచ్చు?
నీవు మర్త్యమునకుఁ బోవుటకొఱకు
నీ వికల్పము లెల్ల నేమె చేసితిమి
ఏమిగారణ మనియెద వేని వినుము
యామహాదేవుని యానతిఁ జేసి
వసుధకు సద్భక్తివర్ధనార్థముగ
బసవండు నా నొక్క భక్తుండు వచ్చి

యున్న వాఁ డాతని యుదితగోష్ఠీస
మున్నతసుఖవార్ధి నోలలాడుచును
బరమశివాచారసరణి వర్తిల్లఁ
జరియింపవలయు నద్ధరణిలో నీవు
ఎవయంగ నార్యాలు నేఁబదియేండ్లు
సనిరొు నీ విట వచ్చి సంయమితిలక!
యొన్న నింకేఁబది యేండ్ల కిక్కడికి
నిన్ను రప్పించికొనెద నిక్కువంబు
ఇటుగూడ నేడుచూతేండ్లకుఁగాని
యిట యున్కిగా నేర దిప్డు డీప్సితము
నే మేనియును వేఁడు మిచ్చెద" ననుడు
నామల్లికార్జునయ్యకుఁ గేలు మొగిచి
"శ్రీయంద మే పరస్త్రీ నిక్కువఁబు
నాయువంద మె మాయ కది జన్మభూమి
స్వర్గ మంద మె యధ్రువం, బింక మోక్ష
వర్గ మంద మె మున్న భర్గునిపదము
ఏమియు నొల్ల నీ వెఱుగవే దేవ!
స్వామి! సర్వజ్ఞాన! సకలేశ!" యనుచు
నంతంత సాష్టాంగుఁడై మ్రొక్కి నిలుచు
నంత వారికృపఁ గళ్యాణంబునందు
బసవనియొదుటఁ బెంపెస గంగ నిలిచె

నసముండు మాదిరాజయ్య తత్క్షణము
యింట బసవఁడు సంగమేశ్వరునందు
నటమున్న పొడగాంచి సాష్టాంగ మెఱఁగి
మ్రొక్కనమ్మాత్రన ముందటనున్న
నక్కజుండగుచు నందంద మ్రొక్కుచును
వత్సలత్వంబు నివ్వటిలంగ నతులి
తోత్సవలీలమై నుల్లసిల్లుచును
నంచితలింగసుఖాపారసార
సంచితామృతవార్ధి ముంచి యెత్తుచును
బసవనిచేఁ బూజ వడయుచునుండె
నసలార మాదిరాజయ్యగా రిట్టు
లీజగత్త్రయి సకలేశ్వర మాది
రాజయ్యగారి నిర్మలచరిత్రంబు
విస్తరించినఁ బ్రీతి విన్న వ్రాసినను
ప్రస్తుతభక్తి శుభంబులు నెందు
ధీమణి! సుజనచింతామణి! బుధశి
ఖామణి! ధర్మరత్నామణి! శుద్ధ
శరణజనానందకరణ! సత్పథవి
హారణ! సంతతదయాభరణచేతస్క!
లలిత నిర్మలయశఃకలితదిగంత!
ఫలిత సద్భక్తి సమ్మిళితాంతరంగ!

రహితషడ్ధ్వాన! విరచితసద్భావ!
మహిత తత్త్వార్థ సన్నిహితావధాన!
విదిత ప్రసాద సంవిత్సౌఖ్యభోగ
ముదితాత్మ! సంగాఖ్య! మృదితేంద్రియాఘ
ఇదియసంఖ్యాత మాహేశ్వరదివ్య
పదపద్మ సౌరభ భ్రమరాయమాణ
జంగమలింగ ప్రసాదోపభోగ
సంగత సుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ
సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగ ఘనకరస్థలి విశ్వనాథ
వరకృపాంచితకవిత్వస్ఫూర్తిఁ బేర్చి
చను బసవపురాణమను కథయందు
ననుపమంబుగఁ దృతీయాశ్వాసమయ్యె.

---

# బసవపురాణము

## చతుర్థాశ్వాసము

శ్రీగురులింగసుస్థిరదయాపాంగ
యోగాత్మ! భక్తిమహోత్తుంగ! సంగ!

### మడివాలు మాచయ్య కథ

మఱియును మడివాలు మాచయ్యనాఁగ
నఱలేని వీరవ్రతాచారయుతుఁడు
శ్రేష్ఠుఁడు జంగమప్రష్ఠుఁడు న్యాయ
నిష్ఠురాలాప మహిష్ఠమండనుఁడు
నిష్ఠితేంద్రియగుణాన్వితుఁడు లింగైక్య
నిష్ఠాపరుఁడు సుప్రతిష్ఠితకీర్తి
భవిజనసంసర్గపథపరిత్యాగి
ప్రవిమలతత్త్వానుభవసుఖాంభోధి
పరగు భాషావ్రతపాలనశాలి
దరితషడ్వర్గుఁ డాస్థానంబుజ్యోతి
రజకజాత్యావృతప్రత్యక్షరుద్రుఁ
డజరామరుం డయోనిజుఁ డవ్యయుండు
శరణపదాంభోజషట్పదుం డనఁగఁ

బరగి హిప్పరిగె యన్పురవరంబునను
నుండంగ బసవనియురుభక్తివార్ధి
నిండారి దెసలను నిట్టవొడుచుడుఁ
బొంగి లింగానందపూరితుం డగుచు
జంగమదర్శనాసక్తి నేతెంచి
బసవనిచేఁ బ్రణిపత్తి గైకొనుచు
నసమజంగమకోటి కర్చ లిచ్చుచును
బంటింపక వరువుఁ బనులు సేయుచును
గంటి నాచేతులకసివోవ వసుచు
బాస వట్రిల్ల సద్భక్తసంఘంబు
మాసినవస్త్రముల్ మఱి మోసికొనుచు
వేవుజామున నేఁగి వేఱొక్క రేవు
గావించి యుదుకుచు ఘట్టనల్ సేసి
శస్త్రసమేతుఁడై సద్భక్తవితతి
వస్త్రముల్ రజతపర్వతభాతిఁదాల్చి
పరిగొనివచ్చుచోఁ బురవీథి "భవులు
శరణులవస్త్రముల్ సంధిల్లిరేని
నోడఁ జాఁ బొడుతుఁ జుండో" యనిఘంట
నాడాడ వ్రేయుచుఁ గూడఁ జాటుచును
నురమున కేతెంచి మఱుఁగులన్నియును
గరిసముల్గాకుండ ఘట్టించి మడువ
నట్టిచో జంగమం బరుదెంచి యడుగ

నెట్టికట్టంబైన నిచ్చి మ్రొక్కుచును
నావస్త్రముల వార లడుగవచ్చినను
లేవన కందిచ్చు లింగసంపదను
అంత నద్భుతచిత్తుఁడై బసవండు
సంతతంబును విని సంస్తుతుల్ సేయు
"నలిభక్తతతిపలువలుదుకుచాకి
విలసితభక్తియు నిలఁ జెప్పఁబడియె
నదిగాక యేకాకియన్నడివాలు
సదములభక్తి భాషయు నొప్పెఁ గాని
యిట్టిసద్భక్తియు నిట్టిమహత్త్వ
మిట్టి సామర్థ్యంబు నెఱుఁగ మే"మనుచు
సల్లీల ననిశంబు సంస్తుతు ల్సేయఁ
దెల్లగానటు గొన్నిదినములు సనఁగఁ
బఱతెంచుచోఁ ముట్టుపాలైన నొకని
నఱిముఱిఁ జంపి మాచయ్య యున్నెడను

మాచయ్య తెరువరిని జంపెనని పౌరులు బల్లహునకుఁ జెప్పుట

పౌరువారన కెల్లవారును గూడి
ధారుణీశ్వరు సభాస్థలి కేఁగి మ్రొక్కి
"బల్లహా! వినుము నీపట్టణంబునను
బ్రల్లదుం డొకచాకి బత్తుండ ననుచు
మొలఁ గరారముగట్టి తొలఁగండు త్రోవ
తొలఁగించు నేబల్లిదులఁ బెఱుసనఁడు

జాకికి నింతేల శ్రద్ధలు జనులఁ
జేకొన కడిచెడుఁ జేరంగనీక
యిట్టిచోద్యంబు లేమెఱుఁగ మేనాఁటు
ముట్టినఁ జీరలు మఱుగునే చెప్పుము
పురజనులకు మున్నె చరియింపరాదు
పరదేశి కింక రాఁబోసె మాపురికి
నెంతబల్లిదుఁడో నేఁ డ్వింతవాఁ డొకఁడు
సంత కేఁగఁగఁ జంపె శవమును లేదు
ఆకసంబున కేఁగు నట్టులుఁ గలవె?
చాకి రక్కసిక్రియ జనుల మ్రింగెసిని
తిట్టఁడు వలుకఁడు ముట్టినమాత్ర
నిట్టు సంపఁగఁ గూడునే వెఱవాండ్రఁ
బాడిఁ దలంపక బత్తుండ ననుచుఁ
బాడుగాఁ జంపు నీపౌరులనెల్ల"
ననుచుఁ బురోహితు లనుమతంబునను
దనయామికులఁ జూచి ధారుణీశ్వరుఁడు
"చాకి నచ్చోటన చంపుండు వాండు
కాక మ్రింగిన వానిఁ గ్రక్కించ రండు"
అనవుడు బసవఁ డిట్లనియె నాతనికి
"విను మీఁదెఱుఁగక వెడలనాడెదవు

బసవఁడు బల్లహునకు మడివాలు మాచయ్యమహిమఁ జెప్పుట

లేకులు లోకుల కాకఱపులకుఁ
"జాకిచా"కని యేల సందడించెదవు
చాకియే యతఁడు సాక్షాల్లింగమూర్తి
కాక యేటికిఁ గనుకనిఁ బలికెదవు.
కులజుండు నతఁడె యకులజుండు నతఁడె
కులము లేకయు నన్నికులములు నతఁడె
యానీలగళు నపరావతారంబు
గాన యాతఁడు సర్వగతుఁ డెట్టులనిన
సరసిజభవుజడల్ జన్నిదంబులుగఁ
బరగ భిక్షించిన బ్రాహ్మణుఁ డతఁడ
మహితాపవర్గ సామ్రాజ్యపట్టంబు
సమాజంబ పాలించు క్షత్త్రియుఁ డతఁడ
కడఁగి దుర్భవకర్మఘటవహిత్రంబు
వడి భవాంబుధిఁ ద్రిప్పు వైశ్యుండు నతఁడ
యిల సత్క్రియారంభఫలములు గోసి
సొలవక నూర్చెడు శూద్రుండు నతఁడ
యాదిశక్తియ ము న్నుపాదానముగను
నాదబిందులు గారణంబుగఁ దగిలి
వేడుక బ్రహ్మాండవివిధభాండములఁ
గూడ వానెడు నాఁటికుమ్మరి యతఁడ
హరియొమ్ము దండంబు నహిపతి ద్రాడు

నరసింహు పెరుపగునఖరంబు గ్రొంకి
యవనిమోచినవరాహం బెఱుగాఁగ
నవనిఁ గూర్మంబును నల్ల మత్స్యంబు
గాలమి క్షీరోదకంబునఁ దిగిచి
లీల నటించువాజాలరి యతఁడ
చటుల సంసృతి జీవఘటచక్రకర్మ
పటుపరివర్తనభ్రమణంబుఁ గూర్చు
కీలు వొందించి యాక్రియ రాటనముల
వాలి యాడించు నావడ్రంగి యతఁడ
మును జీవమను లోహమునకు జ్ఞానాగ్ని
నొనరఁగఁ బదనిచ్చు కనుమరి యతఁడ
యిచ్చుచో నెఱిఁగి కల్లచ్చుం నూకి
యచ్చుల నొరగొను నగసాలి యతఁడ
హరిణమై రమియించు నజునిశిరంబు
శరమునఁ ద్రెంచిన శబరుండు నతఁడ
హరిముఖ్యక్రిమికీటకాదిపశువుల
వెరవునఁ బాలించు వ్రేతేడు నతఁడ
ప్రకటితకపటనాటకసూత్రములను
వికృతిప్రకృతులార్చు వెండీడు నతఁడ
కులనగంబులు నూకి జలధులు సల్లి
పొలము వోడేర్చు నాబోయాఁడు నతఁడ
యేకార్ణవంబైనయెడ నజాచ్యుతులఁ

జేకొన కుడికెడుచాకియు నతఁడ
మహితభక్తాళికి మడుఁగులు సేఁత
మహి నిప్డు మడివాలుమాచయ్య యనఁగ
నిన్నియుఁ దానయై యిట్లున్నయతని
కెన్నఁద వాకగులం బిది నీకుఁ దగునె?
కారణపురుషావతారుఁ డాయయ్య
చారుచరిత్ర విస్మయ మెట్టులనిన
నరసింహశార్దూలకరిదైత్యచర్మ
పరిధానుభక్తులపరిధానవితతి
గాని యొం డుదుకఁడు, వానిని నంటఁ
గానీఁడు నితరుల ఘట్టించు నెడను
భక్తుల చీరల భక్తుల కిచ్చు
యుక్తసద్భక్తినియుక్తి వట్రిల్లి
జంగమం బడిగిన సముకట్టనిచ్చు
భంగిగా లింగసంపద దులుకాడఁ
జీరలువైచినవా రడిగినను
వారికిఁ దమతమవస్త్రంబు లిచ్చు
నటమీఁద నతని మహాత్త్వంబు వినఁగఁ
గుటిలాత్ములకు సముకూడను మఱియు
చీర లంటినమాత్రఁ గారించుభక్తుఁ
డూరకుండునె చంప కీడు వోయినను
వల దభిమానంబు వొలిపుచ్చుకొనకు

మిల నొరులేల నీ వెత్తిపోయినను
జుట్టవ్రేలను జక్కఁ జూపఁగఁగలవె?
యట్టేల ? వల" దన్నఁ గట్టుగ్రుఁ డగుచుఁ
"గారణంబులుఁ గథల్ గల్పింప కిచట
నూరక చూచుచు నుండు మీ"వనుచు
బసవని వారించి పాపాత్ముఁ డంత
వెస యామికులఁ జూచి "వే యుపాయమునఁ

బిజ్జలుఁడు మాచయ్యను జంప నేనుఁగుఁ బంపుట

దోలఁగ కాతఁడు వచ్చుత్రోవన మీరు
తలఁగ కాతనిఁ దలతలమని నిలిచి
సముదాంధగంధగజంబుఁ బైకొలిపి
సమయింపు" డనవుడు జను లుత్సహింప
మావంతు లేఁగి సామజముఁ బైకొలిపి
యావీరవరురాక కరికట్టి నిలువ
నల్లంతఁ బొడగని యార్చి బొబ్బిడుచుఁ
"గల్లినాథుని భద్రగజ మొక్కనరుని

మడివాలు మాచయ్య యేనుఁగుఁ జంపుట

యేనికదున్నకు నేల పంకెంచు
మానవు ల్చాచక మగుడుఁడో" యనుచు
గంటయుఁ గొడుపును గదియింపఁ దడవఁ
బంటించె నేనుఁగు బలమెల్ల నవిసె
నంతటఁ బోక మావంతులు నూక

నంతంత డగ్గఱు నంతకుమున్న
వెన్నున నెలకొని యున్నవస్త్రములు
నన్నభోమార్గంబునం దిఱియించి
చేతిగంటయు నంద చేర్చి మైవెంచి
చేతులు సమరుచు నేతెంచి మాఁచి
దండియై మావంతుతండంబుఁ జంపి
తుండంబుఁ జేపట్టి త్రొంచి రాఁదిగిచి
యంజలిగుంజలి యల్లార్చి పేర్చి
భంజింపుచును వీరభద్రుండు దివిరి
వడి నృసింహునివైచువడువున వైచుఁ
బడనీక లోఁచేతఁ బెడచేత వేయు
నచ్చుగా నార్చుచు హరుఁ డిభదైత్యు
వ్రచ్చినగతి వ్రచ్చినందఱలాడుఁ
గోపించి విష్ణునికోలెమ్ము రుద్రుఁ
డేపునఁ దునిమిన ట్లిల నెమ్ము లేఱు
మాలకు మాంసంబు మఱి గొడారికిని
దోలును గాకుండఁ దొలఁగంగ వైచి
త్రోవ నేతెంచుచోఁ దొలఁగనిబాస
గావున నతులవీరావతారుండు
నిమ్మార్గమున భక్తులెల్ల నుప్పొంగ
నమ్మదకరి పొడవడఁచి యాక్షణమ
"యెవ్వండు నామీఁద నెనుంగుఁ గొలిపె

నవ్వసుధేశుక్రొ వ్వాకఁతుఁ బొ''మ్మనిన
సింతవృత్తాంతంబు నెఱిఁగి బిజ్జలుఁడు
నంతకమున్న మో మల్లన వంచి
బసవని దెసఁ జూడఁ బరమహర్షమున
వసుధేశునకు బసవనమంత్రి యనిరా

బసవఁడు బిజ్జలునకు శివభక్తులమహిమఁ జెప్పుట

''వలదని వారింపవారింప వినక
చలమునఁ బంచితి జనులమాటలను
నేనుంగు గోల్పడె మానంబు వొలిసెఁ
దూనిక చెడె శివద్రోహంబుఁ దగిలె

ఇరువదాండారి కథ

ధరణీశ! విను తొల్లి ద్రావిళభూమిఁ
గరయూరిచోడభూవరుని రాజ్యమున
మున్నరవాద్దడిమువ్వూరిలోన
నెన్నంగ నొకభక్తుఁ డిరువత్తుఁ డనఁగ
నపగతసర్వసంగపరీతచరితుఁ
డపరిమితప్రతాపానూనకీర్తి
సాహసాంకుఁడు శివద్రోహరగండఁ
డాహవవీరభద్రావతారుండు
సకలలోకప్రపంచకళావిరక్తుఁ
డకుటిలచిత్తుఁ డత్యద్భుతకీర్తి
సకలశాస్త్రాభ్యాసశౌర్యాన్వితుండుఁ

బ్రకటశివాచారపరుఁ డనఁ బరఁగి
యౌవనప్రారంభమందు సద్భక్తి
భావుఁడై భయభ్రాంతుల మీఱి
విస్మయలీల శ్రౌతస్మార్తవిహిత
భస్మరుద్రాక్షవిస్ఫారాంగుఁ డగుచు
వరభక్తసందోహచరణారవింద
పరిచరణక్రియాపరవశుఁ డగుచు
శివభక్తులకు నెగ్గుసేయు పాతకుల
నవిచారమునఁ జంపునట్టినేమంబు
ప్రాణస్థలంబుగాఁ బ్రమథోక్త శివపు
రాణార్థపదవిశారదుఁ డన నొప్పి
యుండంగఁ జోడమహోర్వీత లేశు
శుండాల మతిరౌద్రపిండితం బగుచుఁ
గలితమదోద్రేకబలధార లోలుక
వలవేగమున ననివారితవృత్తి
విడివడి యప్పురవీథి నేతెంచు
నెడ నొక్కభక్తుండు గడఁకాము లేచి
వేవునో ప్రొద్దని వేవేగ మంచి
పూవుఁదోఁటలు సొచ్చి భావించి చూచి
పరగిన పెనుగాలిబలువునఁ జేసి
చిరిఁగిన తేకుఁఛిద్రపుష్పములు
క్రిగ్గాలి దూఁటఁదాఁకినఁ బొంగి తునలు

బుగ్గరించినయట్టి మొగ్గపుష్పములు
సుడిగాలిఁ గడివోయి తొడిమలు వదలి
పడియున్న యాస్వయంపతితపుష్పములు
మఱుఁగులఁ గొమ్ములమాటులఁ దుదల
నొఱపున నున్నపర్యుషితపుష్పములు
బహుకీటకోత్కరనిహతిచేఁ దావి
రహితమైయున్న యుపహతపుష్పములు
కావని వర్జించి కమనీయమైన
తావి వొంపిరిగొని తనరుపుష్పములు
సజ్జ నిండఁగఁ గోసి సంభ్రమం బడర
సజ్జనభక్తు డాసాయుజంబెదుర
హరపూజనోత్సవపరవశుం డగుచు
నరుదెంచుచోట నక్కరి గూడముట్టి
తుండాగ్రమునఁ బట్టి తూకించివైచి
రెండుకొమ్ముల నొక్కె రుండంబుగాఁడఁ
బ్రాణవియోగతాపమున భక్తుండు
"ప్రాణేశ ! శివశివ ! పరమాత్మ !" యనిన
ములుఁగు లేశెంచిన నిఱుపదాండారి
ములహారభక్తునిపలుకుగా నెఱిఁగి
చిట్టులిక్కిపడి మదిఁ గట్టుగ్రుఁ డగుచు
"నిట్టియార్తారవం బేమొకో!" యనుచుఁ
బఱతెంచి భక్తునిపాటు భద్రేభ

మఱిమఱితనము నల్లంతటఁ గాంచి
నిశితకుఠారసన్నిహితుఁడై పొంగి
'పశువ! త్రుంచెద నిన్నుఁ బఱవకు' మనుచు
మార్కొన నతనికి మలయుచు గజము
మూర్కొని యెదిరె సున్మదము వట్రిల్ల
నేనికరక్కసుఁ డీశ్వరుమీఁదఁ
గానక పఱతెంచుగతియునుబోలె.
దీకొనఁ గని, మదోద్రేకవిజృంభి
తాకారుఁడై పేర్చి యార్చి మైవెంచి
సంహారరుద్రుని చాడ్పునఁ గోప
రంహస్స్ఫురణమయి సింహనాదంబు
పూరించి చూపఱ దూరించిపాఱ
వారించి మదకరిఁ గారింతు ననుచుఁ
బఱతెంచి తొండంబుఁ బట్టి రాఁదివిచి
మఱి నేల కొఱగిన మావంతుఁ బట్టి
మడియించియొడగాలఁ బుడమికినూకి
మెడఁద్రొక్కి పెడబొబ్బలిడుచు ఘీల్లనఁగ
హస్తికుంభస్థలన్యస్తస్వకీయ
హస్తకుఠారుఁడై యట వ్రయ్యఁదివియ
శుంభద్గజేంద్రంబు కుంభినిఁ ద్రెళ్లె
దంభోళిచేఁ బర్వతము ద్రెళ్లినట్టు,
ఇట చోళభూవిభుఁ డింతయు నెఱిఁగి

యట వచ్చి యిఱువత్తు నడుగుల కెరఁగి
నిటలాగ్రహస్తుఁడై నిలిచి భావించి
"కటకటా! భక్తునిఁ గారించె గజము
హరుభక్తులకు మున్న జాచ్యాదులును
సరియఁ గారన్న సిక్కిరి చావు సరియె?
పసుంగు పశు వదియేమి దా నెఱుఁగు
నేనుంగు నేలిన యే ద్రోహిఁ గాక
చచ్చెద నాచావుసరె యన్న నోరు
వుచ్చు నట్లైనను జచ్చిశుద్ధుండ"
న నుచు నప్పుడ యిర్వదాండారి మ్రోల
జనపతి దనశిరంబునకు దా నలుగ
నట్టిచో శివుఁడు ప్రత్యక్షమై చోళ
పట్టవర్ధను భయభక్తియుక్తికిని
నిఱువదాండారి మహిమభక్తికిని
గఱకంఠు- డజుఁడు శంకరుఁ డక్షయుండు
మెచ్చి భక్తుని ప్రాణ మిచ్చి మావంతుఁ
జెచ్చెర నపుడ సంజీవితుఁ జేసి
నంతఁ బ్రాణము వత్తదంతికి నొసగె
నెంతయు మహిమ నయ్యిఱువదాండారి
నాచోడవల్లభు నతిదయాదృష్టిఁ
జూచి కైలాసవాసులఁ జేసె శివుఁడు
మదియించి భక్తుని మడియించి నేనుఁ

గదియు నప్పుడ చచ్చె నాచోడనృపతి
ప్రేమం బెలర్పఁగ "భృత్యాపరాధ
స్వామినోదండ" యన్బిరుదవు నిష్పించి
తనకరి ద్రోహంబు దన ద్రోహముగను
దన కల్గెనన్న నీతప్పున కింక
గుఱి యెట్టుబిజ్జలక్షోణీశ! నీవ
పఱపంగఁ దలఁచితి భయ మాత్మ లేక.

బావూరి బ్రహ్మయ్యగారి కథ

మఱియు బావూరిబ్రహ్మయనాఁగ నొక్క
గఱకంఠు భక్తుఁ డఖండితకీర్తి
వీరమాహేశ్వరాచారవ్రతస్థుఁ
డారూఢగాఢ మహాత్త్వకాంతుండు
మంగళభక్తిక్రియాంగభావాంగ
సంగతచరితుఁ డభంగప్రతాపి
స్థైర్యసంపన్నుండు శౌర్యపండితుఁడు
ధైర్యప్రపూర్ణుం డవార్యవీర్యుండు
సత్యవచోరాశి శరణాగ్రగణ్యుఁ
డత్యుత్తమోత్తముఁ డనఁగ నిబ్భువిని
బరగ జంగమలింగపాదారవింద
పరిచరణక్రియాపరతంత్రలీల
నలయక పువ్వుఁదోఁటలు వెక్కు గూర్చి

తొలుకోడి కూయంగ బలువిడి నేగి
పూవులు గొనివచ్చి పుష్పమాలికలు
భావించి సంధించి భక్తుల కిచ్చి
యట్టికాయకలబ్ధియందు నిత్యంబు
చట్టన జంగమార్చనలు సల్పుచును
వర్తిల్ల మఱియొక్క వాదంబునందుఁ
గర్త గౌరీశుండ కాఁ బ్రతిష్ఠించి
కలునందిఁ బుల్లును బులకంబు మేపి,
యిలయెల్ల నెఱుఁగ జొన్నలు లింగముగను
జేసి యౌ! యనిపించి భాసురభక్తి
వాసనమై నుండ వడి నొక్కనాఁడు
ధరణీశుఁ డొక్కఁడు దంత్రంబుఁ దాను
బరమండలంబులపైఁ బోయి పోయి
బావురిచేరువఁ బ్రాగ్దిశయందుఁ
బూవుఁదోఁటలచెంత భూపతి విడిసి
యున్నెడ నతనిమహోద్దండగజము
తన్నుఁ దా మఱచి మదగ్రస్తమగుచుఁ
గడిఁదిమావంతునిఁ బడఝాళిసేసి
విడివడి దండెల్ల విరియఁ ద్రోలుచును
నీడకు సులుకుచు నింగి వ్రేయుచును
జాడ మల్లార్చుచు జనులఁ జంపుచును
ననివారితోద్వృత్తిఁ జనుదెంచుగజముఁ

గనియుఁ బాపూరిబ్రహ్మాన లెక్కగొనక
వచ్చుచో మదకరి వడిగొని యుదుర
నుచ్చాటనము సేసి హాయన్చునుదుర
బిట్టుల్కి సంధులు వ్రిదిలి ఘీల్లనుచు
నెట్టోడి తుండంబు నిటలంబుఁ గూర్చి
వెనువెనుకకు భీతిఁ జని నదీతీర
మునఁ బడి చనలేక మూర్ఛిల్లి యపుడు
జీవంబు విడుచుడు మావంతు లేఁగి
యావిభునకు నిట్లు లనిరి బెగ్గిలుచు
"విడివడి మదకరి వడిగొని పఱచు
నెడ నొక్కభక్తయ్య యీపల్లెనుండి
చని పుష్పములు గోసికొని వచ్చునెడను
గని మహోద్రిక్తమై కదియుముట్టుడును
గాదన కేతెంచి కరతలం బార్చి
"చా! దున్న! నిలు" మని జంకింపఁ దడవ
వెనువెనుకకు భీతి జని నదీతీర
మున విడ్చె జీవంబు" నన విని విభుఁడు
"నాయయ్య నాగజం బక్లింత యేఁచె
నో" యని వగచుచు నొయ్యన వచ్చి
యమ్మహాత్ముని చరణమ్ముల కెరఁగి
"యిమ్మదకరి నీకు నెమరించుతప్పు
సైరింపు" మని చక్కఁ జాఁగి మ్రొక్కుడును

గారుణ్యరసవార్ధి కడలున ముంచి
యమ్మహీజనులెల్ల నాశ్చర్యమంద
బమ్మయ్య మదకరిప్రాణ మట్లిచ్చెఁ
బరగ బ్రహ్మాయగారిశరణు పొచ్చుడును
జరితార్థుఁ డయ్యె భూవరుఁడు వెండియును
సజ్జనభక్తులచరితంబు లిట్లు
బిజ్జలక్షోణీశ! పెక్కు వర్ణింప
వెరవటె మార్కొన్నఁ బోరిగాండ్రు వెఱచి
శరణన్నఁ బ్రోతురు హరభక్తవరులు
గాన యిన్నియుఁ జెప్పఁగాఁ బనిలేదు
భూనాథ! మనవలతేల, లే పాదము
కలియుగరుద్రుఁడు గాక మాచయ్య
తలఁపఁగ మర్త్యుఁడే ధరణీశ! యిదియ
కజ్జంబు" నావుడు బిజ్జలుఁ డంత
లజ్జయు సిగ్గును బుజ్జగింపంగ

### బసవన్న బిజ్జలుని మాచయ్యకడకుఁ బిలుచుకొనిపోవుట

'నవుఁగాక' యని వచ్చి యఖిలంబు నెఱుఁగ
భువి సమస్తాంగము ల్పొంద నల్లంతఁ
బడియున్న బండారి బసవయ్య వచ్చి
మడివాలుమాచయ్యయడుగుల కెఱఁగె
నసమానలీలఁ బెం పెసగఁ గీర్తించి
బసవఁ డిట్లని విన్నపము సేయఁ దొడఁగె

"వలదని వారింపఁ జలమున ముక్కు-
వాలియించుకొన్నట్టు పురులు వోనాడి
యిక్కడ రానోడి యెప్పటఁగోలె
నక్కడ సాష్టాంగుఁడై యున్నవాఁడు
కత్తికిఁ దోడ నేల పాశుపతంబు?
ఈత్తుతీశ్వరుఁ డన నెంతటివాఁడు?
ఎదురు నీకెవ్వఁ డీరేడులోకముల
సదయాత్మ! యీతప్పు సైరింపవలయు"

మాచయ్య బిజ్జలుని యేనుఁగును బ్రదికించుట

నని విన్నవించిన నట్ల కా కనుచు
జననాథు లెమ్మనఁ బనిచి తత్‌క్షణము
యట్టయుఁ బొట్టయు నస్థులుఁ గూడఁ
బెట్టించి జనులు విభీతులై చూడ
భసితంబు దునియలపైఁ జల్లి యతని
యసముగజేంద్రంబు నొసగి తోల్నాఁడు
పొడిచివైచినపీనుఁ గుడువీథిఁ దాఁకి
పడ నప్డు సభ భయభ్రాంతులై బెదర
బొందికిఁ బ్రాణంబుఁ బోసి మాచయ్య
యందఱుఁ జూడంగ నంతరిక్షమున
నున్నవస్త్రములకు వెన్నొగ్గి జనులు
సన్నుతిసేయఁగఁ జనియెఁ జాటుచును

బసవఁడు మాచయ్య పాదముల్ గ్రోలిచి
యసమాను మరమున కవిచి యేతెంచె
సకలనియోగంబు జనపాలకుండు
ముకుళితహస్తులై మ్రొక్కుచు నుండ

మాచయ్య బసవనిగీతమంత్రు లని గోపించుట

నంత మాచయ యొంటియట్ల సద్భక్తి
సంతతసత్క్రియాస్పదలీల నడప
మఱికొన్ని దినముల కటు లేక బసవఁ
డఱిముఱి నొకగీత మానతిచ్చుడును
భక్తులు దనయొద్దఁ బాడగఁ దడవ
"యుక్తియే" యనుచు మహోగ్రతతోడ
'శివశివ' యని కేలు సెవులఁ జేర్చుచును
'నవనీతుఁ డిట్టుండె హా కల్లినాథ!
చెల్లబో! దీనులఁ జేసి శరణుల
కెల్లను దా నొకయిచ్చువాఁ డయ్యె
నెన్నఁడు గ్రోఁతి యయ్యెను? వెక్కిరింప
నెన్నఁడు గఱచె నిం కెక్కడిభక్తి
దోసంబు గాదె భక్తులు దీని వింద్రె
బాసలు గీసలు వాటు వాడకుఁడు
మాయొద్ద" ననుచును మాచయ్య గినిసి
కాయకంబున కరుగంగ నిక్కడను

బసవన్న మాచయ్యకడ కేఁగి మన్నింపవేఁడుట

నంత నంతయు నిని యాత్మలోఁ గలఁగి
యంతంత ధరణి సాష్టాంగంబు లిడుచు
బసవఁడు భక్తజనసహాయుఁ డగుచు
వెస నేఁగుదెంచి భయసమగ్రవృత్తి
మడివాలుమాచయ్య యడుగులపొంతఁ
బుడమి సర్వాంగముల్ వొందంగ మ్రొక్కి
"యాక్రాంత సంతతాహంకారు నిరతు
నక్రమాలాపు నిర్వక్రాపరాధు
నూర్జితక్రోధు వివర్జితసత్యు
దుర్జనాచారు ననిర్జితకాము
నజ్ఞానపుంజంబు నపగతశౌచు
విజ్ఞానహీను వివేకవిదూరు
నిర్భాగ్యచూడామణిని భక్తిరహితు
దుర్భావకు నవినీతుని నన్ను నింకఁ
గాచి రక్షింపవే కారుణ్యపాత్ర!
యేచినమద్గర్వమెల్ల మాయించి
లాలితంబుగ నాల్గు లక్షలమీఁద
నోలి సర్వదినాల్గువేలగీతములు
గావించు టిది యొగ్గు గని యేవగించు
భావన నాకయ్యె నీవు గైకొనమి
నాయతప్రీతి నోయనకున్న నింకఁ

జా! యనవయ్య నాసంగయ్యదేవ!"
యనుచు ని ట్లాత్మనిందాతిదీనో క్తు
లను విన్నవించుడు విననట్ల వినియుం
జంగమపరతంత్రుఁ డంగావికారి
లింగదమూచఁ డాలీఢశౌర్యుండు
"నధముఁడా! క్రొవ్వితే? వారభక్తు లరయ
నధములే? నీవొకయర్థాధిపతివె?
యడిగెడువారు లే కయ్య! నీ వింత
బడగ వైతివి, మజ! బాపురే!" యనుచు
"నట్టియాచకుల నే నటు గండఁగాని
యిట్టిత్యాగులఁ గాన మేలోకములను
బాన లిన్నియు నేల? బసవ! నీయిచ్చు
నేనికదున్నలు నిలఁ బచ్చమున్న
గుఱ్ఱపుగాడిదల్ గుటిలంపుసతులు
నెఱ్ఱికోకలు బ్రాఁతియే శరణులకు
నీదిక్కుఁ జూడుమా నాదుజంగమము
పేదతికము లేని పెల్లు సూపెదను
నదిగో" మ్మనుచుఁ జల్ల నందంద నెగయు
సదములోఁ దకకణజాలమంతయును
మరకత నీలనిర్మల పుష్యరాగ
వరవజ్ర విద్రుమ వైడూర్యముఖ్య
వినుతరత్నాచలవితతియై వెలుఁగ

నినుఁడు ఖద్యోతమ ట్లైత్రిపురిఁదోఁప
నట పౌరు లత్యద్భుతాక్రాంతు లగుచు
నిట బిజ్జలుఁడుఁ దారు నేతెంచి చూడ
నమరి మాచయ యుండె బ్రమథప్రసాద
విమలపుష్పాంచితవృష్టి పైఁగురియ
బసవని నభిమతఫలములఁ దనుప
నసమాక్షుఁ డర్పితుఁడై యున్నయట్లు
జంగమం బొప్ప నాలింగావతార
సంగతి మాచయ్య సద్భక్తిమహిమ
మెఱుఁగఁగఁ జాలక యిన్నిరూపములు
పఱలఁగఁ దాల్చిన తెఱఁగునుబోలె
నట్టిజంగమసభాభ్యంతరాళమున
నొట్టిన రత్నంపుఁదిట్టలకఱత
భక్తుల కేనసూ బండారి నన్న
యుక్తి వబ్బసవరా జొండె వెండియును
వారక యా మడివాలుమాచయ్య
గారల శ్రీపాదకంజంబులకును
మున్ను సాష్టాంగుఁడై మ్రొక్కుచుఁ జేరి
సన్నుతి సేయుచు శరణు వేడుచును
"నీమహాత్త్వముఁ జూడ నే నెంతవాఁడ
ధీమణి! సంగయ్య! దేవ! సర్వజ్ఞ!
నీవు శంకరుఁడవు నేను గింకరుఁడ

నీవు నిర్మలుఁడవు నేను దుర్మలుఁడ
నీవు విజ్ఞానివి నే నవిజ్ఞాని
నీ వమృతాంగుండ నే విషాంగుండ
నీవు మహాదాత నేఁ గృపణుండ
నీవు పశుపతివి నేఁ బశుజీవి
స్వామి! త్రైలోక్యచూడామణి నీవు
భూమి నిర్భాగ్యచూడామణి నేను
బోరి నిట్టి దుర్గుణంబులప్రోక లోన
నరయంగఁ గలదె నాయందు సద్గుణము
రక్షింపు మిట్టిగర్వప్రాప్తు నన్ను
శిక్షింపవే యయ్య! జియ్య! నాదైన
యపరాధశతసహస్రావళి సైఁచి
విపరీతమహిమాఢ్య! వేయును నేల?"
యనుచున్న బసవన్న నందంద కౌఁగి
టను జేర్చి కారుణ్యవనధి నోలార్చి
"కలుగునే కాదె లింగంబునందైనఁ
దలఁపఁ గోపప్రసాదంబులు రెండు
చేరెంటికైనఁ జెచ్చెరఁ గడవఁగొను
వారు సేపట్టరు వాయించికాని
ధర నంతకంటెను దమభృత్యవితతి
నోరయక చేపట్టుదురె యట్లు గాక
యందులమాలిన్య మడఁపఁగఁ గాక

యొండుఁ జీరల కల్గునే రజకుఁడు?
అట్టిద బసవయ్యఁ బట్టి మాచయ్య
ఘట్టించి నిర్మలత్వంబు నొందించె
వెన్నంగ వేమాఱు నెంతగాఁచినను
వన్నెక్కుఁగాదె సువర్ణంబు మిగుల
నింతింతగాఁ జేయ నిక్షుఖండంబు
నంతకంతకుఁ దీపు లధిక మౌఁగాదె
అంపానఁ గోసిన అాచిన నెఱయఁ
గంపెక్కుఁగాదె శ్రీగంధంబునకును
ఆాచిన మడివాలుమాచయ్య యొరసి
చూచుడు బసవయ్య శుద్ధసద్భక్తి
తనరంగ నేఁడుగదా! తుదముట్టె"
ననుచు భక్తాళి కీర్తనసేయుచుండ
ముకుళీకృత వికంపితకరాబ్జుఁడైన
సుకుమారు బసవయ్యఁ జూచి మాచయ్య
"విను మహంకారించినను భక్తియగునె
విని యెఱుంగవె పురాతనులలోపలను

మాచయ్య బసవన్నకు శంకరదాసికథఁ జెప్పుట

జడయ శంకరమహాస్థానంబు నందు
నడిపన్నశరణుండు శంకరదాసి
కాలకర్మాకర్మకలితమహేంద్ర
జాలవిలోలనిర్మూలనశాలి

జన్మజరామరణోన్మదాపహుఁడు
చిన్మయానందవశీకృతాత్మకుఁడు
రౌద్రమహోద్రేకరంజితవీర
భద్రుండు ప్రత్యక్షఫాలలోచనుఁడు
ఖండితాజాండకరండదోర్దండ
మండితాడంబరతాండవమూర్తి
విలసితకీర్తినిర్మలుఁడు సంసార
తలగుండుగండఁ డతర్క్యప్రతాపి
నాఁగఁ బ్రఖ్యాపితానశ్వరలీల
వీఁగుచుఁ బ్రచ్ఛన్నవేషంబునందు
బొంతకు గంతకుఁ బ్రోవిడి పోవు
నంతకు విక్రయం బార్చి తెప్పించి
యక్కజం బందఁ గాయకలబ్ధి నిత్య
మెక్కువు దఱుఁగవు నేను మాలికలు
జంగమకోట్లకు సముచితార్చనలు
భంగిగాఁ జలుపుచుఁ బ్రభుఁ డున్నయెడను
దేడరదాసయ్య సూడంగ వచ్చి
వేడుక మదిఁ దులకాడంగ మ్రొక్కి
యొక్కింత సుఖగోష్ఠి నుండి వీడ్కొనుచుఁ
జక్కన మరమేఁగి సదయుఁడై పోల్చెఁ
"గటకటా! యింతలింగ సమర్థుఁ డయ్యు

నిట యీఁగకుచు దవ్వ డింటిలో లేదు
శంకరదాసి లసద్భక్తిమహిమ
మింక నెన్నటి కంచు నెడ్డవగచుచు
నక్కటికను దుర్గళవ్వకుఁ జెప్పి
చిక్క గంపెడు కొల్లు శ్రీఘ్రంబ పనుప
"నట్టెట్టె! పుత్తెంచెనటె కొల్లు దాసి
యట్టిద కాక మేలయ్యె నెంతయును
గొలుచున కిచ్చె మున్నొక్క కలు నేసి
యిల నేమియడుగునో యీ మాకుఁగల దె ?
తలఁచి పుత్తెంచె నంతయ చాలదెట్లు
వలవదు తన కేడ గల విన్నియనుచుఁ
బిడికిట నొకమాటు పుడుకంగఁదడవఁ
బిడికిటిలోననె యడఁగె గంపెఁడును
నత్తవనిధియును నంద లయింపఁ
దొత్తడిసంపద దొలఁగెఁ దత్క్షణము
కూడు మందునకైనఁ గొలు చింత లేక
యూడకాడకు గాదియలు వాడువాతె
దాసి మున్నాడసినతవనిధి యట్లు
దాసయ్య దివ్చుడుఁ దత్క్షణమాత్ర
పరిభవాద్భుతశోక పారవశ్యమున
దురపిల్లు దాసికి దుర్గళవ్వనియె

దుగ్గళవ్వ దేడరదాసయ్యకు శంకరదాసిమహిమ చెప్పుట.

"కలవానియట్ల నిక్కంబు నీ వాక్కు
బులుసరితనమునఁ బుచ్చితి కొలుచుఁ
దలర నేనుఁగుపండ్లు దాఁబట్టిచూచు
మనుజుండు బ్రదుకునే మఱియునకాక
నెట్టన శరణుల నిలుకడ లరసి
పట్టిచూడంగ నీప్రాప్తియే చెపుమ
మృడుఁడు ప్రసన్నుఁడై యడుగ నడుగుమన
నడిగనే గెలిగొని యడకించెఁగాక
యదియేల చేయుకాయకలబ్ధి యెంత ?
కదలకయుండు జంగమసంఖ్య యెంత ?
యక్కజంబైన కాయకలబ్ధి నిత్య
మెక్కువ దఱుఁగవు నేను మానికలు
జంగమకోటుల సంతుష్టి సేయు
లింగసద్భక్తుల లేమి యెట్టిదియొ ?

ఈశ్వరుఁడు శంకరదాసికి మూఁడవకన్ను నిచ్చిన కథ

ఖండేందుధరుఁడు లోకత్రయంబునను
వెండియు నాయయ్య వెలయింపఁదలఁచి
'యడుగు'మటంచుఁ బ్రత్యక్షమై నిలువఁ
జిడిముడిపడక సుస్మితవక్త్రుఁ డగుచుఁ
గర్తలకర్త! మత్కర్తవై నీవు
వర్తింప నింకొండువరమేల వేఁడఁ

గడుఁగాక యేమియు నడుగమి సిగ్గు
వడియొద వడిగెదఁ బగలింటియట్ల
రాత్రియు సూఁదిబారంబు గ్రువ్వంగ
నేత్రములకు దృష్టి నెక్కొల్పుమనుడు"
వరదుండు దరహాసవదనాబ్జుఁ డగుచుఁ
గరమర్థి మిక్కిలికన్నిచ్చుటయును
హరునిచేఁ బడసిన యామీఁదికన్ను
పరదైవ దోర్దర్పహరణార్థమగుట
శంకరదాపి నిశ్శంకితవృత్తి
శంకరేతర సర్వ సమయారి యగుట
నిటలతటాంబకోత్కట చటులాగ్ని
పటుదృష్టివాతను బలువేల్పులెల్లఁ
జిటచిటఁ బ్రేలుచుఁ జటచటఁ బాసి
పటపటఁ బగులంగఁ గటకటాయనక
వేల్పన్న పేరికి వెనుకొని పుట్టు
మాల్పంగ మఱికొన్ని వేల్పులు వోయి
బలువిడి శివశరణుల మఱ్ఱు సొచ్చి
తలఁకుచు మ్రొక్కు వేల్పులనెల్లఁ గాచి
యనయము మువ్వెట్టిగొనుచును బడుగు
పనులు వంపఁగఁ జేసి బ్రదుకుదమనుచు
మసనక ముంగిటికసువులు నూక
కొసనక మానక కొట్టంబు దినముఁ

బుట్టెఁడు దంపంగఁ బోలక మితము
చుట్టును జాల రాఁజుచునుండు పెద్ద
పోటికట్టెలు వాలమున మోఁచితేరఁ
గాటిపాపఁడు వసిఁ గాచుచునుండఁ
గడుభక్తితోఁ గటకంబు మైలారుఁ
డడర నెప్పుడు గొడుగిడి తోడ నడవ.
జేరి యాఁకడములచేటికాట్రేఁడు
డారలువట్టి నుదయ్యత్రి కర్తు లులియఁ
దక్కినయాపెఱదైవంబు లెల్ల
నొక్కటఁ బనులు సేయుచుఁ గొల్చియుండ
నొప్పి యష్టాదశ యోగపీఠములు
దప్పక యేఁటేఁటఁ గప్పంబు లిడగ
'ముక్కంటి! నీయింటికుక్కల'మనుచు
జక్కులు గిక్కులు మ్రొక్కుచుఁ గొలువఁ
దగిలి వారలమహాత్త్వము విని యంత
జగదేకమల్లుఁ డసహ్యభావమున

—— జగదేక మల్లని కథ ——

హరి నడంచుటయొ బ్రహ్మాదిదేవతలఁ
బొరిమాల్చుటయొ బుడిబుడి వేలుపులను
బఱచుట సోద్యమే కఱకంఠుచేత
నెఱయ ఫాలాభీలనేత్రంబు వడసి
ముక్కన్ను వడయుట నిక్కమేనియును

జక్కన విష్ణుని సముదృష్టినిలిచి
వేయేల పడఁకక పోయిన జాలుఁ
బో!" యని కల్యాణపురమధ్యమందు
గోవిందు ప్రతిమ యక్కనను గావించి
భావించి యటమీఁదఁ బంచలోహములఁ
బోయించి కడుసాంగముగఁ బ్రతిష్ఠించి
పాయక రేయును బగలును గొలువ
శంకరదాసి యచ్చటి కేఁగుదెంచి
యంకకాఁడునుబోలె హరభక్తు లలర
నటిమటి మొగవాడ దెఱచి వీక్షింపఁ
బటియలై విష్ణుని ప్రతిమ నుగ్గుడు
నటమున్న మీఁదిలోహంబెల్లఁ గరఁగి
యిట వాదములఁబడి నే తెంచినట్టు
లరుదేర విష్ణునిఁ బొరిమాల్పోఁ గాలఁ
బరసమయులు భగభగ భ్రాంతులై పఱవఁ
గట్టుగ్రలీల శంకరదాసిమయ్య
యిట్టు వర్తింపంగ నిల నరు ల్వొగడ
నెఱుఁగవే విని చూచి యేఁ జెప్పనేల
కఱకంఠుననునైనఁ గావ శక్యంబె?
భక్తులసద్గోష్ఠిఁ బాసి యుండినను
భక్తియు భయమును బాటిల్లుఁ గాక
భక్తులసద్గోష్ఠిఁ బాసియుండినను

భక్తియు భయమును బఱుఁబఱగాదె!
యిదియేమిసోద్యమో యీశుఁడే యెఱుఁగు
విదితంబుగా మఱి చదువ బెట్టినను
గలమతియును జెడ్డ కారణం బయ్యె
నిల నిన్నియును జెప్పనేఁ? ర"మ్మనుచు
వందుచుఁ గుందుచు వనట నిర్వురును
నందంద సాష్టాంగు లగుచు నేతెంచి

దుగ్గళవ్వయు దేడరదాసియు శంకరదాసయ్యను మన్నింపవేఁడుట

"కావవే జియ్య! శంకరదాసమయ్య!
దేవ! దెసయు దిక్కు నీవ మా"కనుచు
మ్రొక్కుచుఁ గరములు మోడ్చినఁ జూచి
"యక్కటా! వీరెవ్వరయ్య వో చెల్ల!
దాసిదేవయ్యగారా! సకణార్తి
మీసరివారమా? మీకిట్లు దగునె?
యిట విజయంచేయు టేమి కార్యంబొ?
యెటుపయనం బిట్టు లేఁగుచున్నారొ?
కరుణించి యిచ్చటి కరుగుదెంచితిరొ
హరహర! మము మఱవఁగదె యెందు?
నిట్టిభయంబును నిట్టినిగర్వ
మిట్టి భక్తియుఁ గల్గునే యితరులకు
బాపురే! దాసయ్య! బడ గులాదరుఁడ!
బాపురే! దాసయ్య! భక్తులప్రాప!

వచ్చితే యేమేనిఁ దెచ్చితే మాకు,
నిచ్చితే బ్రదుకు మాయీసరయ్యకుచు
కోకమ్మి పడసినకొలుచు గాదియల
లేకేమి కొనిరావుగాక యేమియును
నేటంపుసంపద లెం దేఁగెనింక
మాట లేటికిని రమ్మా పాఱఁ గొనుచు
వీసము నాసము విడువంగ ముడువ
నోసరించినధనం బుండునో యిచటఁ
ద్రవ్యమా!” యనుచు నద్దాసయ్య చేతఁ
ద్రవ్వింప జంగమాస్థానదేశమున
నక్కజం బంద నందంద కడాని
నక్కులై వెడలంగ నక్కజంబంది
యాదాసియును దుగ్గళవ్వయుఁ జాఁగి
పాదాబ్జములమీఁదఁ బడి లేవకున్న
“నూలికి మొదలును గూలియు నిచ్చు
నోలికిఁ గొలుచిచ్చి చేలఁ గొన్నట్టి
యీగి చెల్లింపక యెట్లు నా చేతఁ
జాగెద” వనిపోయి శంభుని నాఁగు
కడుఁగాక యింకొండు దడ వల్లెయిచ్చి
పడయుము పుట్టెఁడు పండుము నుముక
కుడిచికట్టిన బడుగు చేత నొండెఁ
బడనడ్చికొనుమ యిమ్మడియు ముమ్మడియుఁ

గాదేని పేదలపాదులచేతి
యాదీవనలన మేలయ్యెడిఁ బొమ్ము
బడుగుభక్తులకాళ్లపైఁ బడ్డఁగలదె
కుడువఁగఁ గట్టఁగ విడువఁగ ముడువ
నేదియుఁ గాదేని పాదము ల్విడువు
లేదన్నఁ బోవునే పేదలమునుక
యున్నియుఁ జెప్పఁగా నేల యీపసిఁడి
మన్నైనఁ గొనిపొండు గొన్ని పెక్కులను
ననవుడు “నిక్కుల యానతిచ్చెదరు?
త్రినయన! యతిగర్వతిమిరాంధు నన్ను
నపరాధశతసహస్రపరీతకృత్యు
నుపమింపరాని గర్వోపేతచిత్తుఁ
గరుణ దప్పకన్నైఁ జేకావవే!” యనుచు
శరణు వేఁడుచును బ్రశంసించుచున్న
సదయాత్ముఁడై యంత శంకరదాసి
ముదమున భక్తసమూహిం గీర్తింప
నిరువుర లేవంగనెత్తి కారుణ్య
శరధి నోలార్చి ప్రసాదింపఁ దడవ
నవలఁ దొల్లిటికంటె నతిశయంబగుచుఁ
దవనిధి దేడరదాసయ్య కలరె
గర్వించినను నట్లకాక సద్భక్తి
నిర్వాహమొందంగ నేర్చునే బసవ!

### మాచయ్య బసవన్నకు నిమ్మవ్వకథఁ జెప్పుట

"యదియునుగాక నిమ్మవ్వయనంగ
సదమలసత్క్రియాస్పద భక్తినిరత
యకుటిల వీరవ్రతాచారయుక్త
ప్రకటజంగమలింగ పరతంత్రచిత్త
సంసారరహిత నిష్కళ మహిమావ
తంస సజ్జనసముదగ్ర్యగుణోపేత
హారభక్తులిండ్లకు నర్ఘ్యశ్రీగణ్యములు
కరమర్థి మోచుచు గాయకం బలరఁ
గొడుకు భక్తులయిండ్లఁ గోవులఁ గావ
నుడుగక కాయకోద్యోగనిబద్ధమున
జంగమాసక్తి లసద్భక్తియుక్తి
సంగతి దినములు జరపుచున్నెడను

### సిరియాలుని కథ

నంచితమతి సిరియాలుండు నాఁగఁ
గంచిలో నిత్య జంగమము లేవురకు
నిష్టాన్నపానాదులీప్సితార్థములు
దృష్టిగా నందిచ్చుశిష్టవ్రతమునఁ
జరియించుచుండంగ సర్వేశ్వరుండు
సిరియాలు భక్తిలోఁ జూడఁగఁ దలఁచి
కృతక తపోధనాకృతి నేఁగుదేర
హితజంగ మార్థమై యేతెంచి నెట్టి

మస్తకవిన్యస్తహస్తుండై తపసిం
బ్రస్తుతింపుచుం బదాబ్జంబుల కెఱంగి
'స్వామి! వే వేంచేయవే! మహాపురుష!
నీమనమనినిత్యనేమంబుసలుప"
నని విన్నవించుడు న త్తపోధనుండు
"ననఘ! మాయిచ్ఛ సేయంగ నోపుదేని
నింతకంటెను సుఖం బెద్ది మా" కనుచు
సంతసంబందుచు సదయుండు పోలె
సిరియాలుం గరుణాభిషిక్తుం జేయుచును
నరమాంస మొక్కొక్క వెరవున నడుగ
"సర్వజ్ఞ! మీమనోజ్ఞంబైనయట్టి
సర్వలక్షణగుణ సంపూర్ణుం డొక్క
వరపుత్త్రుం డున్నాండు, నరమాంస మింకం
బొరుగింటికిని విల్వం బోయెదనయ్య?
యరుదైన మీవ్రతోద్యాపన నేండు
కరమర్థిం జెల్లింతు క్షణముగా"మ్మనుచు
నడుగులం బడి సిరియాలుండు దపసి
నొడంబర్చి యింటికి వడి నేంగుదెంచి
తన సాధ్వి కొయ్యన తత్కార్యధార
విన్పింప "నీవేల వెఱచెద" వనుచు
సంగళవ్వయు నప్డు చదివెడు పుత్త్రు
మంగళంబలరం గ్రమ్మనం దోడితెచ్చి

"మనయింటఁ బండువుదినము నేఁ"డనుచుఁ
గనుఁగొని వధ్యశృంగారంబు సేసి
బాలుని ముక్తివిలోలు సిరాలు
లీలయుఁబోలెఁ దల్లియును దండ్రియును
నిందారుమనమున నిహతుఁ గావించి
ఖండించి నానాప్రకారము ల్గాఁగ
శాకంబు లొడఁగూర్చి జను లెర్గకుండ
శ్రీకంఠమూర్తిఁ జెచ్చెరఁ బిల్చి తెచ్చి
శ్రీపాదయుగళాభిషేకంబు సేసి
యాపాదజలము లత్యర్థిఁ బ్రాశించి
సంచితోన్నతసుఖాసనమున నునిచి
మించి యర్చించి పూజించి వడ్డించి
యంగనయును నెట్టి సాష్టాంగ మెరఁగఁ
బొంగి తాపసి శాకములు వేఱువేఱ
పరికించి చూచి యేర్పడ శిరోమాంస
మరసి యెయ్యెడఁగాన కంత నిట్లనియె.
"తలసూచియైనను దనయునిమీఁది
వలపు దక్కించంగ వచ్చుఁ బొమ్మనియొ
తలదాఁచుకొన్నారు, తగవయ్య! బాలుఁ
తలగొని యిఁక మీరు ధన్యులుగారు
ఏమియు లేదు శిరోమాంస మిట్లు
నేమంబునకుఁ జెల్లునే? యాగమోక్తి

దాన "సర్వస్య గాత్రస్య శిరః ప్ర
ధానం" బనెడుమాట గానేర దింక
ననవుడుఁ బతియును సతియును బెదరి
"యనఘ! మహాత్మ! యి ట్లానతీఁదగునె
యుపమింపఁ గేశదుష్టపరితశాక
ముపహతం బనఁబడునో" యని వెఱచి
పుచ్చితి మఱియు నిప్పుడు చందనంగ
నెచ్చెరఁ బాకంబు సేసెఁదా" ననుచు
మఱి తెచ్చి యాశిరోమాంస మర్పింపఁ
గఱకంఠమూర్తి గన్గొంట వీక్షించి
"యిల నెట్టియన్నదాతలు నిన్నుఁబోలఁ
గలరయ్య! యింతయుఁ గడుసాంగమయ్యె
నేనాఁటఁ బ్రతి వోల్పలేని యభీష్ట
దానంబు సేసితి దీనికిఁ దగఁగ
నీవలపటు మేము నీవు చాపటను
దేవతార్చనములు దీర్చి సపంక్తిఁ
గడుఁ బ్రీతితోడ లింగప్రసాదంబు
గుడువనినాఁడు నా కొడఁబాటు గాదు
కంటి మంటినని యాకాంక్ష నిదేమి
కొంటిమో తింటిమో కొడుకుమాంసంబు
నిచ్చసేయంగ ము న్నిచ్చినక్షణము
పుచ్చుకో నీవ యేఁ బోయెద నింక"

ననవుడు సెట్టి భయభ్రాంతిఁ బొంది
వనితఁ జూచుడు "నింక ననుమానమేల ?
ర"మ్మంచు లింగార్చనమ్ము సేయించి
క్రమ్మన వడ్డింపఁగాఁ దపోధనుఁడు
"నతిథిపూజలు సేయునవసరంబునను
సుతులును దారు నత్సుకలీలతోడఁ
బొత్తునఁ గుడుతు రట్లుత్తమపురుషు
లిత్తఱి నీకైన నెట్లు సేయాడు
నిప్పుడు గానరాఁ డేఁడి మీసుతుఁడు
చెప్పమే యప్పుడు సిరియాల! నీకు
నెన్నఁ బుత్త్రులు లేనియింట మాకెట్టు
లన్నదానముఁ గొన నర్హమా చెపుము
శ్రుతి 'నపుత్త్రస్య గతి ర్నాస్తి' యనఁగ
గతిహీను లిండ్లఁ గుడుతురె సంయములు
కాన పుత్త్రుఁడు గలఁడేని పిల్పింపు
లేనినాఁ డొల్లము పాన లే"లనినఁ
జకితదేహుఁ డగుచుఁ జయ్యన మ్రొక్కి
"యకలంక! మీ రప్పు డన్నారు నేను
విన్నాఁడఁ బుత్త్రుఁడున్నాఁడు సదువు
చున్నాఁడొ! యాడుచున్నాఁడొ పిదపఁ
జను దెంచి మఱి మీప్రసాదంబు వాఁడు
గొనియెడుఁ గాక భోజన మాచరించి

రక్షింపవే యోగిరములు శోకములు
అక్షయాత్మక! చెల్లనారకయుండ"
ననుచు మ్రొక్కుడును దదింగవఁ జూచి
"పనిచిన 'నోఁగాక'యని పిల్వరాదె
తల్లి పిల్చిన రాని తనయులు గలరె
తెల్లంబుగా నాల్గుదిక్కుల సిలిచి
ఎలుఁగెత్తి పిలువుము యేము వినంగ
నలరుచు రాకేమి యట్లయుండెడినో"
యనవుడు "నుత్తరం బాడంగ నేల"
యనుచు నేతెంచి తూర్పాదిగా నిలిచి
చెలఁగుచుఁ దాపసిచెప్పినయట్టు
ఎలుఁగెత్తి సుతుఁ దల్లి పిలువఁగఁదొడఁగెఁ

సంగళవ్వ కొడుకును బిలుచుట

"పూర్వజన్మార్జితభూరికర్మముల
గుర్వణగించు నాకొడుక! రావయ్య!
దక్షిణాధీశ్వరుదర్పమడంచు
దక్షతగల్గు నాత్మజుఁడ రావయ్య!
విరసపశ్చాజ్జన్మమరణదుఃఖములు
పొరిమాల్పఁ జాలు నాపుత్త్ర! రావయ్య!
యుత్తరంబేలు సుదాత్తయోగీంద్ర
చిత్తంబునకు వచ్చుశిశువ! రావయ్య!
యలరు నాకోపభోగాతీతపదము

లలవడె నేఁడు నాయయ్య! రావయ్య!
దండధరోద్దండ దండప్రశక్తి
ఖండింపనోపు పుత్త్రుండ! రావన్న!
పాయనివ్యామోహపాశబంధములు
కోయంగఁజాలు నాకుఱ్ఱ! రావన్న!
ద్రవిణాదికేషణాత్రయ విజృంభణము
తవులునఁ బడనినాతండ్రి! రావన్న!
సురరాజనుతుఁడు విశ్రుతతపోవేషి
వరదుఁడైనాఁడు నావడుగ! రావన్న!
యంతకాంతకమూర్తియగు తపరాజ
సంతసంబంద నాసామి! రావన్న!
ఘోరనిస్సార సంసారవారాశి
పార మీఁదించుపాపండ! రావన్న!
యంచితాగణ్య పుణ్యప్రాప్తినమరు
కాంచీవిలాసు నగ్రజుఁడ రావన్న!
దివిజకన్యకలతో దివి ముక్తికన్య
కవయనున్నది భక్తికాంతుండ! రావె!
దండడి మీయయ్య దక్షిణభుజము
నందంద యదరెడివన్న! రావన్న
ఖానుఁ డెంతేనియుఁ బడుమట వ్రాలె
శ్రీనిలయుండ! నాపేరాల! రావె!
స్వాదొంద వర్థేశసఖునిసన్నిధిఁ బ్ర

పాదంబుఁ గొనఁగ నాగాదిలి! రావె!"
యనుచు నాలుగుదిక్కు లందు నందంద
తనయునిఁ బిల్చుశబ్దంబులోపలను
జనితమై దిక్కులసంజ్ఞలు దోఁప
వనితాలలాము విల్వంగ నంతటను
గుండలంబులు గ్రాలఁగూఁకటిప్రేల
మండనం బొలయ సౌమ్యపుఘంట లులియ
రావిరేకయుఁ దూల భావంబు వోల
నావిధియు నదల హర్షంబు వొదల
నందెలుమ్రోయ మోకొంగన డాయ
సందేహ ముడుగ నాశ్చర్యంబుదోడుగఁ
జూపఱు గీర్తింప సురలు శంకింపఁ
దాపసి వీక్షింపఁ దండ్రి మైవెంపఁ
దల్లి గౌఁగిలిసోఁపఁ ద్వరితంబు దోఁప
ముల్లోకములుఁ జూడ ముద్దు దుల్కాడఁ
బఱతెంచె సుతుఁడు, నప్పాటనీశ్వరుఁడు
కఱకంఠుఁడజుఁడుమాకాంతుఁ డుగ్రాక్షుఁ
డక్షరుం డాసిరియాలుకటైదుర
నాక్షణంబునన ప్రత్యక్షమై నిలువ
నంతలో సిరియాలుఁ డతివయు సుతుఁడు
నంతంత ధరణి సాష్టాంగులై మ్రొక్కి
కలగని మేల్కన్నకరణి నద్భుతము

దళుకొత్తఁ జెలఁగి కీర్తనలు సేయఁగను
"శ్రీశ వాణీశ సురేశ సన్మునిగ
ణేశ దిశాధీశు లెలమి నంకింప
నారుద్రగణములు నాపురాతనులు
వీరభద్రాదులు సేరి కొల్వంగ
సద్భక్తు లతులితోత్సవలీలఁ దనర
నద్భుతాక్రాంతాత్ములై నరు ల్వొగడ
నలరి చందనసంగ నాత్తగర్గంబు
నలతిరువెంగాణినంగఁ దత్సఖుల
నంచితమతి సిరియాలు పీరాలు
గంచేడువాడలుఁ గైలాసమునకుఁ
బ్రవిమలకనకదివ్యవిమానపంక్తి
దివిఁ దేజరిల్ల నద్దేవదేవుండు
గొనిపోయెఁ, గైలాసమున సిరియాలుఁ
డనుపమప్రమథగణాస్థానమందు
భవుఁ జూచి తనుఁ జూచి ప్రమథులఁ జూచి
భువిఁ దనపెట్టిన పుత్త్రునిఁ జూచి
"పుడమిఁ బుత్త్రునిఁ జంపి మృడునిచే మగుడఁ
బడసి కైలాస మేర్పడఁ జూఱ గొనిఁ
యిటువంటివాఁ డెవ్వఁడేఁ దొల్లి యిపుడు
నట యిట గలఁడె నాయట్టి భక్తుండు
వనకా" కని మది నెంతయుఁ గ్రొవ్వి

తా నహంకారించి తలఁపంగఁ దడవఁ
జిఱునవ్వు నవ్వుచు శివుఁ డది యెఱిఁగి
'చిఱుతొండ రమ్మని చెయివట్టికొనుచు
నిమ్మహీంతలమున కేతెంచి యపుడ
క్రమ్మఱ నిమ్మవ్వకడ నిల్వఁబడుడుఁ

### నిమ్మవ్వ కథ

బడఁతియు బిట్టులిక్కిపడి సంభ్రమమున
నడుగుల కొఁగి పాదాబ్జముల్ గడిగి
యంగన ప్రచ్ఛన్నలింగమూర్తులకు
సాంగోచితక్రియాభ్యర్చనల్ చేసి
పంచభక్ష్యంబులుఁ బాయసాన్నాదు
లంచితప్రీతిఁ గావించునయ్యెగను
భువిఁబథశ్రాంతులుఁబోలె నెట్టియును
శివుఁడును వెడ నిద్ర సేయుచున్నెడను
నిమ్మవ్వ యర్ఘ్యపణ్యమ్ముల కేఁగఁ
గ్రమ్మన గోవులఁ గాచి బాలుండు
నలసి యాఁకొని వచ్చి "యమ్మమ్మ!" యనుచు
దలుపు గట్టినునూకితల్లి లేకున్న
నటయిట వరికించి యందొక్కబూరె
కుటిలాత్ముఁడై పుచ్చికొని నమలంగ
నంతటిలోన నిమ్మవ్వ యేతెంచి
యంతంతఁ 'జీ! కుక్క!' యని యిల్లుసొచ్చి

**పడుచు వాపముచేసె మృడునోగిరములు
దోడికిలి తినె శివద్రోహి వీఁ”డనుచుఁ
బచ్చిచెక్కులఁ దలఁ బగులంగనడిచి
చచ్చినపీనుఁగు జఱజఱ నీడ్చె
ననసేల? పుత్త్రమోహంబు సీమంత
యును లేక కొడుకు చా వారులెగ్గకుండ
గాడిలోపల వైచి కసువు పైఁడిగిచి
వేడుక మదిఁ దులుకాడంగ మఱియుఁ
బాకయత్నము సేయ బాలునిచావు
నేకాంతమున శివుఁ డెఱిఁగింపఁ దలఁచి
“చిఱుతొండ! చూచితే! చిత్ర మివ్వనిత
తఱుసంటియాఁకలి ధరియింపలేక
క్రమ మెగ్గఁ డోకబూరె గ్రక్కున డిగిచి
నమలెనో నమలఁడో నాతి వీక్షించి
*పాకమింతయు వృథాపాకంబుసేసె
యీకుక్క ద్రోహి వీఁడేల నా’కనుచు
నఱిముఱిఁ బట్టి నిజాత్మజుఁ జంపి
జఱజఱ నీడ్చి యాచక్కటి వైచె
నదె చూడు” మనుచుఁ బాదాంగుష్ఠమునను
బొదివిన కసు వెల్ల బోవనూకుడును
జూచి శిరఃకంప మాచరించుచును
నా చిఱుతొండఁ డత్యాశ్చర్య మందె

నంగన వాక్ప్రయత్నాంతమందు
జంగమములకు మైజలకంబు సేసి
యతులలింగోపచర్యల నర్చలిచ్చి
యతివ వడ్డించు నయ్యవసరంబునను
నింతిపుత్త్రునిఁ జంపు టెఱుఁగనియట్ల
యంతకాంతకమూర్తి యప్పు డిట్లనియె
"నింతి! నీపుత్త్రుఁడా యింతకమున్ను
నెంతయు నాఁకొని యిటఁ బీరిచీఁ,
యెక్కడ నాయెనో? యెట్లున్నవాఁడో?
యక్కటా! తన్నెఁ గదమ్మ! బాలుండు
కరుణమాలినయట్టి కాంతవు గదవె?
హరహర! చెయ్యాడ దారగింపంగఁ
బెంపమే కానమే బిడ్డలఁ దొల్లి
యింపౌనె కీడు మే లింట నేమేని
వండినఁ దిన, నెట్టివారైన శిశువు
లుండంగఁ దార కైకొండురే యిట్లు?
కనికరం బింతయు మనసున లేక
వనిత! మాకేటికి వడ్డించి తవ్వ!
పసిబిడ్డ లుండంగఁ బాడిగా దిట్లు
మసలక సుతుఁ బిల్వుమా యాల నివల"
ననవుడు "నట్లగు నగు నాఁటదాన
ననిరెయు చూచెదవయ్య! యయ్య నీమాయ

తెఱుఁగుదు నెఱుఁగుదు నే బేలఁ గాను
కఱకంఠ! యిదియేల కథలువన్నెదవు
ననుఁ జూచి సిరియాళుఁ డని తలంచితివా?
పనియులే దారగింపక పోవరాదు
ప్రామిఁడిర్యై వేఁడుకఁడియెడు దానఁ
గామి నీవెఱుఁగవే కడయింటిపాఁడువ
కామించి సుతుఁ జంపి క్రమ్మఱఁ బిలువఁ
గామారి! నీయిచ్చు కైలాసమొల్లఁ
దన ద్రోహమునఁ జేసి తాఁ బోయెఁ బొలిసి
గానకొని యాద్రోహిఁగూడు నేతలఁప"
నన సిరియాలుండు విని యంత శోక
వనధిఁ దేలుచుఁ దలవంచి లజ్జించి
యడఁకుచు నిశ్చేష్టితాత్ముఁడై యుండఁ
బడఁతి నిర్మలభక్తిభాతికి మెచ్చి
యంతకుమున్న నిజాకృతిఁ దాల్చి
యంతకాంతకుఁడు ప్రత్యక్షమై నిలువ
"నోహో! యిదేమయ్య! యుచితమే యిట్టు
లాహా! మహాత్మ! మహాత్ములగుణమె?
యఱిమిఱిఁ జన్నుఁబా లర్థించి యేడ్పు
చిఱుతచే నొకపిండికఱు డిచ్చి తల్లి
తనచన్ను మఱపించి కొనిపోయినట్లు
చనరాదు నిమ్మిచే సందేహపడకు

మొదలికిఁ బ్రాణంబు నొదలు ప్రాణమున
కొడఁబడియున్నట్టు లుభయనామములు
సమరెడు లింగజంగమమూర్తి విడిచి
భ్రమకు హేతువులగు భావము ల్దాల్ప
నవ్వరే నిన్నును నన్నును భక్తు
లివ్వేడబంబుల కెల్ల లోనైన
నేల యీబహురూపులే నేమి నిన్ను
బోల వెర్రిగ మున్ను సూచితినయ్య!
ముక్కంటివై మఱి మూఁడునుగన్న
లక్కజంబుగ నున్న నవియు లేకున్న
హరరూపమైయున్న నరరూపమైన
గురురూప కాదె సద్గురుసన్నిహితులు
కఱకంఠ! యిక్లేల కళవళించెదవు?
వెఱవకు వెఱవకు వేఱకాఁదలఁప
వేయేల గుండయ్య ప్రాయంబు వడసు
నేయజ్జుకప్పుతో నేఁగితి చెపుమ
భోగయ్య యింటికిఁ బోయిననాఁడు
వగౌరిసహితమై యేఁగితి చెపుమ
దాసయ్యచే వస్త్రదానంబు గొనఁగ
నేసోమకళఁ దాల్చి యేఁగితి చెపుమ
మానకంజారుని మందిరంబునకు
నేనందినెక్కి నీ వేఁగితి చెపుమ

యాచియుతోండని యింటికి నీవు
నేచతుర్భుజముల నేఁగితో చెప్పుమ
కావున నీచమత్కారము ల్కాను
మీ వేడబము లెల్ల నేమెఱుంగుదుము
ఎట్టైననుండు మీ విట్టారగింపఁ
బెట్టుదు నీయాన ప్రిదిలితినేని”
యనుచు నిష్ఠించి నిమ్మవ్వ వల్కంగ
మనసిజాంతకుడు మెల్లన నవ్వుదనర
“నట్టైన నవుఁగాక” యని యారగింపఁ
బెట్ట నాసిరియాలసెట్టి కిట్లనియెఁ
గడుభక్తిఁ జండేశ కాటకోటాదు
లడరంగఁ దండ్రుల నాప్తులఁ దప్ప
నడచినఁ జంపరే? నఱకరే మగుడఁ
బడయరే? వేఁడరే ప్రత్యక్షమైన
విను మట్లుఁగాక ద్రావిడదేశమందుఁ
జనినపురాతన శరణులలోన

## నరసింగనయనారుని కథ

నరసింగ మొన్నయనారను రాజు
ధరణి మద్భక్తుఁ డాతనియగ్రమహిషి
కరమర్థి నాయూరిపరమేశుఁ గొలువ
నరుగుచోఁ బూజార్హమగుపుష్ప మొకటి
పుచ్చి మూర్కొనుడును బువ్వులపడుగు

నచ్చెల్వనాసికం బప్పుడ కోయ
నచ్చోటి కప్పుడ యచ్చోడదన్నృపతి
వచ్చుడు సతితోడ వనితలు మ్రొక్కి
"దేవ! తప్పేమియుఁ గావింప దిచట
దేవి వోవుచు నొక్కపూవుమూర్కొన్న
లింగార్థమై యున్న చెంగల్వపూవు
నంగన మూర్కొనె నని ముక్కుఁ గోసి
వైచె నీపూజారివడు" గని చెప్ప
"నోచెల్ల! తగ దిట్టు లుచితమే నీకు"
ననుచుఁ బూవులవడ్డు నప్పుడ పిల్వఁ
బనిచి "నీ కిది భక్తిపాటియే వడుగ!
యెట్టివివేకివై తిటమున్ను పువ్వు
ముట్టినచెయి మొట్టమొదటికిఁ గోసి
మఱికదా కోయుట మగువ నాసికము
ఎఱుఁగవు నిన్ను నాకేమనఁ గలదు?"
అనుచు నిజాంగన నచటికిఁ బిలువఁ
బనిచి భూపతి వాఁడి బాడిత యెత్తి
"నిన్ను నీవెఱుగక యన్నిక్కి కొన్న
మునీశ్వరార్థమై యున్న పూవునకుఁ
జాఁచిన చెయ్యది సక్కన నపుడు
చాఁచినట్లె చాఁపుచాఁపు ర"మ్మనుచు
ముట్టిన యంగుళుల్ మొదలికి నఱికి

పట్టఁ జూచిన మణికట్టు ఖండించి
తివిచినమోఁచెయ్యిఁ ద్రెవ్వంగ నడిచి
యవిచారమున మొదలంట వదల్ప
నత్తఱి నేము ప్రత్యక్షమై నిలిచి
తుత్తునకలై యున్నయత్తన్వి చేయి
మును గోసివైచినముక్కును నొసఁగి
జననాథునకు నంత సాయుజ్యముక్తి
యిచ్చినఁ గైకొఁడె యీజనవ్రాత
మచ్చెరువందుచు నర్థిఁ గీర్తింప

కొట్టరువు చోడనికథ

నట్టునుగాక మఱి పట్టంబుదేవి
కొట్టరువందు మాకొల్పుఁ గుడ్పుడును
గర్భిణినాక తద్గర్భంబులోని
యర్భకు సహితంబ హరియింపఁదడవఁ
గోరి మోక్షము వేఁడికొనఁడె మెచ్చినను
నారచోడఁడు ! మఱి యట్లనే మెచ్చి
భంగిగా నభిమతఫల మడుగుమనఁ
గింగాణమును జేయ దంగనఁ జూడు
తప్పునేసిన మహోద్ధతభక్తియుక్తిఁ
దప్పేమి సంపెఁ బో తన్వి దనూజు
నడుగంగవలదె ప్రత్యక్షమైయున్న
యెడ ? నింతిమాహాత్మ్య మేమనవచ్చు

నడిగినఁ జంపితి నడుగఁ దనూజు
వడియించి పిల్చితి మఱి పిల్వ దలిప
యిట్టిట్టిభక్తు లనేకు లుండంగ
నెట్టయా సిరియాల! యేవకాఁ కంటి
భక్తితో గర్వించి పలుకుటయొల్ల
యుక్తియే?" యనుచుఁ దద్భక్తవత్సలుఁడు
బాలుని నంత సప్రాణుఁ గావించి
కైలాసమున కన్చెఁ గమనీయలీల
"జంగమలింగపూజనము వీక్షింప
భంగిఁ జతుర్వర్గ ఫలములఁ గాంచె
నుత్కృష్ట"మని ధరనుండె నిమ్మవ్వ
సత్క్రియలం దెల్లఁ జను నె గర్వోక్తి
యట్టిద కాక యహంకరించినను
బట్టిచ్చునే భక్తి బసవకుమార!
హరుఁడు దా వెండియు నంతఁ బోనీక
సిరియాల! రమ్మని చెయి వట్టికొనుచు

వాలాయుధుని కథ

పరసర భక్తవేషంబులతోడ
ధరవాలాయుధుఁ డున్న పురికి నేతేర
నావాలాయుధుఁడు సచ్ఛ్రద్ధిఁ దుల్కాడ
మాహేశ్వరులకు సమ్మతిఁ జాఁగిమ్రొక్కి
సవినయసంభ్రమవివశాత్ముఁ డగుచు

నవసరోచితసత్క్రియాదులఁ దనిపి
ముక్కంటిమూర్తికి మొగము వహింప
మక్కువ సుఖగోష్ఠి మాటలాడుచును
"నెంతదవ్వులనుండి యేఁగుదెంచితిరొ?
యెంతయేనియుఁ బథశ్రాంతులువోలె
నున్నవా"రని యిట్లు విన్నవించుడును
నన్నిలగళమూర్తి యతని కిట్లనియె
"ధరణి మహాభక్తదర్శనార్థంబు
చరియించు జంగమోత్కరములోపలను
నరుదంద ననయంబు నాడుచుండుదుము
కరమర్థి భక్తులే గతియుఁగా మేము
మముఁ దమపాలిలింగముగ వారంత
నమితసంగతిఁ గొనియాడుచుండుదురు
తిరునీలకంఠుండు వరగొండపతియుఁ
గరికాలచోడండు నరియమరాజు
యొలయదంగుళిమారఁ డేణాధినాథుఁ
డిలఁ జేదిరాజు వాగీశనైనారు
చేరమ శ్వపచయ్యగారు సోమాసి
మారుండు పిళ్లనైనా" రనఁబరఁగు
వీరాదిగా భక్తవితతిచే నెల్ల
నారాధనలు గొన్నవార మీక్రియను
నీడాడ యని చెప్పనేల! యుద్ధరణిఁ

కూడ నేఁజూరనిభక్తులయిండ్లు లేవు
మమ్మేలుంగనిభక్తుఁ డిమ్మహి లేఁడు
ఇమ్మహిఁ బెద్దగాలమ్ము మాసుళువు
మను పెట్టివారి మెచ్చనియట్టి భక్త
జనము లౌనఁగ మాదినములు గడచెఁ
జేపట్టి మము రూపుసేసినవాఁ
లేపారు భక్తుల నేకులు గలుగు
అరిది మాబ్రదుకు మున్నాదిఁ బుట్టినది
పెరిఁగినది నిరాళపురమును వీడు
పుట్టితిఁగాని యిబ్భువిఁ దల్లిదండ్రు
లిట్టివారనియొర్గ నేమని చెప్ప
నింపార నిమ్మవ్వ యొత్తి చన్నిచ్చి
పెంపఁగఁ బెరిఁగితి బిడ్డనిభాతి
నడరఁ గెంభావిభోగయ్య చేట్టార్చి
నడపింప భువి నడుగిడఁ గఱచితిని
బడిపను లేమేనిఁ బంపుచు నంబి
కడుకొని పిలువంగ నుడువ నేర్చితిని
గడుఁగూర్మిఁ జెన్నయ్యగారిపొత్తునను
దొడుకొని కుడుపంగఁ గుడువనేర్చితిని
అఱకొఱ లేక దాసయ్యవచ్చునను
గఱచితి వస్త్రంబు గట్ట నంతటను
గడఁకతోఁ గూఁతుక్రమ్మడిఁ గోసిమాఱు

జడఁ గట్టె మానకంజారుండు మఱియు
మిండండనై యాడుచుండఁగఁ జూచి
వెండి బల్లెముఁ ద్రొక్కవెలఁదిఁ గావించె
నిమ్మిండనికి ధనం బెక్కుడిదనుచు
ముమ్మడిపడి సేసె మొన్నయధరుఁడు
అంత దక్షారామమం దమార్ని శముఁ
గాంతాసుఖోపభోగంబు లందుచును
వరుదెంచి మొన్న నాసిరియాలునింట
వరపుత్త్రుఁ గంటి దేవరఁ గూడుకొనియె
భువిని నాసుఖదుఃఖములు నీకుఁ జెప్ప
కెవరికిఁ జెప్పుదు నే హాలాయుధుఁడ!

జంగమరూపధారి యగు శివుఁడు
హాలాయుధునకు సిరియాలుమహిమఁ జెప్పుట

యట్టునుగాక చోద్యంబు వెండియును
నెట్లన్న వినవయ్య! యేఁ జూడఁజూడ
సిరియాలుఁ డాకంచిపురి యేదువాడ
లరుదుగాఁ గొనిపోవ నందులోపలను
గలిసి పుత్త్రుఁడు వోయెఁ గైలాసమునకు
నిలఁ జెబుతొండని కెన యెందుఁగలరె?
మలహాయఁ డాతనిమనసులోఁ దరయఁ
దలఁచి శంకరకింకరులు మొదల్గాఁగఁ
గడఁగి ప్రత్యక్షులఁ దోడఁగి పుత్త్రేర

నడిగినట్టుల వారి కతిభక్తియుక్తిఁ
జెఱకురసంబు నీప్సితవస్తువులును
నఱలేక యందిచ్చి కఱకంఠుఁగొలువ
నదిగాక వారుఁ డిరువదియొక్కదినము
వదిగాని కంచిలో వాన గుర్పింపఁ
గడఁగి నిత్యము నేగురోడయల కన్న
మిడుచుండఁ దపసులం దెచట లేకున్నఁ
బరముండు దాన తాపసిక్రియ నంత
నరుదెంచి సిరియాలువరపుత్త్రు నడుఁగఁ
గడునర్థిఁ గొడుకుశాకములు గావించి
మృడుని మెప్పించి యప్పుడు సుతు మగుడఁ
బడసి కైలాస మేర్పడఁ జూఱగొనియె
నడరంగ నుస్వార మంచు నాఁడేము.
అట్టిభక్తుఁడు గలఁడయ్య! లోకములఁ
బెట్టంగవచ్చునే పుట్టినసుతుని
మచ్చరంబున భక్తిమాటలాడంగ
వచ్చుఁగా”కని పేర్చి హెచ్చి కీర్తింప
“శివ! శివ! యిది యేమి సెప్పెదవయ్య!
శివుఁడేమి నరులభక్షింప రక్కసుఁడె?
శిశువు సద్భక్తుని సిరియాల నంబి
పశువరింపఁగఁ జంప భక్తిహీనుండె?
మీ రోడయలుగాన మీమాట బొంకు

నారాదు గాక యేనాఁటఁ బోలఁగునె?"
యని మిథ్య సేయఁగ నామృడుమూర్తి
"విను హలాయుధ! పురాతనులలోపలను
సతుల నిచ్చినవా రసంఖ్యాతకోట్లు
సుతుల నిచ్చినవారు శతకోటికోట్లు
తమ్ము నిచ్చినవారు దా రనంతంబు
నిమ్మహిఁ లేరన నిది నీకుఁ దగునె?
హరుఁడు భక్తులమనం బరయంగఁ దలఁచి
యరుదైనవస్తువు లరుదెంచి వేఁడ
నరగలినొాన కిత్తు రట్ల భక్తులును
ధరఁ బుట్టెనే భక్తి సిరియాలుఁతలనె?
కఱకంఠుఁడును వేఁడెఁ గావున నిట్లు
చిఱుతొండఁడును బెట్టె సీరాలు బాలు
నరయింపు నమ్మవే ధరణిలోపలను
గరమర్థి నూరూర సిరియాలుచరిత
మేటిదై చను భక్తకూటములందుఁ
బాటలుగాఁ గట్టి పాడెడువారుఁ
బ్రస్తుతోక్తుల గద్యపద్యకావ్యముల
విస్తారముగఁ జేసి వినుతించువారు
నటుగాక సాంగభాషాంగక్రియాంగ
పటునాటకంబుల నటియించువారు
మునుమాడి వీరు వా రననేల కూడి

కనుఁగొన ఱోళ్ల రోఁకళ్లఁ బాడెదరు
అనుమాన మొక్కింతయును లేదు దీని"
కనవిని కలుషించి యాహాలాయుధుఁడు

### హాలాయుధుఁడు సిరియాలు కథవిని కోపించి శివునకును, సిరియాలునకును వెలివెట్టుట

"అట్టిట్టు వేఁడె నా హరుఁడు మాంసంబు,
పెట్టెనా చిఱుతొండసెట్టి తనూజు?
భక్తవత్సలుఁ డెట్లు భక్తుని మ్రింగె?
భక్తుఁ డేవియు నెట్లు భక్తునిఁ జంపె?
హరహరా! యట్టిదేవర యట్టిభక్తుఁ
డరుదగు లేదువో సరిసమానంబు
తల్లి రక్కసియైనఁ దా నెట్లు బ్రదికె?
నల్లవో శివుఁడు దానవుఁడయ్యె నయ్యొ!
ముదిసి ముప్పున నింత మది మఱుల్కొంది
మదనారికిని ధృతిమాలంగఁదగునె?
కోమటి బుద్ధుల కోలాసఁ జేసి
కామించి సుతుఁ జంపెఁ గాక యిట్లున్న
ముట్టరు భక్తులు మున్ను మాంసంబుఁ
బెట్టుదురే తన్నుఁ బెద్ద సేయుదురె?
యడిగెఁబో మనసులోఁ దెరయఁ దప్పెమి?
కొడుకుఁ జంపఁగఁ గత్తిఁగొన్న యంతటనె
మృడుఁడు జాణండేని మెచ్చంగవలదె?

కడుఁగడు మోహించెఁగాక పుత్త్రునకు
మఱి యట్లుగాక యచ్చెలుతోండఁ దరయ
నెఱవణిగల భక్తినిరతు డేనియును
నోరవోఁ జూచునే యొగిఁ దన్ను డాఁచి
యూరఁ బ్రాణంబున కాసించె నతఁడు
తమసుతుఁడైన జంగమము కాఁడెట్లు?
సమయింపఁగూడునే శంక దాలేక !
పొరుగింటిచిచ్చైనఁ దరికొనుఁగాని
దరికొనదే యిట్లు దమయింటిచిచ్చు
వెలుపలిదుఃఖంబు వెలిఁ బోయెననినఁ
బొలుపఱెగ్గ నిట్లుండవలవదే భక్తి?
మృడునకు నరమాంసమే కాని యొండు
మొదకుఁ బోదయ్యెనో మేలయ్యెననుచుఁ
దలర కీశ్వరుమీఁదఁ దా నింతభక్తి
గలవాఁడు శాకపాకములు గావించి
యన్నీలగళునకుఁ దన్నేల పెట్టఁ
డెన్నంగ నిది భక్తహింస గాదెట్లు
తనయుని నొప్పించెఁ దన్ను వంచించె
నన మాట కోడి పుత్త్రు నపుడ పిలువఁ
బంచెఁగా "కష్ట దర్పించితిఁ బిలువఁ
బంచుట యిదిభక్తి పాటిగా దింక"
ననియె నే చెఱుతొండఁ డట్లునుగాక

చను దెంచి యర్థించి చంపించినట్టి
మనసిజారి యును మ్రింగనఁగొండి యయ్యె
ననుమాటకంజిపుత్త్రుని నపుడుమిసెఁ
గాక త్రేన్పులు గట్టుగట్టున వెడలఁ
జేకొని యారగించెనె కడుపార
నెట్టికిఁ గర్త్మంబుఁ దిట్టు దేవరకుఁ
గట్టిల్లె నింతియకాదె కావునను
భక్తుని మ్రింగిన పచ్చిరక్కసుఁడు
భక్తుని జంపఁ బొల్పడు సూనెగాఁడు
నిది యొక్కకథయఁగా నిల రచియించి
చదువుమూఢులకు నసంఖ్యాతులకును
వెలియఁజుండో" యని వ్రేసెఁ జేతాళ
ములుక రెట్టింపంగ నాహాలాయుధుఁడు
అంత నత్యంత భయభ్రాంతిఁ బొంది
యంత కారియు సిరియాలుండు నతని
యక్కజంబైన కోపాటోపదృష్టి
కొక్కింత గెలఁకుల కోసరించుచును
నుల్లము ల్గలఁగ నొండొరుల మొగంబు
లల్లన చూచుచుఁ దల్లడించుచును
నున్నయిద్దఱ హాలాయుధుఁడు వీక్షించి
"మన్నింపఁదగు జంగమములుగా మిమ్ము
నిట క్రిందిమాటలకేఁదప్పునట్టి

నిటమీఁద సిరియాలు నీశ్వరువార్త
మఱచి యాడితిరేని మాభక్తు లెడకు
మఱి మీరు వారుని కోమటి తోడివార"
లనవుడు నుత్తరం బాడంగ వెఱచి
మనసిజారియును సుమాకాంతఁ దలఁప

**పార్వతి సంగళవ్వతో నేతెంచి తమపతుల వెలిదీర్ప హాలాయుధుని వేఁడుట**

పార్వతియును దాను భక్తియఁ సుదతి
సర్వాంగములు దాల్చి చనుదెంచునట్లు
సంగళవ్వయుఁ దానుఁ జనుదేరఁ గాంచి
జంగమాకృతిఁగని చని హాలాయుధుఁడు
మ్రొక్కి తోడ్తెచ్చిసముచితక్రియాదు
లక్కజంబుగఁ జేయ నంబిక యనియె
"నఖిలంబు నెఱుఁగంగ నజజనార్దనుల
ముఖమున ఔో్మ్మున ముదిత లుండియును
వారక తమతమ వలచినవారిఁ
గోరి పోదురు వారిగుణ మేమి సెప్పఁ
బోలుపొందఁగాఁ దనపురుషునిఁగాని
కలనైన నెఱుఁగదు గౌరి దా నట్టి
పరమపతివ్రతాపరల మట్లయ్య
హరపాదభక్తినిరంతరాత్మలము
'ఒడలాదిగా హాలాయుధుఁడు భక్తులకు

నడిగినవస్తువు లెడపక యిచ్చు'
ననుచు సద్భక్తసభాంతరంబులను
ఘనతరంబుగఁ జెప్పఁగా విని యేము
వచ్చితి మట్ల మావాంఛితార్థంబు
లిచ్చిదీవనఁ బొందవే హలాయుధుఁడ!
మహితశివాచారమార్గానుపాల!
సహజైకలింగనిష్ఠాపరతంత్ర!
విదితసద్భక్తి సంవిత్సుఖామాత్ర!
సదమలసర్వప్రసాదైకగాత్ర!
జంగమశృంగార! సత్యగంభీర!
లింగానువర్తి! యభంగురకీర్తి!
నెట్టణ శరణుండ! నిర్మలాంగుండ!
థట్టుండ! మోక్షవిద్యాపండితుండ!"
యంచు నగ్గింపఁగా నాహలాయుధుఁడు
నుచిత ప్రీతి దుల్కాడఁ గేల్మోగిచి
"వ్యక్తిమై భక్తులవరువుడఁ బ్రస్తు
తోక్తుల కోర్తునే? యొడయ లిచ్చెదరు
మాభక్తు లతులసామర్థ్యశక్తివిర
తాభీష్టవస్తువు లడుగుఁ డేమేని"
యనవుడుఁ "జిఱుతొండఘనునాతియిదియ;
ననఘ! యీశ్వరునియర్ధాంగన నేను
బతి బాహ్యలై యున్నసతు లేమిగొఱయుఁ

బతులేమిగోఱభక్తిబాహ్యులేనియును
గావునఁ దప్పులు వోవిడ్చి స్నేహ
భావన నతిదయాభావంబు దాల్చి
పతులకు నతులసద్భక్తి భిక్షంబుఁ
బ్రతిభమై మాకు సౌభాగ్యభిక్షంబుఁ
బెట్టవే" యనుచు సంస్పృహాభాతిఁ గరుణ
పుట్టి నాశైలేంద్రపుత్త్రి వేడంగ
నటమున్న చిఱుతోండనతివయు మ్రొక్క
నిటహాలాయుధుఁడుమాహేశ్వరావలియు
హరునకు సెట్టికి నభయంబు లొసఁగఁ
బరమాత్ముఁ డజుఁడు శ్రీపార్వతీశ్వరుఁడు

### శివుఁడు ప్రత్యక్షమై హాలాయుధు ననుగ్రహించుట

కంతుసంహారుఁడు శ్రీకరుఁ డుగ్రాక్షుఁ
డంతకుమున్న ప్రత్యక్షమై నిలువ
నలరుచుఁ బ్రమథరుద్రానేకకోట్లు
బలసి దగ్గఱి యిరుగెలకులఁ గొలువ
వెనుకదిక్కునఁ దిరువెంగాణినంగ
యును సిరియాలుండు దనరఁ గీర్తింప
ముంగదఱ నందంద మ్రొక్కుచు భక్త
సందోహ మచలితానందంబు నొంద
దివిజదానవపద్మభవహరిముఖ్యు
లవికలావరణస్థులై ప్రశంసింప

సర్వసన్నుతులు నాశీర్వాదనాద
పూర్వకంబుగ హస్తములు దలఁ దాల్పఁ
దుంబురునారదాదులు ప్రీతిఁ బాడఁ
బంబిన దేవతూర్యంబులు సెలఁగఁ
గరికాలసిరియాలచరితాదికథలు
నరుదందఁ బొరకు లంతంతఁ జదువ
నటమున్న నిటలతటాంతపదాబ్జ
ఘటితఫాలస్థల పటుదేహుఁ డగుచు
జనితనేత్రానంద సలిలాభిషిక్త
వినుతవక్త్రాంబుజ విలసనుం డగుచు
గద్గదప్రోద్భూత కంధరాంచితస
ముద్గత స్తవన సంయుతదేహుఁ డగుచు
సవినయసంభ్రమ సంప్రహర్షానంద
వివశాంతరంగాది విభ్రముం డగుచు
నున్నహాలాయుధు నన్నీలగళుఁడు
చెన్నొందఁ గౌఁగిటఁ జేర్చి సంప్రీతి
నాహాలాయుధునియుద్యద్భక్తియుతికి
సాహసంబునకు నసాధ్యనిష్ఠకును
మెచ్చి నచ్చోవు నర్మిలి దొట్రుకొనఁగఁ
జెచ్చెర నతులితశ్రీలింగమూర్తి
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లువోవ
వఱలెఁడుకనక దివ్యవిమానపంక్తి

యవిరళంబై వెల్ల నతఁడు వాలించు
నవపురంబులు గూడ శివభక్తవితతి
నాహాలాయుధుని యత్యద్భుతభక్తి
మాహాత్మ్య మలరార మహిఁజను ల్వొగడ
లాలితానందసల్లీల దలిర్పఁ
గైలాసమునకుఁ జక్కనఁ గొనిపోయె
సిరియాల దర్పాపహరణాగ్రముగను
హారుఁ డిల మెఱయించె నాహాలాయుధునిఁ
గావున నెందునఁ గరోక్తిభక్తి
భావన కెక్కునే బసవకుమార !

## మిండనైనారు కథ

మఱియును సద్భక్తిమహితమండనుఁడు
విఱుమిండనైనారు మేదురకీర్తి
జంగమారాధనాశ్రాంతనితాంత
సంగతసుఖ విగతాంగవికారి
యతులశాపానుగ్రహాసమగ్రకీర్తి
యతిశయశుద్ధశివైకమానసుఁడు
దుష్టజనోద్దండదోర్దళనుండు
శిష్టజనోత్కృష్ట శీలపాలనుఁడు
ధరణిఁ జేగొండనా విరచింపఁబడ్డ
పురవరంబందు సుస్థిరభక్తియుక్తి
నెలనెల శివరాత్రి నీమంబు భక్తి

వలగొని పండ్రెండువర్షము ల్సలిపి
యిచ్చమైఁ బనుమూఁడవేఁటి యంత్యమున
వచ్చి చెల్లంతిరువాలూరఁ బరగు
వాల్మీకిదేవునివాసంబునం ద
కల్మషభక్తి జాగరము సెల్లించి
పాపవిధ్వంసుని భక్తులుఁదాను
గోపురంబున నిష్టగోష్ఠి నున్నెడను

ఒడయనంబి వాల్మీకిదేవునిగుడికి వచ్చుట

నరుదండఁగా నంబి పరమనాచమ్మ
వరగృహంబున నుండి వాల్మీకిదేవు
గుడికి నేతెంచునయ్యెడఁ బురజనులు
గొడగూడి తన్నిరుగెలఁకులఁ గొలువ
సంతసంబున గ్రంతక్రంతల నిఱికి
యంతంత జనులు ఘోషముని జము వెట్ట
గద్యపద్యాద్యనవద్యకావ్యముల
హృద్యంబుగా సత్కవీశ్వరు ల్వొగడఁ
బరిహాసకు ల్సేరఁ బాఠకుల్ బట్లు
వరగుణాంకనలుగై వారము ల్సేయ
గాయకు ల్గాళము ల్గదియించి మ్రొక్కఁ
బాయక తాపసప్రభులు దీవింప
వసిగొని వారికి వాంఛితార్థంబు
లొసఁగుచు నంతంత వసలి నిల్చుచును

బదనఖకాంతి భూభామవక్షోజ
పదకరత్నప్రభాప్రఖ్యమై వెలుఁగ
రాజితభూషణప్రభలు దిగ్గజశి
రోజమౌక్తికములరుచి నుల్లసిల్ల
నతులదివ్యాంగదీధితు లుదయార్క
నతిశయాత్మజ్యోతిగతిఁ బ్రజ్వరిల్ల
స్థిరదశనద్యుతుల్ శృంగారలక్ష్మి
వరముఖముకురభాసురలీల వెలుఁగ
వరదృష్టశ్రీచు లావాప్తికిదేవు
చరణాబ్జరుచిరవిస్ఫురణఁ బొల్పార
మకుటమాణిక్యాంశుమంజరు లుస్సరగి
రికలితశేఖరాకృతిఁ బ్రజ్వరిల్ల
వరవిటాకృతిఁ బొల్చి హరునిరవద్య
కరుణామృతాటోపకలితవారాశిఁ
దేలుచుఁ బసిఁడి బొందియకోల వట్టి
క్రాలుచుఁ గిరుచు సోలుచుఁ గతులు
తడఁబడఁద్రొక్కుచుదండయిచ్చుచును
బడసిచూచుచుబయల్వ్రాడిచియాడుచును
సంగడికాండ్రను జప్పరించుచును
నంగ మెక్కంగ దిగంగఁ జూచుచును
బొలఁతిభావముఁ దలపోయుచు నాత్మ
నలరుచు నీశ గటూత్కించికొనుచు

భుజములం గింపుచుం బొంగుచునాత్మ
విజయంబు మెఱయుచు విఱ్ఱవీఁగుచును
నెక్కుడువిటచేష్ట లేపార నెదిరి
లెక్కసేయక సుఖలీల నందంపు
సంబవు లిడుకొని సరసర నొడయ
నంబి సద్భక్తగణవ్రాతమునకు
మ్రొక్కక కరములు మోడ్ప కందంద
చిక్కక స్రుక్కక చక్కన వచ్చి
గుడి సొచ్చి తననిత్యపడి వేఁడికొనఁగ
మిడమిడమిడుకుచు మిఱుమిండఁ డనియె

{ ఒడయనంబిగర్వమునకు మిఱుమిండఁడు కుపితుఁడై వెలివెట్టుట }

నోరి వీఁడెవ్వఁడురా? రాజమౌళి
ధీరదిగ్గజములఁ జీరికిఁ గొనక
క్రొవ్వె! మాభక్తులకొలఁ దెఱుంగండు
నవ్వాలుమీఁకేశుఁ డడ్డమే తనకు
ఘాలాతుఁడలిగిన భక్తులు గావఁ
జాలుదు రట్టిద షోలగుఁగాక!
యతులమహోద్ధతాయతమహాభక్త
తతి యద్దైనేఁ గావఁ దరమె యీశునకుఁ
గడుఁగడు గర్విమై కానఁ డాతనిని
గుడివెడలింపుఁడు గూడదు చూడ"

ననవుడు విన్న వా రాశ్చర్యమందఁ
జనుదెంచి యొక్క పూజారి గేల్మోగిచి
"దేవ! మున్నెఱుఁగవే? యీవాలువీఁకి
దేవదేవుఁడు లసత్ప్రీతిదుల్కాడ
నచ్చెరువంద నీయయ్యపాటలకు
మెచ్చెరో భక్తికి మెచ్చెరో యెఱుఁగఁ
బడి నిత్యవేమాడ లెడపక యిచ్చు
నడిగిన వెండియుఁ గడపఁ డేమియును
గొడుకని మన్నించుఁ గడుముద్దు సేయు
నెడవోవు లంజియయింటికిఁ దాన
యనురాగహేతు సర్వార్థసంపదలఁ
దనిపి నంబికి విటత్వంబు నెల్లించు
నిల విదూషకుభాతి నిరువురవలపు
లలర నన్యోన్యగుణాంకన ల్సేయుఁ
గరిమర్థిఁ దాన నాగరకున ట్లతని
సరసోచితాలాపసంపదఁ దనుపు
ధరఁ దాన పీఠమర్దకులీల నెల్ల
పరిచర్యలును బడిపనులును జేయు
నన్నియు ననవేల నమ్ముడువోయి
యున్నాఁడు శివుఁడు నంబెన్నకు" ననిన
"నీతఁడా నంబి? మున్నితనికా శివుఁడు
ప్రీతితోఁ బడివెట్టుఁ? బెద్దమేలయ్యె

సీతనిబగితియు నితనికి గూర్చు
నాతనిగూరిమిఁ జూతఁ డి”ట్లనుచు
“నంబియు గింబియు నంబికిఁ గూర్చు
సంబుండు గింబుండు సకలభక్తులకు
వెలియుఁ జుండో[illegible], యని ప్రేయించె ఘంట
నలిరేఁగి మిఱుమిండనల్లనైనారు
అట యున్నవారెల్ల నక్కజంబంద
“నిటయున్కి పాటిగా దింకరం” డనుడు
ముఖమంటపంబున మును గొలువున్న
యఖిలభక్తులయాగ్రహంబు నాలించి
భయభక్తియుక్తియు భక్తైకదేవ
తయు నంబికెఱిఁగింపఁ దలఁచి శంకరుఁడు

{ వాల్మీకేశుఁడు సాకారుఁడై మిఱుమిండనికి వెలిచి యొడయనంబితోఁ జాటుగాఁ బాఱిపోవుట }

నయ్యా!యనుడు నేమియయ్యా!య నెడుత
దివ్య వాక్యంబు నజ్జియ్య యడంచి
గ్రక్కునఁ జేసన్నఁ గడియంగఁ బిలిచి
చక్కన సాకారసన్మూర్తిఁ దాల్చి
వడవడవడఁకుచు వాల్మీకిదేవుఁ
డొడయనంబిని దన పెడకచ్చఁ జక్కఁ
బట్టించుకొనుచు సద్భక్తసమూహి

కట్టెదురఁ జనంగఁ గడుభయమునుంది
చప్పుడుగాకుండ జలహారి దెసకు
నప్పుడ తొలఁగి యొయ్యన నడ్డులిడుచు
మడుకుచు దీపముల్ మఱుఁగు వెట్టుచును
నొదుఁగుచు మూలలకోసరించుచును
గాలిసన్నడఁపుచుఁ గరముల గోడ
జాలూఁదికొనుచును వ్రాలించుకొన్న
లాలితనవపుష్పమాలావిలంబి
కీలనపంక్తులక్రేవలఁదారి
తలఁకున డెందంబు తటతట నుదరి
నలఁగుచు గర్భగృహాంతంబు వెడలి
మెల్లన మెల్లన మెట్టుచుఁ దొలఁగి
యల్లనల్లనఁ దల్పులండకుఁ జేరి
సంగతి జాలకసమితులఁదొంగి
తొంగిచూచుచు నెడఁ దొలఁగి నిల్చుచును
బోవకుండఁగ నోడి పోవంగనోడి
యావాలుమీఁకేశుఁ డాత్మఁగలంగ
సందులు ప్రిదుల సంచలనంబు వొదల
సందడిదొఱఁగి పూజారుల మొఱఁగి
ఘనభక్తనిచయంబుఁగనుఁగొన వెఱచు
చునుగరాగ్రములు దృష్టులకడ్డమిడుచు
స్రుక్కుచు సరగున సొకనాసి వెడలి

చక్కనగుడి వెన్కదిక్కున కరిగి
మొగుడుదురో యని వగవడి వెనుక
మగిడియాలించుచు బెగడుచుఁ జనుచుఁ
జూకాకుగాలికి స్రుక్కుచునిక్కి
నిక్కిచూచుచు నలుదిక్కులరయుచుఁ
జెంగిచెంగి చనుచుఁ బొంగటి వంగి
వంగిపాఱుచుఁ దొంగితొంగి తాఱుచును
నటమున్నకలుకోట యందొక్కఠాయి
స్ఫుటపదాంగుళమున భువిఁబడనూఁకి
కదుభయంబున గండికను దాటి వెడలి
వడిగొని కుఱుజంగ నిడుజంగ గునుకు
పరువు బాటయఁబెట్టి పఱవ ముందటను
ధరనొప్పిక్రోశ మాత్రంబున నొక్క
వరవిచిత్రోద్యానవన మున్నఁ జూచి
యెరుగక దిగ్భ్రమితాత్ముఁడై నిలిచి
"యూరోయిది యటంచునూహగా దురుత
రారణ్యమో యూరునడవియుఁగాదు
హృద్యశాఖాతతి నిత్తరు లొప్పు
నుద్యానవనముగా నొప్పు నీవనము
గాని ష్మిదియు నూరుగాకున్నఁ జాలుఁ
గాని ఘోరాటవియైన నుద్యాన
వనమైనననుచు నల్లన వనాంతరము

చనఁజొచ్చి తొంటి తెరువ్వనకుఁ దొలంగి
యూఁక చింతలవడి మోకమామిళ్ల
వాఁక నొప్పెడు సరోవరము వీక్షించి
పారిజాతవకుళ బంధూకకర్ణి
కారక్రముకకోవిదారము ల్గడచి
చందన ఘనసార చంపకాశోక
మందార తరువుల కందువదాఁటి
యిమ్ముల మాదిఫలమ్ముల కురవ
కమ్ముల నారికెళమ్ముల క్రేవ
మాగధీకరవీరమాలతీకుంద
నాగకేసర వికీర్ణస్థలి నడుమ
మల్లికావిద్రుమ మాధవీద్రాక్ష
వల్లరీవేల్లన సల్లీలఁదనరి
లలితతదీయ కిసలయ ప్రసూన
ఫలమంజరుల ప్రభఁబ్రజ్వరిల్లుచును
బంబి పున్నాగ రంభాపరివేష్టి
తంబగు సంతానధరణీరుహాంబు
పొడఁగని ముందట గుడియుకాఁ దలఁచి
యడుగెత్తఁ కతిసంశయాత్ముఁడై చూచి
యీవనమధ్యమందిది యొక్కగుడియొ?
కావింపఁబడియున్న ఘనకల్పతరువొ?
యీతరుశాఖల హేమకుంభములొ?

భాతివిద్రుమలతాప్రసవ మంజరులొ?
యీమంజరులలోన నిదిరత్నపంక్తి
యో మల్లికాతతియో! పుష్పతతియొ?
యీపుష్పపంక్తిమాకెనయుఁ గాదనుచు
నేపారి యిట్లున్న యెలమి వేష్టించి
ప్రాఁకుగట్టినయట్టి మానంపుగుడియొ?
ప్రాకటపుష్ప విస్ఫార గుల్మములొ?
యీగుల్మమధ్య మహీజరాజనకు
బాగొందఁజల్లని పవనంబు నొసఁగఁ
జాలుపచ్చని పట్టుసాలవట్టములొ?
క్రాలుచున్నట్టి కదళీదళములొ?
యీకదళీదళానీకంబు సుట్టి
ప్రాకారములలీలఁ బ్రజ్వరిల్లెడిని
వినుతికెక్కిన కల్పవృక్షంబయిందియు
ననుమాన మొక్కింతయును వలదనుచు
శీతలంబై కడుఁజెన్నొందుచున్న
యాతరుచ్ఛాయ కట్లల్లన యేఁగి
భువి నిపతితపుష్పములు గద్దెగాఁగ
శివుఁడు సుఖాసనాసీనుఁడై యంత
నెగయు నిట్టూర్పులునిగుడఁగ ఱొమ్ము
నిగుడించుకొని నంబి మొగముఁజూచుచును
సంగతానన ఘర్మజలములు గరత

లాంగుళంబులఁబుచ్చి యవలవైచుచును
నలిఁ గదళీదళచలన సంకలిత
మలయానిలమునకు మనసువెట్టుచును
నానావిధానేకనవపుష్పపరిమ
ళానూనవాసనకాత్మఁ జొక్కుచును
ఘనసారచందనక్ష్మాజ సౌరభము
తనుపు సంగతికిఁ డెందంబు నొగ్గుచును
బరిమళాఘ్రాత భృంగపక్షోపనిహతిఁ
దొరుగు పుష్పాళికిని శిరము సాఁపుచును
హిమకరశేఖరుఁ డమృతాంగు డిట్లు
గమనోపతాపోపశమము వహింప
నొయ్యనొయ్యన నంబికున్నదం బడఁగ
నయ్యెడ భక్తి భయం బాత్మఁ దోఁడఁగ
"నయ్యా! యిదేమయ్య! జియ్య! నీయట్టి
యయ్యకు నిట్టి భయం బాత్మఁదోఁచు
టింతవట్రిల్లు టిదేమొకో?" యనిన
నంత వాల్మీకేశుఁ డతని కిట్లనియె.

{ వాల్మీకేశుఁడు శివభక్తులమహిమ నొడయ
నంబికిఁ జెప్పుట }

"నవికలవేద వేదాంతపురాణ
వివిధశాస్త్రార్థ సంవిత్ప్రమాణముల
మాకును మద్భక్త మండలికిని వి

వేకింపఁగా నెద్ది వేఱుభేదంబు ?
భక్తులకేన చూ ప్రాణంబు నాకు
భక్తుల దేహంబు పరమార్థ మిదియు
మద్భక్తసేవయ మత్పాదసేవ
మద్భక్తదేహంబు మాదుదేహంబు
మద్భక్త వినుతియ మద్గుణావినుతి
మద్భక్తనిందయే మత్తత్త్వనింద
సన్నుతలీల మాజంగమావలిని
మన్నింపకున్నను మఱి నిష్ఫలంబు
శంభు పూజనముదా "స్థావరే నిష్ఫ
లం భవే" త్తని శ్రుతు ల్చాటెఁగాదె !
భక్తైకదేహుండ భక్తవత్సలుఁడ
భక్తసత్ప్రాణుండ భక్తాశ్రితుండ
భక్తపరాధీనయుక్తుండ నట్లు
భక్తి కేఁగూర్చుట ప్రఖ్యాతి గాదె

బాణుని కథ

యొట్టన్న ! వీరమాహేశ్వరభక్తి
నెట్టణ గలుగు వినిశ్చలాత్మకుఁడు
బాణుండు నాఁగ సద్భక్తిక్రియాధు
రీణుండు లింగమూర్తికి సాంగముగను
వేయుమాఱులు నిత్యవిధి నేమముగను
బాయక పూజలు సేయుచునుండ

దేహధర్మములకుఁ దెఱపి లేకున్న
బాహుసహస్రంబు బాణున కిచ్చి
యది యొక్కమాఱు వేయవసరంబులను
సదమలభక్తిమైఁ జలుపఁజేసినను
"బాణునకును మెచ్చి బాహుసహస్ర
మేణాంకధరుఁ డిప్పు డిచ్చెఁ దా"ననుచు
సందర్శనాసక్తిఁ జనుదెంచు భక్త
సందోహశివకథాసంగతి నుండ
"నటమున్న చేయులింగార్చనలకును
నిట యెడలేకున్న నెట్లొకో" యనుచు
సషిసను లింగావసరములు సేసి
తొడఁగి ప్రసాదంబుఁ గుడుచునంతకును
వారించి చొరనీక వాకిట నిలిచి
యేరికైనను సేన యిల గోష్ఠి యిచ్చి
వాకిటికాపులవాఁడనై యతని
వాకిలి గావనే లోక మెఱుంగ

## పిట్టవ్వకథ

వెండియు నమ్ముదిగొండ యన్పురిని
దండిమై కరికాలమండలేశ్వరుఁడు
కావేరి గట్టింపఁ గడఁగి యిల్లాది
వోవ 'నీకై యేను వోయెద' నంచుఁ
పిట్టవ్వ భక్తికిఁ బ్రియపడి కాదె
వెట్టికిఁ జనులెల్ల విను మట్లుఁగాక

## కలికామదేవుని కథ

నిత్యార్థముగు స్వామిభృత్యసంబంధ
కృత్యసద్భావనక్రియ దులుకాడ
"నక్కటా! స్వామిదివ్యాంఘ్రికంజంబు
లొక్కింతయును గందునో యనకిట్లు
పంచిన మర్త్యమేలంబున నొడయ
నంబి యన్వాఁడు భయంబు చింత లేక
వెడపను ల్పంపఁగ వేశ్యయింటికిని
నెడయును బుచ్చంగ నిర్లజింగియును
వారక యత్తిరువాలూర భక్త
లూరక చూచుచు నున్నారు గాని
తారొండెశివుఁ బంపఁదగ దన్నవారు
గారొండె నంబికి వేఱొక్క భృత్యుఁ
బనిపాటు సెయ నేర్పడ నియమింప
రననేల వేయును" ననుచు నుగ్రమునఁ
గలికామదేవుఁ డగ్గణము సీయూరు
దలఁచిన నీవార్త దడవినయపుడ
యొట్టిబల్లిదుసైనఁ బట్టి భంజింప
నట్టిచో నే నేఁగి యట్లొడఁబఱచి
చక్కన నాతనిఁ సముఖంబునందు
నొక్కటిసేయనే యొండు డిఁకనేల ?
చేయొగ్గి మీఁలాఁతచేత మాఁలాఁత

యాయతిమాపి ప్రాఁతప్పు గొన్నాఁడె
యడిగినప్పుడు నీకు నర్థమిచ్చుటయు
బడిపను లేమేనిఁ బాటె సేయుటయు?
మిక్కిలి భక్తినిమిత్తంబు గాదె
యొక్కఁడుగాఁగ నీ కేఁగూర్పు టెల్లఁ?
గావున మా భక్తగణములనడుమ
నీ వహంకారించి నిలువ నెవ్వఁడవు?
భ్రాంతి "సంసర్గజాః పాపగుణా భ
వంతి" యన్పదువు దా వసుధ నాకయ్యె
నీకారణంబునఁ గాక భక్తులకు
మాకును నొల్లమి మనసునఁ గలదె?"
యని యిట్లు పెక్కు దృష్టాంతరంబులను
మనసిజహరుఁడు నంబెనకుఁ దెల్లముగ
భక్తుల మహిమయు భక్తుల ఘనత
భక్తుల నడవళ్లుఁ బాటించి తెలిపి
నయమును నధికవినయమును భక్తి
భయమును దత్త్వనిర్ణయము సంధించి
ప్రథితజంగమముఖభక్తస్థలంబు
పథముఁ జూపుడుఁ జాఁగఁబడి మ్రొక్కి నంబి
"సద్గురుమూర్తి! జగద్గీతకీర్తి!
హృద్గతంబై యున్న మద్గర్వ మడఁచి
సద్గతిఁ జూపి నీజంగమభక్తి

తద్ద్రతుఁజేసితి ధన్యుండ నైతి
నరిగి దైన్యముఁ జూపి యభయంబు వేఁడి
శరణని ప్రార్థించి సంస్తుతుల్ సేసి
యడుగులఁ బడి బంటనై యాడిపాడి
పడయుదు నెట్టైన భక్తులకరుణఁ
జూడుమా! యింక నీసుతుభక్తి" యనుచు
నాడాడ భక్తాళి కభిముఖుం డగుచు
నందంద బారెంట నంత మూరెంట
నందుండి ధరణి సాష్టాంగంబు లిడుచు
దాళముల్ గ్రంగన ధ్వనియించి మ్రొక్క
వేళానుకూలవిలోలరాగములఁ
బరగు మహాభక్తచరితలు నాద
భరితమై చనఁ దిరుపాటలు సేసి
పాడుచు నొక్కొక్కభక్తునిచరిత
వేడుకఁ బొగడు నవ్విధ మెట్టులనిన

## ఏణంమూర్తినైనారు కథ

లీలమైఁ దన ప్రాణలింగంబునకుఁ ద్రి
కాలంబునందును మేలిచందనము
ననురక్తి నియతిగా నర్పింపుచుండ
ధన మెల్లఁ జందనంబునకు సమయుడుఁ
గడులేమి పుట్టిన గంధ మొబ్బంగి
గడియింపఁజాల కయ్యెడ నిర్ణయించి

తలఁపగ నేల దాఁ గలిమియుభక్తి
కలిమిగా కర్థంబు కలిమియే కలిమి
నామనంబునఁ దెంపు లేమియే భక్తి
లేమిగా కర్థంబు లేమియే లేమి
తనువుండ మనసుండఁ దల్లడం బంద
నను మెచ్చునే ప్రాణనాథుఁ డీశుండు
తనువెల్లఁగూడ గంధముగాఁగ దిగిచి
యనుపక్తి నిత్యంబు నర్పింతు నింక
నెత్తురు వెడలిన నిగ్గు దేరినను
నిత్తఱిఁ దనుగుణం బింతసూపినను
మెఱుఁగు లేవడియైన మించు సడలిన
నెఱిఁ జందనమునకుఁ గొఱఁత దోఁచినను
జాయ దప్పిన నెఱి సామాన్యమైనఁ
బాయుచో నురలినఁ బొలుపు గందినను
గంపొందు వలచినఁ గడలు గట్టినను
గెంపు దక్కువయైనఁ గ్రియ వెల్తియైనఁ
దనుపు లేకున్నఁ బూఁతకు రాకయున్న
ననుపు గాకున్న వాసనకుఁ దేకున్న
మఱి కదా శివునకు మాకు నంకంబు
అఱిముఱితనమిప్పు డదియేల!" యనుచు
ముదమున వలపలిమోఁచేయి సానఁ
గదియించి తిగిచి శ్రీగంధంబు వడసి

శివున కర్పించి భజించి మెప్పించి
భువి నరుల్ సూడఁ జూడ విమాన మెక్కి
మృడుపురంబునకు నప్పుడు వొందితోడ
నడచిన యేణుమూర్తినయనారిబంట

కడమలనంబి కథ

ప్రాణలింగమునకుఁ బ్రతిదినంబునను
జాణత వెలయ నిజవ్రతంబుగను
గడు నర్థితోడ నఖండదీపంబు
లెడపక నిత్య వేయేసి ముట్టింప
నదియ నిమిత్తమై యర్థంబు సమయ
మదిలోన నొక్కనుమానంబు లేక
"తనువు దక్కంగ నర్థంబెల్ల సమసెఁ
దనువు నివేదించు తఱి యయ్యె నింకఁ
దలయును మేనును దరికొల్పి పెద్ద
వెలుఁగు వెట్టెద" నంచు వెంట్రుకల్ విచ్చి
జ్వాలనంబునకుఁ బట్టి శంభు మెప్పించి
వెలసిన యాకడమలనంబిబంట

గుగ్గులుకళియారు కథ

ఆసక్తిమై మహిసాక్షి ధూపంబు
బాసగా వెండియుఁ బ్రాణేశ్వరునకు
నేఁడునాఁ డనకుండ నిత్యనేమముగ
మూఁడుసంధ్యల ధూపముగ సమర్పింప

సాళిమంగళసూత్ర మది యాదిగాఁగ
లీల నర్థంబు సెల్లించున త్తఱిని
దిరుపరంధామమం దురగేశ్వరేశుఁ
డురగకన్యక లతిస్ఫురణమైఁ బాడ
సోలి ముందటి కింత వ్రాలుడు ధరణి
పాలుఁడు మును వెక్కు పాయంబులందుఁ
జక్కొల్పఁ జాలక సంచలింపంగ
నక్కడి కేఁగి యత్యర్థిఁ దుల్కాడ
"వలసినయంత గుగ్గిలము నాకిందు
నిలిపెదఁ జక్కఁగా నిటలాక్షు" ననుడు
మహినొక్కవ్రేఁకగా మహిసాక్షివోసి
మహిపతియొప్పించి మహిఁజాఁగి మ్రొక్క
నలరుచుఁగైకొని యఖిలంబునెఱుఁగ
బలువుగానొకపట వలిచించియొక్క
దిక్కుశుతోడ సంధించి వేఱొక్క
దిక్కు శస్త్రంబుతోఁ దిగిచి బంధించి
గ్రక్కున శస్త్రంబుఁ గంఠంబునందు
నెక్కొల్పి వెనుకకు నిగుడంగఁ దడవ
నెప్పటియట్ల నాగేశుండు నిలిచి
యప్పుడు ప్రత్యక్షమై కరుణింప
నలి దీటుకొన నపునర్భవలీల
వెలసిన గుగ్గులుకళియారిబంటు

అరివాళునయనారి కథ

లీల వెండియుఁ దనలింగంబునకుఁ ద్రి
కాలంబు నియమంబుగా రాజనంబు
ప్రాలోగిరము సమర్పణసేసి తాను
నాలింగలీనుఁడై యట్లువర్తింపఁ
దమ మొల్లమంతయుఁ దత్కారణమున
సమయుడు నొందుపాయము లేమిఁ జేసి
కొడవలి గడియించికొనుచుఁ గైకూలి
పడి రాజనములకు నొడఁబాటు చేసి
పట్టిననియమంబు ప్రతి వాల్చుచుండ
నట్టిచోఁ గూలియుఁ బుట్టకయున్న
నిట్టుపవాస మేన్దినము లుండంగ
నెట్టకేలకు బియ్య మిరుస గల్గినను
సరసరఁ గొనివచ్చు సంభ్రమంబునను
ధరఁ దాఁకి పడిన నెత్తఁగ రాక ప్రాలు
నెరియలపాలైనఁ "బురహర! నీకుఁ
గరమర్థి నర్పింపఁగా నేఁగుదెంచు
నత్తఱి విచ్ఛిన్నమయ్యె నేనింకఁ
జత్తునకా" కంచుసంశయం బుడిగి
పెడకచ్చ గొడవలి మెడఁ బెట్టి మూఁపు
తడుపంట సంధించి తన్నంగఁ దడవఁ
బరమేశ్వరుం డట్టి బాసకు మెచ్చి

ధరణిఁ బ్రసన్నుఁడై కరుణఁ జూచుడును
బరమపునర్భవప్రాప్తుఁ డై యున్న
యరివాళునయనారి కనుఁగు భృత్యుండ

— అడిభర్తుని కథ —

మఱియును నప్పాండ్యమండలంబునను
మఱియొండు గాయకం బెలుఁగమిఁ జేసి
వలయొత్తి నీటిలో వైవంగఁ దడవ
వలఁ దొల్ల వచ్చిన వలుఁదమత్స్యంబు
నదియు శివప్రీతి యనిపోవ విడుచు
నిదియ నేమముగాఁగ నితరమత్స్యముల
నంగడిఁ బోకార్చి యందుల లబ్ధి
జంగమారాధనల్ సలుపుచు లీలఁ
జరియింప దినములు సనఁగ వేఁటయును
బరికింప నేనాళ్లువాఱమి దస్సి
వలఁగొని మఱునాఁడు వైవంగఁ దొలుత
వలనుగా నందు సువర్ణమత్స్యంబు
వచ్చిన నదియు శివప్రీతి యనుచు
నచ్చోన పోవిడ్చి యవలవై చుడును
నమ్మీన వచ్చుడు నారేవు విడిచి
యొమ్మెయి వలవైవ నెప్పటి మీన
తగులంగ విడుపంగఁ దగులంగఁ విడువఁ
బగలెల్ల నమ్మీన పట్టువడంగ

కరుణాత్మ! శాపమోక్షంబు దా లేదు
వేడుకమై నిత్యవిధికైన వేఁట
లాడవే మామీఁద నఖిలోపకార!
గంధర్వులం దొక్క-గార్యకారణము
సంధిల్లి మాకిట్టి శాపంబు వచ్చె"
ననుచుఁ దద్వృత్తాంతమంతయుఁ జెప్పి
"కనుఁగొన శాపమోక్షం బగుటకును
దానిక్క- మిదియు మీచే నేము సావఁ
గానప్డు దివ్యవిమానము ల్వచ్చి
కొనిపోవుఁ గైలాసమునకుఁ దత్క్షణము
జనులకు నెల్ల దృష్టప్రత్యయముగ
నరయ శాపంబె ము న్నాయయ్యె యోగి
వరము గానిది మాకుఁ బరికించిచూడ
నవధరింపఁగఁ గల దదిఁ గొట్టులనినఁ
దవిలి ము న్నేము గంధర్వలోకులము
అమలాత్మ! మాకింక నపవర్గపదవి
సమకూరు మీచేతఁ జచ్చుటఁ జేసి
యదిగాన మమ్ము దయాకృతిఁ జూచి
బ్రదికింపవే" యని ప్రస్తుతింపంగ
నక్షయమూర్తి దివ్యజ్ఞదృష్టి
నీక్షించి తత్కార్య మిట్లౌట యెఱిఁగి
యరుగుట పాలించి యంతన మగిడి

కరమర్థిఁ గొంతవత్తిరిఁ గోసికొనుచు
సరసర నసమానశరణాగ్రగణ్యుఁ
డరుదెంచి కనుగొని యనురాగలీలఁ
బచ్చనితలచుట్టుఁ బచ్చకుప్పసము
నచ్చెరువుగ విల్లు నమ్ములు వట్టి
నందనవన పురణ్యంబుపై విడియు
చందంబునను సహజక్రియఁ బొల్పు
బలువేఁటకాఁడు, నాపంచాస్యుమీఁడు
చలమును బలమును గలజాగిలములు
దనుఁ బరివేష్టించికొని యేఁగుదేర
నవఘుండు జొమ్మయ్య సన నరణ్యమున
సమ్మృగావలి యుబ్బి జొమ్మయ్య మీఁద
గ్రమ్మనఁ జనుదేరఁగా వేఁటకాఁడు
సడి గేల దుయ్యడు సారమేయములు
నడర నంకమపోలె విడిపించికొనుచుఁ
బొంగి మనోవేగమునఁ గూడ ముట్టి
యంగద మృగముల నార్చుచు వ్రేయఁ
గుక్కలఁ జంకించి కోలల కెగసి
చక్కన జొమ్మయ్య శరముల కెదిరి
చచ్చుచు శాపమోక్షంబులు గాంచి
యచ్చోప్పిన గంధర్వులై నిల్చి తెలుఁగు
జొమ్మయ్యగారిపాదమ్ముల కెరఁగి

నమ్మదలీలఁ బ్రశంస సేయుచును
నతనిచే మరణంబు లగుటను జేసి
యతులితాగణ్యపుణ్యప్రాప్తిఁ బొంది
ప్రవిమలకనక దివ్యవిమానములను
శివలోకమునకుఁ జెచ్చెర నేఁగుచుండఁ
బ్రస్ఫారత నెగిరెడు కుక్కల మొఱఁగి
తా రేయుశరములఁ దప్పించుకొనుచు
జొమ్మయ్యచేతన క్రమ్మనఁ జచ్చి
యమ్మృగరూపంబు లణఁగి మ్రొక్కుచును
గంధర్వులై కనకవిమానచయము
సంధిల్ల నేఁగు టాశ్చర్యంబు గాదె
"యదె కుక్క లేఁగు నా నంతలోపలను
నిదె పోయెఁబోయెనా నెగసిపోయెకును
నెప్పాటనైనఁ దా రేయుబాణములు
తప్పునే? తాఁకియుఁ దాఁక వయ్యెడిని
మృగముల కేనాఁట మించి వెలుంగు
గగనంబునను గనకవిమానపంక్తి
మేదినిఁ గారణమృగరూపధారు
లాది పీ రెవ్వరో యాతఁడ యెఱుఁగు
నితరుఁడే జొమ్మయ్య యిహలోకరుద్రుఁ
డతులకారణపురుషావతారుండు"
నని తోడివేఁటకాం డ్రచ్చెరువంది

వికుతింప నిబ్భంగి వేఁట లాడుచును
నిచ్చటిమృగమునఁ నెరిఁ బొలియించి
యచ్చుగా శివపురి కనుపుచునుండి
యుర్వీశుఁ డాదిగా నొక్కొకనాఁడు
సర్వజనంబులుఁ జనుదెంచి చూడ
హరభక్తవితతియుఁ నరుదెంచి చూడ
"నరు" దని పొగడ జొమ్మయ్య వీక్షించి
"పృథుగురుధ్యానము న్నందిపాలమునఁ
బ్రథితసంసారమృ పంచాస్యుఁ ద్రుంచి
మును భక్తదర్శనం బను ముద్గరమునఁ
జనుపురాకృతకర్మమను దుప్పిఁ జంపి
గుర్వాజ్ఞయనుకత్తి కుంతంబునందుఁ
బూర్వాశ్రమంబను పులిఁ బడఁబొడిచి
సుజ్ఞానమను వాఁడి సురియఁ జేపట్టి
యజ్ఞానమను వరాహంబుఁ జెండాడి
యాయతి సద్భక్తియను తోమరమున
మాయాప్రపంచ మన్మనుఁబోతుఁదునిమి
వినుతశివాచారమను కుఠారమున
జినలోకపథమను చివ్వంగిఁ జదిపి
విమలప్రసాదము న్వల్లు పూరించి
భ్రమితేంద్రియముఁ లనఁ బడు నిర్గ నేసి
భాషాప్రణీతమన్నదు బల్లిగోల

నీషణత్రయమును నెలుఁగు కన్నొడిచి
హారమహాత్త్వంబను నద్దాయుధమునఁ
బరవాదులను మృగోత్కరముఁ గీటడఁచి
వెలసిన యూబలు వేఁటకానికిని
నిలమృగంబులఁ జంపు టిదియెంత పెద్ద
యదిగాక పరికింప నరుగుచో నతని
పదఘట్టనలఁ జచ్చుబహుజంతువులకు
నగు మోక్షమనిన జొమ్మయ్యచేఁ జచ్చు
మృగము లేఁగుట సోద్యమే శివపురికి”
ననుచు నబ్బసవయ్య యర్థిమైఁ బొగడ
ఘనకీర్తిఁ గళ్యాణకటకంబునందుఁ
జోద్యతరంబుగా జొమ్మయ్య సిరస
ముద్యద్గుణాంకుఁడై యుండెఁ దెల్లముగఁ
దెలుఁగు జొమ్మయ్య నిర్మలచరిత్రంబు
నలవోకఁ జదివిన నర్థిమై విన్న
రాజ్యాభిషిక్తుఁడై రంజిల్లుఁ బ్రీతిఁ
బూజ్యత లింగసామ్రాజ్యంబుఁ బొందు.
సారజంగమపాదసరసిజయుగ్మ
ధారాళమకరంద ధౌతశిరస్క!
శారదనీరదహారనీహార
తారాగురాహార ధౌతయశస్క!
యంచితకర్ణరసాయనకల్ప

సంచితపరిపాకసత్యవచస్కు!
మహనీయరుద్రాక్షమాలికాభూతి
విహితమండనకాంతి విలసదురస్కు!
సంగాఖ్య! సమసుఖసదమలప్రాణ
లింగనిరంతర లీనమనస్కు!
ఇది యసంఖ్యాతమాహేశ్వరదివ్య
పదపద్మసౌరభభ్రమరాయమాణ
జంగమలింగప్రసాదోపభోగ
సంగతసుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలుకురికిసోమనాథ
సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగఘనకరస్థలి విశ్వనాథ
వరకృపాంచితకవిత్వస్ఫూర్తిఁ బేర్చు
చను బసవపురాణమను కథయందు
ననుపమంబుగఁ బంచమాశ్వాస మయ్యె.

# బసవపురాణము

## షష్ఠాశ్వాసము

---

### ఏకాంత రామయ్యాగారి కథ

శ్రీమన్మహాభక్త చిరతరవరద
యామృతపూరవిహారసంగాఖ్య!
మఱియు నేకాంత రామయ్య నానొక్క
నెఱవాది భక్తుండు కఱకంఠమూర్తి
శమదమస్ఫురణానుషక్తుండు జైన
సమయకోలాహలుఁ డమితప్రతాపి
యతులితశివసమయప్రతిపాలుఁ
డతిశయవీరభద్రావతారుండు
నిస్పృహేంద్రియగుణాన్వితచేతనుఁడు
నస్పృశ్య భవిజనుఁ డపగతభయుఁడు
లింగ సమ్యగ్జ్ఞాని లింగావధాని
లింగగంభీరుఁ డభంగురకీర్తి
యేకాంతభక్తి సుశ్లోకుఁడు మర్త్య
లోకపావనుఁడు త్రిలోకవంద్యుండు
ధీరమహోదారశూరగంభీర

సారగుణస్తోమధౌరేయుఁ డనఁగ
నెగడి నిత్యక్రియానియతప్రయుక్తి
దగిలి శివార్చనాంతమున నత్యర్థిఁ
బ్రమథలోకమున కుద్యమలీల నరిగి
విమలాత్మ వీరక వీరభద్రాది
గణనికాయములకుఁ బ్రణమిల్లి వారి
గుణకీర్తనలు సేసి కోర్కి దైవాఱ
శివభక్తి తత్త్వానుభవ సదేకాంత
సవిశేషసుఖసుధాశరధి నోలాడి
యొప్పటియ ట్లిల కెలమి నేతెంచి
మున్పూఁట నిమ్మార్గమునఁ జరింపంగ
బసవనిభక్తి సంపత్సముద్రంబు
దెసల ధరాస్థలి దివి నిట్టవాడువ
స్వచ్ఛుండు సందర్శనేచ్ఛ నేతెంచి
ప్రచ్ఛన్నయుక్తి నబ్బసవనిఁ జూచి
"యాకటకమునందు నేకాంతరాముఁ
డేకాకియై చరియించుచునుండ
నొక్కజైనుఁడు సెప్ప నూడ్వకవచ్చి
చక్కన శివనివాసంబుఁ జొచ్చుడును
లోపల రామయ్య గోపించి చూచి
"యీపాపమున కింక నేగుఱి గలదు
రోరి! జైనుండ! తగ దుడురాజధరు న

గారాంతరముఁ జెప్పఁగాళ్లఁ జొరంగఁ,
గడవఁ జొచ్చితినని మృడునకుఁ జాఁగఁ
బడి మ్రొక్కి చెప్పులు వాఱంగ వైచి
యటుగాక తక్కిన నంతకోద్దండ
పటుదండ బాధలపాలైతి పొమ్ము
ఇంకఁ జెప్పులతోన యిట్లుంటి వేని
శంకింప కిప్పుడ సందుసందులకు
నఱకుదు" ననవుడుఁ బిఱుసన కతఁడు
"నఱిమఱి నీ కేల యాగ్రహించెదవు?
ముక్కంటిగుళ్లకు దిక్కు గల్గితివి
నిక్కపుభక్తుండ! నీకేల వెఱతు
గుడి వసదియు వేల్పులోడయందు జినుఁడు
నుడువకు కాదేనిఁ బడయుమా మగిడి
దల దర్గియిప్పుడ మలహరుచేత,
నిల నీవె భక్తుండ వితఁడె వే"ల్పనిన
"నితనిఁ జంపుట యిది యెంత దలంపఁ
బ్రతినఁజూపమి భక్తి పంతంబుగాదు
శిరమిత్తుఁ బడయుదు జినసమయంబు
శిరము ద్రుంపుదు వాసఁ జెల్లింతు"ననుచు
శ్రీకరుభక్తికిఁ జేవ యెక్కంగ
నేకాంతరామయ్య యిట్లని పలికె
"శిర మిచ్చి పడయుట యరిది యంటేనిఁ

బరవాది! వినుర మాభక్తులమహిమ
యొక్కభక్తుఁడు జంబూర్మహాకాళుఁ
డక్కజంబుగ శిర మభవున కిచ్చి
యిలయెల్ల నెఱుఁగంగ నెలమితోఁ బడసెఁ
దల నెట్టితోఁ గీలుకొలిపి ప్రాణంబు
అట వార్తగలిగి యీకటకంబునందుఁ
బటుమతి గోవిందభట్టారకుండు
శివునినిర్మాల్య మిచ్చిన మస్తకంబు
తవిలిచి కొను టిది దప్పు దప్పనుచుఁ
గఱకంఠునకుఁ దలదఱిగి పూజించి
నెఱియ మూన్నాళ్లకు మఱియొండుశిరము
వడసె వెండియు నొక్కభక్తుఁ డిట్టిదియుఁ
గడు నపహాస్యంబుగాఁ బ్రతిష్ఠించి
మూఁడుదినంబులు ముక్కంటి యచట
లేఁడో తాఁ జచ్చినవాఁడో కా కనుచు
మొఱటద వంకయ్య యఱిముఱి శిరము
తఱుగంగ మొలవఁగఁ దఱుగఁగ మొలవఁ
దఱిగెడు తలలును దఱుఁగని భక్తిఁ
దఱు గమిగాఁ జేసి తదవసరమునఁ
బూన్చెడి శిరమును బూన్పనిశిరముఁ
బూన్చినపిమ్మటఁ బుచ్చెడు శిరము
మొలచెడు శిరమును మొలచిన శిరము

మొలవఁగ లోలోన నలిఁ దోఁచుశిరము
తఱిగెడు శిరమును దఱుగని శిరము
తఱుగక తనుదాన యొఱఁగెడుశిరము
సరసర హారుమీఁద సంధిల్లుశిరముఁ
జారి నొయ్యనొయ్యన పాదవగుశిరము
కన్నులార్చుశిరముఁ గాదనుశిరము
మిన్నక శివుమ్రోల మెలఁగెడిశిరము
నున్నతి మీఁదన యుండెడుశిరము
సన్న సేయుశిరము జరిగెడుశిరము
నారుచుశిరము నౌనౌ ననుశిరముఁ
గేరెడుశిరమును దారెడుశిరముఁ
బారుతెంచుశిరంబుఁ బైపడుశిరము
గారవంబున శివుఁ గలసెడిశిరము
ననలంబుమీఁదను నలరెడుశిరము
ననలంబు మ్రింగుచు నటయుండుశిరము
బొబ్బిడుశిరమును నుబ్బెడుశిరము
గుబ్బవఁబడి తద్ద గునిసెడుశిరము
నాలుక గ్రోయుచునలి గొనుశిరము
శూలిని వెక్కిరించుచు నుండుశిరము
నుఱికుర్కిపడుశిర మొఱగెడుశిరము
మఱియు సంధిల్లుచు మఱపడుశిరము
పొగడెడుశిరమును నగియెడుశిరముఁ

దెగడెడుశిరమును దీవించుశిరము
శరణనుశిరమును జయవెట్టుశిరము
సరసమాడుశిరముఁ జదివెడుశిరము
మలరెడుశిరమును మూర్కొనుశిరము
దలఁకకీశ్వరుతోడఁ దాఁకెడుశిరము
'బా'పనుశిరమును బాడెడుశిరముఁ
'జాపంద'యని శివు జంకించుశిరము
నిప్పాటఁ బసికమై నీశ్వరుఁబూన్పఁ
గుప్పలుగొని తల ల్గుడిఁ బిక్కటిల్ల
మూరారి విస్మయమానసుం డగుచు
"ఔరౌరి! వంక! నా కూరుపు వోదు
ఓడితినన్నను మేడెమువాడువఁ
బాడియే నీవీరభక్తికి నిలువ
నావశంబే?" యని దేవదేవుండు
నావంకతండె శ్రీహస్తంబు వట్టి
యనురాగమునఁ బొల్చు నత్తలలెల్లఁ
దనలింగమూర్తిలోనన ధరియించె
శంకించుచును నరు ల్సంస్తుతి సేయ
వంకయ్య శివునిమాఱంకమై గెలిచె
నిటువంటి భక్తు లనేకులు గలరు
కుటిలాత్మ! విన నీకుఁ గొలఁది గాదెట్లు
నెఱుఁగవే తొల్లి మీయెద్దడవారిఁ

బఱపిన మాశివభక్తులమిహిఁ;
తిరునావలూరను పురిఁ దిరునావ
కరిశుండనఁగ జైనగురుఁ డొక్కరుండు
జినసమయాచార్యుఁ డనఁ జనునట్టి
మును శూలకుట్టెత్తి మూల్గుచు నేలఁ
బడి పొరలుచుఁ బ్రాణపరితాపమందు
నెడ వారి తోఁబుట్టు వేతెంచి చూచి
"యీమంత్రతంత్రలూలామూలములను
నోములదేహి! నీ కుడుగదు నొప్పి
బ్రదుకంగవలతేని భక్త సమ్మతిని
మదనసంహారు దివ్యమంత్రంబు గఱవు
వేగంబ నీకు నీరోగమయ్యెడును
రాగిలి యీప్సితార్థములు వొందెదిని"
ననవుడు "భక్తుండ నయ్యెదనింక
ననుమాన మొక్కింతయును వల"దనుచు
శపథంబు సేయుడుఁ జయ్యన నతివ
త్రిపురారిభక్తులఁ దివుటఁ దలంచి
యనుపమదివ్యపంచాక్షరీమంత్ర
మున భసిత మలంది మొల దిగఁదుడువ
శూలకు ట్టుడుగుడుఁ జోద్యంబు నొంది
యాలలనకు నతఁడష్టాంగ మెరఁగి
"పడఁతి! నీకతమున బ్రదికితి నింక

నడర భక్తుండవే నరయ్యోద"యనుచు
శ్రీపతినాథునాజ్ఞాపనఁ జేసి
యాపగలూరికి నరిగి యక్కడను
నిలఁ బంకమందున్న జలరుహామట్ల
వెలివాడనున్న నిర్మలసుచరిత్రు
గురుమూర్తిఁ గవిసి య త్తిరునావకరిశుఁ
డరుదంద సాష్టాంగుఁడై మ్రొక్కి నిలువ
ముదమునఁ దద్గురుమూర్తియు నతనిఁ
బదపడి శివభక్తిపరుఁ జేయఁ దలఁచి
తనదుకృపావలోకనమాత్రఁ జేసి
ఘనపురాకృతకర్మ కల్మషం బడఁచి
భసితసదైశ్వర్యపట్టంబు గట్టి
నొసలి దుర్లేఖలు గసిమసి సేసి
శివతీర్థకలశాభిషేక మొనర్చి
సవిశేషలింగ సంస్కార మొనర్చి
సంచిత శివహస్త సంగతుఁ జేసి
పంచభూతవికారపథమునఁబాపి
యంగలింగనియుక్తి మంగళక్రియల
సంగత సత్యప్రసాదాంగుఁ జేసి
విగతవాయుప్రాణవిధు లాచరించి
నెగడ లింగప్రాణనిష్ఠితుఁజేసి
సిద్ధమంత్రమునఁ బ్రసిద్ధుఁ గావించి

శుద్ధాత్ముఁ జిన్మయజ్యోతిఁ గీలించి
వినుతజీవన్ముక్తికిని హేతువైన
యనుపమ శివరహస్యార్థము దెలిపి
తమకరుణాప్రసాదముఁ గృపసేసి
విమల సద్భక్తి సంవేత్తఁగావింపఁ
దిరునావకరశియుఁ దేజిష్ణులీలఁ
బరమశివాచార పారవశ్యమున
భవభక్తవితతికి భువిఁ జాఁగిమ్రొక్కి
శివమహోత్సవములు సేయఁగఁ బనిచి
వాహనవస్త్రసువర్ణాభరణస
మూహార్చనక్రియ ల్మదమునఁ జలిపి
వలపారఁ దనమనోవాక్కాయకర్మ
ములఁ బ్రాణదేహార్థముల నివేదించి
భూతిరుద్రాక్షవిభూషణాపగమ
పూతవ్రతస్థుఁడై భువిఁ బ్రవర్తింప
"నన్యదర్శనమార్గుఁ డయ్యె నీఁ" డనుచు
నన్యాయమున జైను లందఱు నతని
గరికిఁ బెట్టుడు భద్రకరి ముట్టనోడెఁ
గరిచర్మధరుబంటుఁ గరి యేమిసేయు?
విషము వెట్టుడుఁ గుడ్చి విజయుఁడై నిలిచె
విషసంహారునిబంటు విష మేమిసేయు?
బహ్వగ్నిఁ ద్రోవఁ బైబడ నాఱె వహ్ని

జిహ్వాంతకునిబంటుఁ జి చ్ఛేమిసేయు?
జలముల ముంపుడుఁ జాలవు ముంప
జలమహాళిబంటును జల మేమిసేయు?
జంపంగ నేక్రియఁ జాలక తమ్ము
జంపునో యితఁడని శరణుసొచ్చుడును
గంటకులగు జైనకర్ములఁగాచి
తొంటిలాంఛనములు దుడిపించి యంత
రుద్రాక్షభసితాదిరూపితపంచ
ముద్రాధరులఁ జేసి రౌద్రముతోడ
వెసజైనప్రతిమల విటతాటమాడి
వసదులన్నియు వ్రచ్చి వైపించెఁగాదె
లలి జైనసమయకోలాహలుఁ డనఁగఁ
గలుగు మా తిరునావకరశి దేవుండు

—— ఇరుత్తాండికథ ——

యోరి! చెల్లతిరువాలూరను మఱియు
మారారిభక్తుఁడు మహినిరుత్తాండి
యనఁగ నొక్కయ్య జాత్యంధుఁడై యుండి
మనసిజహరునకు మజ్జనార్థముగ
గుడిముందటను నొక్క గొలను గావింపఁ
గడఁగి కుద్దాలంబుఁ గంపయుఁగొనుచుఁ
ద్రవ్వుచు నొకశంకుదరి నొకశంకుఁ
దెవ్వనిత్రాట సంధించి చేపట్టి

మ్రోఁకు వెంటన యొడ తాఁకుచుఁ జొట్టి
ప్రాఁకగాఁ బోయుచుఁ బ్రొద్దులు వుచ్చు
జినసమయులు "దీనిఁ జెరుపుదఁ" డనుచుఁ
గనుఁగొని పెక్కువిఘ్నములుగావింపఁ
దలఁక కెప్పటియట్ల త్రవ్వుచునుండ
నిలమ్రోఁకుఁ ద్రెంచి శంకులు వాఱువైవఁ
గఱకుఁరుచే నవ్వు కన్నులు వడసి
యఱిమఱి వసదులు వెఱికి వేఁటాడి
జినసమయుల నెల్లఁ జీకులఁ జేసి
కనఁబర్చెఁ గాదె మాగణ మిరుత్తొండి

పిళ్లనైనారు కథ

మఱియు శ్రీకాళినా మహిమోప్పు పురిని
నెఱిశివబ్రాహ్మణునికి నుదయించె
నలరి కుమారుని యంశంబునందు
నఱువొప్పఁగాఁ బిళ్ళనయనా రనంగ
జనకుఁ డర్కుటఁ బెట్టికొని యొకనాఁడు
చని సరోవరతీరమున బాలు నునిచి
తా నఘమర్షణస్నానంబు చేయఁ
గా నభోవీథిని గౌరియు శివుఁడు
మానితదివ్యవిమాననిరూఢ
యానులై చనిచని "యల్ల బాలుండు
మనకుమారునియట్ల" యనుచు నగ్గిరిజ

కనుఁగవఁ జూచుచుఁ జనుఁగవ నేఁప
నవనీతలంబున కరుదెంచి బాలుఁ
గవుఁగిటఁ జేర్చి కూఁకటి వుడుకుచును
దేవి దా శాంభవదీక్షితుఁ జేసి
భావించి శివభక్తిపరునిఁ గావించి
కడుపారఁ జనుఁబాలు గుడిపి పసిండి
కుడుకతో వెండియుఁ గొన్ని నే నిచ్చి
గౌరి దా నీశ్వరు కడ కేఁగె నంత
నీరఁ గ్రుంకిన ధరణీసురోత్తముఁడు
భోరునఁ లేచి విస్ఫారదివ్యాంగ
చారుదీధితిఁ గ్రాలు సత్పుత్త్రుఁ గాంచి
"యోరి! చ న్నిచ్చినవా రెవ్వ రిచట
నో రెక్కడివి పైఁడికోరయుఁబాలు
నెవ్వ రేతెంచిరి యిక్కడి కేఁగి
రెవ్వల నున్నవా రిట చెప్పు" మనుచు
జన్నిదంబునను జేసాఁచి ప్రేయుడును
దిన్నని నగవును సన్నపుటేడ్పు
కన్నులఁ దొరిగెడు చిన్ని బాష్పములు
గ్రన్నన నెలవులఁ గాఱుదుగ్ధములు
చె న్నొలయఁగఁ గోరఁజేతఁ గప్పుచును
"అన్నన్న! నన్నేటి కడిచెదు వినుము
దివి నల్లవాఁయెడు దేవదేవేశు

కవనుండి యయ్యుమాకాంత యేతెంచె
సురుజటాజూటభాస్వరుకడ నుండి
చిరమణిమకుటభాస్వర యేఁగుదెంచెఁ
దగఁజంద్రరేఖావతంసుని నిల్పి
సుగుణావతంస దత్సుదతి యేతెంచె
ముక్కంటివానిసమ్ముఖమున నుండి
యిక్కంటితో నొక్కయింతి యేతెంచెఁ
గరమొప్ప నీలకంధరుకడనుండి
సరసరఁ గంబుకంధర యేఁగుదెంచె
ఘనచందనాంకువక్షఃస్థలిఁ బాసి
స్తనచందనాంకవక్షఃస్థలి వచ్చె
సురగేంద్రహారుని యూరులనుండి
వరరత్నహార సుందరి యేఁగుదెంచె
నామహోక్షగమను నఱమేననుండి
కామిని వరహంసగమన యేతెంచె
ముల్లోకముల ఱేని ముందఱ నుండి
ముల్లోకములకెల్లఁ దల్లి యేతెంచె
చన్నిచ్చెఁగడుపార మన్నించి మఱియుఁ
గొన్నివాలు వసిండికోరలోఁ బిడికి
నిలిపి వచ్చినసీలగళుని పాలికిని
బోలఁతి యల్లదె చూడు వోయిడి” యనిన
నామహీసురుఁడద్భుతాత్ముఁడై యయ్యు

మామహేశ్వరులకుమహిఁజాఁగిమ్రొక్కి
కొడుకుఁ దా నఱికట నిడుకొని వచ్చి
మడఁదియుఁ దాను సమ్మద లీల నుండఁ
బార్వతీ స్తనపయఃపాన ప్రశక్తి
సర్వజ్ఞతయు వచస్సంసిద్ధి దనరి
వేవిన గుడికేఁగి వేనవేల్వధుల
భావించి పార్వతిఁ బ్రస్తుతించుడును
అంబిక స్వర్ణతాళంబు లొసంగ
దుంబురునారదాదుల మీఱిపాడఁ
గరమర్థితోడ శ్రీకాళినాథుండు
విరచితంబై యొప్పు వెలిగొడుగులును
నక్షయనిధియు ముత్యాలపందిరియు
నీతఱిఁ బ్రతిలేని హేమాసనంబు
ఖండేందుధరుఁ డప్డు గరుణింపఁ గనఁక
దండె యందల మెక్కి తా వైభవమున
భాతిగా ధారలు పరమతధూమ
కేతువు నాఁగఁ బ్రఖ్యాతమై మ్రోయ
సురతరలీలఁ గులోత్తుంగచోడ
ధరణీశు శివభక్తిపరునిఁ గావించి
యలరుచు సుగతసహస్రద్వయంబు
గొలువఁగఁ జనుబౌద్ధగురుఁ బాఱ ద్రోలి
శీలమై మఱి రెండువేల బౌద్ధులను

బాలించి శివభక్తిపరులఁ గావించి
తిరుమరక్కాడయను పురిని బ్రహ్మేశు
చిరకవాటములు సుస్థితిఁ దెఱపించి
తిరు నావలూరు నాఁబరగునప్పూరికి
నరుదెంచి జైనులనందు జయించి
యిల సర్పదష్టుఁడై యీల్గినయట్టి
వెలమనిప్రాణముల్ వేగంబె పడసి
మధురేశుదేవి సమ్మతమునఁ జేసి
మధురకేతెంచుడు మనుజేశుకడకు
జైనులు బౌద్ధులు సనుదెంచి యపుడు
"జ్ఞానసంబంధినాఁగా నొక్కశిశువు
నాతతవేదబాహ్యసమయధూమ
కేతుండు నాఁ గ్రొవ్వి యేతెంచినాఁడు
పురి వెడలింపుము నరనాథ! యనిన
"గురుఁడశే యచ్చోడనరపతి కతఁడు
ఊరక వెడలించు టుచితంబుగాదు
వారి నోడింపుఁ డేవాదుననైన"
ననుడు జైనులు పదునెనిమిదివేలు
చని యెట్లుఁ దర్కింపఁజాలక నిలిచి
యర్ధరాత్రంబప్పు డతఁడున్నయింట
స్పర్ధమైఁ జిచ్చిడ జ్వాలనుండు వెఱచి
యెదుర నిల్వఁగఁబడ్డ "నేమేమిరోరి!

సదనంబు గాల్పనా చను దెంచి తీవు
విహ్వాలుఁ గావించి వీరభద్రుండు
జిహ్వాలు నీ రెండు నేతులుఁ దొల్లి
కోసివైవఁగ నున్న కొఱఁత నీముక్కు
గోసివైపించి యేఁ గొన మఱేఁగెదవు
జైనుల గీనుల శక్తిసూచెదము
దీనఁ దప్పేమి యీభూనాథు మేనఁ
బ్రాపించి యుష్ణజ్వరస్వరూపమునఁ
దాప మొందింపుము దహన! కాచితిమి"
యనవుడు నతని దేహంబునఁ బొంది
ఘనతరజ్వరరూపమునఁగొని కాల్ప
మంగయక్కరసి యమ్మండలేశ్వరుని
యంగన తనపతియనుమతంబునను
తా నప్పుడు రప్పించి జ్ఞానసంబంధి
కానాతి సాష్టాంగయై విన్నవింప
"వా రెవ్వ రేఁ గలరా రాజు నొడలి
యీరుజఁ బాపంగ నింతయు వలదు
వలపల మాపాలు వామభాగంబు
బలహీను లార! మీపాలు మంత్రింపుఁ"
డంచును భూతి మంత్రించి చల్లుడును
సంచితంబుగ మేనిసగమును బాసి
వామభాగమునన జ్వర మిమ్మడింప

నామును ల్మంత్రింప నగ్గలంబైన
"నారోగ ముడుపవే శ్రీరుద్రమూర్తి!
యీరుజ మాన్పవే కారుణ్యపాత్ర!
నా తెవులార్పవే నల్లనైనార!
యీతాప మడఁపవే యాద్యచరిత్ర!
నాగదఁ బాపవే యోగీంద్రవంద్య!
యీగహనజ్వర మిగిరింపు తండ్రి"!
యని పెక్కువిధుల మహారవం బులియ
జనపతి ప్రార్థింప జ్ఞానసంబంధి
క్రమ్మన భసితంబుఁ గలయఁగఁ జల్లి
ముమ్మాఱు దిగఁదుడ్చి ముట్టినంతటను
బోఱటిపాండేశుఁడువోలుపారమున్న
పోఱడువోయినవీఁపుపొఱడుమానుటయు
భావింపఁ బొంకయ్యెఁ జావకపోవు
నా వీఁపు పొఱడని యాడుమాటయును
గూనిపాండ్యుండను హీనత్వ ముడిగి
తా నొప్పె నంత సుందరపాండ్యుఁ డనఁగ
రెట్టించి దాపటఁ దొట్టినజ్వరము
చట్టన నుడుగుడు సతియును దాను
భువి సమస్తాంగము లొత్త్వందంగ మ్రొక్కి
యవసరోచితసత్క్రియాదు లొనర్ప
"నింక నేమిటి కట యేటికొం" డనిన

శంకరమూర్తికి జైను లిట్లనిరి
"జినమంత్రలేఖయు శివమంత్రలేఖ
యును నగ్నిలో వైవ నొగిఁ గాలకున్న
వారిదె గెలు"పని వారు నుడువుడును
ధారుణీశ్వరుఁ జూచి "దానఁ దప్పేమి
పసిఁడితో నొకకుక్కపల్లు దూఁచుడును
బసిఁడియు నెముకయుఁ బ్రతివోల్పఁదగునె
పాలకావడి తూన్కి జాలఁ దూన్చుడును
బాలును జాలును బ్రతియొతలంప
మలయజంబులు పట్టిమ్రాఁకులుఁ దూన్ప
మలయజంబులు పట్టిమ్రాఁకులు సరియె
శివమంత్రలేఖయు జినమంత్రలేఖ
తవిలి కూర్చిన నేమి తత్తుల్య మగునె"
యంచును "శివ"యను నక్షరద్వయము
పంచవర్ణాఢ్యుండు పత్రిక వ్రాయ
మండలాధీశుండు రెండు లేఖలును
మండెడు పెనుపగు మంటలో వైవఁ
గరమెత్తు సంతన సురసురఁ గమరి
పరవాదిజినమంత్రపత్రంబు గాలె
హరమంత్రపత్ర మయ్యర్కునిఁ గన్న
సరసిజదళమట్లు కర మొప్పియున్న
జినముచు ల్తల సచ్చియును దోఁక సావ

కనిరి "ముమ్మాటికి నరయఁగవలయు
శివమంత్రలేఖయు జినమంత్రలేఖ
తవిలి కావేరిమధ్యంబున వైవ
నేటఁ బోయినపత్ర మోటుపత్రంబు
నేటికి నెదురెక్కెడిది నిజం" బనినఁ
"బిడికిటఁ గోమటిఁ బొడువంగమఱియుఁ
బొడువుమాయనుక్రియఁబోవంగరాదు
ఊరక పోనీకు మోడినవారి
ధారుణీజనులెల్లఁ దల లెత్తిచూడ
నెట్టఁగాఁ గాల్పించి యిచ్చుట నినుప
కొట్టులఁ దివియింపు కువలయేశ్వరుఁడ!"
యనవుడు నవుఁగాక యని జినమునులు
జనపతియును దారుఁ జనుదెంచి యంత
నాకులు కావేరియందు వైచుడును
జేకొన నెదురెక్కె శివ మంత్రలేఖ
వారిమంత్రం బొకు వఱదనే కలసె
బూరించునే చమత్కారమంత్రములు
అంత నాపిళ్లనైనారు భూనాథు
సంతోష మలరార సద్భక్తుఁ జేసి
పదునెనిమిదివేలు మొదలిజైనులను
బొదిగొని పిలిపించి పొరిఁబొరిఁ బట్టి
యచ్చెరువందఁ గులచ్చిరియారు

చెచ్చెర నటమున్న చేయించినట్టి
కాలియున్న యినుపశూలంబులందు
నోలిఁ దివిర్చంచుచు వ్రాలి యుద్ధరణిఁ
బరఁగఁగ దిరువూరఁ బఱపుట వినవె
యురుభక్తియుక్తిమై నోరి జైనుండ!

### నిడుమారని కథ

పుడమినట్టులు సెప్పఁబడిరి వెండియును
నిడుమారఁడనునొక్క నిఖిలేశ్వరుండు
దనయేలుభూమి దాఁ దక్కఁ దక్కెల్ల
జినమార్గవర్తు లౌటను విశేషించి
మందునకైన భస్మత్రిపుండ్రాంగి
యొందును లేకున్న నెట్లొకో యనుచు
మది విచారించుచు మనుజేశుఁ డుండఁ
దదవసరంబున మదనారిభక్తి
మానసుండగు శివజ్ఞానసంబంధి
దా నప్పు డా పాండ్యభూనాథుధరణి
కేతెంచి వీరమాహేశ్వరోద్యుక్తి
ఖ్యాతిగాఁ బ్రభవించి పరవాదులైన
జినమార్గవర్తుల నినుపకొఱ్ఱులను
గనలఁగఁ దివియించె ననుచు నీవార్త
విని యట నిడుమారవిశ్వంభరేశుఁ
డనఘుఁడు దనదేశమున నెన్నఁబడ్డ

జినపదాచార్యుల జినమంత్రయుతుల
నననేల వీరు వారనక రాఁబనిచి
"శ్రుతి నవాంతరశాస్త్రమతములు వన్ని
శ్రుతిబాహ్యులై చను మతిహీనులార!
పశుకర్మ నొకనరుఁ బరమేశుఁ డనుచుఁ
బశుపతి నెఱుఁగని పశుజీవులార!
పాసపరి శూన్య దుర్బోధలఁ దగిలి
భసితంబలందని పాతకులార!
యద్వైతకర్మమాయాకుయుక్తులను
సద్విధిఁ జెందని చండాలురార!
యజ్ఞానబోధల కాలయం బగుచు
విజ్ఞానరతి లేని విద్వేషులార!
యెట్టొకో నాప్రజ నింతగాలంబు
బట్టి దుర్బోధలపాలు సేసితిరి
యటుచూడుఁడా యిప్పు డభవుసద్భక్తుఁ
డలె పిళ్లనాయినా రానాండ్యభూమి
సర్వప్రమాణదృష్ట ప్రత్యయముల
శర్వుఁడ కర్తగాఁ జనఁ బ్రతిష్ఠించి
జినబౌద్ధమయంబు లను పేళ్లు దుడిచి
మునులఁ దివ్యించె నాయినుపకొల్పులను
గాన కొల్వుండు మాశ్రీనీలగళుని
గానినాఁ డిందఱఁ గ్రాఁగినకొర్ల

భువిఁ దలక్రిందుగాఁ దివియింతు" ననుచు
శివభక్తవర్యుఁ డాశిష్టేశ్వరుండు
నిశితఖడ్గాయుధాన్వితహస్తుఁ డగుచుఁ
బశుపరింపుచుఁ గొర్లపాలు సేయుచును
నంతలో శివభక్తులగు జనమునుల
సంతోషచిత్తులై చనఁ గాచెఁ గాదె
నిడుమూర భూనాథు మృదుభక్తిమహిమ
నడిసన్న లెఱుఁగవే జైనకష్టుండ!

## నమినందికథ

మఱియును నమినంది మాభక్తుఁ డొకఁడు
వఱలుఁ జెల్లత్తిరువాలూరిలోనఁ
దిరిగి యార్జించి నే దెచ్చి భర్గునకుఁ
బరువడి వేయుదీపములు ముట్టించు
వ్రతతత్పరతఁ బ్రీతి వర్తింపుచుండఁ
గుతకులై జైనులు గూడి యయ్యూర్వర
భక్తుఁ డొక్కఁ డితనిఁ బొఱఁగఁదోలు
యుక్తు లెట్లని పెక్కు లూహించి చూచి
యల్ల పాడ్గుడిలో సహస్రదీపంబు
లెల్లెడ ముట్టించునిది నిజవ్రతము
నీయూర నితనికి నెవ్వరు నెయ్యి
వోయకుండినఁ దాన పోయెడిఁగాక
యంచు నాలోచించి యతనికి ఘృతము

నించుకయును బోయ నీకున్న వచ్చి
"ప్రాణేశ! నేయి ఱెప్పపాటును లేదు
ప్రాణముల్విడుతు దీపంబు లాఱెనను"
అంచుఁ బరిచ్ఛేది యగుడు నద్దేవుఁ
డంచితప్రీతిఁ బ్రత్యక్షమై నిల్చి
"వరదసోమయ యర్ఘ్యపణ్యంబులందుఁ
బరువడిఁ దొల్లి దీపము లెత్తినట్లు
సజ్జనలీల మజ్జనబావిలోని
యజ్జలంబులు వోయ నలరు దీపములు
కానక యన్యాయకారులై యున్న
జైనుల పసులును జచ్చెడు నేఁడ"
యని దేవదేవేశుఁ డానతిచ్చుడును
విని మహానందసంజనితాస్యుఁ డగుచుఁ
గొలనిజలంబులఁ గోటిదీపంబు
లలరఁగ ముట్టించి యాడుచున్నెడను
నఱవంగ నొక్కవెయ్యయును లేకుండ
నఱిముఱిఁ బసులెల్ల హతమైనఁజూచి
"యిది యేమి సోద్యమో యింతలోఁ బసులు
మెదలవు గదలవు మృతిఁబొందె నల్ల
పాటిదేవరచేతఁ బడసి దీపములు
కోటానకోటి యీఁకొలని నీర్వోసి
ముట్టించినాఁడట యిట్టిచోద్యంబుఁ

బుట్టునె శివభక్తు లెట్టివారుం డ్రొ ?
యిట నెయ్య మోయంగనీక యుండినను
గటకటా శాపించెం గాక యత్తపసి
కాదేని బిట్టపిడ్గఁర బసు ల్పచ్చు
నా దీనం దప్పేమి పోదండుగాక"
యనుచు నేతెంచి సాష్టాంగులై మ్రొక్క
వినుతింపుచుండ నాఘునకృపామూర్తి
పసులప్రాణం బిచ్చి పరగ జైనులకు
నొసంగండే శివదీక్ష యోరి జైనుండ!

## సాంఖ్యతొండని కథ

వెండియు విను సాంఖ్యతొండండు సోడ
మండలంబున శాంతమంగయన్పురిని
బొద్ధునికడుపునం బ్రభవించి మఱి ప్ర
బుద్ధుండై బౌద్ధవిరుద్ధసంగతిని
దోలుమేని తనపుణ్యఫలమునం జేసి
వలగొని శివభక్తివాసన నిగుడ
"భక్తుండనైనను బ్రదుకంగ నీరు
భక్తుండం గాకున్న బ్రదుకు దానేల
యావటం బదిట లింగార్చకుం డనెడు
నామంబు వినంగరా దేమి కర్మంబొ ?
యిట్టి భవద్భక్తిహీనుకడుపునను
బుట్టింపం దగునయ్య భూతేశ్వరుండ!

యేలయా నన్నింతయీశ్వర! కరుణ
మాలి పుట్టించితి మలధారియింట
నిండారుసద్భక్తి నిను భజియింప
నొం డుపాయమ్ము లే దొగి నట్లుఁగాక
సిద్ధంబు వేదవిరుద్ధంబు జైన
బౌద్ధచార్వాకదుష్పథసమయములు
మూఁడు నిర్మూలముగఁ జేయు దనుక
మూఁడు ఱాలనువైతుముప్పొద్దునిన్ను
నిది నిజవ్రత"మంచు నిలఁ బ్రవర్తింప
నది వెల్లివిరిసియేన్నాళ్లు వాఱంగ
గుడి కేఁగ రామిని గుదగుదమనుచుఁ
గుడువక యేన్నాళ్లు గడచినపిదప
నేఱు డొంకిన గుడి కేఁగియు "లెక్క
నేఱ నేమిటికి ఱాలెన్ని వైచినను
మిసిమింతుఁడవు గావు మృడ! దేవ! యేను
విసివితి నివియేల వేయును నింక
నీయొక్కటియె చాలుఁ బో" యస పెద్ద
ఱా యెత్తికొనిపోయి "కో"యని వైవ
శివలింగ మంతలోఁ జేతులు సాఁచి
యవుదలఁ బడకుండ నాఁగి నవ్వుచును
"మెచ్చితి వరము నీ కిచ్చితి నడుగు
మిచ్చ యెయ్యది"యస నిలఁజాఁగి మ్రొక్క

"హరియును బ్రహ్మయు నాది నంత్యంబు
పరికించి కానని యురులింగమూర్తి
వేనవేల్విధముల వేదంబు లరసి
కానక వెదకెడు ఘనలింగమూర్తి
సకలసిద్ధాంతశాస్త్రపురాణాయుక్తి
నిక మిట్టి దనరాని నిజలింగమూర్తి
సనకసనందనమునిముఖ్యవితతి
మనములు గడచిన మహాలింగమూర్తి
శేషవాసుకి బహుజిహ్వోక్త వినుతి
భాషలు గడచిన పటులింగమూర్తి
కంటి మీశ్రీపాదకమలంబు లేను
మంటిఁ జాలదె నాకు మఱియొం డదేల?
మల్లెమొగ్గల వైవ మదనుని వేఁడి
వెల్లఁగాఁజేసితి దెల్లంబుగాదె
ఆలవై చినఁ గరుణాలోకనమునఁ
బాలించితివి భక్తిపరునిగా నన్ను
నన్యాయమున నీకు నహితంబు సేయ
ధన్యత్వ మిాఁగి సోద్యముగాదె జియ్య!
స్తుతియును నిందయు హితము నహితము
మతిఁ దలంచినను సమానము ల్గావె
భక్తవత్సల! భక్తపరతంత్ర! భర్గ!
ముక్తివల్లభ! దయామూర్తివి గాన

నిందించి నంబన్న నీగుణకీర్తిఁ
జెంది మల్హణుఁడును జేరరె నిన్నుఁ
గావున నకటకటాక్షప్రేక్షణమున
భావించి యీతాయి పూవుతాయిగను
నలవడ నీయుత్తమాంగంబుదెసను
నెలమి నుండఁగఁ జేయు మెల్లగుళ్లందు"
ననుచు నవ్వేదబాహ్యంపు మార్గములు
దునిమివైవఁడె సాంఖ్యతొండఁడుజైన!

గోవూరి బ్రహ్మయ్య కథ

మఱియుఁ గోవూరి బ్రహ్మాయ నాఁగ నొక్క
గఱకంఠభక్తుఁ డఖండితకీర్తి
జినమునులకుఁ దనకును దర్కమైన
జినసమయంబు డు వాదమున సిగ్గువడియు
వటమహీజాత మచ్చటనున్నఁ జూచి
"యటుగాక దృష్టి మివ్వటముఁగాల్చెదవొ
పడసెదో చెప్పుమా భక్తుఁడ" యనిన
"మడియింపఁగూడదేఁ బడసెద" నన్న
మంత్రతంత్రములచే మట్టిగాల్చినఁ గు
మంత్రకుతంత్రకుమాయాపహారి
వసుధ నీఱైయున్న వటముపై నపుడు
భసితంబు సల్లి యొప్పటియట్లు నిలిపి

వఱలఁగఁ గోవూరివసదులన్నియును
జెఱుపఁడే బ్రహ్మయ్య సిగ్గేది జైన!

## దేడరదాసయ్య కథ

మఱియును విను పొట్లచెఱు వనుపురిని
వఱలంగ నేన్నూరు వసదులు గట్టి
వెలయ మున్నిరువదివే ల్జినమునులు
గొలువఁగ జినకులగురుఁ డొక్కరుండు
నాబల్లహునకు ముఖ్యాచార్యుఁడగుచుఁ
దాబుద్ధిసెప్పుచుఁ దగఁ బ్రబోధింప
తలిపతియైన యాసింగబల్లహుని
యతివ సుగ్గలదేవి యకలంకచిత్త
తానును దేడరదాసయ్య వరద
యానూనసద్భక్తిమానస గాన
తమగురుస్వామిఁ దా దాసిదేవునకు
రమణి యాస్థితి విన్నపము సేసి హితులఁ
బుచ్చుడు నప్పు డప్పొట్లచెఱువునకు
నచ్చెరు వందంగ వచ్చునయ్యెడను
జినమును ల్వెక్కు గుచ్చితములు సేయఁ
గని నూఁకుచును లెక్కగొనకేఁగుదేర
నగ్గురు శ్రీచరణాంబుజంబులకు
సుగ్గలదేవి యుత్సుకలీల మ్రొక్కి
భామ గురుప్రసాదామృతాంభోధి

లో ముదంబారఁ దేలుచు మునుంగుచును
వేత్రాకరావున విడియింప నతఁడు
మీఁటివచ్చుట నటమీఁద నెట్లగునో
యనివచ్చి జినమును ల్వానిపింప రాజు
జినసమయుఁడుగాన వనిత కిట్లనియె
"సతి కొక్కగతియును బతి కొక్కగతియు
నతివ! యేలోకంబునందైనఁ గలదె
యొక్కఁడిగురువులు నేనాఁటిబుధులు
చక్కన సంపుము జైనులు విన్న
విపరీతమగు నింక వేయును వేల
చపలాక్షి! యనుపు మీసాముల" ననిన
నధికకోపోద్రిక్తయై "వీరిరాక
యధమజైనులపెంపు లడఁపనేకాదె
పురుషునకు సతికిఁ దెరు వొకఁడైన
గురుశిష్యులకు వేఱె తెరువులు గలవె
స్త్రీవివాహమునాఁడు సేసినబాస
నీవ విచారించుకో వేయునేల ?
గడియించికో భార్యగలదేని యోర్త
విడువుము నన్ను నే మృడుఁగాని యొల్లఁ
గాదేని యోడింపు వేదశాస్త్రాది
వాదతర్కప్రతివాదంబులందు"
నంచు నగ్గలదేవి మించిపల్కుడును

గుచ్చితులగు జైనకూళలందఱను
బిలిపించి బల్లహుఁ గొలువున వారి
వలపట నవరత్న కలితమై తనరు
సింహాసనాసీనుఁ జేసి యాజైన
సంహారుఁ డైనట్టి సద్గురుదేవు
దాసయ్యపాదము ల్డాసి యొత్తుచును
నాసుగ్గలవయుండె నాజినమునులు
మంత్రతంత్రానేకమాయాదులను గు
యంత్రమహేంద్రజాలాదివిద్యలను
అద్వైతశూన్యమాయావాదకర్మ
విద్వేషమున జైనవితతి దర్కింప
వేదవేదాంతాదివాద సిద్ధాంత
వాదతర్కముల సంపాదించి మించి
న్యాయవైశేషికాద్యఖిలవాగ్ద్రష్ట
ధీయుతోక్తులఁ బెక్కు దెఱఁగులు సూపి
'నద్వితీయుఁడు రామనాథుఁడే కర్త
సర్వాధిసర్వము సర్వేశ్వరుండు
శ్రుతి "యేకఏవ రుద్రో" యనుతత్త్వ
గతి "లింగమధ్యే జగత్సర్వ" మనియు
రతి "లింగబాహ్యాత్పరం నాస్తి" యనియు
సతత మిట్టులు శ్రుతి చాటెడుఁ గాన
యీక్షింప నింతయు నీశ్వరమయము

దతుత గల్గెనా తర్కింపుఁ" డనిన
"నింకఁ దర్కింపంగ నేది? యంతయును
శంకరుఁ డనియెదు సచరాచరంబు
వలదుపో గుడి కేఁగి కొలిచెద మనఁగఁ
గలఁ డంతటను గళకంఠుఁడు మఱియు
నంగజహరుఁడు సరాచరంబులకు
నంగమో జీవమో యాత్మయో చెపుమ"
యనిన "శ్రమణులార! యాదిప్రశ్నకును
వినుఁ డుత్తరంబ"ని వెండి యిట్లనియె
"నీరాష్ట్రములకెల్ల నీరాజు దక్క
ధారుణి మఱి చెప్ప లే రను టెల్ల
నోలి సమస్తపిపీలికాదులును
మూలలు బోయలు మహిపతియనుటె
సర్వేశు సుగుణవిచారితవృత్తి
సర్వంబునందును సంకీర్ణపదమె
యదిగాక వినుఁ డీశ్వరాద్వైత మనుట
యిదియు సర్వాద్వైతమే యట్లుఁగాక
గుడికేఁగి మీకింకఁ గొలువనే లనిన
వెడఁగుప్రశ్నకు మీరు వినుఁ డుత్తరంబు
సర్వగతంబైన చంద్రాతపమున
సర్వశిలలు నుండఁ జంద్రకాంతంబు
ద్రవియించు నారెంటిసామరస్యమున

స్రవియించునే యున్నశైలములెల్ల
శిలలపై వెన్నెల గలుగదే కలిగి
ఫలమేమియది ప్రాణపదముగా దట్లు
చంద్రికకొఱక తచ్చంద్రకాంతంబు
చంద్రాశ్మముకొఱక చంద్రిక యరయ
సర్వగతుండగు శర్వులోపలను
సర్వంబు నుండంగ శరణునిమనసు
కరఁగు రెంటికి సమకళ గల్గుఁగాన
కరఁగునే తక్కిననరులచిత్తములు
నఖిలంబు లింగమధ్యంబున లేదె
యఖిలంబు నుండియు నందేమిఫలము
శరణునికొఱకె శంకరునిలీలయును
శరణునిహృదయంబు శంకరుకొఱక
మొదవుగాఁపును దనయదియ కాఁదలఁచు
మొదవున కలెప్రాణపదముగా క్రేపు
బ్రదుకుఁగాఁపును రెంటిపరిణామమంద
మొదవుగాఁపునునెఱుంగదు క్రేపుఁగాని
మది లింగభక్తసన్మథనంబునంద
బ్రదుకు నెంతయుఁ బ్రాణపదముగానుండు
స్వాతివాన గురియు జలములోనెల్ల
నేతఱి గఱిఁగొన దిట్టిచిన్కులకె
కాని నోర్దెఱవదు గఱి చిప్ప యొకటి

తానెల్ల వానలఁ దడియుచు నుండు
నుభయసంగతిఁ జేసి యుదయించు రత్న
మభవుని శరణుని యనువును నట్ల
కావున లింగభక్తస్నేహలీల
మీవశంబె యెఱుంగఁ గావలులార!
రమణమై నాడంబరము కాక లింగ
సమథనసుఖములజాడ లేలింక
యంగమో జీవమో యాత్మయో యనిన
వెంగలిప్రశ్నకు వినుఁ డుత్తరంబు
అంగంబు పూర్వకర్మావశేషంబు
నంగంబు సుఖదుఃఖసంగతినెలవు
నంగంబు పుణ్యపాపాలయం బట్టి
యంగంబు శివుఁడుగా దది వోవనిండు
జీవుఁడు శివుఁడని భావింతురేని
జీవుఁడు మలినుఁడు శివుఁడు నిర్మలుఁడు
జీవుఁడు దుష్కర్మి శివుఁడు నిష్కర్మి
జీవుఁడు సకళుఁడు శివుఁడు నిష్కళుఁడు
జీవుఁడు పశుమూర్తి శివుఁడు పశుపతి
జీవుఁ డముక్తుండు శివుఁడు ముక్తుండు
జీవుఁడు సభవుండు శివుఁ డభవుండు
జీవుఁ డనిత్యుండు శివుఁడు నిత్యుండు
జీవుఁ డశుద్ధుండు శివుఁడు శుద్ధుండు

జీవుఁడు మృతదుఃఖి శివుఁ డమృతుండు
జీవుఁడు సంసారి శివుఁ డసంసారి
జీవుఁడు సందేహి శివుఁ డసందేహి
కావున జీవుఁడు దేవుఁడు గాఁడు
పోవఁగ నిం డది వోలుపుగా దింక
నాత్మయుఁ బరమాత్మ యనరాదు వినుఁడు
ఆత్మదాఁ బంచభూతాత్మకం బయ్యె
నాత్మ దాఁ బంచేంద్రియాత్మకం బయ్యె
నాత్మ దా దేహగుణాత్మకం బయ్యె
నుండుఁ గావున నాత్మయును గాఁడు శివుఁ డ
ఖండిత సూక్ష్మవికస్వరలీల
సకలముఁ గపటనాటకసూత్రములను
బ్రకటించు చైతన్యభావంబు శివుఁడు
అందు "నణోరణీయా" ననఁజొచ్చి
సందు లేకున్నట్టి శంభుఁడు శివుఁడు
నూవులలోపలి నూనియయట్ల
భావింపఁ గాష్ఠంబుపావకునట్లు
పూనిపాషాణంబులో నినుమట్ల
తా నేత్రములలోని తద్రూపమట్ల
యాలవడఁ బాలలోపల నేయియట్ల
జలకుంభములలోని చంద్రునియట్ల
వెలుఁగు నద్దంబులోపలి నీడయట్ల

తలఁపఁ బూసలలోని దారంబునట్లు
ఘటపటాదులలోని గగనంబునట్లు
పటికంపుశిలలోని భావంబునట్లు
వెలయ బీజములోని వృక్షంబునట్లు
నలరు శబ్దంబులోపలి యర్థమట్లు
పర్వతంబులలోని ప్రతిశబ్దమట్లు
సర్వంబునందును శర్వుండునట్లు
ముల్లు గుట్టఁ దెలిపి యెల్లెడ లేక
యెల్లచోఁ దానయై యిట్లున్నవాఁడు
ఈశుండు సకలలోకేశుండు గర్వ
నాశుండు నాదురామేశుండె" యనిన
"నవు నేని దాసయ్య! యఖిలంబునందు
శివునకుఁ గల్గువిశేషంబు లెవ్వి?
శివుఁడు నిత్యుం డటె యవి యనిత్యములు
శివుఁడు ననిత్యుఁడో శివుఁ డందు లేఁడో
శివుఁడు దైవంబటె యవి యదైవములు
శివుఁడు నదైవమో శివుఁ డందు లేఁడో
శివుఁడటె పశుపతి యవి పశురాశి
శివుఁడును బశువయో శివుఁ డందు లేఁడో
యందొక్కటైనను హారుని గుణంబుఁ
జెందంగవలవదా యిందులో" ననిన
నన్యాయవాదుల నతగులఁజూచి

ధనుఁడు దేడరదాసి యిట్లనియె
"నూనియగాఁజేసి నూల్కొను దీప
మూనూ వులందును నలరునే చెపుఁడ
నువ్వులఁగల్గునే నూనియ గుణము
నువ్వులలోపల నూనియ లేదె
యీశునిగుణమేల నిన్నిటఁబొందు
నీశుఁడు దానెట్టు లిన్నిట లేఁడు
నువ్వులలోపల నూనియ గలదు
నువ్వులుగల్గునే నూనియలోన
సర్వజ్ఞునందును సర్వంబునుండు
సర్వజ్ఞుఁ డుండునే సర్వంబునందు
నీహేతువులకెల్ల నిట్లు చూడుండు
ఊహింపఁగా లేకయును గలవిధము
మథనపక్వక్రియామానంబునందుఁ
బ్రథితంబుగా మీఁడి పథము గాన్పించుఁ
గలుగంగవలెనన్నఁ గలుగు జ్ఞానికిని
కలుగ దజ్ఞానికివలె నన్ననైన
సర్వజ్ఞుఁ డిట్టుండు సర్వంబునందు
సర్వప్రమాణాదిసంసిద్ధ మిదియు"
ననవుడు జినమును లపహాసింపుచును
మనమునఁ దలపోసి మఱియు నిట్లనిరి
"పెక్కులెఱుంగుట పెద్ద మేలయ్య

నిక్క మింతయుఁ గూడ నిటలాక్షుఁ డేని
కలుగునే మలమూత్రములు నిడు తావు
నిల మెట్టవచ్చునే యిది సెప్పు" మనినఁ
గూడ జైనుల నెల్లఁ గూళలఁ జేసి
దౌడలు వడునట్లు దాసి యిట్లనియె
"నెఱుఁగరె జైనులా! యెన్నఁడు మీర
లెఱుఁగని కార్యమే యిది మీకుఁ గ్రొత్తె
మృడుఁడు లేఁడనియెడు జడకర్మవాది
నడుతల మెట్టిరే నడుతు మేప్రొద్దు
మనసిజహరుఁడు లేఁడని పల్కు నధము
మనుజుల నోళ్లు మామర్గడంబులకుఁ
గింకిరిపడకుఁడీ బొంక నే నేర
నింక నే మడిగిన నిట్లు చెప్పెదను
భావింప నీ రెండు తావులు దక్క
దేవదేవుఁడు లేనిరా వున్న దెట్లు
సకలంబుఁ దానయై సకలంబునందు
నికము దాఁబొందని నేర్పరి యతఁడు
సకలంబుఁ బుట్టించి సకలంబునందు
నికము పుట్టకయున్న నేర్పరి యతఁడు
సకలంబుఁ నడపుచు సకలంబునందు
నికము దానడవని నిర్గుణి యతఁడు
సకలంబుఁ ద్రుంగించి సకలంబునందు

నికము ద్రుంగనియట్టి నిత్యుఁ డతండు
సకలముఁ దనలోన సందు లేకునికి
సకలము నడఁచెడు జాణఁ డతండు
సకలంబుఁ దననిజాజ్ఞాప్రభావమునఁ
బ్రకటించు చైతన్యభావకుఁ డతఁడు
సకలంబు లీల నిచ్ఛామాత్ర నిలిపి
వికృతంబు లార్చు నిర్వికృతి యతండు
కలిగి యంతటిలోనఁ గలుగనివాఁడు
కలఁ డన్నవారికిఁ గలిగుండువాఁడు
తలఁపుల మిగిలిన తత్త్వంబువాఁడు
తలఁచినవారికిఁ దన్నిచ్చువాఁడు
కొలఁదికి మీఱిన గుణములవాఁడు
కొలఁది యెఱింగినఁ గూడుండువాఁడు
వలపింపరానట్టి వలపులవాఁడు
వలచినఁ బాయక వరమిచ్చువాఁడు
గమియింపరానట్టి గమకంబువాఁడు
గమియించువారికిఁ గడసూపువాఁడు
పట్టంగఁజూచినఁ బ్రభసూపువాఁడు
పట్టిన మఱి బట్టబయ లగువాఁడు
వినికికి మిగిలిన వేషంబువాఁడు
వినునంతలోనన విహరించువాఁడు
దృష్టికిఁ దాఁటిన తేజంబువాఁడు

దృష్టించి చూచినఁ దెలివగువాఁడు
వాసనగడచిన వర్తనవాఁడు
వాసనమైఁ గూడ వర్తించువాఁడు
చవులకు మీఱిన సారంబువాఁడు
చవులఁబాసినఁ దాఁ బ్రసన్నుఁడౌవాఁడు
పలుకులు గడచిన బొసలవాఁడు
పలుకు లెఱింగిన ఫలియించువాఁడు
భక్తవత్సలుఁడనఁ బరగినవాఁడు
శక్తి కతీతుఁడై సడిసన్నవాఁడు
యుక్తికిమీఱిన యుక్తులవాఁడు
వ్యక్తి సాకారలింగమై యున్నవాఁడు
కావున మాలింగదేవునిమహిమ
భావింప నెఱుఁగ మీ ప్రాప్తియకాదు
రామనాథుండు సర్వంబును నగుట
భూమి నభక్తులఁ బొందకుండుటయు
నప్రసిద్ధపుమాట లనవల దిపుడు
సుప్రసిద్ధముగ దృష్టప్రత్యయముగఁ
జూపెద మీరడ్డనోపెద రేని
యీపొట్లచెఱువులో నెన్నఁగఁబడ్డ
వసదు లేణ్ణూరును వ్రచ్చివైపింతుఁ
బసుల మిమ్మేమని పఱతు నే" ననిన
"నెన్నిమార్గంబుల నీతని. జెరుప

కున్నఁ" గాఁ దని జైను లూహించి చూచి
"దృష్టాంత మిప్పుడు దృష్టమౌఁగాని
దుష్టోరగంబునఁ దోడికింత" మనుచు
వాసుకి మెచ్చక వ్రాలినాలుకలు
గ్రోసెడు నన్నట్టి ఘోరసర్పంబు
గడువలోపలఁ బెట్టి, "కలఁడయ్య! యిందు
మృడుసర్వగతుఁ డని నొడివెద"వనిన
"కలఁ డనుమానమే ఘటములోపలను
కలుగఁడేనియు సర్వగతుఁడె రామయ్య"
యనుచు నూతనపురాతన మహాభక్త
జన పాదపద్మ సంస్మరణాత్ముఁ డగుచు
నిర్భయుఁడై చేరి నిలిచి తత్కుంభ
గర్భస్థ మైయున్న దుర్భరోరగము
రోఁజుచుఁ బొంగుచు మ్రోగుచు లోనఁ
చాఁ జప్పరించుచు దౌడలడఁచుచు
నెడనెడఁ గడువలోఁ బడఁ గడచుచును
గడవడించుచు భుజంగము విజృంభింప
"రామనాథుండు సర్వగతుఁ డవ్యయుఁడు
రామేశుభక్తు లీభూమి నుత్తములు
పరముఁ గొల్వనివారు పరమపాతకులు
నరు లెల్ల వింటిరే నాశపథంబు"
నంచు నాఘటములో హస్తంబు దోడిగి.

పొంచున్న సర్పంబుఁ గొంచి తివ్వుడును
పటికంపులింగమై స్ఫటికకాంతిఁ జేసి
చటుల భాస్కరకరపటల మంతయును
విటతటముగ దిశాతటములఁ గప్పఁ
గుటిలాన్యసమయ విఘటనతదీయ
పటుతరకరతల ఘటితమై వెలుఁగ
నటుగూడు జనులు ఖే యని జయవెట్టఁ
దటుకున జైనులు గుటిలత యడఁగి
ఘటితఫాలస్థల కరకంజులుగను
సుగ్గలదేవి యౌత్సుక్యంబు దనర
నగ్గురుదేవుఁ డా నగ్గించుచుండ
బల్లహుఁ డాదిగా నెల్లజైనులును
దల్లడం బందుచు ధరఁ జాఁగి మ్రొక్కి
రంత దేడరదాసమయ్య బల్లహుని
సంతోషమున లింగసహితుఁగాఁ జేసి
యిటు దర్క ముత్తరించుటఁ జేసి యల్ల
పటికలింగంబు నప్పట్టణంబునను
నుత్తరేశ్వరుఁడన నొగిఁ బ్రతిష్ఠించి
యుత్తటి నాదాసమయ్య యేణ్ణూరు
వసదులు వ్రప్పించివైచి జైనులకు
నొసఁగఁడే శివదీక్ష యోరిజైనుండ !

## హిరియ నాచయ్యగారి కథ

మారుడిగనుపురి మఱియొక్క భక్తుఁ
డారంగ హిరియనాచయ్యగా రనఁగఁ
బరు లెఱుంగకయుండ భక్తుఁడై యుండఁ
బరవాదిజైనులు ప్రల్లదంబునను
నేడ నూచినఁ దామె యొలమిని వెయ్య
యేడునూ ర్వసదుల కిది వాడవనుచు
నొక్క శివాలయం బున్నఁ ద్రప్పించి
చక్కన నచటి పూజారిఁ గారింపఁ
"బరవాదిజైనులఁ బఱపక యింకఁ
బరమున కారగింపఁగఁ బెట్టరాదు
తప్పగుఁ దడసిన నిష్ఠూరి" యనుచు
నప్పుడ నాచిదేవయ్య దా వెడలి
పదినాళ్ళలోనన పండ్రెండువేలు
మదనారి సద్భక్తమండలి దాను
నెలమి దలిర్ప వేయేణ్ణూరు లింగ
ములఁ బండ్లకెత్తించి వలివేగమునను
నడతెంచి చుట్టు మారుడిగపై విడిసి
"బడుగు బాఁపఁడు బట్టు వరదేశి మొదలు
తడయక జైనులు దక్కఁ దక్కెల్ల
వెడలుఁడో" యని యెల్ల వినఁగఁ జాటించి
యందులోఁ దేరసు లనఁ బదుమువ్వ

రందఱ వారించి హరభక్తు లలరఁ
దలపడి తాఁకి జైనులఁగూడ ముట్టి
తలపట్లు పట్టి యుద్ధంబు సేయుచును
దమకంబుమైఁ దార తమతమ శిరము
లమితకోపోద్రిక్తులై తరిగికొని
యొలమి నత్తలలు గాపలికరంబులను
వలచేతఁ గరవాలములు జళిపించి
చెలఁగి యత్యంత విజృంభితులగుచు
నలరుచుఁ దూఁగాడ నలుఁగులు వెలుఁగఁ
గునియుచు నాడుచుఁ గోయని యార్వ
జినమును ల్భీతిమూర్ఛిల్లి వాపోవఁ
మునుమాడి యాజినమునుల మోదుచును
గనికని శిరములు దునిమివైచుచును
రూఢిమై నాడుచుఁ బాడుచు వెయ్యి
యేడునూర్వసదులఁ గూడ లెక్కించి
జినరూపముల తలల్ సిద్రుపలు సేసి
జినవసదులమీఁది సిడములు నూకి
యొక్కొక్కలింగంబు నొక్కొక్కవసది
నక్కజంబుగ నిల్పి యఖిలంబు నెఱుఁగ
నారంగఁ దలలతో నట్టలుగూర్చి
ధారుణి వెలయరే తేరసు లనఁగ
నాచిదేవయ్య యనశ్వరమహిమ

నీచుఁడ! యెఱుఁగవే నిన్నఁటివార్త!
పాటివేల్పని మీరు వాటించు జినుని
చేటెఱుంగరె యొండు సెప్పనే లింకఁ
బఱచుట సోద్యమే పశువుల మిమ్ము
మఱియును నా పాలిగఱ యనుపురిని

## సోమన్నగారి కథ

శూలిభక్తుండు దా సోమన్న యనఁ ద్రి
కాలంబుఁ జేయు లింగస్పర్శనంబు
నేమంబుగాఁ గోరి భూమి వర్తింపఁ
గా మఱియొకనాఁడు గన్నులు నొవ్వఁ
గడుసంకటంబునఁ గానంగరామి
గుడికిఁ బోనేరక కుడువక యున్నఁ
దానొక్కరుఁడ తక్కఁ దత్పురినెల్ల
జైనుల కాన యసహ్యభావమున
"కుడువ కుండఁగనేల గుడికడ కేము
దోడుకొనిపోయెద మడరఁగ నిపుడు"
అంచు జైనులు దోడికొంచుఁ దక్కార్య
వంచకు ల్పురహాన్నవసదికి నేఁగి
"మ్రొక్కుము వీఁడె మీ ముక్కంటి"యనినఁ
గ్రక్కున జినుతలఁ గరములు వెట్టి
పుడికి లింగాకృతి వడుపుననున్న
దొడఁగి ముమ్మాఱు వ్రేల్మిడి మ్రొక్కి మ్రొక్కి

వలగొని సర్వాంగములును సంధిల్ల
నిలఁ జాఁగి మ్రొక్కిన "నింక లే చాలు
జినుఁడు ప్రసన్నుఁడై తనుఁగొల్వనిచ్చెఁ
బని లేదు మాబుద్ధిగొని యిట్ల బ్రదుకు"
మనవుడు సోమన్న యాగ్రహం బంది
"జినునికి గినునికిఁ జేతు లెత్తుదునె
చా, పన్నలార! సాక్షాల్లింగమూర్తిఁ
జూపెద రం"డంచు లోపలి కేఁగి
కన్నులఁ గట్టిన కవణంబు వుచ్చి
మున్ను లేచుచు బల్మిఁ గన్నులు దెఱవ
నటమున్న జినరూప మటయట పాసి
పటపటఁ బగులుచు నిటయటవడఁగ
నిటలతటానలోత్కటచటులాక్షుఁ
డట జినప్రతిమమధ్యంబున నిలిచె
ఖ్యాపితార్వాచీనరూపంబు దనర
గోపతివాహనుఁ డేపు గలిర్ప
సురహోన్నవసదిన సోమేశుఁ డనఁగఁ
బరగె మా సోమన్నభక్తికి మెచ్చి
ముంజేతికంకణంబున కద్ద మేల
భంజింపఁబడు జినప్రతిమయ సాక్షి
యిలఁ బ్రసిద్ధము నేఁడు నెఱుఁగుదు గాదె
హూళిగెఱలోపల నోరి జైనుండ!

## వైజకవ్వ కథ

వెండి బరవళిగ వెలఁది వైజకవ్వ
ఖండేందుధరపాదకమలాంతరంగ
మగఁ డాదిగాఁ బురి మనుజు లందఱును
వగవఁగ జినమార్గవర్తులై నడవ
నాతిమగం డొక్కనాఁడు జైనులకుఁ
బ్రీతితోఁ బర్వంబు వెట్టునయ్యెడను
దరళాక్షి వదపదార్థములు గావించి
వరుఁడు జైనులఁ బిలువంగఁ బోయినను
దరుణియు సప్పదార్థములు వీక్షించి
"హరమూర్తియొకఁడైన నరుగుదెం డయ్యె
బరికింపఁ దాఁ జేయు పాయసాన్నములు
పరమేశ! యితరులపా"లయ్యె ననుచుఁ
గడుఁగడు దుఃఖాగ్నిఁ గ్రాఁగుచు నున్న
యెడఁ దపోవేషియై వృద్ధుఁడ యేతెరఁ
బడఁతియుఁ గడుభయంపడి యప్పు డులికి
పడి వడి సంతోషపడి చక్కఁజాఁగఁ
బడి పలుమాఱు మ్రొక్కఁ బడిపాదధూళిఁ
బడి పొరలుచును బైఁ బడి వైజకవ్వ
యాదిదేవునిమూర్తియగు తపరాజు
పాదంబులు గడిగి ప్రాశించి మ్రొక్కి
సముచితసత్కారసంపదఁ దనిపి

యమలినదేహాలు సుఖాసీనుఁ జేసి
పదపదార్థములుఁ బక్వాన్నములును
గదళీదళంబిడి కన్ను దనియఁగ
వడ్డింపఁ దపసియు వడి నారగింప
సడ్డలు సేయుచుఁ జప్పరింపంగ
సంతోషమునఁ గుడ్వఁ జనుదెంచి జైను
లంతకాంతకమూర్తి నల్లంతఁ గాంచి
యంతన మగిడిపో నధిపుఁ డేతెంచు
నంతన తపసియు నట్లదృశ్యముగఁ
"బాపోసి వైజి! తాపసి యెం దణంగె?
గాసిపడక చూపు క్షపణులచేతఁ
గన్నంతటను జూడఁ గాదను తపసి
కెన్నదల్ గల్గె నీకిటు గుడ్వఁబెట్టఁ
గూడునే తనయిల్లు వాడు నేసితివి
యేడ దాఁగినితి చెప్పు బూడిదగొట్టు
మగనియాజ్ఞకు మీఱఁదగునె యీ శ్లేమి
తగులమో కాక యత్తపసికి నీకు
సమ్మతంబగునేని చను" మని యతివ
సమ్మెటఁ గొని చాటుచాటున వ్రేయ
నతివయు లెక్కసేయక శివుఁ దలఁపఁ
బతి వ్రేయువ్రేల్లెల్ల సతిమీఁదఁ బడక
పిట్టారగింపంగఁ బెట్టె శంభుండు

పిట్టవ్వాకై రాచవెట్టికిఁ బోయి
సోలుచుఁ గ్రాలుచుఁ ద్రేలగింపుచును
నాలంబు సేయుడుఁ గోలలవారు
నలుకమై 'వడుగ!' పొమ్మని వ్రేయు వ్రేట్లు
కలయఁ జోడని నియోగముఁ దాఁకినట్లు
వసదులు నిండఁగ వాడలనడుమ
ముసలిన తమ జైనపసులను దాఁక
త్రట్లను గట్టి ముచ్చట్లును జొట్టి
వ్రేట్లతోడన తమవీపు తోళ్లెగయ
నులికుల్కి వీఁగి వీపులు విర్చుకొనుచుఁ
గెలకు లారయుచుఁ జేతులు నొగ్గికొనుచు
నులికుర్కిపడుచు దబ్బఱమానుఁ డనుచు
వెఱవేఁకు లందుచు విభ్రాంతు లగుచు
హోయని జడియుచు నుపతపించుచును
వారెత్తి యేడ్చుచు వసదు లెక్కుచును
నందుండి యుఱుకుచు నైదవెట్టుచును
సందుల కేఁగుచుఁ గ్రిందు సొచ్చుచును
చెఱువులమునుఁగుచుఁ జెట్లఁ బ్రాఁకుచును
బఱచుచునొండొరుమఱువుసొచ్చుచును
వ్రేట్లకు నులుకుచు విహ్వాలు లగుచుఁ
ద్రట్లంటి చూచుచుఁ 'దమకర్మ' మనుచు
జిను వెన్కఁ దాఁగుచుఁ 'జిక్కితి' మనుచుఁ

గనుకనిఁ జనుచు 'నెక్కడ సొత్తు' మనుచు
'వచ్చెఁజా' వనుచు 'దైవమెఱుంగు' ననుచు
'నొచ్చితి' మనుచును వెచ్చనూర్పుచును
దలలు గుండులతోడఁ దాఁకించికొనుచు
నిలఁబడి పొరలుచు 'నెట్లొకో' యనుచుఁ
దొరిగెడి మేని నెత్తురు లంటియంటి
పొరిఁబొరిఁ జూచుచుఁ 'బొక్కితి' మనుచుఁ
'జొరఁ జోటు' లేదంచు బొమ్మసిల్లుచును
'హారుక్కృత్యమో కాక' యనుచు నిబ్బంగి
సంతాపమున వ్రేట్ల జైనులు పొరల
నంతలో నొకబుద్ధిమంతుఁ డీక్షించి
"చాటున నొకవ్రేటు సతి వ్రేయఁ జాటు
చాటున నీజైనకోటిఁ దాఁకెడిని
యక్కజంబుగను నినాంశులు పోలె
నొక్కొక్కవ్రేటు వేయు ముఖము ల్గాఁగ
శ్రీచంద్రముని పోయి చెఱువుపాలయ్యె
నాచార్యముని పోయి యగడితఁబడియె
వరచంద్రమునిపోయి వసదెక్కియుఱికె
నరహాతముని పోయి యడవులఁ గలసె
శుపణేంద్రమునిప్రాణ ముపతాపమొందె
విపులేంద్రముని వీపు విక్కన విఱిగె
రాజేంద్రముని బిట్టు ప్రాణముల్ విడిచె

సీజినకులగురుఁ డింతలోఁ బొలిసె
నింతయుఁ గూడ నొక్కింతగ్గాయె మడిసెఁ
గంతుసంహారుచెడ్డి గానోపు" ననుచు
నలిప కడ్డము సొచ్చి యతని వారింప
నతగులపై వ్రాలునవ్వేళిటు లుడిగె
భార్య సద్భక్తితాత్పర్యరా లగుట
యార్యేతరుఁ డెఱింగి యగ్లైర్గనట్టు
"లన్నఁబు వెట్టితి వన్నన్న మున్న
తన్నెఱుంగకయుండఁ దపసి కొక్కనికి
నటుగాక శిక్షించి తండఱ నిప్పు
డిటు మునీంద్రుల కెల్ల నెగ్గు సేసితివి
ముదిగొరగల తంత్రములు మంత్రములును
మదిమది నిన్నేల బ్రదుకంగనిచ్చు
వెఱతుము తమయిల్లు వెడలుమీ" యనుచు
నఱిముఱేఁ ద్రోచుడు నవ్వైజకవ్వ
చనుదెంచి చనుదెంచి జైనాలయంబుఁ
'గని శివాలయ మిది గానోపు' ననుచు
వనిత ము న్నిలు వెలువడమిగాఁ జేసి
కని వసదియు గుడియును నెఱుంగమిని
'ముక్కంటి శరణం'చు మోడ్పుఁగేలమర
మ్రొక్కుచు వసది యమ్ముద్దియగదియ
నటజిన ప్రతిరూప మప్పుడ వ్రస్సి

యటయిట వడఁగఁ దదభ్యంతరమున
నుదయించె నద్భుతాస్పదలింగమూర్తి
ముదిత ప్రముదితసమ్మదలీలఁ దనరఁ
"బురుషుఁడు శివభక్తివిరహితుఁ డేనిఁ
బురుషుని మీఱుట తరుణికిఁ బథము
దుర్గతిఁ బొంద దెందును బతిఁ బాసి
భర్గునిఁ గొనియాడు పడఁతియు నట్ల
చనఁగ నాలాయని యను మునిభార్య
యనసూయయుఁ బురుషుఁడు నభక్తుఁడైనఁ
బాసి శంభునిఁ గొల్చి పడసెను గాదె
భాసురంబగు మోక్షపదవి వెండియును
నిల యెల్ల నెఱుఁగఁగఁ దిలకవ్వ నాఁగ
వెలఁది యీశర్వభక్తి విముఖుఁడై నట్టి
మగనిఁ బాయుడు వాఁడు దెగనున్న యెడను
నెగిడి శివాలయం బింతి సొచ్చుడును
వెనుకొని యేతెంచి పెనిమిటి శివుని
వెనుక దాఁగిన నాతిఁ గినియుచుఁ గొంగు
వట్టి తివ్వఁ బురుషభావమై యుండె
నెట్టణ శివభక్తి నిష్ఠగాఁ జేసి
యనుచుఁ జెప్పఁగ విందు మాద్యోక్తులందుఁ
గనుఁగొనఁబడియె నీకాంత సద్భక్తి"
యని యసంఖ్యాతభక్తావలి వొగడ

జననికాయంబు ఖే యని జయవెట్టి
నాజినమును లెల్ల నాశ్చర్యమంది
వైజకవ్వకు మ్రొక్కి వడిఁ బ్రస్తుతింప
వైజవ్వ భావోద్భవంబొటఁ జేసి
వైజనాథుం డన వసుధపై వెలసి
భ్రాజిల్లు నెఱుఁగవే బరవళికందు
వైజకవ్వ మహిమ యోజైనమూళ !
చన్నసద్భక్తుల శౌర్యాతిశయము
లెన్న ననంతంబు లిన్నియు నేల
నాటిలింగము నేఁడు నవసెనే చెపుమ
నాఁటి భక్తమహిమ నవసెనే నేఁడు
చిటిపొటిసమయంబు లిటువంటి వడఁప
నట వెద్దలేల యే మైనఁ జాలుదుము
గబ్బున జైనమార్గమె యాది యనుచు
నిబ్బంది జినమును లీసబ్బలూర
మెట్టి మాటోఁ బ్రతిఘట్టించి యాడ
నెట్టణ వాదంబు నిల్చి గెల్చినను
"నటువోవ దింకఁ బ్రత్యక్షప్రమాణ
మిటుసూపుమా" యని యటు మొదలింప
"హిరియవసదినాఁగఁ బురినెన్నఁబడ్డ
యూరుజినాలయ మిపుఁ డుదయమహానంత
లోనన గోడలతోనన కూలి

తానప్పు మీఁ వేల్పుతలయును బగిలి
నేలపాలయ్యెనేనియు నీశుబంటఁ
జాలుఁబో యిదియ దృష్టముచూఁడుఁ"డనుచు
వచ్చినంతటిలోనఁ వసదియుఁగూడ
వ్రచ్చి వందఱ లాడుచడువునఁ ద్రెళ్లె
జినురూప మంతఁ దుత్తునియలై పడియె
జనులు జైనులును నాశ్చర్యంబు నొంద
నిలువ దప్పరిఁ గూలు నేడును వసది
యిలయెల్ల నెఱుఁగరే యిన్నియు నేల
ముదిలంజెపడు పట్లు ముందటికథలు
పదరి చూపఁగ లేని పందవే నేఁగు
వరకీర్తి వెురటదవంకయ్యగారి
వరువుడఁ బిలుసనవచ్చునే నాకు
నిప్పుడ శిరమిచ్చి యిప్పుడ మగుడ
నొప్పునే పడయంగ నోరి జైనుండ
నిప్పుడ శిరమిచ్చి యేడుదినంబు
లిప్పురవీథులనెల్లను మెఱసి
తలవడయుదు ధరాస్థలియెల్ల నెఱుఁగఁ
దలతలఁమాడను గలదురా శక్తి
యటమీఁదఁ గళ్యాణకటకంబునందు
నటయిట మందునకైన లేకుండ
వసదు లన్నియు వ్రచ్చి వందఱలాడి

వెస జినప్రతిమల విసమాల్తు నిదియు
బాస మి మ్మిరుగాలిపసుల నింకొండు
చేసిన నింకొండు సిద్ధియుఁ గలదె”
యనవుడు “నల్లకా”కని యొక్క దెసను
జినసమయస్థులు సేరిచూడంగ
బసవఁడు సహితంబు భక్తనికాయ
మొసకంబుతోఁ గొలు విచ్చి కూర్చుండ
నాబిజ్జలుఁడు దంత్ర మప్పూరాంతరము
నాబాలవృద్ధాదు లంతంతఁ జూడ
నచ్చెరు వంద నేకాంతరామయ్య
కచ్చింగికొని యంకకాఁడునుబోలె
దరహాసకాంతి వక్త్రమునఁ దుల్కాడ
నరుదొంద భక్తగణాళికి మ్రొక్కి
యార్చి బొబ్బిడి పొంగి యలుఁగుఁ గంఠమునఁ
జేర్చి కుమ్మడి యొక్కసేత సంధించి
యాసురంబుగ నల్ల నప్పు డట్టికును
బాసి శిరము కేల “బాపు బా” పనఁగ
బసవఁడు గీర్తింప భక్తసమూహ
ముసమానలీలఁ గో యని పొంగియార్వ
త్సాతలేశుఁడు శిరఃకంపపూర్వముగఁ
జేతులు రెండును శిరమునఁ దాల్ప
వారక జయజయధ్వనులు ఘూర్ణిల్ల

పౌరజనములు విభ్రాంతులై చూడ
నవికలసకలవాద్యధ్వను లెసలఁగ
వివిధనాటకమహోత్సవము లొప్పార
వలచేత నలుఁగు డాపలిచేత శిరము
దులుకాడ వీథివీథుల మెఱయుచును
జతులు వెట్టఁగఁ దాళగతుల కాడుచును
ఊతిఁగటారముమీఁదఁ జేరినిల్చుచును
శరణార్థి సేయుచు జయవెట్టుఁడనుచుఁ
బిరిగొని యార్చుచుఁ బెడబొబ్బ లిడుచు
నిప్పాటఁ గలయంగ నేడుదినంబు
లప్పురి మెఱసి యేకాంతరామయ్య
వచ్చి యప్పురు గుడివాఁకిట నిలిచి
"వచ్చెనా బాస శ్రవణులార!" యనుచు
నేకాంగవీరుఁ డలోకానుసారుఁ
డేకాంతరాముఁ డపాకృతకర్మి
చక్కన శిర మట్టు సంధింపఁ దడవ
నొక్కింత కొంక దెస కొరవో యుండె
'హరుఁడు వేల్పగుట కేకాంతరామయ్య
శిరములోకుల కెల్ల గుఱి'యన్న యట్టు
లేకాంతరామయ్య శ్రీకరమహిమ
లోకాంతమయ్యెఁ ద్రిలోకంబులందుఁ
బ్రత్యక్ష మీశుఁడే పరమేశుఁ డనుచు

నత్యద్భుతాక్రాంతులై జను లొ్వాగడఁ
'గడుదురాత్ములఁ జూడఁ గా దని తముకుఁ
బెడమొగం బిడె' నని భీతిల్లినట్లు
జనపాలకునిచేత జయపత్ర మిచ్చి
జినసమయులువచ్చి శివభక్త వితతి
ముందటిదెసఁజాఁగి మ్రొక్కఁగఁబడిన
యందఱిమొగములయం దచ్చులొత్తి
యారిచి పెడబొబ్బ లందంద యిడుచు
వీరమాహేశ్వరవితతి యుప్పొంగి
వెనుకొని వసదుల విఱుగఁగొట్టుచును
జినప్రతిమలతల ల్చిదిమివైచుచును
నసమానలీలఁ గల్యాణంబునందు
వసదియు జినుఁ డనువార్త లేకుండఁ
గసిమసంగుచుఁ జంపి గాసివెట్టుచును
వసుధలో జిను లనువారి నందఱను
నేలపాలుగఁ జేసి నిఖిలంబు నెఱుఁగఁ
గాలకంధరుభక్తగణసమూహంబు
అనుపమశౌర్య నేకాంతరామయ్య
ననురాగలీలమైఁ గొనియాడుచుండ
ననయంబు బసవఁడు దనసంగ మేశుఁ
డని భక్తిఁ గొల్వ నేకాంతరామయ్య
వరకీర్తిమై నిట్లు వర్తింపుచుండె

ధర లసద్భక్తివిస్ఫురణామె మతియుఁ
బ్రథితుఁ డీయేకాంతరామయ్య దివ్య
కథ విన్నవ్రాసిన గారవించినను
జలకాలహాలవహ్నిశస్త్రాస్త్రబాధ
నలి నాగ మృగరోగములభయం బణఁగు
విపులదృష్టాదృష్టవివిధసౌఖ్యములు
నపవర్గములు గల్గు వారుకృపఁ జేసి.

## షాడ్డలదేవు బాచయ్యగారి కథ

ధీరుండు షాడ్డలదేవుబాచయ్య
గారు నా వెండియుఁ గలకంఠమూర్తి
నిర్గతేంద్రియవైరివర్గదుర్గుణుఁడు
భర్గనిరర్గళాంతర్గతధ్యాని
యుగ్రాతిభక్తగణాగ్రగణ్యుండు
నిగ్రహానుగ్రహోదగ్రశౌర్యుండు
కష్ట గుణా క్లిష్ట దుష్ట జనారి
శిష్ట జనానంద పుష్టి పాలకుఁడు
దుర్భావరహితుఁ డగర్భసంభవుఁడు
నిర్భవాశ్రయుఁ డపునర్భవశాలి
శాంతుండు దాంతుండు సదమలభక్తి
కాంతుండు నిర్జితావాంతగసమయ
పరదైవ పర్వతప్రథితదంభోళి
పరదైవసఁదోహతరుకుఠారంబు

పరదైవశుండాలపంచాననుండు
పరదైవవార్ధిశుంభత్కుంభజుండు
"త్రినయనునతులితోద్రిక్తశౌర్యంబు
చనునందికేశ్వరు సర్వజ్ఞతయును
భృంగినాథుని యేకలింగనిష్ఠయును
భంగిగా నవ్వీరభద్రు రౌద్రంబు
భృగుదధీచ్యాదులపృథుశాపశక్తి
తగుగౌతమాదుల తర్కప్రయుక్తి
గురునాథుఁ డిన్నియుఁగూడ బాచాంక
వరదివ్యమూర్తిగా విరచించెనో కో
కానినాఁ డిటువంటి కలియుగరుద్ర
మానితపృథుదివ్యమహిమ యెట్లొనరు"
ననుచు లోకంబు లత్యర్థిఁ గీర్తింప
ననురాగలీల నూనిన భక్తియుక్తి
'సిద్ధాంతముల శ్రుతిస్మృతిమూలములను
బద్ధవేదాంతసంపాదితోక్తులను
న్యాయవైశేషికాద్యఖిలశాస్త్రముల
నాయతబహుపురాణాగమార్థముల
సహజానుమానాదిసర్వప్రమాణ
బహుతర్కవాదజల్పవితండములను
వెలయు నుత్పత్తిస్థితిలయకారణుఁడు
నలరు నిత్యానందుఁ డంబికాధవుఁడు

పశుపతి దాఁగర్త వలువేల్పు లెల్లఁ
బశువులే యని ప్రతిపాలన సేసి
జినసమయస్థులశిరములు దునిమి
మును విష్ణుసమయులముక్కులు గోసి
యద్వైతులను హతాహతముగాఁదోలి
విద్వేషవాదుల విటతాటమార్చి
చార్వాకవాదుల గర్వంబడంచి
సర్వేశుభక్తియే యుర్వి నిష్ఠించి
దిట్టయౌ పాడ్డలదేవుబాచయ్య
యిట్టిసద్భక్తిమహిష్ఠుఁడై నడవ
నెడనెడ సౌరాష్ట్ర మేఁగి యేఁటేఁటఁ
గడు నర్థితోడ జాగరము సెల్లించు
దిన మేఁగుదెంచుడుఁ 'దివుట సౌరాష్ట్ర
మున జాగరము సేయఁజనియెద' ననుచు
బిజ్జలునకు వినిపింపఁగ నతఁడు
"కజ్జ మెంతేనియుఁ గలదు వోరాదు
కొట్టరువునఁ బల్లి గోలువఁగవలయు
నిట్టేల చెల్లు నీ కిరుదెస కొలువు
బాలెంతలంజియపడుపట్ల రాచ
యోలిగంబును భక్తియునుగూర్చి నడవ
సౌరాష్ట్రమున కీవు సనుము గాదేని
సౌరాష్ట్రనాథుఁడు సనుదేర నిమ్ము

శివరాత్రి గివరాత్రి సేయుట మాను
తవిలి యీయుళిగంబు దప్పింపరాదు"
అనుచు నప్పరవాదులనుమతంబునను
జనపతి వారించుడును బోక నిలిచి
"మొదలించి పలుకుడు మూర్ఖుండై పోక
యదియుఁగష్టముగాదె యతఁడన్నయట్లు
వచ్చు నిచ్చటికిఁ గొండె వరదుఁడు నాకు
నచ్చటి కేఁగున ట్లయ్యెడు నొండె
దీనఁ దప్పినదేమి నానిజవ్రతము
తా నెట్లు శివునకుఁ దప్పింపవచ్చు"
ననుచు నిశ్చింతాత్ముఁడై యున్నయెడను
ఘనుఁడు సోమేశుఁ డాదినము దొల్నాఁడు
మడఁపు లేఖయు నందిపడఁగయుఁ గొనుచుఁ
బడిహారి క్రియఁ బట్టపగలె యేతెంచి
కొట్టరువునఁ బల్లి గొలిపించుచుండ
నట్టిచో బాచయ్య కాతఁ డిట్లనియె
"సౌరాష్ట్రనాథుండు సనుదెంచుచుండి
భోరన ముందఱఁ బుత్తెంచె నన్ను
శంకరు నానతిఁ జదువుకో లేఖ
యింకిటపూఁటకు నేఁగుదెంచెడిని
నాసక్తిమై నింక నగిశంబు వీని
వాసంబునన యుండవలయుఁ గావునను

నీపెద్దగాదియలోపలఁ గొలుచు
వేపోయఁబనుపుము వెడలి సోమేశుఁ
డచ్చోటఁ బ్రత్యక్ష మయ్యెడి" ననుచు
నచ్చుగాఁ జెప్పుచు నతఁ డదృశ్యముగఁ
"జను దెంచు నిచటికి సౌరాష్ట్ర నాథుఁ
డనుమాన ముడుగుఁడీ యదియెట్టు లనిన
వచ్చునే మున్ను రావణుని మన్నించి
యచ్చోన చిక్కఁగా కనిపల్కవలదు
భక్తుఁడే యతఁడు దపఃఫలోన్నతిని
శక్తిమంతుఁడు గాక చర్చించిచూడ
భక్తులచేఁ బట్టువడుఁగాక శివుఁడు
భక్తిహీనులకేల పట్టిచ్చు శివుఁడు
విలసితభక్తి సద్విధి మెచ్చికాదె
యెలమి గుడ్డవ్వకు నెదురుగా వచ్చి
కదల కట్టుల చిక్కఁగాదె సోమేశుఁ
డదియేల నావిందె గనుపురంబునను
గావునఁ జూడంగఁ గందు మిప్పురిని
దేవునిరాకకు దృష్టి మిచ్చుటికిఁ
బడిహారి భావనఁ బఱతెంచె నతఁడు
నడర సౌరాష్ట్రనాయకుఁడ కానోపు
సకళనిష్కలభావ సన్నుతశక్తి
నిక మెట్టి పడిహారులకు నున్న దెట్లు

వచ్చె నిట్లానతియిచ్చె లోకులకు
నచ్చెరువుగ నెల్లి యరుదెంచుఁజుండి
యిట యదృశ్యుండయ్యె నీశుండ"యనుచుఁ
గటకంబునరులు విఖ్యాతిసేయంగఁ
దవిలి సమ్మదసముద్భవవారి గ్రమ్మ
శివునియానతి లేఖ శిరమునఁ దాల్చి
పుర మప్డు శుభముగా విరచింపఁబంపి
కరమనురక్తి బాచరుసు వెండియును
బసవయ్యమొదలుగాభక్తులు దాను
వసమమొడ్డోలగంబై యున్నయెడను
వింతచే నానందవిభ్రమం బెసఁగ
నంతంతఁ బాడంగ నంతంత నాడ
నదెవచ్చె వచ్చె వియన్మండలమున
నిదెవచ్చెవచ్చె సోమేశుండనంగ
నీరధు లేడు ఘూర్ణిల్లినభాంతి
సారగంభీరవాద్యారవం బెసఁగ
భోరన మ్రోయుచప్పుడు వినఁబడఁగ
సౌరాష్ట్రనాథుఁ డాశ్చర్యం బెలర్పఁ
దివిరి కోట్టరువు గాదియ వ్రచ్చికొనుచు
భువిఁ బ్రతిష్ఠుండయ్యె నవని గంపింప
'సిద్ధరామయ్య దా శ్రీగిరికేఁగి
శుద్ధాత్ము మల్లికార్జునునిఁ బ్రార్థించి

కొనుచు నాసొన్నలికను పురంబునకుఁ
దానెట్లు రప్పింపఁగా నేరఁడయ్యె
నిప్పు డిచ్చటనుండి యీబాచతం దె
రప్పించుకొనియెఁ జేరఁగ సోమనాథు
నిట్టిధన్యుఁడు గల్గునే' యని భక్త
లిట్టలంబుగ నుతియించుచుండ
నచ్చెరువందుచు నాబిజ్జలుండు
వచ్చి సాష్టాంగుఁడై వడిఁ బ్రణమిల్లి
సకలనియోగంబు జయవెట్టు బసవఁ
డకలంకలీల బాచయ్య నంకింప
వలివేగమున గాడియలు వడఁ ద్రోచి
నెలకట్టుకట్టించి నిమిషమాత్రమున
వరరత్నఖచితసువర్ణాలయంబు
విరచించి కోటగోపురము లెత్తించి
ప్రవిమలోద్యద్భక్తి బాచిరాజయ్య
శివరాత్రినియమంబు సెల్లించెనంత
నలిఁగొట్టరువు సోమనాథుఁ డనంగ
వెలసె లోకావలి వినుతింపుచుండఁ
దెల్లఁగా పొడ్డలదేవు బాచయ్య
సల్లీల సద్భక్తి కెల్లయై పరగ
లలితనవ్యసమయ కోలాహలమహిమ
కిల బిజ్జలుండు సహింపక మఱియుఁ

గుమతిన్నై యప్పురిసమయులుఁ దాను
రమణఁ బ్రతాపనారాయణపురిని
గోవింద ప్రతిమ సద్భావం బెలర్పఁ
గావించి యొకగుడిఁ గట్టించి మంచి
దినమున నతనిఁ బ్రతిష్ఠగావించి
యనురాగలీలమై నంతఁ గొల్వొచ్చి
యున్నెడ నఖిలనియోగంబు గొలువ
నన్నరేంద్రుండు దా నందఱఁ జూచి
"బాచిరా జటయేమి భక్తుండ ననియొ
యేచియో యీకార్య మెఱుఁగఁడో యెఱిఁగి
తా లెక్కసేయక తమకొలువొల్లఁ
డో లీల నిట్టి యొడ్డోలగంబులకుఁ
జనుదేరకుండు డే"మని యాగ్రహింప
మనుజేశునకు బసవనమంత్రి యనియెఁ
దవిలి నీయుడిగంబుఁ దప్పించెనేని
బవరంబు ముట్టినఁ బాఱనేనియును
దప్పని దండింపఁ దగ వగుఁ గాక
యిప్పరదైవంబు లిండ్లిండ్లకడకు
నేల రా వనవచ్చునే పతి వీవు
జోళవాళిక కాక వేళవాళికినె
వత్తురే యన్యదైవంబులయిండ్లు
చొత్తురే భక్తులు సూతురే వింద్రె

శింగైకనిష్ఠావిలీనుండు భృంగి
యంగజారాతికి సతివ యైనట్టి
యర్ధనారికి మ్రొక్క కభవునిదక్షి
ణార్ధ మేర్పఱిచియు నటమ్రొక్కెననిన
నిట వేయునేల మాహేశ్వరవితతి
చిటిపొటివేల్పులఁ జీరికిఁ గొండ్రె
వినవె ఘంటాకర్ణుఁ డను ప్రమథుండు
మును పరశబ్దంబు వినని నేమంబు
గాన ఘంటలు ఘణఘణయని మ్రోయ
వీనుల నొకవేనవేలు ధరించి
లోకంబులందు ఘంటాకర్ణుఁ డనఁగఁ
బ్రాకటంబుగఁ జెప్పఁబడియె వెండియును

అరియమ కథ

నదియట్లు లెఱుఁగవే యరియమనాఁగ
మొదల నర్వద్దాడి మువ్వురలోన
వెలయు మహేంద్రమంగళ మనుపురిని
నెలకొన్న సద్భక్తినిష్ఠ పెక్కువను
దనయొద్ద నొండొకదైవంబుఁ బేరు
కొనువారి తలఁ దెగఁ దునుముదు ననుచు
నున్నెడ నింటికి నొక్క బ్రాహ్మణుఁడు
సన్నుతి రుద్రంబుఁ జదువుచు వచ్చి
భిక్షంబు వేఁడుడుఁ బ్రీతిమైఁ దాన

భిక్షంబు గొనివచ్చి పెట్టంగ నురిలి
యందులో నొకమెదు కవనిపైఁ బడ్డ
సందడింపుచు నవ్యశబ్దంబుఁ బలుకఁ
గట్టుగ్రమునఁ జేతిచట్టువంబునను
గిట్టి యాభూసురు పొట్ట వ్రచ్చుడును
"నక్కటికము లేక యరియమనాఁగ
నొక్కభక్తుఁడు సంపె నొక్కవిద్వాంసు
'ధర బ్రాహ్మణో నహంతవ్య' యనంగఁ
బరగిన వేదోక్తిఁ బరపరసేసి
స్వాధ్యాయపరుఁడగు సద్బ్రాహ్మణుండు
వధ్యుఁడే యూరకవధియింపఁ దగునె
యడుగ భిక్షంబు వెట్టెడిది గాదేనిఁ
గడపెడి దింతియకాక చంపుదురె"
యనుచు భూసురు లాగ్రహంబునఁగూడి
జననాథునకు నంత వినిపింపఁ దడవ
నప్పుడ పిలిపించి యరియమగాజుఁ
"దప్పేమి మునుచేసెఁ జెప్పుమా విప్రు
నేలచంపితి నీతియే యింత బుద్ధి
మాలుదురే భక్తి మదిఁ గల్గుఫలమె
చెప్పు కాచెద మేమి సేసె నాతండు
చెప్పవేనియు సరిసేసెద మిట్లు
చెల్లునే' యనవుడుఁ జిఱునవ్వు నవ్వి

"చొల్లువాలుడు మాటలెల్ల నేమిటికిఁ"
జంపితి నట్లైనఁ జంపినవిధము
చెంపంగఁ దగుతప్పు శంభుఁడె యెఱుఁగుఁ
గావఁ జంపఁగఁ గర్త దేవుఁడు కాక
కావఁ జంపఁగ మీరు గర్తలే" యనుడు
"భవికీటకంబుతో శివభక్తిపరుని
భువి సరిసేయుట యేమినీతి" యనఁగ
ధరణీశ్వరుండు మదగ్రస్తుఁ డగుచు
సరిసేయఁ బంచుడు నరియము మగిడి
వచ్చుచో నొకశివావాసంబులోను
సొచ్చి చేతాళంబు లిచ్చుచు నిట్టి
పరమపాతకుఁ డనఁబడు ద్రోహితోడ
సరి సావఁదగునయ్య పరమాత్మ" యనుడు
నరియమరాజు లింగైకనిష్ఠుఁడును
బరమనిర్మలభక్తిభాతికి మెచ్చి
"పరదైవనామదుర్భాషణుతోడ
సరిసేయవచ్చునే శరణుని" ననుచు
నాక్షణమాత్ర నెయ్యంబుతోఁ దనదు
వక్షంబు దెఱచి యావరలింగమూర్తి
'సొరుచొరు' మనుడు నాయరియమరాజు
కరమర్థితో లింగగర్భంబు సొచ్చె
నత్తఱి 'నదెపోయి నదెపోయి' ననుచు

న త్తలవరు లేఁగునంతకు మున్న
వెలుపల మూరెఁడు మొలకచ్చుతోఁక
వెలయ లింగంబులోపలఁ బ్రవేశించె
భంగి గా మాశివభక్తు లెయ్యెడల
వెంగలివేల్పుల వినఁగ నొల్లమికి
యరియమఁగట్టిన యయ్యంబరంబు
కరిగాదె నేఁడును గానవచ్చెడిని

## వీరశంకరుని కథ

వీరశంకరుఁ డన వెండియు నొక్క
మారారిభక్తుని చారిత్ర వినుము
కల నైనఁ బరసమయుల దైవములను
దలఁపఁడు ముట్టఁడు పలుకఁడు దోడ
నదియు నేమముగ సమ్మదలీల నడవ
నదియొక్కనాఁడు స్వప్నావస్థయందు
"నంటితి నొకబౌద్ధు"నని కల గాంచి
కంటగించుచు మేలుకని విచారించి
"కుక్క ముట్టిన కడ్వాకును విధి యేమి
చక్కనఁ గాల్చినఁ జాలున కాదె"
యని కృతనిశ్చయుఁ డగుచు శ్రీగిరికిఁ
జనుదెంచి హాటకేశ్వర దేవునొద్ద
విస్ఫులింగంబులు వెడలుచు నగ్ని
ప్రస్ఫురింపఁగ బగబగయను నినుప

పెనముపైఁ గూర్చుండి భీకరోద్వృత్తిఁ
గనలెడు నయ్యున్నపెనము కాఁకకును
రెట్టించి ముప్పదిరెండాయుధముల
దట్టుండు గెలసంబు దానాచరించి
మదనారి మెప్పించి మహితసాయుజ్య
పదవిఁ దత్క్షణమాత్రఁ బడసెఁ గావునను
నంతకాంతకుభక్తు లన్యదైవముల
సంతయు నొల్లమి సహజంబు వినుము

## శివలెంక మంచయ్యగారి కథ

శివలెంకమంచయ్య శ్రీకాశిలోనఁ
దవిలి విశ్వేశ్వరస్థానంబునందుఁ
దప్పక శివునకుఁ దనపదివ్రేళ్లు
ముప్పూఁటఁ బూజించి యప్పుడ పడయు
జను లద్భుతం బంది వినుతింపనట్లు
యనయంబు వర్తించుచును రూఢి వెలయ
నక్కజం బందఁగ నన్యదర్శనుల
ముక్కుపైఁ గత్తియ న్బెక్కె మప్పురిని
నెత్తించి 'వీరమాహేశ్వరపదమె
యుత్తమ మీశ్వరుఁ డొక్కండె కర్త'
యని ప్రతిష్ఠింపంగ నన్యదర్శనులు
సని యంత వారణాసిని గదాధరుని
గుడిసమీపంబునఁ గూర్చుండి గర్వ

నశ్వరపరదర్శనస్థులు వడఁక
బసిగమై మంచెనభట్టారకుండు
నసదృశమహిమ దుల్కాడ నేతేర
సమయులు దమతమశాస్త్రంబు లెత్తి
భ్రమగొని యొక్కొక్కప్రశ్న సేయుడును
నయ్యయి శాస్త్రసూక్తార్థంబులందు
నయ్యయి సమయుల కియ్యకోలుగను
నిపుణతమై సకలపురాణశాస్త్ర
విపులార్థవాదము ల్వ్యాఖ్యాతి వెలయఁ
జూపుచు వెండియు శ్రుతిసంహితాది
రూపితార్థంబుల రూఢిగాఁ బ్రశ్న
సేయుడు లెంకమంచెనపండితులకు
నాయెడ సమయులు వారొత్త నోడి
"చదువులు గిదువులు సాలుఁబో" వేయుఁ
"నదియేల దృష్టమే మయినను గలదె
యనవుడుఁ "దనక తా నరుగ నవ్విష్ణుఁ
గొనిపోయి విశ్వేశ్వరునకు మ్రొక్కింతు
నింకఁ" జూడుం డంచు లెంకమంచెయ్య
యంకించి నరు లెల్ల నటు ప్రస్తుతింప
మూరారి సద్భక్తముండలిఁ దలఁచి
"యూరారివిష్ణు! నీకొడయఁడైనట్టి
విశ్వేశునకు మ్రొక్క వెడలి ర"మ్మనుడు

ముదరఁ దదోత్కన్ముఖులై పిలిపింపఁ
శ్రీరమణుండు మంచెన పండితయ్య
గారి యానతికిని గడగడ వడఁకి
మ్రొక్కుచు నత్తిరుముట్టంబు వెడలి
చక్కఁదెర్వునఁ బాదచారియై నడవ
శివలెంక మంచెయ్య శివభక్తవితతి
దవిలి ముందట మహోత్సవలీలఁ జనఁగ
నగ్గదాధరు వెన్క నన్యదర్శనులు
నగ్గలికము సెడి యరుదెంచుచుండ
నక్కజంబుగ నటు హరిఁ గొనివచ్చి
మ్రొక్కించె విశ్వేశ్వరునకు మంచెయ్య
భువి "శివభక్తః ప్రభుర్మమ" యనఁగ
నవిరళంబయ్యెఁ గేశవునివాక్యంబు
మంచెనపండితుల్ మఱి తన్నుఁ బిలువఁ
'బంచినపని సేసి బ్రదుకుదు' ననుచుఁ
జక్కనఁ జనుదెంచి మ్రొక్కె నంతటను
'జిక్కె' నంచును గూడి శివభక్తు లలర
"నదిగాదె నేఁడును హరి విశ్వనాథు
నెదుర మ్రొక్కినయట్టు లిల నున్నవాఁడు
నేవాదులును విష్ణు లేవంగనెత్తఁ
జూవె చాలక యిట్లు సూచుచున్నారు
హరునకుఁ బ్రతిలేమి యన్నియు నేల

ధరఁ జాఁగఁబడియున్న హరిరూప సాక్షి
భక్తులయాజ్ఞలోపలివాఁడు హరియు
భక్తు లల్గినఁ జెడు బ్రదుకుఁ గూర్చినను
ధరణి నెట్లన్న శంకరదాసి యనఁగఁ
బరికింప రెండవఫాలలోచనుఁడు
ఇట యల్గిచూచిన నితరదైవంబు
లటు ప్రయ్యలై పడు నన్యదర్శనులు
దొల్లియు జగదేకమల్లుఁ డన్పెద్ద
బల్లహు నొద్ద సంపాదనసేయ
బిలిబిలి పరసమయులు దల్లడిల్ల
నలిగి శంకరదాసుమయ్య సూచుడును
ఫాలకరాళవిశాలనేత్రాంత
కీలావళీస్ఫురత్కాలాగ్ని గ్రమ్మఁ
గ్రక్కున నచటి నారాయణప్రతిమ
వ్రక్కలయ్యెనుగాదె వసుధ యెఱుంగ
నరయ శూన్యాలయంబై యున్నయట్టి
తిరుమట్టి మది దాన కరిగాదె చూడఁ
గావున మాభక్తగణములమహిమ
నీ వేమిటెఱుఁగుదు నిఖిలేశ్వరుండ
యననేలవేయు నట్లైన బాచరసు
ఘనమహత్త్వముసూతుగాదె తొల్లియును
యెణఁకించి పలుకఁ దత్క్షణమాత్ర నీవు

ప్రణుతింప సోమేశు రప్పించుకొనఁడె
కొట్టరువునఁ బట్ట గోటానకోట్లు
పెట్టియు మనుజులవేళ్లు వ్రాయండు
కదియఁ బంచాక్షరి కవిలియవ్రాసి
చదువు లెక్కలు పార సది దప్పకుండ
నెఱుఁగుదుగాదె మున్నేఁ జెప్పనేల
యెఱుఁగుదుగాకేమి యిటమీఁదిపనులు"
నంచును వృత్తాంతమంతయు బసవఁ
డంచితమతి విన్నవించి పుచ్చుడును
'వాద మన్నను బోవవలయుట తగవు
గాదె' యంచును సముద్ధతకోపుఁడగుచుఁ
జనుదెంచి భక్తులఁ గని మ్రొక్కి నిలువ
జననాథుఁ డాగ్రహంబున నిట్టులనియె
"సరుదగు నఖిలలోకాధీశుఁడైన
హరి ప్రతిష్ఠకు నమాత్యవ్రాత మెల్లఁ
జనుదేర నీవేల చనుదేర విచటి"
కనుడుఁ గోపోద్దీపితాంగుఁడై పొంగి
"పుట్టఁ బుట్టువుమాలి చుట్టుముట్టాడు
నిట్టెట్టివేలుపు లెట్టు నగేంద్ర !
కర్త లనియెదవు కర్త లిం దెవరు
కర్తలకర్త మత్కర్తయ కాదె
కర్తవ్య మింతయుఁ గర్త శంభుండు

కర్తవ్య మొందును గర్తకు సరియౌ
కర్త ప్రధానుండు గాక తక్కెల్లఁ
గర్తయు హర్తయుఁగలఁడె వేఱొకఁడు
హరియును గిరియును నజుఁడును గిజుఁడు
సురలును గిరలును హరునిసమంబె
యిల 'మమ కర్తా మహేశ్వరః' యనుచుఁ
బలికెను విష్ణుఁడు వాగ్మేశు డగునె
యటుగాక స్థితికర్త యందమే విష్ణుఁ
డిట పుత్త్రు రక్షింప నేలొకో లేఁడు
నలువ ధైవంబనుపలుకులు మున్నె
పొలిసెఁగాదే తలవాలిసినయపుడు
కాఁడువో యుత్పత్తికర్తయు నజుఁడు
పోఁడిగాఁ దనతలఁ బుట్టించుకొనఁడె
ధర జినబౌద్ధులు ధై ంబులేని
నరరూపులై యుండుదురె మహాత్తణఁగి
పశుకర్ములగు వేదబాహ్యులువారు
పశుపతు లగుదురె ప్రత్యక్షమిదియు
ననవేల 'హస్తినాహన్యమానోఽపి'
యనునిరీశ్వరుని విశాలయముఁ దనఁగ
నేనుగు వెన్కొని గొంగిది మట్టాడు
చోనైన వసదులు సొరరెట్టివారు
మాయ దైవం బనుమాట లేమిటికి

మాయ దానట పేరు మఱి దైవమగునె
వారునధికారులు నజుఁడును హరియు
నరయంగ శ్రుతిబాహ్యు లాయున్న మువురు
నెవ్వండు గర్త యీయేవురియందు
నెవ్విదర్శనము లి ట్లెన్నఁగ నాఱు
శ్రుతి "ఏకఏవరుద్రో"యన్నయట్టు
లితరదైవంబుల నెన్న నేమిటికి
వేదంబు దైవమే వేయును నేల
నాదిసోమునుచేత నపహృతంబగునె
తలరునే పృథివియు దైవమేనియును
నిలయమై యుండునే మలమూత్రములకు
నెఱయ దైవమె నీరు నీట్టుపాటులను
వఱలునె యణఁగునె యఱచేతియందు
ననలుఁడు దైవ మే నటు భంగపడునె
మును సర్వభక్షుఁడై చనునె లోకముల
నక్కరువలి దైవ మండ్రేని నొక్క
దిక్కున నుండునే దిక్పాలుఁ డనఁగఁ
దలఁప నాకాశంబు దైవమండ్రేనిఁ
బ్రళయంబుఁ బొందునే ప్రమథునిచేత
నిలుకాల నిలువఁగ నేరక తిరుగు
నిల దినేశుండు సర్వేశ్వరుం డగునె
యానిశాపతి దైవ మన నెట్లువచ్చు

నానాఁటికిని గళానష్టతఁ బొందు
నఖిలంబునకుఁ గర్త యాత్మయేనియును
సుఖదుఃఖములఁబొందిసొగయుచునున్నె
కావున మున్నిట్లొకం డొకొక్కటికి
దైవంబు లేనియుఁ దారు పుట్టుదురె
కర్మంబ యంతకుఁ గర్తయంటేనిఁ
గర్మం బచిత్తు దత్కర్తయు జడుఁడు
నెట్టన్న నన్యాయ మే మేనిఁ జేయ
నట్టివానిఁ బఱుప నధికారి గలఁడొ
తనకుఁదాఁబఱుపునో తత్కర్మఫలము
తనకుఁ దాఁ బంధించుకొనునొ తత్కర్త
కావునఁ బఱుప నొక్కఁడు గర్తగలఁడు
భావనఁ దత్కర్మఫలములు గుడుపు
నిలను గర్మాధీశుఁ డీశుండు గర్మ
ఫలదాత మాయుమాపతియె దైవంబు
కర్మంబు గర్తయేఁ గ్రతువునఁ బుణ్య
కర్మి యంచును దక్షుఁ గడ తేర్పవలదె?
పితృవధసేసిన యతికర్మఫలము
నతని బొందఁగనీక యఖిలంబు నెఱుఁగ
మేటికర్మము గర్త మృడుఁడు గాఁడేనిఁ
గాటకోటని కేల కైలాస మిచ్చె
నటు 'కృతంకర్మశుభాశుభం' బనెడి

చిటిపాటివాదము లెల్ల వెఱ్ఱ్యేడను
కోయని శ్రుతియు 'నేకో రుద్ర ఉచ్య
తే' యనుఁగాన మాదేవుండె కర్త
హరిముఖ్యు లీశుఁ బంచావరణములఁ
బరిచరులై కొల్చుపశువులు గాక
కర్తలే యొక్కొక్క కార్యకారణవి
వర్తనమాత్రన వా రెట్టు లనినఁ
బనిసేయు బంట్లెల్ల మును దమచేయు
పనికె కర్తలుగాక ఫలకర్త లెట్లు
కాన కర్తలకర్త మానీలగళుఁడు
దీనికి నిం కొండు దృష్టంబు లేల
పరమేశు చుట్టును ధర నూర నూరఁ
బరిచరులై హరిప్రముఖులు గొలువ
నప్రతిమాకారుఁ డగులింగమూర్తి
కిప్రతిమాకారులే సమానంబు
నిర్మలనిత్యనిష్కర్మ దేవునకు
దుర్మల దుష్ట దుష్కర్ములు సరియె
శుద్ధ ప్రసిద్ధానిరుద్ధ దేవునక
సిద్ధ బౌద్ధాశుద్ధ జీవులు సరియె
చావుఁ బుట్టువులేని దేవదేవునకు
చావుఁబుట్టువుగల దేవత ల్సరియె
బ్రహ్మామాయాకారపశుపాశపతికి

బ్రహ్మేంద్రహరిముఖ్యపశువులు సరిగొ
శంకరునకు ధృతకంకాళునకును
శంకితు లగుచున్న కింకరు ల్సరిగొ
ప్రళయంబుఁ బొందించు ప్రళయరుద్రునకుఁ
బ్రళయంబుఁ బొందెడు పలువేల్పు లెవరొ
మునిగణార్చిత పాద వనజాతునకును
మునిశాపదగ్ధులౌ పినుఁగులుసరిగొ
పూజితుండగు లింగపుంగవునకును
బూజించికొలిచెడి పూజరు ల్సరిగొ
సిరిమహాదేవుఁ డౌసిరిగిరిపతికి
సిరివాసుదేవాదిసురలు సరుంబె
నలిమూఁడుగన్నులుగల త్రినేత్రునకు
నల రెండుగన్నులయతగులు సరిగొ
హాలాహలాగ్ని సంహారశౌర్యునకు
హాలాహలాగ్నిహతాంగులు సరిగొ
త్రిపురదైత్యాంత కోద్రిక్త వీర్యునకుఁ
ద్రిపురదైత్యోపద్రవపతితు ల్సరిగొ
యంధకాద్యసురదర్పాపహారునకు
నంధకాద్యసురభయభ్రాంతు లెవరొ
హరికమలజకపాలాస్థి ధారునకు
హరికమలజసురాసుర తతి సరిగొ
యావిర్భవింపనియభవున కరయ

దేవకీపుత్త్రాది దేవత ల్సరియొ
లింగమూర్తికి జగత్సంగతాత్మునకు
లింగమధ్యములోని లెంగులుసరియొ
సర్వజ్ఞుతోడ నసర్వజ్ఞు లెనయొ
సర్వేశుతోడ నసర్వేశు లెనయొ
షాడ్గులదేవుతో సోమేశుతోడ
సడ్గులదైవము ల్సర్చింప సరియొ
హరుఁడు సర్వేశ్వరుం డభవుండు శివుఁడు
పరముఁడు పశుపతి పరమేశ్వరుండు
శ్రీమహాదేవుఁ డన్నామంబు లున్న
వేమహి నిటువంటి యితర వేల్పులకు
రమణఁ 'దద్విష్ణోః పరం పద' మనఁగ
నమర విష్ణునకుఁ బరమమైనపదము
శ్రుతి "సదా పశ్యంతి సూరయో" యనఁగ
గతకర్ము లీశుండ కాఁ గనియుండఁ
గుమతులై కర్మశాస్త్రముల వెంబడిని
బ్రమసియో యిలఁగుక్కపాలు ద్రాగుటనో
మఱి నాము మేసియో మతిమాలినట్టి
యఅవపాఠులమాట లవనీశ వినకు
మపునర్భవత్వంబు నచ్యుతత్వంబు
నుపమింప విష్ణున కున్నదే యొందు
పూని మాభృగుశాపమున నచ్యుతుండు

తా నుదయింపఁడే దశజన్మములను
సామ మా 'విష్ణుః పితామహః' త్తనఁ బి
తామహునకు హరి దాఁబుట్టఁ గాదె
యజునిగుదంబున హరి పుట్టుటకును
నిజనామ మది యథోక్షజుఁడయ్యెఁ గాదె
యదిగాక యదితి కింద్రానుజుఁ డనఁగ
నుదయించెఁ గాదె పయోజనాభుండు
ఆదట ద్వాపరమందు విష్ణుండు
బాదరాయణుఁ డనఁ బ్రభవించెఁగాదె
యయ్యుగంబునను మున్నచ్యుతుం డుదయ
మయ్యెనుగాదె కృష్ణాఖ్యుండునాఁగ
విష్ణుఁ డొక్కొక్కెడ విలయంబుఁ బొంద
విష్ణుత్వ మర్థించి విశ్వేశుఁ గొలిచి
యొక్కొక్కఁ డుదయించె నొగి విష్ణుఁడనఁగ
నెక్కడఁ బట్టి యింకెన్ని జన్మములు
నతనిబాములు విను మవనిపాలుండ
శ్రుతిమూలముగఁ జూడు ప్రతివాదమనక
తగిలి దూర్వాసుండు దన్నినఁగాదె
నగధరువక్షంబునను మచ్చయయ్యె
హరిని రుక్మిణిఁ గూడ నట్లును గాక
కరమర్థితో బండిగట్టి తోలండె
యమృతాబ్ధిసేవన నయ్యుపమన్యుఁ

డుమియఁడే కుత్తుకనున్న కేశవుని
హరిని జలంధరుం డనునొక్కయసుర
పొరిమార్చెఁగాదె నభోమార్గమునను
జెలమఱి యొక జరాసంధునకోడి
యిలదుర్గమును బన్నెఁడే కేశవుండు
నవిష్ణు నిభదానవాదిరాత్రులు
ముప్పురు సలపట్టు లెవ్వరు వినరె ?
యేచి విష్ణుండు దధీచిఁ జక్రమున
వైచుడు వీ పొగ్గి యాచక్ర మపుడ
తునియలుగాఁ గొట్టుచును నతండెగుదఁ
గనుకని దలపీడఁగాఁ బాఱెఁ గాదె
మును మృగచండాలమను గార్దభంబు
వనజాక్షు ప్రాణంబు సనఁగాచెఁగాదె
హరుఁడు విసముద్రాగి యమృతంబుఁ బనుప
హరి మగఁటిమివిడ్చియాఁటదిగాఁడె
బలిఁగిట్టి భువిఁ గొన్న పాపంబుకతన
నిలగోలుపడి హరి జలధి సొరండె
యాలిఁ గోల్పడి రాముఁ డట బ్రహ్మహత్య
పాలయిధర చుట్టు భ్రమరించెఁ గాదె
పోటరి విష్ణుండు బోయచేఁ గాల
నేటువడీల్గఁడే యిల యెల్ల నెఱుఁగ
వేయేల ప్రేవాడ వెన్న ముచ్చిలుచుఁ

బోయి అంకాడఁడే పొలఁతులతోడ
నోలి నందీశ్వరు నూర్పులఁ దగిలి
పోలేక వచ్చుచుఁ బోవుచుండఁడె
హరి దాన దైవంబ నని జగం బెఱుఁగ
సురలింగమూర్తిచే సుబ్బణంగండె
మృడుఁ బెక్కుయుగములు మేఘరూపమునఁ
గొడుకు నర్థించి దాఁ గొలువఁడే శార్ఙ్గి
మత్స్యావతారంబు మడియించికాదె
మత్స్యకేతనవైరి మకుటి తలఁ జొల్పెఁ
బరగఁ దత్కూర్మకపాలంబు గాదె
హరుహారమధ్యంబునం దున్నయదియు
బ్రాఁతిగా నాదివరాహదంష్ట్రంబు
ఖ్యాత మీశ్వరుచేతఁ గాదె యున్నదియు
శరభరూపము దాల్చి పొరిమాల్చి కాదె
నరసింహుతోలు శంకరుఁడు దాఁగప్పె
పొట్టి త్రివిక్రము నెట్టెమ్ముగాదె
పట్టె ఖట్వాంగము భాతి శంకరుఁడు
నగ్రజుఁడగు విష్ణు నక్కళేబరము
నుగ్రాక్షుమూఁపున నున్నదే కాదె
మహాదేవదేవుని పాదపీఠమునఁ
గాదె లక్ష్మీశ్వరుక న్నున్నయదియు
మృడుఁడు విష్వక్సేనుఁ బొడిచి యెత్తుడును

గడఁగి శూలంబునఁగాదె యున్నాఁడు
అత్తఱిఁ గలికేతుఁడై కేశవుండు
నెత్తురు వఱపఁడే నిటలాక్షుమ్రోల
సంతతంబును శ్రుతిసన "హరిగ్ంహ
రంతః" బనుచు మ్రోయు రౌద్రభాషమున
హరిని హరించుట హరిహరుండయ్యె
హరుఁడు నేతోజాతహరుఁ డఘహరుఁడు
శ్రుతులు "యజ్ఞస్య శిరోభిన్న" మనఁగఁ
గ్రతుపురుషునిఁ జంపఁ గడుఁగోపమునను
వెనుకొని తునుమఁడే వీరభద్రుండు
చని కేశవునితల జన్నంబులోన
నవలేపమునఁ బొంది దివిజాధ్వరమునఁ
దివిరి విష్ణుఁడు దలఁదెగఁ గొట్టువడఁడె
యతఁ డేల యెవ్వఁ డహంకరించినను
రతిపతిహరునిచే బ్రతుకఁగఁగలఁడె
వసిగొని హరియు దేవతలు నెత్తంగ
వెస నోపిరే యక్షవినిహితతృణము
మించి మఱి బ్రహ్మ గర్వించిన శివుఁడు
త్రుంచివైవఁడె వాసిహించమ శిరము
హరిణమై కూఁతురివరియింప నజుని
హరియింపఁడే మృగవ్యాధ రుద్రుండు
అతనిపుత్త్రుండు నహంకారియగుడు

శ్రుతి సుష్ట్రమైయుండఁ జేయఁడే హరుఁడు
వాసుదేవుండు దైవంబనియెత్తు
వ్యాసునిచేయి నిహత మయ్యెఁగాదె
యదిగాక గర్వించినట్టి రావణుని
నదుమఁడే శివుఁడు పాదాంగుష్ఠ మంద
మలహరుతో మాఱుమలసి కాముండు
నిలయెల్ల నెఱుఁగ నేఁశేఁటఁ గాలండె
కాలుని శ్వేతునికై చంపెఁగాదె
శూలంబునను బొడ్చి సురలెల్ల నదర
దక్షుండు గర్వించి తలఁగోలుపడుట
సాక్షిగా దెల్లు మేషంబుశిరంబు
ఆది దా నఖిలలోకాధ్యక్షుఁ డన్నఁ
గాదె భగాదిత్యు కన్నులు వెఱికె
దూషించి పలుక రుద్రుం డనుగణము
పూషునిపం డ్లూడఁబొడిచెను గాదె
తానచూ యాజగత్ప్రాణుఁడ నన్నఁ
బూని త్రుంపఁడె పవమానునికాళ్లు
ద్రోహించేనాఁడావహ్నితుల్ గొని కుడిచి
బాహుజిహ్వాలు గోలుపడియెఁ బావకుఁడు
అనిమిషాధిపుచేయి యదితినాసికము
దునుమఁడే వీరభద్రుండు రౌద్రమున
నమృతాంశుమేను పాదాంగుష్ఠమునను

జమరఁడే యతఁడు యజ్ఞమున కేతేరఁ
జయ్యన మును సరస్వతి ముక్కుఁ గోసి
వయ్యఁడే నాఁటియధ్వరములోపలను
వెండియుఁ గ్రొవ్విన వేల్పుల నెల్ల
దండించుచును జగద్రక్షణార్థముగ
ముల్లోకములఁ గూడ ముంచినగంగ
మల్లికాదళభాతి మౌళిఁ దాల్పండె
త్రిపురంబు లతిదుర్నిరీక్ష్యమై తిరుగఁ
ద్రిపురారి వాఁడే స్మితిపుటఁ గాల్పండె
నే లెల్ల మోవఁగఁ జాలిన శేషు
వ్రేలిముద్రికగాఁగ దాలిచెఁ గాదె
సంగతి విషవహ్ని జంబూఫలంబు
మ్రింగినభావన మ్రింగఁడే హరుఁడు
అంధక సింధుర వ్యాఘ్రు లాలాజ
లంధరాదుల నిర్దళనము సేయండె
యింతింతవనులకు నీశ్వరుం డేల
కంతుసంహారు నొక్కగణము సాలండె
యొకశివగణముచే సకలలోకములు
ప్రకటంబుగాఁ జెడుఁ బ్రభవించు మించు
నన మహాదేవు మహత్త్వంబునకును
నెన యున్నదే యింక నిన్నియు నేల
నిత్యుండ నేన యనిత్యు లందఱును

సత్య మిట్లనుచు సజ్జనసాక్షికముగ
నిత్యస్వరూప వినిశ్చితదృష్టి
బ్రత్యయంబుగఁ జాల్పఁబడియున్న యట్టి
హరివిరించుల కపాలాస్థిమాలికలు
కరి గాదె యీశుండు కర్త యనుటకును
నదిగాక యుపమన్యుఁ డను ముని చేతఁ
బదపడి శివదీక్షఁ బడసి విష్ణుండు
పొంపున నింద్రనీలంపులింగంబు
నింపార సజ్జయం దిడి కొల్చెఁ గాదె
వెన్నుండు దా నిత్య వేయుఁదామరల
నున్నతిఁ బూన్ప నం దొకటి లేకున్నఁ
గన్నప్డువుచ్చి శ్రీకంఠుఁ బూజించి
కన్నను నాఁటి చక్రముఁ బడయండె
మత్స్యావతారుఁడై మఱి లంకలోన
మత్స్యకేశ్వరు నిల్పి మఱి కొల్చెఁగాదె
మున్నుదోరసముద్రమునఁ గూర్మనాథుఁ
బన్నుగాఁ గూర్ముండు భక్తిఁగొల్వండె
శ్రీరాముఁడును నట్ల సేతువు నిల్పి
శ్రీరామనాథు నర్చించుట విసమె
యాది క్షీరారామ మందు విష్ణుండు
గాదె రామేశ్వరుఁ గడు నర్థిఁగొలిచె
ద్వారావతిని నిల్పి తాఁ గొల్చెఁగాదె

శౌరి గోవిందేశు గోవిందుఁ డర్థి
బ్రహ్మ యలంపూర భక్తితో నిల్పి
బ్రహ్మేశ్వరునిఁగాదె పాయక కొల్చె
నింద్రుండు పుష్పగిరీంద్రంబుమీఁద
నింద్రేశు నిడికాదె యిప్పుడుఁ గొలుచు
వారణాసిని నిల్పి వ్యాసుఁడుగాదె
శౌరి వ్యాసేశ్వరుఁ గొల్చుసంతతము
ననయంబు వారణాసిని మునీంద్రులును
దనుజామరాదులు దమతమపేళ్ల
నొక్కొక్క లింగంబు నక్కడ నిలిపి
యక్కజంబుగఁ గొల్చు టది దెల్లగాదె
యభవుఁ డక్షయుఁడు మహాదాని దక్క
నభిమతార్థము లిచ్చు నధిపు లున్నారె
యవ్విష్ణుఁ డాబ్రహ్మ యజ్ఞినముఖ్యు
లెవ్వరే నెవరికే నిచ్చిరే పదము
హరివిరించిప్రముఖామరదైత్య
నరగరుడోరగవరమునీంద్రులకు
నీశ్వరుఁ డొసఁగినయీప్సితార్థముల
శాశ్వతలీల సజ్జనసాక్షికముగ
నిచ్చిన సకలలోకేశ్వరుమహిమఁ
గ్రచ్చఱఁ బడసినగణముల వినుము
చేతులు రెండు సంప్రీతిఁ బూజింప

ఖ్యాతిగాఁ జేతులు బాణున కిచ్చెఁ
గన్నులు రెండు సమున్నతిఁ బూన్పఁ
గన్నుల ప్రోవిడెఁ గాళిదాసునకు
నాసక్తి శివనాగుమయ్యకుఁ గన్నె
లేసోమవారంబు నెడపక యీఁడె
ఖానునిచేఁ బోని లోనికి ష్ఠడఁచి
పూని మయూరుని మే నిచ్చెఁగాదె
హరిచేతఁబోని దుర్భరమైన కుష్ఠు
హరియింపఁడే దండి యర్థిఁ గీర్తింప
భువిజను లెల్లను బొగడుచునుండఁ
దవనిధి దేడరదాసయ్య కీఁడె
ధూపవేళను ఘంటతోఁ గొనిపోఁడె
యేపార మెచ్చి యోహిళుఁ దనపురికిఁ
గరికాల చోడుకుఁ గనకవర్షంబు
నరులెల్ల నెఱుఁగంగఁ గురియించెఁగాదె
మిగిలినబాసకు మెచ్చి ప్రాయంబు
మగుడఁగ నీఁడె కుమ్మరగుండయకును
అక్కడఁ బ్రమథులు నక్కజంబంద
నెక్కిన గద్దియ యీఁడె చేరమకు
నిమ్మవ్వకై యేడ్డినమ్ములు సూఱ
యిమ్ములఁ బ్రమథలోకమ్మున విడఁడె
చెనసి జొమ్మయ్య చంపినమృగంబులను

వనయంబుఁ గైలాసమునకుఁ గొంపోడె
ఫూని యేడ్డినములపీనుఁగు బ్రదుకు
మానుగాఁ కదిరె రేమయ కిచ్చెఁగాదె
మలయరాజయ్య నిర్మల విమానమున
సలిగొన బొందితోనన కొనిపోఁడె
నిర్జితసంసారునిఁ గుమారపాల
ఘూర్జరుఁ దంత్రంబుఁ గొనిపోయెఁగాదె
లలి నూరివారిఁ బిళ్లయనయనారు
వెలయఁగఁ దనలోనఁ కలపికొనండె
వరగొండ పెరుమాణి నరులెల్ల నెఱుఁగఁ
కర మర్థిఁ గొనిపోఁడె కైలాసమునకు
మ్రోలఁ బాడఁగఁ దాళములతోడ నంబిఁ
గైలాసమునకు శంకరుఁడు గొంపోఁడె
యెలమి షోడశగణముల నిరతముగ
వెలయఁ బీరంబుల నిలుపఁడే మఱియు
తేరసగణముల వీరసద్భక్తి
గారవించుచు మెచ్చి కరుణించెఁగాదె
పొంచి మృగార్థియై పోరి నిద్రవోని
చెంచున కొసఁగఁడే శివరాత్రిఫలము
చన్నసద్భక్తుల చరిత లనంత
మెన్న నే లిపుడు నీ వెఱుఁగంగ శివుఁడు
వసుధఁ బెర్గొను మడివాలుమాచయ్య

యదృశుఁడగు కిన్నరయ్య యాదిగను
వచ్చుఁగా భక్తుల కభిమతఫలము
లిచ్చుచున్నవాఁ డిట్లు గావునను
గంతుసంహారు కెన గలదనుచదువు
లింతయు శివుఁ డను నేకాత్మమతము
విను "యథాశివమయోవిష్ణు" వన్మాట
లును త్రిమూర్తులునొక్కటనుదురుక్తులును
అష్టమూర్తులు రుద్రుఁ డనుశుయుక్తులును
దుష్టమానవుల భక్తుల కెన సేసి
పలుకుటయువినంగఁ బాతకంబొందుఁ
గలదేని పనిసెప్పు పిలిపించి తనుడు
భూములు సూచుచు మోములు వాంచి
గామడ్చినట్టు లంగంబులు మఱచి
యొక్కటి స్రుక్కి యయ్యార్యరుపు లుడిగి
నక్కళ్లు వడి గ్రక్కుమిక్కన లేక
యున్నవారలఁ జూచి యుత్తరం బడిగి
యన్నరేంద్రాధముఁ డట్లు లజ్జింపఁ
గ్రొవ్వడంగిరి దార్కికులు గూసి కుక్క
దువ్వఁ దెచ్చికొనిన యవ్విధంబయ్యె
నీతీతి బాచయ్య యితరమూర్త్యండె
సాక్షాత్త్రినేత్రుండు సత్య మి ట్లనుచు
గొలువు దిగ్గనలేచి బిలిబిలి దార్కి

కులుఁ దాను నేఁగె బిజ్జలుఁడు దత్త్రణామ
బాచిరాజయ్యయు బసవయ్యముఖ్య
మైచను నిఖిలభక్తావళి యంతఁ
జనుశీలసద్భక్తి సౌభాగ్యమహిమ
దనరార జనులెల్ల ఘనకీర్తి సేయ
రాచిన సద్భక్తిగోచరుం డగుచు
బాచిరాజయ్య యొప్పటియట్ల యుండె
బాచిరాజయ్య విభ్రాజితచరిత
మేచినవీరమాహేశ్వరసభలఁ
జదివిన విన్నను సంస్తుతించినను
సదమలసద్భక్తి సౌఖ్యసారంబు
సహజైకలింగనిష్ఠాపరత్వంబు
మహితశివాచార మహిమయుఁ బొందు
నాతతసకలపురాతనచరిత
గీతానుభవసుఖకేలివిలోల !
విహితశాస్త్రపురాణవేదవేదాంత
మహితరహస్యార్థమార్గానుపాల !
తనుమనోధన నివేదనభక్తివినయ
జనితానురాగాత్మసద్భక్తిజాల !
విదితప్రసాదసవినయసౌఖ్యప్ర
ముదితాంతరంగసమున్నతలీల !
హృన్మందిరాంతర్నిహితగురుధ్యాన !

మన్మిత్ర ! సంగనామాత్య ! సుశీల !
ఇది యసంఖ్యాతమాహేశ్వరదివ్య
పదపద్మసౌరభ భ్రమరాయమాణ
జంగమలింగప్రసాదోప భోగ
సంగతసుఖసుధాశరధి నిమగ్న
సుకృతాత్మ పాలుకురికిసోమనాథ
సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగ ఘనకరస్థలి విశ్వనాథ
వరకృపాంచిత కవిత్వస్ఫూర్తిఁ జేర్చి
చను బసవపురాణ మనుకథయందు
ననుపమంబుగను సప్తాశ్వాసము.

---

# బసవపురాణము

## సప్తమాశ్వాసము

---

శ్రీ శ్రితకంధర శ్రీపాదయుగ స
మాశ్రిత సంగనామాత్య ! సత్కృత్య !
మఱియును భక్తధీమణి లసత్కీర్తి
కఱకంఠభక్తాగ్రగణ్యుఁ డుత్తముఁడు
అసలార శివనాగుమయ్య సంప్రీతి
బసవనిచేఁ బ్రణిపత్తిఁ గైకొనుచు
ననయంబు భక్తిసుఖామృతాపార
వనధి నిమగ్నుఁడై వర్తింపుచుండ
బుడిబుళ్లువోవుచు భూసురులెల్లఁ
బుడమీశుకొలువుకుఁ బోయి యిట్లనిరి
వ్యక్తిగా విను పెద్దభక్తులు పెద్ద
భక్తులంచును మన బసవయ్య వారిఁ
గడుఁగడుఁగొనియాడుఁబడుఁ గాళ్లమీఁదఁ
గుడిచిడించినయదిగుడుచు వెండియును
వెఱవక సభ్యునివిధి మిమ్ముఁ గదియుఁ
దఱియంగఁజొచ్చు నంతర్నివాసములు

వారును బురవీథి వచ్చుచోఁ దమ్ముఁ
జీరికిఁ గైకోరు సెంబలివారు
కథలేల కళ్యాణకటక మంతయును
బ్రథితంబు మాలలపాలయ్యె నింక
నెక్కడివర్ణంబు లెక్కడినీతు
లెక్కడిధర్మంబు లిట్లేల చెల్లు
రాజులఁ బోరయుఁ దద్రాష్ట్రంబుపాప
మోజమాలినవారి నొగిఁ బర్వుకున్న
వినఁజెప్పకున్నఁ దజ్జనసాధుపాప
మనఘ పురోహితులను నవశ్యమును
బొందుఁగావునఁ జెప్ప భూమీశ! వలసె
నెందుఁ బాపం బింకఁ బొందదు మమ్ము
ధ్రువము "రాజానుమతో ధర్మ" యనుట
యవనీశ! యెఱుఁగవే యనుడుఁ గోపించి
వసుధేశ్వరుఁడు బసవనఁ బిల్వఁబనుప
నసమాను నందలం బర్థి నెక్కించి
శివనాగుమయ్యకుఁ జే యిచ్చికొనుచుఁ
దివిరి యేతేరఁ దద్ద్విజులు వీక్షించి
యదిగో మహారాజ! యంతటఁ బోక
కదియవచ్చెడు మాలఁగలప నిచ్చటికి
డెందంబునను భయం బంచమి సూడు
మందలం బెక్కించి యతనిఁ దెచ్చెడిని

ఇంక నేరి కితండు శంకించు ననినఁ
గింకతో నగరివాకిలి సొరకుండ
వెలుపలికొల్వున విభుఁడున్న యెడను
నులుకక బసవయ్య యున్నతంబుగను
శివనాగుమయ్యకు సింహాసనముగ
భువిఁ దనపైఁచీర వుచ్చి పెట్టుచును
"బిలిచినపని యేమి పృథివీశ" యనినఁ
గలుషంబు గ్రమ్మ బిజ్జలుఁ డిట్టు లనియె
"నాదిఁ దలంప వర్ణాష్టాదశముల
భేదంబు లవి నేఁడు వేరొక్కన్న యవియె
కులసంకరము సేయఁగూడునే మాలఁ
గలపితి కళ్యాణకటక మంతయును
నీతలఁ బుట్టెనే నిటలాక్షుభక్తి
నీతి హీనుఁడ కుర్వ్యనే వర్ష మింకఁ
బండునే యింక మీ రుండినభూమి
యొండేల మీకు మే మోడుదు" మనుడు
వసుధేశ్వరునకు నవార్యవీర్యుండు
బసవఁడు సద్భక్తిపండితుండనియె
"మనుజేశ! గొడగర మాచలదేవిఁ
జెనసి యుత్తమవంశ్యఁ జేసెద మనుచు
స్వర్ణధేనువులోన సతి నుంచి మునుఁగ
నిర్ణిమిత్తము పాలు నిండఁగఁ బోసి

యా పోయఁ బూర్వాశ్రయం బని తార
యాపడఁతికి మ్రొక్కి యంతటఁ బోక
యంగద నట్టిగ్రామాంత్యజు గాలి
యెంగిలిపా ల్ద్రావి హేవంబు లేక
యదియేల వేయును ననఁ గథ లందు
గదుగదుకేమి యక్కనక ధేనువును
వండఁ దర్గినమాడ్కి ఖండముల్గా గఁ
జెండుచుఁ దమలోనఁ జే ప్రేసికొనుచు
బనత సోమాదుల బలగంబుపాలు
వెనుకచట్టలు సతుర్వేదులపాలు
కోలెమ్ము దా నుపాద్ధేలయ్యపాలు
వాలమ్ము బ్రహ్మవిద్వాంసులపాలు
బరులు షడంగులపాలు మున్నుడుక
లురముసైతము ప్రభాకరభట్లపాలు
సమపొట్ట సన్నపుటెముకలుఁ బ్రక్క
టెముకలు వ్యాకరణమువారిపాలు
తోలఁకుజల్లియుఁ ద్రివేదులవారిపాలు
బలుడెక్క సిఱుడెక్క వాళ్ల మిక్కిళ్లు
పరదేశి విద్యార్థిపాలంచు నిట్లు
చెరలుచు గోహత్య సేసినయూర
మాలల యాత్రాటిమాలల పచ్చి
మాలలమాటలు వోలునే వినఁగ

వేదంబు లాదియో విధికల్పితంబు
లాదియో జాతుల కది యెట్టు లనినఁ
జనువేదచోదితజాతులు రెండు
వినుము ప్రవర్తకంబును నివర్తకము
భవకర్మసంస్కారి భువిఁ బ్రవర్తకుఁడు
శివకర్మసంస్కారి భువి నివర్తకుఁడు
సన్నుతవేదార్థచరితంబు లుండ
మొన్నఁ బుట్టినకులమ్ములమాటలేల
స్రష్ట్రుక్తమగునట్టిజాతులు గావె
యష్టాదశంబులు నవియేల చెప్ప
మిక్కిలి పదునెనిమిదివర్ణములకు
నిక్క మారయ భక్తనిచయంబుకులము
భాగ్యహీనుండు దాఁ బసిఁడిఁబట్టిన న
యోగ్యంపులోష్టమై యున్నట్లు శివుని
ప్రతిబింబమూర్తియౌ భక్తుఁడు భవికి
మతిఁజూడ మానవాకృతి నుండు ధరణిఁ
గావున శివభక్తగణములమహిమ
భావింపఁ దలఁప నీప్రాప్తియే చెపుము
కరివైరితోడఁ గుక్కలు వోల్ప సరియె
కరితోడ గ్రామసూకరములు సరియె
జడధితో నిలఁ జౌటిపడియలు సరియె
వడి గంగతో వెడ వ్రంతలు సరియె

తపనుతో ఖద్యోతతతు లెల్ల సరియె
యుపమింపఁ జంద్రుతో నుడుపంక్తి సరియె
మేరువుతోఁ జెఱుమెట్టలు సరియె
పారిజాతంబుతోఁ బ్రబ్బిళ్లు సరియె
శివనాగుమయ్యతోఁ జెనఁటులీద్విజులు
అవనీశ! సరియౌఁగా రది యెట్లనిన
భక్తుండు శ్రీపతిపండితుం డీశు
భక్తుని కిలఁ గోటిబ్రాహ్మణులైన
నెన యన్ననాలుక నేఁ గోసివైతు
ననుచు ననంతపాలుని సభాస్థలిని
నెక్కొనఁగాఁ జండ్రనిప్పులు గాదె
చక్కన పొత్తిపచ్చడమున ముడిచెఁ
దా నేమి చెప్ప భక్తానీక మిండ్ల
శ్వానంబులకు ద్విజు ల్సరిరాము వినవె

కల్లిదేవయ్యగారి కథ

యల్లమావినమాళ యనుపురంబునను
కల్లిదేవయ్య నాఁగా మహాత్ముండు
శ్రీరుద్రు నపరావతారంబు గాని
ధారుణి మనుజావతారుండు గాఁడు
ఒకరాత్రి పరదేశి యున్న నయ్యూర
శోకవాముసంపుచు నుండు సంతతము
నప్పాటఁ గల్లిదేవయ్యను గఱచి

యప్పాము దాఁ జచ్చె నఖిలంబు నెఱుఁగఁ
గరుణాకరుఁడు గాన కల్లిదేవయ్య
యురగంబుఁ బడసి యయ్యూరన యుండ
సహజసన్నుతశీల సంబంధయుక్తి
మహిమ దుల్కాడంగ మఱియొక్కనాఁడు
తమదాసి యర్ఘ్యపణ్యములకుఁ బోవు
సమయంబునం దొక్కసద్ద్విజుఁ డేయి
తన్నుసోఁకుడు నద్ద తనతలఁగడువ
నన్నెలపై వ్రేసి యచ్చోట్ల పాఁతి
యత్తఱి భసితాంగి యగుచు వేఱొక్క
క్రొత్తబిందియ మోఁచికొని పోవఁగాంచి
కొత్తిఁ జూడుఁడు గండక్రొవ్వుఁదనంబు
నుత్తమద్విజుఁడు దా నొఱసెఁ ద న్ననుచు
భాండ మచ్చోటనే పాఱంగ వైచి
యొండు భాండముఁ గొని యొరవోయొడిని
ఎచట బ్రాహ్మణులకు నితరులముట్టు
నుచితంబు గాదుగా కొరులకు ద్విజుల
ముట్టఁగ రా దనునిట్టిధర్మములు
పుట్టునే యని కూడి భూసురు లపుడు
కలియుగరుద్రునిఁ గల్లిదేవయ్యఁ
బిలిపించి కౌటిల్యకలితవాక్యములఁ
'దలపోయ నూరిలోపల నొక్కమాట

పలు కెన్నఁడును వినఁబడదు మీవలన
కల్లిదేవయగారు వ్రల్లదు లనఁగ
నెల్లెడ వినము మీ రల్లసర్పమును
బడసిననాఁ డొండెఁ బొడగంటి మిపుడు
పొడగంటి మెన్నఁడుఁ బొడగానరాదు
మంచివారని మిమ్ము మన్నింతు మేము
క్రించుబోయత మమ్ముఁగొంచెంబు సేసెఁ
జంటివిప్రుఁడు గాఁడు స్వాత్మోద్భవసిద్ధు
వంటియుత్కృష్టవిద్వాంసుఁ డట్లయ్యు
వేదులవారి దామోదర యజ్వ
గాదిలియగు త్రివిక్రమసోమయాజి
సమిథల కీగుళ్లసంది వోవంగఁ
బ్రమసెనో దాను నప్పాట వచ్చుచును
దనుసోఁకె వీరిచే యనుచు మీఁదాసి
తనతలకడువ యత్తఱి వ్రేసెఁ బగుల
వినుము శూద్రులుముట్టినను బ్రాహ్మణులకు
మునుసచేలస్నానములు సేయవలయు
నని చెప్పఁ గాక యీయధమవంశజుల
కును ద్విజులను ముట్టఁ జన దని కలదె
యేనీతి యేధర్మ మేపురాణోక్తి
యేనాఁటిభక్తి సహింపఁగఁ దగునె
మగువ నచ్చోటన మాయించు టపుడు

దగవుగా దని కాక దండింపలేఁడె
భూమిఁ బుట్టినిమార్గములు సేయఁదగునె
'యే మెదురెదుర మి మ్మేమందుమింక'
ననవుడుఁ గల్లి దేవయ్య యింకేల
ననుమాన మనుచు ని ట్లనియె వారలకు
'నింటిదాసులకు నె ట్లంటనో భక్తు
లింటికుక్కలకు మి మ్మంటరా దనిన
బ్రాహ్మణులేమిారు' "బ్రహ్మాచరంతి
బ్రాహ్మణా"యన మిాకు బ్రాహ్మ్య మెక్కడిది
పాన లేటికిఁ బరబ్రహ్మం బనంగ
దీనికి నర్థంబుఁ దెలుపుఁడా చాలుఁ
బరమేశ్వరుం డన్నఁ బరమాత్ము డన్నఁ
బరికింపఁగాఁ బరబ్రహ్మం బటన్న
హరుఁడె కా కొరులకుఁ బరశబ్ద మెద్ది
పరశబ్ద ముత్కృష్టపదము గావునను
నొరులకుఁ గల్గునే యుత్కృష్టపదము
హరియును బ్రహ్మయుఁ బరమాత్ము లెట్టు
లరయంగ వేదశాస్త్రార్థంబులందు
హరిముఖ్యు లెల్ల జీవాత్ముల కాన
ధరణిఁ బరబ్రహ్మ హరుఁడు బ్రహ్మంబు
చరియించువారు మాసద్భక్తవరులు
హరియును బ్రహ్మయు నమరవల్లభుఁడు

పరము నర్చన సేయుభక్తులు గారె
ధృతిని "బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణో౽ధి
పతి" యనియెడుఁగాదె శ్రుతిసమూహంబు
కావున బ్రహ్మమార్గం బెద్ది మిమ్ము
భావింప ముట్ట సంభాషింపఁ దగునె
యేతెఱంగునఁ బొసె నెఱుఁగరే మీరు
జాతిశూద్రత్వంబు శ్రేతవిముక్తి
రుద్రేతరక్రియల్ రూపింపఁగలవొ
రుద్రుండు దక్కంగ శ్రుతికర్త గలఁడొ
మృడునిభక్తులతోడ మీ రెల్ల సరియె
నుడువులు గలవేని నోరెత్తుఁ డనిన
'నక్కటా యిదియేల యందఱమమ్ముఁ
గుక్కలకంటెను దక్కువగాఁగఁ
బలికెదు మీపిన్నపాపచెద్దంబు
కోలఁదియే మొదలికి గుద్దలిగొంటి
మొదలింప మొదలింప ముల్లుచ్చి పెద్ద
పద రడ్చిన ట్లయ్యె నది సెప్పనేల
చదివింతుగాక మీశ్వానంబు నొక్క
పదఖండవర్గంబు వనస యెం దైన'
నని విప్రు లందఱు నాగ్రహింపంగ
విని కల్లిదేవయ్య విప్రులఁ జూచి
యనియె 'రోఁకటి పాట లట్ల వేదములు

పసుగొన మాశివభక్తులయిండ్ల
సారమేయములకు ధారుణి' ననుచు
నారంగఁ గల్లిదేవయ్య నవ్వుచును
దాఁబిల్చె వేదపితామహాఖ్యుండు
నాఁ బొల్చుశునకంబు నలిఁ జిట్టమిడిచి
'యుచ్చుచ్చిరే శంకరోచ్ఛిష్టభోగి
యుచ్చుచ్చిరే ప్రణవోదాత్తయోగి
యుచ్చుచ్చిరేయాగమోత్కృష్టభరిత
యుచ్చుచ్చిరే మహామహోదారచరిత
యుచ్చుచ్చిరే వీరసచ్చరనిరత
యుచ్చిరేయపునర్భవోన్నతస్థిరత'
యని యిటులెలుఁగించు నమ్మాత్రలోనఁ
జను దెంచి శునకంబు దనకు మ్రొక్కుడును
వరదయాంచితసుధావార్ధి నోలార్చి
యరుదొందఁగల్లిదేవయ్య యిట్లనియె
'నేవేదముం డైన నెత్తి యందొక్క
రా వనుష్ఠింపుమా యీవిప్రులెదుర'
ననవుడు శునకచర్మావృతరుద్రుఁ
డనుపత్తిఁ బద్మాసనాసీనుఁ డగుచుఁ
గటికంఠు నాత్మాబ్జకర్ణికఁ జేర్చి
గుటి నాదిశక్తి నాకుంచనఁ గూర్చి
యాసూర్య మెట్టి సుధాసూతిఁ గట్టి

నాసాగ్రమునదృష్టి నలి నాఁటుకొలిపి
యకలంక మృదుమధురకళానియుక్తి
సుకరనాదోక్తి విశుద్ధస్వరమునఁ
ద్ర్యక్షరబిందు నాద ప్రయుక్తాంచి
తాక్షర మోంకారమ ట్లుచ్చరించి
నంతలోననె తద్ధరామరానీక
మంతంతధరణి సాష్టాంగంబు లిడఁగ
దయనుదాత్తానుదాత్తస్వరిత ప్ర
చయములు సాంగమై సంధిల్లి తఱచఁ
బదమును గ్రమమును బాటయు జటయు
విదితంబుగా నాల్గువేదంబు లందు
నొక్కొక్కరావెత్తి యొగి ననుష్ఠింపఁ
గ్రక్కునఁ దా లేచి కల్లిదేవయ్య
"హాః మాను వేదపితామహాః" యనుచుఁ
దామాన్చెశునకమధ్యయనంబు సేఁత
వింటిరే చెవులార విప్రు లంపఱును
గంటిరే భక్తుల ఘనమహత్త్వంబు
ననుచు నాకల్లిదేవయ్యవేదంబు
జను లెఱుంగఁగఁ గుక్కఁ జదివించె మఱియు
నఘవైరి సిద్ధరామయ్యగారింట
నుఘెకాళికాఁడన నొకగుక్క గలదు
దీనికి గురు వది దానిమహత్త్వ

మే నైన నొకనాఁటి కెఱుఁగ వెండియును
గారవింపఁగ మహాకాళయ్యగారి
సారమేయంబును జంబూరిలోన
వాదంబునం దిట్లు వేదంబు సదివెఁ
గాదె యీమర్త్యలోకం బెల్ల నెఱుఁగఁ
గాన విప్రులు భక్తగణములయిండ్ల
శ్వానంబులకు నెట్లు సరి యనవచ్చు
శివచిత్తుఁ డన నొక్క శివభక్తిపరుఁడు
తవిలి విప్రులతోడి తర్కంబునందు
సకలవేద పురాణశాస్త్రపారీణు
లాకకోటివిప్రులు నొక్కభక్తునకు
సరియుఁగా రని వేదశాస్త్రంబులందు
విరచించి చెప్పుడు ద్విజులంతఁబోక
చర్చలు సదువులు సమ్మతికలిమిఁ
గూర్చి యాడుట శబ్దకోవిదత్వంబు
కాన యిన్నియునేల కలదె ప్రత్యయము
దీనికింతయుఁ జెప్పఁగా నేమి యనిన
విద్దెలాడుచునున్న ద్విజులతో నొక్క
పెద్దభక్తునిచెప్పువెట్టి తూఁచుడును
నూరిభూసురు లెల్ల నొక్కటఁ దూన్కి
రారైరి యాపాదరక్షకుఁ దొల్లి.

కాన విప్రులు భక్తగణములచెప్పు
తో నైన నెన గారు పాన లేమిటికి

## బిబ్బబాచయ్యగారి కథ

గొబ్బూరిలోపల నిబ్బరంబుగను
బిబ్బబాచయగారి పృథుమహత్త్వంబు
వర్ణింప శివునకు వశముగా దనిన
వర్ణింప నెంతటివాఁడ నట్లయ్యు
నీమాజనము వారిచే మున్నువడ్డ
బాములుసెప్పెద భూమీశ వినుము
జంగమలింగప్రసాదంబు గనకు
సంగంబుఁ బ్రాణంబునై చరింపుచును
నగ్రహారంబులో నం దొక్కపాల
నగ్రగణ్యుఁడు నాఁగ నాశ్రమధర్మ
మతలోకపథవివర్జితుఁడౌచు వేద
మతభక్తిపథము సుస్థితిగా భజించి
యామట రెండు మూఁ డామటఁ బదిటఁ
గామించి ఘనదేవకార్యంబులైనఁ
గర మర్థి బాహాంకంధరకర్ణవితతి
నురమున శిరమున నుపవీతముగను
జెలువొంద భక్తులచెప్పులబిళ్ల
లున్నతి ధరియించి యొగి భస్మ మలఁది
బండియుఁ బోణకయుఁ బచ్చెనవెట్టి

బండి నెల్లెడ నందిపడగలు గట్టి
యెలమి దలిర్ప మువ్వలు నురుగజ్జి
యలు ఘంటలును నందియలు సామరములు
భాసురరుద్రాక్షబహువలయములు
బాసికంబులు స్వర్ణపట్టము లూన్చి
గోరాజమూర్తిఁ గైకొన్నకుఱ్ఱలను
గారవంబున బండి గట్టి ముందటను
జాఁగు బళా యనుశబ్దముల్ మ్రోయఁ
గాఁ గేళికలతోడఁ గర మర్థి నేఁగి
శరణపదాంభోజ సంస్పర్శఫాల
సురుచిరభక్తిమై సొంపు నింపార
స్ఫుటచరణాబ్జ సంఘట రేణుపటల
ఘటితోత్తమాంగుఁడై ఘనహర్ష మలర
లీలఁ దత్పాదసలిల సుధావార్థి
కేళీవిలోలైక మేళనం బొలయ
"ఘనతర దివ్యలింగ ప్రసాద సద
య నమో నమస్తే మహాలింగ" యనుచు
శ్రీగురుప్రతిబింబ సిద్ధలింగోప
భోగోపభోగానురాగుఁడై మఱియు
నొలికిన డించిన యున్న ప్రసాద
మలరుచు ముంచి గంపల బండిఁ బోసి
య ప్రతిలీల గణప్రసాదంబు

సుప్రసన్నాత్మ నుత్సుకత దుల్కాడ
నెప్పటివినుకులు నెప్పటిచెన్ను
నొప్పారఁ దెచ్చి గొబ్బారిలోపలను
సుప్రసిద్ధముగఁ దా రాప్రసాదంబు
ముప్పొద్దుఁ గుడువంగ విప్రవర్గంబు
బుడిబుళ్లవోవుచున్నెడఁ నొక్కభక్తుఁ
డడరఁ బాడువుసేయ నయ్యూరిలోనఁ
బరితోషమతి బిబ్బబాచయ్యగారు
కరమర్థిఁ దొల్లిటిక్రమమున నేఁగి
జంగమశ్రీపాద జలజసౌరభ్య
సంగతరుచిరోత్తమాంగుఁడై పొంగి
యలరుచుఁ జెందుచు వలసినవన్ను
వలఁ బ్రసాదామృత వనధి నోలాడి
నలిదీటుకొనఁ దద్గణప్రసాదంబు
నిలఁ జిల్కకుండ గంపల ముంచి పోసి
ముందటిక్రియ బండిముందట వెనుక
నందంబుగా నిట యటు నటింపంగ
గొడుగులు గొడుగులు గూడి క్రిక్కిఱియఁ
బడగలుఁ బడగలు ముడివడి వాల
మంగళారవములు మధురమై చెలఁగ
సంగీతరీతులు సరసమై యులియఁ
బాయక చాఁగు బళాయనురవము

ఘే యని యటుఁగూడివ్రాయుచునుండ
బొబ్బలు వొడువంగ నుబ్బి యార్వంగ
బిబ్బబాచయగారు గొబ్బురుపొరఁగ
వినఁబడె మున్నెల్ల వీరిదుర్జనత
కనుఁగొనఁబడియె నేఁ డనుచు భూసురులు
నేతెంచి "హో నిలుఁ డెందువచ్చెదరు
మీ తెఱం గిదియేమి మిగిలియున్నదియు
పెండ్లి కేఁగుటొ యిట్లు బం డ్లిదియేమి
దండ్లువచ్చెనొ మీఁదఁ దల్లడం బేల
యంకాన కేఁగెద రార్పు బొబ్బలను
శంకరభక్తుండు సచ్చెనో యిట్లు
పొలంగఁ గొంగనిఁ బొడిచి వంగనిని
వ్రాలంగఁ దిగిచితి రేల బింకంబు
సడగరంబులు వట్టిచాఁగుబళాలు
గొడుగులుఁ బడగలు దడఁబడుటలును
జేరమవలె నొండె శివపురంబునకు
బోరన నిపుడేమి పోవుచున్నారొ
యక్కుమాలిన భంగి నగ్రహారంబు
చక్కన మీకెట్లు చనఁ జేర వచ్చు
నిలఁ గులభ్రష్టులయిండ్ల రొంగిళ్లొ
గులహీనులెంగిళ్లుఁ గూడంగ దేవి
బండినిండఁగఁబోసి పైఁ జీరగప్పి

తండ్రుఁ జేకొని పెద్దగొండ సేసెదరు
ప్రకటింప నింతేల పట్టినఁ జూప
నొకవిశేషంబైన నున్నదే యిందు
విద్దెలాడక యూరు వెడలుఁడీ యింత
పెద్దతికముతోన పెక్కులే లనిన
చా! కాలు లేమని చదువుచున్నారు!
మీకొలఁదియె మమ్ము మీఱి పల్కంగఁ
బన్నగధరుభక్తిపరులకు మీకు
నెన్నిచాళులపెట్టు లెన్నిచూడంగఁ
దలఁప మీనోరికిఁ దగుకడిఁ గొనరు
వెలికులుకవె గ్రుడ్లు కొలఁదిమీఱినను
మీ రేడ మే మేడ మీకును మాకుఁ
గారణం బేమి యీయూరేల మాకు
జంగమలింగప్రసాదంబు బ్రమసి
యెంగి లెంగిలి యంచుఁ ద్రుంగిచూచెదరు
శరణప్రసాదదూషకు లతిఘోర
నరకాగ్నిఁ బడుదురు నా మున్న వినరె
యటమీఁదిచే టింక నడియేల చెప్ప
నిట వచ్చు మరణంబు నెఱుఁగరు మీరు
ప్రణుత ప్రసాదప్రభావ ప్రశక్తి
గణుతించి చూడ దగ్గఱఁగ మీవశమె
భక్తులపాలికిఁ బరమామృతంబు

భ క్తిహీనుల కిది ప్రళయానలంబు
వలదు శార్చిచ్చులోపలి మిడ్తలట్లు
పొలిసిపోవనేకాక నిలువఁగఁగలరె
మీఱిపల్కుటయెల్ల మీకుండేఁగాక
పాఱులఁ జంపుట వరమశౌర్యంబె
యనవుడు బిబ్బబాచయ్యగారలను
గనుఁగొని యవ్విప్రజను లాగ్రహించి
యెంగిలికూడు భుజంగమో పులియో
శృంగియో యబ్బాచిగొంగఁ జేసెదరు
బట్టులపిన్న! యప్పనగారిమంచ!
చట్టనపెద్ది! విశస్తులకూచి!
దుష్టదామోదర! ధూర్తభాస్కరుఁడ!
శిష్టులబలభద్ర! చిమ్మికేతప్ప!
తొలఁగు మాఱుటదోవతుల దర్భసంబె
లలఁ బెట్టి యప్టికోలలుగొనిరండు
పట్టుఁడా యెడ్లను బలుపులు దెగఁగఁ
గొట్టుఁడా చని కూడముట్టుఁ డింకేల
చింపుఁడు మొగవాడ ద్రెంపుఁడు వడగ
లుంపుఁడు బండివోకుండఁ జూతండు
అని సందడించునయ్యధమపాదులను
గని బిబ్బబాచయ్యగారు గోపించి
యోడులా రేటికి నుత్తలపడఁగఁ

జూడ శక్యంబేనిఁ జూతురుగాక
తొలతొలఁ డనుచు విప్రుల నదల్చుచును
నలిఁ బ్రసాదముమీఁ దివలువఁ బోచూకి
యంజలి ముంచెత్తునమ్మాత్రలోన
కెంజాయయో యొజ్జసంజయో మెఱపొ
హా! కాదు నిప్పులో యది మంట యనుచు
నాకులతను విప్రు లతిభీతిఁబొంద
నదె చూడుఁడని చల్లునమ్మాత్రలోనఁ
బొదలి భుగుల్భుగుల్భుగులన నెగసి
నిటలతటాంబకోత్కట చటులాగ్ని
పటుదృష్టిఁ బురము లొక్కటఁ గాలునట్లు
లట యిట విప్రాలయంబులన్నియును
నటుగూడ దరికొని యాహుతుల్గొనఁగ
శ్రీధరభట్టిల్లు సిచ్చునఁగలసె
మాధవప్పనయిల్లు మంటపా లయ్యె
గ్రుడ్డిగోవిందుని గుడిసెయుఁ గమరె
దొడ్డభాస్కరునిల్లు దొడిఁదొడిఁ గాలె
కొమ్మనఘుటశాశి కొంపయుఁ గమలె
బమ్మనభట్టిల్లు భగ్గన మండె
వామనప్పనయిల్లు వాసము ల్వ్రక్కె
సోమయాజులయిల్లు సురసురఁ గమరె
త్రేదులవారిల్లు దెరువునఁ గలసె

నాదిత్యభూచియి ల్లప్పుడ పొలిసె
మచ్చతాడనయిల్లు మంటిపాలయ్యె
బచ్చలికేశవుపాకయు మడిసె
వాసుదేవునియిల్లు వహ్ని సేకొనియె
మాసకొమ్మనయిల్లు మసిమసియయ్యె
వసిగొని సన్న్యాసివామనపురము
వసదిమంటపమును బసుమానఁగలసెఁ
గుశదర్భపిన్నయ్యకొంప పైఁ జిచ్చు
నశనంబువారియి ల్లది యందికొనియె
నీ డాడ యననేల యిన్నియు మడిసెఁ
కూడఁగ శివదూషకుల యిండు లనుచుఁ
బ్రళయాగ్నిలోనార్చు ప్రమథులయట్లు
లలరి భక్తానీక మార్వఁగ ద్విజులు
మసలి యిండులతోన మడిసెడువారు
వెసనేఁగుదెంచుచు వెండీల్గువారు
తలలంటుకొని కాలఁ దల్లడపడుచు
నిలగుళ్ల లోపలి కేఁగెడువారు
గడ్డము ల్మీసలు గమరంగ నచటి
గడ్డిగబావులు గని యుర్కువారు
చీరలు దరికొనఁ జిడిముడి పడుచు
మారారిభక్తుల మఱువుగొన్వారు
మించఁగాలకమున్న మృడుభక్తు లిండ్లఁ

బంచలఁ బెరడులఁ బొంచుండువారు
తనువుల శిఖి దరికొని కాలఁగాఁ
జని చని భక్తుల శరణనువారు
పఱుపకమును బిబ్బబాచయ్యగారి
పిఱుఁదన నిల్పియుబ్బటి మ్రొక్కువారు
చచ్చునవెడవెడ వెచ్చుచు సగము
సచ్చియు నిబ్బంగి సగము సావకయుఁ
బప్పుకేశవభట్టు దొప్పనపెద్ది
తప్పకంబైతన బొప్పనత్రేది
సింగరాజాదెన చిప్పనకూచి
మంగన ఘుడిసాసి నంగన్న పిన్న
దబ్బరాదిత్యుండు సబ్బనయ్యయును
గబ్బుమైలారుండు సుబ్బనమంచి
యెడ్డగాలైతన దొడ్డనకూచి
బొడ్డురాఘవభట్టు గడ్డము పెద్ది
వీరాదిగాఁగ గొబ్బూరి గ్రామణులు
మారారిభక్తుల మాఱు దిక్కనుచుఁ
బశువుల మనుచు సబ్రహ్మణ్యమనుచు
దిశలకు నోళులు దెఱచి యేడ్చుచును
వెక్కుచు వంతంతఁ జిక్కుచుఁ గూడ
స్రుక్కుచు ధరఁ జాఁగి మ్రొక్కుచుఁ జేరి
దీనుల సపగతజ్ఞానుల దురభి

మానులఁ బుణ్యవిహీనుల ఖలుల
భ్రష్టుల నవగుణాశ్లిష్టుల నధిక
దుష్టుల నిలఁ గడుఁ గష్టుల జడులఁ
గ్రోధుల నధికాపరాధుల నతివి
రోధుల జ్వాలననిరోధుల మమ్ముఁ
గావరే దీవనఁ బ్రోవరే తప్పు
ద్రావరే చలిగాలఁ ద్రోవరే యింక
నూరు మఖ జనమేజయుఁడు సేసె నగ్ర
హారమింతటనుండి మీ రుద్ధరించి
పౌరిని బునర్ధారఁ బోయరే మాకుఁ
గరుణించి మీధర్మపురుల మేమనుచు
నావిప్రజనులు సాష్టాంగులై మ్రొక్కి
లేవకయున్న నాలించి లెండనుచు
వాప్రసాదమునకు నంజలియొగ్గి
సుప్రసన్నాత్ముఁడై చూడఁగఁదడవ
గహాన ప్రసాదాగ్ని గ్రక్కున నాఱి
సహాజ సంసిద్ధ ప్రసాదభావమునఁ
బ్రస్తుతింపఁగ బిబ్బబాచయ్యగారి
హస్తంబులందుఁ బ్రశస్తమై నిలిచె
నిప్పాటబాఁపల యిండు లన్నియును
నెప్పటిక్రియ నొప్పె నెఱుఁగరే జనులు
ఎన్నఁగ ధరణీశ ! యేండ్లుఁ బాండ్లేల

మొన్నటివార్త యింకిన్నియు నేల
యసమాక్షుఁ గొలువని యగ్రజుండైన
వసుధ మాలలమాల వాడ కాకెట్లు
మాలఁడు శివుఁగొల్చి మాలఁడు వెంపు
మాలఁడు రెంటికి మాలఁడీయుక్తి
మాలఁడే యాతని మాలఁ దక్క త్రాటి
మాలలు భువిఁ బచ్చిమాలలు గాక
సెంబలియనియెనే చెన్నయ్యయింట
నంబకళము గ్రోలునప్పుడు శివుఁడు
మాదరచెన్నయ్య మహిమయెఱింగి
మాదేవభక్తులు మాలలు నాఁగఁ
గూడునే బాఁపనకూళలాపులకుఁ
గాఁడు గాఁడని నీచగతి విరోధింప.

## మాదరదూడయ్యగారి కథ

నవనీశ! వినవెట్లు శివునిభక్తుండు
ధ్రువకీర్తి మాదరదూడయ్య నాఁగ
మఱియొప్పు నాయయ్య మహిమ యెట్లనిన
నెఱయఁగ మెయిచెడ్డ కఱకుఁబాఱుండు
పసివెన్కనడు రేయి వెసఁబోయిపోయి
మసలక దూడయ్య మందిరం బఱుత
సారమజ్జన జలపూరితపంక
మూరులు దరియంగ నొగిఁ జొచ్చి వెడలి

కూడఁగాళ్లు గడిగికొని ప్రభాతమునఁ
జూడఁ బూర్వచ్ఛాయ శోభిల్లియున్న
నావిప్రుఁ డత్యద్భుతాక్రాంతుఁ డగుచు
భావించి యప్పుడ పరు విడి యేఁగి
మాదరదూడయ్య మజ్జనోదకని
షాదితం బగుటొఁపిఁ బడి పొర్లిపొర్లి
యాడుచుఁ దనువు దివ్యాంగమై యున్న
నాడనా మాదరదూడయ్యగారి
పాదాబ్జములమీఁదఁబడి కృపవడసి
భూదేవకులుఁ డంతఁబోయి నింటికిని
జూడుఁడా మాదరదూడయ్య యిట్టు
లాడినచోటినీ ళ్లప్పుడు గారు
పడిలేచి టొంపిఁదాఁగడిగిన యంత
నడఁగెఁ గుష్ఠవ్యాధి హరహరా తొల్లి
యాదిత్యుఁడును మనోహరుఁడనుగణము
పాదోదకములను బడసెఁ దా మేను
నని చెప్ప వినఁబడు నాద్యోక్తులందుఁ
గనుఁగొంటిమిపుడు నిక్కంబుగా ననుచు
వినుతింపుచును నరుల్ విభ్రాంతి బొంద
విని వారివారికిఁ జను దెంచి యచటఁ
బొరల నేడ్నూర్వురు భూసురోత్తముల
కరయఁ గుష్ఠవ్యాధులణఁగుట వినవె.

## బానసభీమయ్యగారి కథ

పృథివిలో బానసభీమయ్య నాఁగఁ
బ్రథితుండు మెయిసెడ్డ పాఱులకెల్ల
మేనులు కృప సేయుచేనాఁటు వినవె
భూనాథ! జనులెల్లఁ బొగడ గమిచియుఁ
జక్కన ముచ్చట్లు జరపఁగనేల
యిక్కర్మచండాలు రెంతటివారు.

## శ్వపచయ్యగారి కథ

సామవేదులు నాఁగఁ సద్బ్రాహ్మణుండు
శ్రీమతి నాకాశగామియై యరుగ
శ్వపచయ్య నాఁగ నీశ్వరభక్తుఁడొకఁడు
విపినాంతరమున సద్విధి నోగిరంబు
లొనరించుచును మీఁదఁ జనుసామవేదిఁ
గని పొందునో వీనికర్మంపుదృష్టు
లనుచు నోగిరముఁజెప్పున మూయఁదడవఁ
గని సామవేదులు కలకల నగుచు
శ్వపచుండుఁ దాను మాంసంబు వండెడిని
కపటుండు మాపొడగని మూసెఁజెప్ప
నిట్టిదుర్జనుఁ డగునే యని తలఁపఁ
జట్టనఁ దన్మంత్రశక్తి యణంగి
యంతరిక్షంబున నాడుదేవతలు
నంత నబ్భువిఁ బడ్డ నతఁ డప్డు వచ్చి

శ్వపచయ్యగారి శ్రీచరణాబ్జములకు
నపరిమిత ప్రీతి నందంద మ్రొక్కి
శివదీక్ష వారిచే శిష్యుఁడై పడసి
సవిశేషమగు తత్ప్రసాదంబు మహిమఁ
జేసి కొంపోవఁడే శివలోకమునకు
నాసక్తి ముప్పదియాఱ్ఱూళ్లవారిఁ
గాన పురాతనగణములనాఁడు
లేనిమార్గము పుట్టెనే నేఁడు భక్తి
శ్వపచుఁడైనను లింగసహితుఁడై యున్న
నుపమింప సద్బ్రాహ్మణోత్తమోత్తముఁడు
త్రిపురారిఁ గొల్వని ద్విజముఖ్యుఁడైన
శ్వపచాధములకంటెఁ జాలంగఁగీడు

## ఉద్భటుని కథ

అదిగాక బల్లకియను పురంబునను
నుదుబటుఁ డన నొప్పు నొక్కభక్తుండు
వరభోజరా జను నరనాయకునకు
గురువయి శివదీక్షఁ గరుణించి మఱియు
వేదశాస్త్రార్థ సంపాదితయుక్తి
నాదేశమున నన్యవాదంబు లణఁచి
క్షోణీశునకుఁ బాడు జొమ్మవ్వనాఁగఁ
బ్రాణేశసద్భక్తి పరురాలుగాన
నలిపయుఁ దాను సముంచితభక్తి

గణినిరంతర సుఖస్థితిఁ దేలుచుండ
మనుజు లత్యద్భుత మానసులగుచుఁ
బనువుచు నిట్టి సద్బ్రాహ్మణోత్తముఁడు
కులహీనులును దాను గూడియున్నాఁడు
తలఁపంగఁ బెద్దలు దార యిబ్భువిని
ననుచు నచ్చోడరాజాన కెఱఁగింప
వినియుఁ దొల్లిటియట్ల కొనియాడుచుండఁ
బరమేశ్వరుండు నుద్భట్టయ్యగారి
పరభక్తి మహిమ యివ్వసుమతిలోన
నరుదుగా మెఱయింతునని యమ్మహాత్ముఁ
గరమర్థితోఁ దన్న కాఁగూర్చుకొనుడు
దహనక్రియలు సేయఁ దత్సమీపమున
మహి నెదుర్చాచెడి మర్త్యభూతములు
ఎగిదిరొక్కటి సాల కేఁబ్బారు నచటి
పొఁగదాఁకి కైలాసమున కప్డు పోవ
నందొక్కభూత మాహారార్థమేఁగి
వందుచు మఱుపూఁట వచ్చి భూతములఁ
గానక యేడ్చుచుఁ గటకటాయనుచు
మానక వాచర్యమహి యెల్ల నద్రువఁ
గూయిడ నిది యేమొకో యంచు జనని
కాయంబు భోజుండు గ్రక్కున వచ్చి
కొవ్వ రేడ్చినవార లేమికారణము

నెవ్విధంబునఁగాని యేడ్పుడుగ వన
"వినవయ్య! పంద్రెండువే లేండ్లనుండి
మనుజేశ! యుద్భటు మరణంబుఁ గోరి
యేడునూఱేమత్తి నెలమి భూతములు
నేడకు నేఁగక యెదురు సూచుచును
నుండె నే నేఁగితి నుదరాగ్నిఁ జేసి
యుండంగఁ జాల కొక్కండ చిక్కితిని
పెనుపొందఁగాఁ గూటివేద దొడ్డప్పె
నని యాడుమాట నాయంద సంధిల్లె
నెలమి నొక్కటిసాల కేడ్నూఱుభూత
ములు నుద్భటునిఁగాల్చి పోగ దాఁకఁదడవఁ
గైలాసమున కేఁగ గతిచెడి తాన
భూలోకమునఁజిక్కి పోగిలెదఁదండ్రి!
గ్రచ్చుఱ నీనంగఁ గాంచి నక్కలకు
నిచ్చినయ ట్లయ్యె నీడితకీర్తి!
మఱియేలవేయును నెఱయఁబండించి
యఱప డిగ్గినయట్టు లయ్యెనుర్వీశ!
మును వెల్లవేగియుఁ దినికి చాబిడ్డఁ
గనినచందంబయ్యె జనపాలతిలక!
తివిరినిండఁగముంచి యవియఁగఁ ద్రోచు
నవివేకి నైతిఁ జేరాసగాఁ జేసి
యింతగాలంబుంట యిది వృథయయ్యెఁ

జింతింపకెట్లు ధరింతు భూనాథ!
యింక నైనను గట్టి లిందువైపించు
కొంకు గాదేఁగెదఁ బోగదాఁకఁనడవ
వినుము నేఁ గైలాసమునకు నేఁగుటకు
జనులకు నెల్ల దృష్టముగ నీయుష్ణ
పటము వేళులతోన వడిఁ జెఱికికొని
యిటయందఱును జూడనటయేఁగుదాన
ననవుడుఁ బౌరు లత్యద్భుతంబంద
జననాథుఁ డౌఁగాక యనుచు బ్రార్థించి
గ్రక్కున మలయజకాష్ఠము ల్వేర్చి
యక్కజంబంద దివ్యాంబరావలులు
పేని ముప్పిరిగొల్పి పేరిననేతి
లో నించి యాయగ్నిలో దరికొల్ప
భుగులభుగుల్లనఁ బోగ మత్తెవిరాఁది
కెగయులోనన దిగదిగఁ బఱతెంచి
భోజుఁడుఁ దనమిత్ర పుత్త్రబాంధవులు
నాజనావళియును నమ్మత్తెవ్రాఁక
భూతంబు లైఁ బోగ వోలయంగఁదడవ
ఖ్యాతిగానత్తె వృతము గూడఁ జెఱికి
కొనుచు నక్కైలాసమున కేఁగె భోజ
జననాథజనయూథ సహితంబుగాఁగఁ

దెల్లవిూ యుద్భటదేవునిమహిమ
ముల్లోకముల ధరావల్లభ! వినవె

### కక్కయ్య కథ

నిక్కంబు వెండియు నిఖిలేశ్వరుండ!
ముక్కంటిగణము దాఁ గక్కయ్యనాఁగ
నీద్విజాలకు వైరి యెఱుఁగవే యొక్క
విద్వాంసు డీనగరద్వారమందుఁ
బాటియైన పురాణభట్టును బోలెఁ
గాకొఱుక్కలెల్ల నక్కజమందివినఁగఁ
బరగఁగ బ్రహ్మకపాలంబు వట్టి
హరుఁడు భిక్షించె మున్ననియెడిఁగాని
వఱలుశూలమున విష్వక్సేనుఁ బొడిచి
మఱి విష్ణునడిచిన తెఱఁగు సెప్పండు
వెరవున బలి గట్టి వెండియుఁ బెఱిగి
హరివిూఁదికెత్తెఁ గా లనియెడిఁ గాని
యట్టిత్రివిక్రము నెట్టెమ్ము విఱిచి
పట్టె నీశ్వరుఁ డని ప్రతిభ సెప్పండు
వ్యాసుండు చేయెత్తె ననియెడిఁ గాని
వ్యాసుని చేయి నిహతమైన దనఁడు
హరుఁడు యజ్ఞములోన నలిగి కేశవుని
శిరము ద్రుంచినచోటు సెప్పండు సదివి
నరసింహరూపమై హరి హిరణ్యాక్షు

హరియించె మున్ను తా ననియెడిఁగాని
శరభరూపముదాల్చి నరసింహుఁ ద్రుంచి
హరుఁడు దిత్రోల్చినయది సదువండు
మసలి "సర్వం విష్ణుమయ"మనుచోటు
నెసఁగఁజెప్పెఁడుగాని యనయులోచనుఁడు
నరుదగు సర్వసంహారంబుసేయ
హరియు సర్వము ద్రుంగెనని చదువండు
హరికర్త జగముల కనియెడిఁగాని
హరికిని భర్త యీశ్వరుఁడని యనఁడు
హరి విశ్వనామాంకుఁ డనియెడిఁగాని
హరుఁడు విశ్వేశ్వరుఁడని చదువండు
హరి పరాశక్తి దా ననియెడిఁగాని
హరుఁడు పరాపరుఁ డని చదువండు
హరి మహామాయ దాననియెడిఁగాని
హరుఁడు మహాదేవుఁ డని చదువండు
హరిహరుఁ డనెడు శబ్దార్థ మెర్గమిని
హరిహరుఁడన నొక్కఁ డనియెడిఁగాని
హరిని హరించుట యదికారణముగ
హరిహరుఁడును మృగహరుఁడు ననండు
పశుపాతి పురాణభట్టు యథార్థ
మీక్షింప దలఁచెడు నితరేతరముల
శివనిందచేసెడి యవినీతుఁ జంప

నవ్వుఁ బుస్తకము గాల్పు నవ్వుఁ బథం బిదియ
యనుచు మాకక్కయ్య యాశివద్రోహిఁ
బొనరుచు నలిగి డొంకెఁబడఁ బొడిచి
తలదగ్గి పొట్టలోపలఁ బెట్టి కిట్టి
యలరుచు నున్నెడ నాక్షణంబునన
ప్రక్కలై చూడఁ బౌరాణికు మేను
విక్కన విరియుచు విలవిల యనుచుఁ
బ్రువ్వులప్రోఁకలై రూపఱియున్న
నివ్విప్రు లెఱుఁగరే యిన్నియు నేల
డోహరకక్కయ్య మాహాత్మ్య మెఱిఁగి
యూహింప భక్తుల నొండనఁజను నె

### భోగయ్యగారి కథ

మఱియుఁ గెంబాగిలో మహిఁ జెప్పనొప్పు
కలికంఠభక్తుఁ డకల్మషకీర్తి
భోగయ్యనాఁగ నెప్పుడుఁ బరమాను
రాగుఁడై జంగమార్చన సేయఁ జేయఁ
గలికంఠుఁ డాయయ్య మెఱయింపఁ దలఁచి
పెఱవానిక్రియ నొక్క వెయ్యశవంబు
మోచికొనుచు రుద్రముద్రాసమేతుఁ
డై చూప నద్భుతం బంది నేతేరఁ
బొడగని సర్వాంగములు భూమిఁ బొంద మ్రొక్కి
మెడనున్న పెయ్యఁదా మెడఁ బెట్టుకొనుచు

దోడుకొనివచ్చి యుత్సుకలీలతోడ
నడుగులుగడుగ నామృడమూర్తి యనియెఁ
జచ్చిన పెయ్యమాంసము నారగింప
నిచ్చు నేమముగాఁగ నిన్న నేఁ బోయి
ధీయుత! వినవయ్య! దేడరదాసిఁ
జేయఁ బాకము సేసిపెట్టవే యనిన
నడిగి వచ్చెద డుగ్గళవ్వఁ దా ననుచు
నెడసేసె నాఁకొంటి నింక నీవైనఁ
బెట్టవే వండించి పెయ్య నా కనిన
నట్టిద కా కంచు నపుడు భోగయ్య
తౌరామ్లలవణయుక్తముగ మాంసంబు
సారంబుగా వండి చయ్యన మఱియు
శాకము ల్గావించి సంధిల్లఁ బెక్కు
వాకంబు లొడఁగూర్చి భద్రమూర్తికిని
నారగింపఁగఁ బెట్టునంత నయ్యగ్ర
హారంబు భూసురు లందఱుఁ గూడి
గుండులు బడియలు గొని పాఱిపాఱి
యొండొరుఁగడవంగనుద్వృత్తి నరిగి
నఱుకుఁడుతలతల్పు లుఱుకుఁడు గుడిసెఁ
బెఱుకుఁడుభోగయ్యఁబఱపుఁడు వెదకి
పట్టుఁడు దల వచ్చిబడియలఁ బగులఁ
గొట్టుఁడు మాదిఁగకొయ్యఁ బోనీక

యగ్రహారంబు గాడయ్యె నిట్లనుచు
నాగ్రహారంబున విప్రు లందఱుఁ బలుక
హరమూర్తియును నంతనట్లదృశ్యముగ
వరకీర్తి భోగిదేవయ్య కోపించి
యంత్యజు లంత్యజు లని యఱచెదరు
అంత్యజులకుఁ జోర నది యెట్లు వచ్చు
నరుదుగ వీరాయట్టి యగ్రజన్ములకు
హరభక్తులిండులు సొరఁగరా దనిన
నిటలాక్షభక్తుల నిందించి వీరకుఁ
బటురౌరవము లందఁ బ్రాప్తియే చెప్పఁడ
కూడదు శివదూషకుల మిమ్ము నంటఁ
జూడఁగఁ బ్రతిమాటలాడఁ గావునను
ఖలులార ! యిండ్లువృత్తులు నూరు మీరు
తలఁ గట్టికొనుఁడు మాదాతలు మేముఁ
బోయెదమనుచు నబ్భోగయ్య వెడలి
యాయూరిమునిమంద కరుగ నయ్యెడను
శైవులయిండుల శైవలింగములు
దేవాలయముల ప్రతిష్ఠలింగములు
నమితస్వాయంభు లింగాదిలింగములు
తమతమ సింహాసనములను విడిచి
తలుపులు వడనూకి తారు లింగములు
జలదారిగాఁ దూఱి చనులింగములును

పూవుటా వడనూకి పోవులింగములు
బావి నదృశ్యమై పఱచులింగములు
కలయ నంతంత గంతులువైచివైచి
యలరుచుఁ జెలఁగుచు నరుగులింగములు
నురవడి వట్రిల్ల నొండొంటిఁ గడవఁ
బరువడిఁ దమకించి పాఱులింగములు
నెల్లవారును జూడ నిలమీఁద నొక్క
నల్లేటిపొడవున డొల్లులింగములు
ఖేచరత్వమున నేఁగెడు లింగములును
భూచరత్వంబునఁ బోవులింగములు
ననిలవేగంబున నరుగులింగములు
చనలేక మెల్లన చనులింగములును
నీవిధంబునను గెంబావిలింగములు
భావించి భోగయ్యపజ్జనె యరుగ
లింగపర్వత మేఁగులీలఁ బొల్పార
లింగభక్తాలి గేలికలు సేయుచును
నాడుచుఁ బాడుచు నరుగ నిక్కడను
బాడువాఱెనుబురిభాగ్యంబు దొలఁగ
నవని గంపించె సస్యావలులెండె
భువివృక్షములువ్రాలెఁ బొడిచెఁ జుక్కలును
నప్పురి నిండంగ నంధకారంబు
గప్పె నెల్లెడ వంటకంబులు ప్రచ్చె

బావులుఁ జెఱువులుఁ బద్మాకరములు
వావిరి నూతులు వరుసట్లు వట్టె
వనములు ఫలపుష్పవాటిక ల్గమరెఁ
గనుఁగొనఁ బశుపతీగణ మర్వఁదోఁగె
ధరణిఁ ద్రొక్కినరావు దరికొని కాల
దొరకొనియెను గాలి ధూళియు నెగసెఁ
తవిలి యుబ్బంగి నుత్పాతము ల్పుట్ట
భువిసర్వజనులు నబ్బ్భాసురావలియు
భోగయ్య వోవఁగఁ బురములింగములు
భోగయ్య వెనుకొనిపోయెఁ బోవుటయు
నింతింతగార్యంబు లిలఁబుట్టె ననుచు
సంతాపచిత్తులై చయ్యన నేఁగి
శరణుసొచ్చితిమంచు జయజయయంచు
వరికట్టుకొనుచు సాష్టాంగంబు లిడుచుఁ
గావవే మముఁ బాపకర్ములఁ భోగి
దేవయ్య! దెస దిక్కు నీవ మా కనుచు
నవుదల ల్వంచుచు నయ్య! మీధర్మ
కవిలెల మంచును గడుదైన్యపడుచు
సభయాత్ములైయున్న చండివిప్రులను
నభయంబులొసఁగి భోగయ్య తత్క్షణము
మరలి కెంబావికి నరుదెంచె లింగ
పరికరుఁడగుచు నన్నరులు గీర్తింప

నాలింగములు భక్తి కటశాసనముగ
నోలి నన్యోన్యశివాలయంబులను
పెద్దపీఠంబులఁ బిన్నలింగములు
పెద్దలింగంబులుఁ బిన్నపీఠములఁ
భీమలింగంబులు రామపీఠముల
రామలింగంబులు భీమపీఠములఁ
స్ఫటికలింగంబులు బాణపీఠముల
స్ఫటికపీఠంబుల బాణలింగములు
గనుఁగొన నబ్బంగిఁ గ్రక్కున నిలిచె
జనులకు నిదియు దృష్టప్రత్యయముగఁ
బొనరుచుఁ గెంబావి భోగిదేవయ్య
వెనువెంటఁ జనివచ్చి పీటఁ బీఠముల
నిలిచిన లింగమూర్తులు సాక్షిగాదె
మలహారుభక్తులు కులజాలౌటకును.

### గుడ్డవ్వగారి కథ

నరనాథ! గుడ్డవ్వ నాఁగ వెండియును
బరు లెల్లఁ దను పెద్దభక్తురా లనఁగఁ
బట్టినంతన తెగిపడియెడి కుష్ఠు
వట్టి రూపఱియున్న నట్టిచో నొక్క
నాఁడు నావిందిగె నాఁబురవీథి-
బోఁడిగా గుడ్డవ్వవోవ భూసురులు
"నలుకులే కీయగ్రహారంబులోని

కులిపిజంగెత రాక నిలు నిలు మనుడుఁ
బాపిష్ఠులగునట్టి పాలులఁజూచి
శాపించుచును నింక సౌరాష్ట్ర మేఁగి
కాయంబువడయ కీగ్రామంబు సొత్తు
నే యంచు నాత్మఁ బ్రాణేశ్వరు నిలిపి
ముదిత సౌరాష్ట్రాభిముఖయౌచుఁ బోవఁ
బదయుగమువిరిసి కదలరాకున్న
మోఁకరించుచువంగి మొగినేఁగ నేఁగ
మోఁకాళ్లఁజేతులు మురియనిల్వకయుం
గ్రక్కునఁ ద్రోవఁ బొరలిపొర్లిపోవ
వ్రక్కలై మే నెల్ల వికలనవిరియ
నంతలో నధికదయార్ద్రభావమునఁ
గంతుసంహారుఁడు స్వాకారంబుఁ దాల్చి
యచ్చుగా సౌరాష్ట్రమం దుండి యెదురు
వచ్చి సోమేశుండు వనిత దేహంబు
దివ్యాంగముగఁజేయఁ దెలివ మ్రొక్కుడును
భవ్యుండు వెండియుఁ బటుదయామతిని
నడు గడ్గ నీ కీప్సితార్థ మిచ్చెదను
బడఁతి! మెచ్చితి నీదుభక్తికి ననిన
మన్మనోరమ్య! నిర్మలభావగమ్య!
సన్మతి మీపదాబ్జప్రేక్షణమున
జన్మము నేఁడు దా సఫలతనొం దె

నున్నదవ్యాధి గుణోద్వృత్తి యణఁగ
నసమాక్ష! యింక నొండభిమతార్థముల
దోసఁగేల పెన్నిధి దొరకొనియుండఁ
బరగడుగఁగఁబోవు వెరవిండ్లుగలరె
వరద! నీ విట్లు సుస్థిర లీలఁదనరి
యిక్కడ నుండు మాకింతియ చాలుఁ
దక్కినవరములఁ జిక్కు లేనొల్ల
ననుడు నావిందిగె యనుపురంబునను
దనరు సోమేశుఁ డత్యద్భుతలింగ
మూర్తిఁ జేకొనియుండె ముదితగుడ్డవ్వ
కీర్తి లోకముల నంకింపంగఁబడియె
నటమీఁద నాయమ్మ పటుభక్తి మహిమ
మట యీశ్వరునకై ననరిదిదానెన్న
వనిత మున్నపహసించిన ద్విజాధముల
తనువులు సెడియెఁ గుష్ఠనిరూఢివలన
గుడ్డవ్వయని ధరఁగొనియాడుచుండ
గుడ్డవ్వభక్తికి గుడ్డరై పరగ
నటుగాన కులహీనులన నెట్లువచ్చు
నిటలాక్షుభక్తుల నిఖిలేశ్వరుండ!
కని ప్రతిష్ఠాపూర్వకంబైన పిదపఁ
జెనసి లింగము కాక శిల యనఁజనునె
యతిశయలింగదీక్షితుఁడైన యట్టి

ప్రతి నంత్యజాండనిమిత్తంజాడనగున
హారసన్నిహితంబూతుర్వామరయుటయెల్ల
హారుశిలయన్న యట్లధికపాతము
మేదినీవల్లభ! మేఁగువు సోఁకి
కాదె తచ్ఛాయన కాకి పత్రిల్లు
భృంగసంస్పర్శఁ బతంగంబునొంటి
యంగంబునకుఁ బాయుటది దెల్లగాదె
వారిధిఁదటినీప్రవాహముల్ గలయఁ
జేరున్నదే వేఱ పెక్కులేమిటికి
సిద్ధరసస్పర్శఁ జేసి యాఁగాదె
శుద్ధసువర్ణంబు శుద్ధతామ్రంబు
గురుకరస్పర్శచేఁ గులమొక్కఁడౌట
యరిదియేయట్లయంత్యజుఁడునగ్రజుండు
ధర "సుమామాతాపితారుద్ర" యనఁగ
సరినొక్కదల్లి ప్రజలకు వేఱద్ది
యొప్పెడుమాణిక్య మొక మసిఁసోఁక
నెప్పాటఁ బొదివిన నిలఁ గాంతిసెడునె
హారభక్తుఁ డధముజాత్యావృతుఁడయ్యు
ధర నున్ననేమి యాతని ప్రాప్తి సెడునె
రాజీవ మరయఁ బంకేజంబు గాదె
పూజకు నది యెట్లు పూజ్యమై పరగెఁ
గాష్ఠోద్భవంబయ్యుఁ గాదె పవిత్ర

నిష్ఠితంబై పొల్చె నెఱి ననలంబు
ఎట్టిదుర్జాతిని బుట్టిననేమి
యొట్టును శివభక్తుఁ డిలఁ బవిత్రుండు
ఈయగ్రజన్ముల కెల్లను గురువు
బోయెతకును గాదె పుట్టె వ్యాసుండు
పూర్వద్విజాచార్యుఁ డుర్వి వసిష్ఠుఁ
డూర్వశియనులంజె కుదయించెఁ గాదె
మాతంగుఁ డనఁగ బ్రహ్మర్షియొకండు
మాతంగికిని గాదె మహిఁ బ్రభవించె
శునకగార్దభ మచ్ఛశుకదర్దురాది
జనితమునీంద్రాదిజాతము లెల్ల
శివభక్తిఁ గాదె విశిష్టమై పరగె
నవనీశ! యెఱుఁగవే యందఱ ననిన
విని బిజ్జలుఁడు రోషవిహ్వలుఁ డగుచుఁ
గనుఁగొని బసవరాజునకు నిట్లనియె
"పనిలేనిమాటలుఁ బాటలుఁ గథలు
విన విరుద్ధము లాడ వేసర వీవు
బత్తులఁ జదిమినఁ బాలు గాఱెడినె
నెత్తురు గాఱెడినే యొడ్లఁ జిదుమ
నిట్టిమార్గములు మున్నెఱుఁగమే" యనిన
దట్టుఁడు బసవయ దా నంత లేచి
"భర్గునిఁ గాదని పలుద్రోవ లేఁగు

దుర్గుణు లగు శివద్రోహులతోడ
నడరంగ వేదభరాక్రాంతు లనంగఁ
బడిన బ్రాహ్మణ గార్దభంబులతోడ
మహితప్రణవదివ్యమంత్రోపదేశ
రహితులై చనువ్రతభ్రష్టులతోడఁ
జాల దధీచ్యాదిశాపాగ్నిశిఖలఁ
గాలినకర్మచండాలురతోడఁ
బట్టిప్రాణముతోడఁ బశువు వధించు
కట్టిఁడు లగు పశుకర్ములతోడ
జన్నినితోరలినఁ జాగఁగఁబెట్టు
మన్నట్టి యధికపాపాత్ములతోడ
పీసానకై యొట్టి దోసాన కైనఁ
జేసాఁచికొను కర్మజీవులతోడ
మానుగా సురపాటిగా నర్థి సోమ
పానంబు గావించు పాపులతోడ
నిన్నియుఁ జెప్పంగ నేల తాఁ జంపి
జన్నిసంపె నను దుర్జాతులతోడఁ
బ్రతిసేసి యాడినఁ బాపంబువచ్చుఁ
బ్రతినసూపమి భక్తిసంతతంబుగాదు
శివనాగుమయ్యగారి శ్రీహస్తమంద
నివిడి చూపెదఁ బాలు నీ వన్నయట్లు
శివమహాసురులలో నెన్నఁగఁబడ్డ

సోమయాజులఁ దర్గి చూపుఁడా నీళ్లు
అటుగాక తక్కినఁ గటకంబుచుట్టుఁ
గుటిలాత్ములను దోడుగులఁబఱపెంపు
మనుచు బిజ్జలభూసురానుమతమునఁ
జని సదాసిద్ధ బసవచక్రవర్తి
శివనాగుమయ్యగారి శ్రీపాదములకు
భువి సమస్తాంగము ల్సోఁదంగ మ్రొక్కి
సన్నుతలింగప్రసాయితశస్త్ర
సన్నద్ధుఁడై మదిఁ జెన్ను దుల్కాడ
సరస మాడినయట్లు పారి నాగుమయ్య
కరతలాంభోజంబు గరములఁబట్టి
కౌఁగిటఁ జెంజించి యుడువీథిఁ దాఁకి
యుత్తతి క్షీరధారావలి వర్వ
శివభక్తి కామధేనువు బసవనికిఁ
దవిలి చన్నవిసి యిబ్బ్బనిఁ గాఱునట్లు
కరుణించి శంభుండు గనకవర్షంబు
కరికాలచోడుకుఁ గురియించె నాఁడు
అసలార నేఁడు దివ్యామృతవృష్టి
బసవనికిఁ గురిసె భక్తవత్సలుఁడు
దుర్మలత్రితయ విధూతమైనట్టి
నిర్మలదేహంబు నిజ మట్లు గాకె
రుధిరమాంసాది నిరూపితం బగునె

యధమదేవాళులకుఁ గా కని నరు ల్వొగడ
దివ్యామృతాంగ దీధితి దేజరిల్లఁ
బ్రవ్యక్తమై జగత్ప్రత్యయం బమర
నఖిలభక్తౌఘంబు నసదృశలింగ
సుఖసమేతాత్ములై చూడ బిజ్జలుఁడు
నందంద నాగిదేవయ్యపాదార
విందంబులకుఁ జాఁగి వినమితుఁ డగుచు
సకలలోకంబులు జయవెట్టుచుండ
నకుటిలభక్తిమై నంతంత మ్రొక్కి
యజ్ఞానజీవుల మపగతమతుల
మజ్ఞుల మధికగర్వాపరాధులము
శరణన్నఁ గాచు మీబిరుదు నేఁ డింకఁ
బరమాత్మ! మఱవంగఁ బాడియే యనుచు
శరణు వేఁడుచు నున్న చండివిప్రులను
గరుణఁ జూచుచు వారిఁ గాంచి నవ్వుచును
బసవఁ డుద్యత్సముల్లసనం బెలర్ప
నసమగజంబు నాగయ్య నెక్కించి
తానును బిఱుఁ దెక్కి తననివాసమున
కానందలీల నొప్పారంగ నరిగె
శివనాగుమయ్యగారి ప్రవిమలచరిత
మవిరళప్రీతి దుల్కాడంగ వినినఁ

జదివిన వ్రాసిన సద్భక్తిమహిమ
లాదవు చతుర్వర్గపదములు నెందు

కల్యాణపురమునఁగల భక్తులు

రుద్రునిమూఁఱిట రూపంబు లనఁగ
భద్రేభసంహారు ప్రతినిధు లనఁగ
కల్యాణమున నిత్యకల్యాణభక్తి
లౌల్యనిరర్గళ లాలిత్యముగను
మడివాలుమాచయ్య మాదిరాజయ్య
బడవరబ్రహ్మయ్య బాచిరాజయ్య
కిన్నరబ్రహ్మయ్య గేశిరాజయ్య
కన్నదబ్రహ్మయ్య గల్లిదేవయ్య
మోళిగమారయ్య ముసిడిచౌడయ్య
శూలదబ్రహ్మయ్య సురియచౌడయ్య
కలికేతబ్రహ్మయ్య గక్కయ్యగారు
తెలుఁగేశు మసనయ్య డెలుఁగుజొమ్మయ్య
శాంతదేవుండును జమ్మయ్య బాస
వంతుకేసయ్య యేకాంతరామయ్య
యుత్తమాంగదకేశి హొన్నయ్య గండ
గత్తెరనాచయ్య గాలాగ్నిరుద్రి
శృంగిబొప్పయగారు సిగురుచందయ్య
డింరిగమల్లయ్య సంగమేశ్వరుఁడు
కదిరె రెమ్మయ మహాకాళయ్యగారు

పదుమరసును బురాణదమాంయిభట్టు
ఉదరదరామయ్య యోగిదేవయ్య
యుదయమరసుగారు హొన్నయ్యగారు
ధవళయ్యగారు భ్రాంతాదేవిగారు
సవరద చిక్కయ్య సారెనాయండు
శివముద్దుదేవుండు సిక్కదేవుండు
శివరాత్రిసంగయ్య యవిముగతయ్య
చండేశుచామయ్య ముండబ్రహ్మయ్య
బండియరేవణ్ణ యిండెసోమన్న
హాటకేశ్వరునిబ్రహ్మయ మహాబలుండు
శోశుచామయ్య గొగ్గయ్యగారు
దుమ్మబ్రహ్మయ్య ధూర్జటికేశి
యెమ్మెసంగయ కపిలేశు విస్సయ్య
సొణిమేశుచిక్కయ సులుకచందయ్య
గణదాసిమాదన్న గంటిమల్లయ్య
మురహాటకేతయ్య హారవిహొల్లయ్య
గిరిగిటుసింగయ్య గురుజకాళవ్వ
బానసభీమయ్య భాస్కరయ్యయును
గోనియమల్లయ్య గొగ్గయ్యగారు
అల్లయ్యమధుపయ్య యనిమిషకేశి
హొల్లయ్య గోడలమల్లయ్యగారు
ఓలెబ్రహ్మయ కరహాళమల్లయ్య

బాలబ్రహ్మయగారు పణివారిబాచి
కవిలెబ్రహ్మయ బందికారమల్లయ్య
యవకరకేతయ్య శివనాగుమయ్య
నిజలింగచిక్కయ్య నిర్లజ్జశాంతి
నిజభావుఁడును నిత్యనేమదమైలి
యంకబ్రహ్మయ గరళబ్రహ్మయ్య
సుంకేశుబంకయ్య లెంకమంచయ్య
యేలేశుబ్రహ్మయ్య యీడెబ్రహ్మయ్య
మైలనబ్రహ్మయ్య మాయిదేవయ్య
చక్కెరబ్రహ్మయ్య శరణయ్యగారు
చిక్కబ్రహ్మయ్యయు సిరిగిరయ్యయును
వీరమారయ్యయు వీరలింగయ్య
వీరబ్రహ్మయ్యయు వీరభావయ్య
వీరనాగయ్యయు వీరకల్లయ్య
వీరభోగయ్యయు విమలదేవయ్య
కక్కయ్య గల్లయ్య గాటకోటయ్య
చిక్కయ్య వీరయ్య శ్రీసూరసాని
కొండగుడ్కేతయ్య గుండయ్యగారు
చండేశుబ్రహ్మయ్య శంకరయ్యయును
అమృతదేవయ్యయు ననిమిషయ్యయును
విమలదేవుండును వీరాదిగాఁగ
శివభక్తిసంపదల్ సిలిబిలివోవ

సవిశేషభక్తి దృష్టప్రత్యయములఁ
జూపుచుసద్భక్తి సురుచిరమహిమ
నేపారువీర మాహేశ్వరావలికి
భక్తమహత్త్వంబు భక్త్యాభివృద్ధి
భక్తచరిత్ర ప్రభావవైభవము
కన్నవారలు సెప్ప విన్నవారలును
నున్నతశివభక్తి యుక్తిమైఁ దగిలి
దేవలకులు మంత్రదీక్షాన్వితులును
శైవపాశుపతాదిశాసనధరులు
వారివారిక లింగవంతులై చూచి
వారివారిక లింగవంతులై కూడి
వీరమాహేశ్వరాచార నిరూఢి
భూరిప్రసాదోప భోగులై నడవ.

### బోయలతగవు

బోయ లందఱుఁ గూడి భూమీశుకడకుఁ
బోయి "యుత్పాతముల్వొడమె నీపురిని
శ్రీకంఠశివులు గౌరీనాథశివులు
లోకేశశివులు త్రిలోచనశివులు
నీశానశివులు మహేశ్వరశివులు
పాశమోచనశివు ల్పరమాత్మశివులు
శాశ్వతశివులు గణేశ్వరశివులు
విశ్వేశశివులును విమలాత్మశివులు

త్రిపురాంతకశివులు త్రినయనశివులు
ద్విపదైత్యహారిశివు ల్దేవేశశివులు
సురలింగశివులును సుగ్రాక్షశివులు
హారశివులును బరమానంద శివులు
ధర్మశివులును విద్యాధరశివులు
నిర్మలశివులును నిష్కలశివులు
మొదలుగాఁగల శైవముఖ్యు లందఱును
నిదియేమి మతములో నెఱుఁగంగరాదు
బసవయ్యతోఁ యంపు భక్తులఁజూచి
వసుధఁ దారును లింగవంతుల మనుచు
దొడఁగి ప్రసాదంబుఁ గుడుచుచున్నారు
నడరఁగ మా కించు కైనను నిడరు
నియ్యార్యరిలో మల్లజియ్యయు బొల్ల
జియ్యయు నిత్తురే చెల్లునే యిట్లు
విను మహారాజ! మావృత్తి నిర్మాల్య
మొనరఁగ మాకు వచ్చినతొంటి విధము
పనులఁగావఁగఁబోయి బాలుఁడు దొల్లి
యిసుకలింగము సేసి యెలమిఁబైఁబిదుక
నేలరా! మొదవుల పాలెల్ల నేల
పాలు సేసెద వంచుఁ గాలఁ దన్నుఁడును
గడఁగి తండ్రియనక గ్రక్కునఁ గాళ్లు
గడికండలుగఁజేసి మృడుని మెప్పించి

మాదేవుచేతఁ బ్రసాదంబు వడసి
యాదిఁ జండేశ్వరుఁ డట్ల మాకిచ్చె
నంతటనుండి భోగింతు మిట్టులు ని
రంతరవశపరంపర మేము
నిప్పారి వీరమాహేశ్వరు లనఁగ
నిప్పు డేలా చెల్ల నిచ్చెద మనుచు
బసవయ్య యంత్రము ల్వన్నుటఁజేసి
పొసపరి మాతోడఁ బోరుచున్నారు
చెల్లింపఁదగు నని చెప్పు గాదేని
వల్లభ! నీయింటి వాకిట నగ్ని
గుండముల్ ద్రవ్వించికొని కాల్చు" మనిన
నిండుఁగోపముతోడ నిఖిలేశ్వరుండు
బసవయ్యఁ దోడ్తేరఁ బనుచుడు బసవఁ
డసమానలీలమై నరుగుదెంచుడును
"గెడ గూడి బోయలఁ గెడపుటదేమి
వడిఁ బ్రసాదము మీరు గుడుచుటదేమి
యాదిమార్గమొ బల్మి రామొ దీనిఁ జెపుము
కాదేని నాడికో కార్య మేమైన
నూరక కుడుచుట యుచితమే యనిన
ధారుణీశ్వరునితోఁ దా నిట్టు లనియె
నిచ్చుట గలదు సందేశున కభవుఁ
డిచ్చిన తెఱగు మీ రెఱుఁగరే వినుఁడు

బాణలింగములందుఁ బటికంబులందుఁ
బ్రాణలింగములందుఁ జౌష్యరాగాది
లింగంబులందును లేదు ప్రసాద
మంగజహారునికి నాగమోక్తముగ
ధరమానవులు మహేశ్వరప్రసాదంబు
ధరియించినను గొన్నఁ దారు సూచినను
నరయుక దాఁటిన నరకాగ్నిశిఖల
నెరియుదు రని శ్రుతు లెందును వినరె
శ్రీగురుకరుణానురాగ ప్రసాద
మాగమవిధ్యుక్త మగు ప్రసాదంబు
సుప్రసన్నానంద శుద్ధప్రసాద
మప్రతర్క్యాది లింగప్రసాదంబు
పరమపవిత్ర సంపత్ప్రసాదంబు
స్థిరభవరోగౌషధీప్రసాదంబు
సత్యప్రసాదంబు నిత్యప్రసాద
ముత్యుత్తమోత్తమం బగుప్రసాదంబు
గరళకంధరు కృపాకలితప్రసాద
మరుదగుసంగమేశ్వరు ప్రసాదంబు
ములదేవాలకు మీకుఁ దలమె భోగింప
మలహరుభక్తుల యిలుపుట్టువృత్తి
పూని లింగప్రసాదానూనసుఖము
మానవులకుఁ బొందఁగా నెట్లువచ్చు

ఏనుఁగుపన్నగునే గాడిదలకు
ఏనాఁటఁ గన్నులఁ గానరు గాక
యిచ్చుచోఁ గెడిపితిమే ప్రసాదంబు
నిచ్చిసకొన్నచో ఖిన్నుఁడుఁగలదె
యిదియేల వెడగథ లిన్నియుఁ బన్ను
గుదగుదపడక నెమ్మదినుండుఁ" డనిన
"వారాణసి గయఁ గేదారంబునందు
సౌరాష్ట్రమునను దక్షారామమునను
శ్రీగిరియందును సేతుపురోఁగ
మాగమస్థానంబులం దెల్ల మాకుఁ
జెల్లఁగ మీరెట్లు చెల్లఁగనీరు
బల్లిదమైన మా ప్రాణంబులైన
విడుతుముగాక మామడిగూటివృత్తి
విడుతుమే యిదియేమి విపరీతవృత్తి"
యనుచు బోయలు లేచి కనుకనిఁ బలుకఁ
గనుఁగొని బసవయ్య గన్నులనగుచు
వట్టియాకులు గాలి వడిఁ దూలుఁగాక
మెట్టులు దూలునే యెట్టిగాడ్పునను
బెండ్లు దేలెడిఁగాక పేరేటనైన
గుండ్లు దేలునె మఱి తండ్లవియేల
బలువునఁగొన హరిబ్రహ్మాదులకును
గొలఁది గా దనిన మీకొలఁదియె తొరల

వలదు మీ రెంతటివారు గావునను
చల ముడ్గి తొలఁగుఁడు తెలివిడిఁ గొనుఁడు
శైవశివాలయస్థానంబు దక్క
నేవీటనేనాఁట నిలఁ దొల్లి నేఁడు
నెన్నఁడే వీరమాహేశ్వరు లింగ్లఁ
గొన్నచోటులు దెల్పికొనుఁడ యిచ్చెదము
యారయ మును శైవు లైననునేమి
వీరమాహేశ్వరాచారు లై రేని
గనుకనిఁ బ్రాణలింగప్రసాదంబుఁ
గొసనిత్తురే మీకుఁ గుటిలాత్ములార!
కోలాస లేల పైఁ గొసరఁ గుంచంబు
గూలఁబడ్డ ట్లగుఁ గూడనిమ్మనిన
నేదియునేల మీ కిష్ట మేనియును
మాదేవునకును శ్రీమన్మహేశునకు
బాలచంద్రప్రభా భాసురాంశునకుఁ
గాలకాలునకు మానీలకంఠునకు
సర్పకుండలునకు సంగమేశ్వరున
కర్పింతుఁ గాలకూటాదులు నేఁడు
రండ ప్రసాదంబు గొండ యిచ్చెదము
పొండ యింతకుఁజాలకుండి"న ననుడు
"నక్కటా బసవయ్య! యందఱుమ్ము
నొక్కవెట్టునఁ జంప నొండుపాయమునఁ

జాలక యిది మేలు మేలు వో శృంగి
కాలకూటంబు మ్రింగంగఁ బంచెదవు
నలి దీటుకొనఁగఁ బ్రాణంబుఁ గల్గినను
బలుసాకు దిని యైన బ్రదుకంగ వచ్చు
నద్దిరా తాఁజచ్చి యది గుడ్తు రెవరు
దొడ్డవో బసవయ్యతోడివాదంబు
వడిఁగొలుకునకేఁగి బడిగంటఁ జావఁ
బడిన మూషకములభంగి వట్రిల్లి
నేచి కొల్లకుఁబోయి యెదురెదుర్ గాను
బైచీర గోల్పడ్డభావన దోఁచు
జాలిఁబడి కనకసాములు దమక
వేలిచికొన్న యావిధ మగుఁ దమకుఁ
బగవారిబిడ్డల నగవులఁ జంపు
పగిదిఁ జేసిన జోదు బసవనమంత్రి !
యీరసం బిదియేల యే మింత వెఱ్ఱి
వారము గాముపో వలవ దిన్నియును
ధరభక్తు లెవ్వారే హరునకుఁ దొల్లి
గరళ మర్పించుట గలదేని యిమ్ము
తవిలిచెప్పుము ప్రసాదంబని విషము
నెవరేని మునుగొన్న నేముఁ గొనెదము
మేలిప్రసాదంబు మ్రింగ మీపాలు
కాలకూటంబు మాపాలె నేఁ డింక

నె ట్టిచ్చెదయ్య మాకీశుప్రసాద
మట్టవుఁబో విష మనియె యిచ్చెదవో
నీవకో విషములు దేవుని కిచ్చి
చావకున్నను దత్ప్రసాదంబు మీఱ
చేకొందు వేయేల మీకును మాకుఁ
బ్రాకటంబుగ నింక బాస దా నిదియ
యనుడుబిజ్జలుఁ డుభయానుమతమునఁ
జనుదెంచె దేవదేవుని గుడికడకు
బుడిబుళ్లువోవుచు బోయలు వచ్చి
రడరఁగఁ దమకాకిపడగలు దూల

## బసవన్న విష మారగించుట

బసవఁ డసంఖ్యాతభక్తులుఁ దాను
నసమానలీలమై నరిగియచ్చటను
గాలకూటము శృంగి ఘనవత్సనాభి
హాలాహలంబును నాదిగాఁగలుగు
విషము లన్నియుఁ గూర్చి వేగ నూఱించి
విషమతరంబగు విషసౌరభంబు
గాలి సోఁకినమాత్ర నోలి జంతువులు
వ్రాలి యచ్చటన జీవంబులు విడువఁ
బై నాకసంబునఁ బోవువిహగ వి
తానంబు దొప్పున ధరఁబడి చావ
రాగిల్ల నూఱినఁ ద్రేగులు దెగెడిఁ

ద్రాగిన బ్రదుకంగఁ దా నెట్లువచ్చు
ననుచు నబ్బోయలు కనుకనిఁ బఱవ
ఘనఘోరగరళంబు లెనయంగఁ గలపి
పసిఁడికొప్పెరల నిం పెసఁగఁగ నినిచి
యసమసద్భక్త సభాభ్యంతరమునఁ
గొప్పెర ల్దియించి కూడ నర్పించి
యప్పుడు ధూపదీపాదు లొనర్చి
పంచమహావాద్యపటలంబు లులియ
సంచితకీర్తి బసవచక్రవర్తి
యామడివాలు మాచయ్యయాదిగను
గామారిసద్భక్త గణలింగములకు
నతిభక్తి సాష్టాంగుఁడై ప్రణమిల్లి
చతురత సరససంస్తుతిపూర్వకముగ
ముద్రవుచ్చుడును విషోద్రేకవహ్ని
రుద్రమూఁడవకంటి రౌద్రాగ్ని కరణి
భుగులుభుగుల్లనఁ బొగలి కెంబొగలు
నెగయ విషార్చులగగనంబుఁ గప్పెఁ
బటువహ్నిగాని చెడిపాతె భానుండు
నిటయటపడియె నీరేడు లోకములు
భూలోకమెల్లఁ గల్లోలంబు నొందె
ప్రాలి మూర్ఛిల్లె జీవంబు లన్నియును
నిల మంగలమునఁ బ్రేలలు సిట్లుగొన్న

పొలుపున ధరణిఁ జుక్కలు ద్రెళ్లిపడియెఁ
వాగఁ గొన్నమాత్రన దిగులు సొచ్చుడును
విగతచేతనులైరి దిగధీశులెల్ల
నిండె ధూమంబు బ్రహ్మాండమంతయును
గొండలు గాటుకకొండలై తోఁచె
బడబానలంబున జడధులు గలఁగె
నడరెఁ గల్పాంతాగ్నియని బ్రహ్మ నడఁకె
నీలవర్ణంబు దా నెక్కొన్న నాఁటి
హాలాహలం బని హరి దల్లడిల్లెఁ
గుత్తుకవిష మెట్లొకో పోయి వెడలె
నత్తఱి నని రుద్రుఁ డతిభయంబందె
నెగసె రుద్రునిఫాలనేత్రాగ్ని యనుచు
నొగి గణాడంబరోద్యోగంబు దనరె
నేలయు నింగియు నెక్కొన నిట్టి
హాలాహలాగ్నిమయంబగు నంత
మాయీశభక్తుల మహిమ లిన్నియును
బోయలార! వినుండు బుడిబుళ్లు మాని
కంటిమి కానము వింటిమి వినము
ఉంటిమి లే మను నుక్తులు వలదు
అరయంగ నఖిలలోకాలోకములను
బరమేశభక్తులు పరమపావనులు
నద్వితీయుండు పినాకియే కర్త

సద్విధి నేమె ప్రసాదయోగ్యులము
ఇట్టిద కాదనునట్టి ద్రోహులకుఁ
గట్టితి నెఱిఁగెల్తుఁ గాలకూటాగ్ని
శాపింతు నఱికింతు సందుసందులకుఁ
ద్రోపింతు వాండ్ర నధోగతి ననుచు
దండియై బసవనదండనాయకుఁడు
చండేశసుతుఁడు శ్రీసంగమేశునకు
సర్వాంకునకుఁ దద్విషంబు సద్భక్తి
దర్పం బెలర్ప సమర్పణచేసి
పసిగమై నారగింపఁగ నార్చి పేర్చి
వెస ననివారితోద్వృత్తిఁ జెలంగి
యరగలిగొనక కొప్పెరలకు నొరగి
పరమ మాహేశ్వరప్రకర ముప్పాంగి
జొష్టంబు "బహ్వాపి స్తోక మేవాపి
శిష్ట మన్నం విమిశ్రిత" మనుఁ గాన
పసిఁడిగలంతెలఁ బసిఁడికోరలను
బసిఁడికర్పరములఁ బసిఁడిముంతలను
వారక యిటుకూడ వడ్డించికొనుచు
మారారి కర్పించి మహనీయలీలఁ
"జిందక క్రోలుము సిక్కయ్యదేవ!
సందడిసేయకు సంగయ్యదేవ!
కెచ్చెదఁజొమ్మయ్య త్రిపురారిదేవ!

విచ్చేసి కూర్చుండు విమలాత్మ దేవ!
కాలకంఠయ్యకుఁ జాలదు రెండు
చాలుఁబో నీకు సిరాళదేవయ్య!
వేగ మింతేలయ్య విరుపాక్షదేవ!
యీగరిఁ గొండుఁ జాలు భోగయ్య కింకఁ
జాలదో తెత్తునా శంకరాచార్య!
ఫాలలోచన! పట్టు పట్టు మీసార
యెంతైన నాస్వాదమే పురాతయ్య!
చింతింపలేదువో శివదేవుఁ డింక
మిగిలిన నాక చూ జగదేవతం దె!
నగవులఁ బోదువో గగనేశ్వరుండ!
కొంకకుగొంకకు శంకరదేవ!
యింకను దెత్తునా యెంకమంచయ్య!
పాడియే వలదనఁ బర్వతదేవ!
కూడ వడ్డింపుఁడీ గురుదేవసికిని
శివశివ! తనియండు సిన్నదేవుండు
ప్రవిమలదేవుండు బాస సెల్లించె
ముద్దులాడక పట్టు మూర్తిదేవయ్య!
దొడ్డయే యెంతైన ధూర్జటిదేవ!
సంబరపడకయ్య సర్వజ్ఞదేవ!
కెంబావిభోగయ్య! గెలియే నీకు
నీకొలఁ దెఱుఁగమే నిజభావదేవ!

మా కేమి పట్టుము మహాలింగదేవ!
సంతసంబే నీకుఁ జంద్రశేఖరుఁడ!
మంతనం బేల నిర్మలదేవ! నీకు
నుసులకు నుసులకు కుసుమేశ్వరుండ!
కసిమసంగెదవేల కల్లి దేవయ్య!
సడ్డ లిం తేలయ్య షొడ్డలదేవ!
వడ్డింతుమే నీకు దొడ్డలింగయ్య!
మీసలు దీర్పుకు మిండసంగయ్య!
బాసలువలుకకు బల్లాణదేవ!
కడుపారఁ గ్రోలుమా కళ్యాణదేవ!
గుడికెఁడు దెత్తునా గొల్లవరాయ!
చిక్కంగనీకుమా శ్రీగిరినాథ!
మొక్కలం బిదియేల ముదునూరిదాసి!
గ్రక్కునఁ గ్రోలుమీ కఱకంఠదేవ!
వెక్కసం బేలయ్య విమలాత్మదేవ!
గొగ్గవ్వ మహాదేవి గుడ్డలదేవి!
దుగ్గళదేవి సద్యోజాతదేవి!
యమ్మవ్వ సకళవ్వ యచలదేవమ్మ!
నిమ్మవ్వ శాంతవ్వ బమ్మలదేవి!
కాళవ్వ గేతవ్వ గాములదేవి!
షోళశిబసవమ్మ సోమలదేవి!
సంగవ్వ శివదేవి సాకలదేవి!

లింగవ్వ రెబ్బవ్వ మంగళదేవి!
ప్రమథవ్వ బాచవ్వ పదుమలదేవి!
విమలవ్వ సెల్లవ్వ వీరభద్రవ్వ!
చిక్కలరామవ్వ సిద్ధలదేవి!
యక్కవ్వ సోడవ్వ యానందదేవి!
హొల్లవ్వ గల్లవ్వ హొన్నలదేవి!
హాల్లవ్వ మల్లవ్వ యనిమిషదేవి!
కేతలదేవి పురాతవ్వ! మీర
లేతెంచి కూర్చుండుఁ డీబంతి ననుచు
సల్లీల వెండియుఁ జతురతాన్యోన్య
సల్లాపసూక్తులు సరసమై తనర
నిట్టిసందడి యున్నఁ డెలుఁగ మే మనుచు
దట్టుఁడు బసవన దా నెర్గుననుచుఁ
దమ్మయ్య కడు పారెఁ దడవకు మనుచు
నిమ్మాటికిని మిక్కి లింకఁదే ననుచు
నోయన సడలింపు మొడ్డాణ మనుచు
నీయాన నాపొట్ట నిండెరా యనుచుఁ
గడుపు డిగ్గాడిని నీల్గకుము నీ వనుచుఁ
గడుపు వెర్గినఁ దెత్తుగాకేమి యనుచు
నయ్యకుఁ దలమున్క లయ్యెఁ బొమ్మనుచు
నియ్యయ్య కింతట నేమయ్యెననుచు
నిది పెద్ద గాదువో యీ యయ్య కనుచు

వదలింపు కట్టినవలువ నీ వనుచుఁ
బోనిత్తునే నుస్సిపోయిన ననుచు
మానుఁడా సరసము ల్మాతోడ ననుచు
నాయయ్యఁ జూడుఁడీ యాస్వాదమనుచు
నీయందు నేమేనిఁ బోయెనే యనుచు
నుత్తమాంగమున నో యన్నఁగాకనుచుఁ
జిత్తము నున్నట్లు చెప్పఁబొమ్మనుచు
గప్పెర నిండినఁగాని పోవనుచు
గుప్పునఁదెమ్ము వేరొక్కని గ్రుక్కఁ డనుచుఁ
దలయూపులకు రాకు తండ్రి! నీ వనుచు
వలెనటె మాతోడ వాగ్వాద మనుచుఁ
గడుపు దా మాయయ్య వడసెరా యనుచు
బడుగుమాట లవేల బంతిలో ననుచుఁ
దప్పిపోవునె యూఁది త్రావిన ననుచుఁ
గొప్పెరకును గంతు గొందుఁగా కనుచుఁ
గ్రేళ్లువాఱక యారగింపు రమ్మనుచు
నల్లవో బలిసెరా నాయయ్య యనుచు
నేలతెచ్చెదు తేకు మిచ్చటికనుచు
మేలుబంతికి నీవ చాలుదే యనుచు
నోయయ్య తెత్తునా యొక్కింత యనుచు
నాయయ్య చాలురా నాకింక ననుచుఁ
ద్రేన్పకపోదునే దేవ! యే ననుచుఁ

త్రేన్పుఁగ నైనను దెఱపి లేదనుచుఁ
బళ్లెరం బులుఁగులువాత్తెరా యనుచుఁ
బెల్లు వడ్డించితి వ్రేలెద వనుచు
నొలుకఁబోయకు మఱి యోయయ్య! యనుచు
నొలికినబసవనికుండుఁగాకనుచుఁ
దెరలోని కొప్పెరల్ దెండు దెండనుచు
హరహర! దాఁచెదమయ్య నీ కనుచుఁ
గొని తెచ్చి వడ్డింపఁ గ్రోలుచు భక్త
జనులఁ దోతెండంచు ననురాగలీల
శివున కర్పింపుచు శివశివ! యనుచు
నవధానవంతులై యారగింపుచును
జాఱ్ఱుజాఱ్ఱునఁగొని సొగయుచు గఱ్ఱు
గఱ్ఱున త్రేన్పుచుఁ గాళ్లు సాఁచుచును
నిక్కుచు నీల్గుచు నక్కలింపుచును
జొక్కుచు సోలుచుఁ జక్కలింపుచును
నక్కలిపడి తెప్ప లల్ల మోడ్పుచును
గ్రుక్కిళ్లు మ్రింగుచుఁ గుత్తుక బంటిఁ
గ్రోలుచు నలరుచుఁ గ్రాలుచు నాత్మ
సోలుచు సుఖవార్ధిఁ దేలుచు వేడ్క
వ్రాలుచు మెఱయుచు వక్త్రంబులందు
నోలిఁ బళ్లెరముది కొక్కయ్యన మరలి
చూచుచు నించుకించుక వుచ్చికొనుచు.

లేచుచుఁ జెలఁగుచు లీలఁ దలిర్ప
నాడుచుఁ గప్పెర లఱచేత నొలయఁ
బాడుచు నుఱుకుచుఁ బరువువెట్టుచును
మురియుచుఁ గునియుచు ముఱకటింపుచును
నొరగాలనిలుచుచు సరసమాడుచును
నేతెంచి మ్రొక్కుచుఁ జేతులుసాఁచి
ప్రీతిఁ బ్రసాదంబుఁ బెట్టించికొనుచుఁ
గర మనురక్తిమైఁ గౌఁగిలింపుచును
నరుదొందఁ బొత్తుల నారగింపుచును
నొండొరుముందట నున్నపళ్లెరము
లొండొరు లాడియుచు నుబ్బియార్చుచును
విషమాత్మసద్భక్త వితతి యుబ్బంగి
విషమవిక్రమలీల విషకేలి సలుప
దండిమై బసవనదండనాయకుఁడు
చండేశవరద ప్రసాద శేషంబు
గొట్టరువులవారిఁ గుంచెలవారి
గొట్టుబోయల నాలవట్టాలవారి
పట్టపుదేవుల భ్రాతల హితులఁ
జుట్టాలఁ బక్కాల సుతులఁ బౌత్రులను
బండారులను నడబాళ్లఁ బ్రెగ్గడల
దండనాయకులను దఁత్రపాలకుల
దాసజనులను విశ్వాసుల భట్ల

దాసీజనముల విలాసినీజనులఁ
దతవితతాది వాద్యవిశారదులను
జతురగాయక నిజస్తవపాఠకులను
బండిత నర్తక ,పరిహాసకులను
మండితసత్కవి మండలి నెల్లఁ
బంతులు సాగఁగఁ బంచి వారలకు
వింత వేడుక పుట్ట విషము వోయింపఁ
గాలకూటము వారిపాలికి నెయ్యి
పాలునై యుండఁగ బసవన్న మఱియుఁ
గాలాగ్నిరుద్రుని గణనాథు దాయఁ
గోలాహలంబును గుంజరోత్తంసు
గంగాధరప్రియు సంగరవిజయు
లింగసన్నాహంబు మంగళకీర్తి
జవుదంతితిలకంబు జగదేకవీరు
భవదుఃఖభంజను బంచాస్యబలుని
నంతకదర్పసంహారు దుర్వ్యప్ర
దంతభగ్నంబు సదాశివమూర్తి
భద్రేభసుందరుఁ బరవాదివీర
విద్రావణుని వీరభద్రావతారు
నప్రమత్తునిఁ ద్రిపురాంతకు జంగ
మ ప్రసాదమ్ముఁ దెండు మావంతులార!
యనుచుఁ జేర్కొని యివి యాదిగాఁ గలుగు

వినుతేభవితతి సుదృ్త్తిఁ దెప్పించి
యప్రతిబలుఁ డెండు హయరాజుఁ డెండు
సుప్రసన్నునిఁ డెండు సుభగునిఁ డెండు
ధర్మకీర్తిని డెండు దవరాజుఁ డెండు
కర్మసంహరుఁ డెండు నిర్మలుఁ డెండు
వాయువేగునిఁ డెండు వరదునిఁ డెండు
దాయఖంపముఁ డెండు తత్త్వజ్ఞుఁ డెండు
సృష్టిపాలకుఁ డెండు సిత్రాంగుఁ డెండు
దుష్టమర్దనుఁ డెండు దుర్దాంతుఁ డెండు
చంద్రాతపముఁ డెండు శాశ్వతుఁ డెండు
ఇంద్రాయుధమ్ముఁ డెం డీశానుఁ డెండు
చేరమప్రియుఁ డెండు శృంగారిఁ డెండు
వారణాసిని డెండు వాహకులార
యనుచుఁజేర్కొని యివియాదిగాఁ గలుగు
వినుతాశ్వవితతి సుదృత్తిఁ దెప్పించి
కూడ నేనుఁగులకు గుఱ్ఱంబులకును
వేడుకఁ బోయించె విషమెల్లసమయ
నడలుచుబోయలు గడగడ వడఁక
మృడుభక్తమండలి మెచ్చి కీర్తింపఁ
బ్రమథకారుణ్య విస్ఫారప్రసాద
విమల పుష్పాంచితవృష్టి పైఁ గురియ
గగనస్థులై రుద్రగణములు సూడ

నాగి దివ్యదుందుభు లొక్కటఁ మ్రోయ
బిజ్జలుఁ డద్భుతోపేతుఁడై మ్రొక్క
యజ్జనౌఘంబు వాయక జయవెట్ట
భవలతాంచితదాత్ర పరమపవిత్ర!
శివగణస్తోత్ర విశిష్టచారిత్ర!
సదమలగాత్ర ప్రసాదైకపాత్ర!
విదితసజ్జనమిత్ర విజ్ఞాననేత్ర!
ప్రోద్గతసూత్ర మహాద్గురుపుత్త్ర!
సద్గుణైకచ్ఛత్ర జంగమక్షేత్ర!
యతిదయామాత్ర దుఃఖాబ్ధివహిత్ర!
ప్రతివాదిజైత్ర సద్భక్తికళత్ర!
చన 'నరిర్మిత్రం విషం పథ్య'' మనఁగఁ
బనుపడు శ్రుత్యుక్తి బసవ! నీకయ్యె
బాపురే మాతండ్రి భక్తివర్ధనుఁడ!
బాపురే మాయయ్య ఖ్యాపితశౌర్య!
నల్లవో బసవయ్య నందీశమూర్తి!
నల్లవో బసవ యనశ్వరకీర్తి!
గరళంబు వోల్గి జగద్ధితార్థముగ
హరుఁ డారగించుచో నట మ్రింగ వెఱచి
కాదె విషం బుంచెఁ గంఠంబునందు
నాదేవు మాహాత్మ్య మదియెంత వెద్ద
కాలకూటముకంటెఁ గడు నుగ్రవిషము

తా లెక్కసేయక దండనాయకుఁడు
అంచితభక్త హితార్థంబుగాఁగ
వంచనలే కారగించెఁ గడ్వార
నమృతంబు ద్రావియు నమరసంఘంబు
సమసుప్తిఁ బొందెడు జగ మెల్ల నెఱుఁగ
బసవయ్యఁ జూడుఁడా విసము ద్రావియును
నసమానలీల దివ్యాంగుఁడై నిలిచె
ననుచు లోకము లెల్ల నచ్చెరువంది
వినుతింప బోయలు విభ్రాంతిఁ బొంది
సంతాపచిత్తులై సంస్తుతింపుచును
నంతంత సాష్టాంగులై ప్రణమిల్లి
"యభయమే బసవయ్య యతికృపాంభోధి!
యభయమే బసవయ్య యద్భుతచరిత!
యిమ్మెయి సరివారమే బసవయ్య!
తమ్ముఁ బఱుప మీకుఁ దలఁప శౌర్యంబె?
పోల దుర్జనుతోడి పొందునకంటె
చాల మేలండ్రు సజ్జనవిరోధంబు
కావున మము నెట్లుఁ గాచి రక్షింపు
మావికలతఁ ద్రోచి దీవనఁ బొందు
దేవ! దెసయు దిక్కు నీవ మా" కనుచు !
వేవిధంబుల నిట్లు విన్నవించుడును
జూచె దయాదృష్టిఁ గాచె వీడ్వడఁగఁ

ద్రోచె వాదములెల్ల నేచెఁ బ్రఖ్యాతి
మాపె బోయలపెంపుఁ జూపెఁ బ్రసాద
మోపి లేదనినూకెఁ బాపె బోయలను
నిలిచెఁ జలింపక తలఁచెఁ బ్రస్తవము
గెలిచె సద్భక్తిమైఁ బొలిచె బీరమునఁ
జేర్చె భక్తావళిఁ గూర్చె నాద్యోక్తిఁ
దీర్చె సన్మార్గంబు నోర్చెఁ దర్కమునఁ
బండించె నిశ్చలభక్తి లోకముల
నిండించె బసవయ్య నిర్మలకీర్తి

## జగదేవ దండనాయకుని కథ

వెండియు జగదేవ దండనాయకుఁడు
నిండారుసద్భక్తి నిధి కర్మయోగి
యభిమతలీలమై విభవంబు మెఱసి
శుభకార్య మాచరించుచు నొక్కనాఁడు
నేతెంచి వీరమాహేశ్వర తిలక!
ప్రీతియొలర్ప విభూతిఁ గైకొనుము
అసలార మాయింట నారగించినను
బసవనమంత్రి! యే బ్రదుకుదు ననిన
నగుమొగం బలరార జగదేవమంత్రి
నొగిఁ జూచి బసవయ్య యొండేమి చెప్ప
సర్వజ్ఞనెట్టణ శరణులరాక
కోర్వఁగ నెమ్మెయి నోపుదే యనిన

నవుఁగాక యనుచు రయంబున నేఁగి
వివిధపక్వాన్నాది వితతులు గూర్చి
సరసర బసవయ్య సను దేకమున్న
గరమభిషేకంబుఁ గావింత మనుచు
జానగుప ట్లల్కి సద్భక్తియుక్తిఁ
గానక బాఁపల కాళ్లు గడ్గుటయుఁ
బరిచారకునిచేత బసవయ్య యెఱిఁగి
యరుగుట పాలించి యాగ్రహింపంగ
జగదేవుఁ డంతలోఁ జనుదేరఁగాంచి
భుగభుగకోపాగ్ని యెగయ ముందటను
దెరచీర వట్టించి చూర నెట్టువచ్చు
నరుగుము భక్తజనాళిలో వెడలి
కులదైవ మిలువేల్పు మలహరుఁ డుండఁ
బలుద్రోవలనుబోవఁ బాడియే నీకుఁ
గలికంఠు శుద్ధనిష్కలభక్తియుక్తి
జలభుల కదియేల సమకూడుఁ జెపుమ!
ముల్లోకనాథుని ముట్టఁ గొల్చియును
గల్లరిలోకుల క్షుణియింపఁ దగున
హరునకు మజ్జనం బార్చుచేతులను
నరవి విప్రులకాళ్లు సరి గడ్గఁ దగునె
శివపాదజలములు శిరమునఁదాల్చి
భవులకాళులనీళ్లు వైన నల్కఁదగునె

శ్రీమహాదేవుఁ బూజించు చేతులను
నామాలకుక్కల నర్చింపఁ దగునె
మురహరార్చితునకు మున్నెత్తుకేలు
ధరనెత్తఁ గూడునే త్రాటిమాలలకు
సదమలలింగ ప్రసాదజీవికిని
విదిత మీశ్వరభక్తి విముఖులైనట్టి
కర్మచండాలురఁ గలసి కుడ్పుటయుఁ
గర్మంబు గుడుచుట గాదె యిట్లనిన
నదియును దివ్యాగమార్థంబులందు
మదనారిసద్భక్త మందిరంబులను
మెలఁగుపుత్రకళత్ర మిత్రగోత్రాది
బలఁగంబు లింగాన్వితులు గాకయున్న
నొండేమి యిలఁ గూడియున్న యంతటను
చండాలమిశ్రదోషంబు వాటిల్లు
"దర్శనా దపి పాపదా" యనుఁ గాన
దర్శనాలాప సంస్పర్శన శయన
సంపర్కభోజనాసన దానములకు
నింపారునే భక్తుఁ డితరులతోడను
బశుపతిసద్భక్తి పథ మేమిచెప్పఁ
బశువులసద్భక్తి పరులఁ జేయండె

## ఏలేశ్వరు కేతయ్యగారి కథ

ఖ్యాత మేలేశ్వరు కేతయ్యనా న
జాతభక్తుండు దచ్చరిత మెట్లనినఁ
జిత్ర మత్యద్భుతశీలప్రయుక్తిఁ
బుత్రమిత్రకళత్రగోత్రవర్గంబు
బానిసె బంటు గోపాలుండు పశువు
శ్వానంబు మఱియు మార్జాల మాదిగను
గృహచారకుల నెల్ల మహనీయలీల
మహిఁ బ్రాణలింగసన్నిహితులఁ జేసి
తానును భవ్యులను దలఁపఁ డల్లంత
నైనఁ జూడఁడు మాటలాడఁడు వినఁడు
ముట్టఁడు వరసీము మెట్టఁ డెయ్యెడలఁ
బెట్టఁడు వారిచేఁ బెట్టించికొనఁడు
తా విల్వఁ డమ్మఁ డెంతయు భాగ్యమునను
బోవఁ డెరవువోయి పొం దిడికొనఁడు
తానయ్యె పొరయఁ డింతటి కేమి యనఁడు
మానుగా నావంతయేనిఁ బోనీఁడు
భవి పరిత్యాగులై భువిఁ బ్రవర్తింప
శివభక్తులకు నిది శిష్టత్వ మనఁగ
నిట్లు వర్తింప నేలేశుకేతయ్య
నెట్టణభక్తివినీతిని జనులు
నెడనెడ నొక్కొక్క రెగ్గొనరింపఁ

దోఁడఁబడఁ గాయయ్య నడచుచు నుండఁ
బుడుకఁడు భవులంచుఁ బోయి పొందీఁడు
అడుగఁడు భక్తుఁడ ననుచు నింకేల
వెదపద న్నెడకుండ విత్తులు సేన
వెదవెట్టుఁగాకేమి యిది సూతఁ డనుచు
వలిగి విత్తులగాదియలఁ జిచ్చువెట్టి
యలరుచు ద్రోవలు లంతంత వీక్షింప
నేలేశుకేతయ్య యెఱిఁగి నవ్వుచును
గాలుఁగా కేమని గ్రక్కున నచటి
నీరుపోణ్కలనిండ నించి తెప్పించి
యారకుండఁగఁ జేన నంతటఁగలయు
విత్తించికొని కొండ్ర వేలకు మిగుల
నత్తఱిఁ బండించె ననురాగలీల
మును పిల్లవాళి బ్రహ్మన నాఁగ భువిని
వినఁజెప్పఁ జిత్రంబు విత్తు లల్కకయ
చేను పండించె నాఁ జెప్పఁగఁబరగుఁ
దా నేఁడు వీరిచేఁ గానఁగఁబడియె
మదనారిభక్తుల మహిమ దలంప
నిది చోద్యమే యంచు నిల బుధు ల్వొగడఁ
బనువుచు వెండియుఁ బాపిష్ఠులైన
జను లంతఁబోక యసహ్యభావమునఁ
బసు లేడ తా రేడ బగి తేడ జగతిఁ

ఋసరించి కుడిచెడి పగిది గా కనుచు
జంత్రంబువన్ని క్రచ్ఛఱమ్రు చ్ఛలకును
యంత్రించి పసులఁ దారంతెఁబట్టింపఁ
దలర కొక్కటియును దప్పకయుండఁ
బోలమునఁబసులను బోలమున వెడల
నటుగొనిపోవుచో నరుగుచునుండి
యిటప్రాణనాథుఁ డుండుటఁజేసి పసులు
పండినపొలములఁ బదువయు మొలవ
నిండినచెలికల నీర్గలచోట
మఱచియైనను బులు గఱవక నీరు
దఱియుచో మాతులు దడియంగనీక
యేడునాళ్లునుగూడ నిటు సనుచుండఁ
జూడ నక్కజ మైనఁ జోరు లూహించి
యిది యేమి చోద్యమో యిట వట్టి తెచ్చి
నది యాదిగా మేయ వంటవునీళ్లు
నుండినఫలమేమి రెండుమూన్నాళ్లు
లుండినఁ జచ్చు నొక్కండును మనదు
వట్టి కర్మంబేల కట్టికొనంగ
నిట్టున్న భంగిఁ బోనిం డని విడువ
గ్రక్కున మగిడి యు బ్బెక్కి యంతంత
నెక్కడఁ నిలువక యెగసి దాఁటుచును
తోఁకలు వీఁపులతోఁ గీలుకొలిపి

వీఁక వచ్చినదారి విడువక పట్టి
యేడునాళ్లకు మును వేతెంచు తెరువు
నేడుజాములకుఁ గూడ నేఁగుడు నిచట
నేలేశుకేతయ్య యెడదవ్వులందుఁ
గిలరుఁబోడగాంచి కినియుచు దొడ్డిఁ
బలుగాఁడులిడి వ్రతభ్రష్టుల దిక్కు
పలుకుట సూచుట పాతకం బనుచుఁ
జొరనీక నూకుడుఁ జొప్పయుఁ గసువు
పఱులు వాపంబంచుఁ బడిగొనిపైవఁ
జొప్పదిక్కున నంత సూడక వ్రతము
తప్పుమయ్యాయని తా రర్చునట్లు
నెలుఁగెత్తి కూడి యంబేయని యఱచుఁ
దల లెత్తి వంచు నాల్కలు వెడలించుఁ
దెట్టుపై మాతులు వెట్టి యన్నగరి
చుట్టును వాచర్చు శోకంబు లడర
దొడ్డిలోపలఁ దారు దొల్లి భజించు
దొడ్డలింగముఁ దొంగితొంగి చూచుచును
దాఁటఁగఁ దలపోయుదర్పంబు పేర్మి
దాఁటఁగ నోడుఁ గేతయ్య రమ్మనక
యాపసు లిభ్భంగి నలమటపడఁగ
లోపలఁ గట్టిన క్రేపు లిల్లెఱేఁగి
తప్పెనో తమతమతల్లులు నియమ

ముప్పాట నని యర్వ కాలింపకున్న
లేఁగలఁబుడుకుచు లీలఁ గేతయ్య
మూఁగియర్చుచు మేఁతముట్టకుండుటయు
శీలము ల్దప్పమి వోలఁగా నెఱిఁగి
యాలోకు లత్యద్భుతాక్రాంతులుగను
బలుగాళ్లు దెఱపింప నలరుచుఁ బసులు
వలివేగమున వచ్చివచ్చి యొండొండ
నూఁకర ల్గొట్టుచు నుత్తలపడుచు
వీఁక' గన్నులు విచ్చివిచ్చి చూచుచును
దలలు లింగంబుతోఁ దాఁకించికొనుచు
వలగొని వచ్చుచు వడి మూరుకొనుచు
నిట లింగవిముఖులై యే గుటఁగోలె
నటపూరికట్టియు నంటకుండుటకు
సత్య మీలింగంబు సాక్ష్యమన్నట్లు
నిత్యలింగస్పర్శ నియమము ల్సలిపి
గ్రక్కున కేతయ్యగారి పాదముల
కొక్కింత వంగుచు మ్రొక్కి తత్క్షణము
ముప్పిరిగొనిపాఱి చొప్పయుఁ గసువు
నప్పుడు దముకడుపార మేయుచును
నెడనెడ నుదకంబు లేఁగి త్రావుచును
వడి నాకుచును జాఁగఁబడుచు లేచుచును
బొదుగులు సేపంగఁ బొదలి నెయ్యమున

మొదవు లంటేయని మునుకొని యఱవఁ
బసులఁ గేతయ్య సేపట్టుట యెఱిఁగి
పసిగొని క్రేపులు వార కర్పుచును
విడువఁ దల్లులడాసి కుడువఁగ నియతి
నడరంగనఱచెఁ దా రట్లకావునను
నేలేశుకేతయ్య యింటియాపసులు
పాలింపఁగా శివభక్తుల నియతి
నితరులఁ గలయంగ నెవ్విధిఁ గూడు
మతిఁ దలఁపఁగ గురుమార్గమే యిదియు

## సవరద నాచయ్య కథ

సవరదనాచయ్య యావిదకుఁ దొల్లి
కవలవా రుదయింప గ్రక్కున మున్న
యుదయించు బాలున కొక్క లింగంబు
నుదయించు లోనన నొగి సమర్పించి
యున్నబాలునికి వే ఱొక్క లింగంబు
మున్నగల్పింపమి నన్నాతి దడసి
పతికిని వినిపింపఁ బథహీనుఁడయ్యె
సుతుఁబాలవైవుఁడు చూడఁగరాదు
శరణోక్తి గురులింగ సన్నిహితంబు
వరయ నర్ధోదయంబైనప్డ వలయు
నని నాచిదేవయ్య యఖిలంబు నెఱుఁగఁ
దనయు విసర్జించె ననుచు సాధ్వోక్తి

మార్గంబులుండఁ గుమార్గంబులూఁది
మార్గమే యాత్రాటిమూలలఁ గలయఁ
బశుపాశపతి యుండఁ బశువులౌ పంద
పశుజీవులకుఁ బెట్టు పందలఁ బట్టి
సోడంబుతో ముక్కు మోఁదుగాఁ గోసి
కూడ నిట్టికఁ బ్రాము క్రేడఁ బోవచ్చు
ఖండేందు ధరుఁ డిట్టికర్ముల యొద్ద
నుండునే మాభక్తు లొద్దనే కాక
రాచిన శుద్ధశివాచార మహిమ
నీచుఁడ యెఱుఁగంగ నీ కేలవచ్చు
దృష్టిహీనుండు దా దీప మే మెఱుఁగు
నష్టకర్ణునకును నాద మేమిటికి
జ్వరపీడితుఁడు వాలచవి యే మెఱుంగు
సరి గప్ప లెఱుఁగునే జడనిధిలోఁతు
వానరం బెఱుఁగునే వరరత్నమహిమ
శ్వానం బెఱుంగునే స్వర్గలోకంబు
రా నేర్చునే పుష్పరసమున కీఁగ
కాన నేర్చునె రవిఁ గౌశికవితతి
యజ్ఞానజీవుల కతులితభక్తి
ప్రాజ్ఞత యిదియేల ప్రాపించుఁ జెపుమ
ముంగిటిపెన్నిధి దంగేఁటిజున్ను
నంగిటనూరెడు నమృతం బనంగఁ

జను నేకలింగనిష్ఠాభక్తియుక్తిఁ
జనకదుష్పథములఁ జరియించు టెల్ల
రాజితాంచితరత్నరాజ ముండంగ
గాజుపెంచిక లేఱి గమియించినట్లు
తవరాజ మమరి ముందటఁ బ్రోఁకయుండ
తవుడు చొక్కుదునని తలఁచినయట్లు
దొడ్డిలో సురధేను వొడ్డుగాఁ గురియ
గొడ్డుఁ బిదుకఁగుండఁ గొనియేఁగినట్లు
నక్కజంబగుచు వజ్రాయుధంబుండ
మొక్కసురియమును మోహించినట్లు
పొట్టపొర్వ్యాన గల్ప భూరుహాంబుండ
వట్టివృక్షమునకు వడి నేఁగునట్లు
ఒదవంగ వత్తేట నోడ యుండంగ
వద రూఁదినట్టు లీవసుమతిలోన
మంగళంబగుభక్తి మార్గ ముండంగ
వెంగలులై కర్మవిధి యూఁది చెడుట
"స్మృతి తేన సహా సంవ సే" త్తని వ్రాయ
మతిహీనులకు నేల గతమగుబుద్ధి
నెఱి నెన్నిమాఱులు నీళ్లలోపలను
గొఱుపడం బుదికిన మఱి తెల్లనగునె
యేనాఁటు బ్రద్దల నెంత గట్టినను
శ్వానంబుతోఁక దాఁ జక్కన యగునె

మానక జలములలోన నేప్రొద్దు
నానిన శిల మెత్త గానేర్చునెట్లు
ఎడపక పాలు దా నెన్నివోసినను
విడుచునే సర్పంబు విస మొకింతైనఁ
బొలుపుగాఁ దేనియ వోసి నూఱినను
నిలఁ దీయనై యుండునే వేపనార
పన్నుగా నేలెంత వ్రామి కడిగిన
మన్ను దాఁ బోవునే మఱియట్లుఁగాక
పసిఁడినాఁగటఁ జెఱ్కుభంగుల దున్ని
వెస ముల్కవిత్తులు వెదవెట్టినట్లు
ఘనసారవృక్షముల్ ఖండించి వెల్గు
పెనుజెముళ్లకుఁ జుట్టుఁ బెట్టినయట్లు
నగ్గిలోపల మూత్ర మఱిముఱిఁ బోసి
డగ్గఱి వేల్వఁ దొడంగినయట్టు
లచ్చుగా నర్ఘ్యశ్రీపణ్యమ్ములు దెచ్చి
యిచ్చుఁ గుక్కలకాళ్ళ లిలఁ బూన్చినట్టు
లోడునఁ బోసిన యుదకంబులట్లు
నీడఘూలిన ధరణీరుహంబట్లు
రాజితలింగపరాఙ్ముఖానేక
పూజలు నిష్ఫలంబులు గావె తలఁపఁ
ద్ర్యక్షపరాఙ్ముఖక్రతు వాచరించి
దక్షుఁ డెఱుంగవే తలఁ గోలుపడియుఁ

పరశురాముఁడు దొల్లి బాఁపల కర్థి
ధర యిచ్చి యెఱుఁగవే తా నేమి గనియె
నిల యెల్ల నెఱుఁగ విప్రులనె పూజించి
బలి బంధనంబునఁ బడఁడె తెల్లముగ
నడరంగ గౌతముఁ డగ్రజన్ములకుఁ
గుడువఁ బెట్టియు గాదె గోహత్యఁ జెందె
వేదజ్ఞులగు కోటివిప్రుల కన్న
మాదటఁ బెట్టిన యట్టిఫలంబు
త్ర్యక్షభక్తున కొక్క భిక్షంబు వెట్టు
నక్షయఫలమున కసమాన మనుట
వ్యక్తమైయుండఁ గుయుక్తుల నడవ
భక్తియుఁ జెడు దానఫలము నిష్ఫలము'
అని పెక్కుభంగుల నానతిచ్చుడును
విని శోకజలసమన్వితనేత్రుఁ డగుచు
జగదేవుఁ డాభక్తజననికాయంబు
మొగిఁ బ్రస్తుతింపుచు మోడ్పుఁగే లమరఁ
"కర్మబద్ధుఁడనైతిఁ గష్టుఁడ ఖలుఁడ
దుర్మదోపేతుఁడ దుష్కృతాలయుఁడఁ
బ్రజ్ఞావిహీనుఁడఁ బరమపాతకుఁడ
నజ్ఞాని నధిక సర్వాపరాధుండ
శంకమాలిన యనాచారుండ [illegible]
కింకఁ బ్రాయశ్చిత్త మేమియు లేదు

పాన లేటికి విడ్తుఁ బ్రాణంబు గెలస
మానతి యిందు నా" కని మ్రొక్కి నిలువఁ
గనుఁగొని బసవయ్య ఘనభక్త వితతి
యనుమతంబునఁ గూడ నతని కిట్లనియె
"గొంకక విను మతి కొన్ని దినముల
కింక శివద్రోహి మిట పుట్టఁగలదు
మడియింపు ద్రోహిని మా కెక్కెఁ గెలస
మడరఁ బ్రసన్నుఁడయ్యెడి శివుఁ డప్డు
ఈనిర్ణయమునకు నీశానగణ వి
తాన మెంతయు మెచ్చి తత్ప్రస్తవంబు
నిమ్ములఁ గరుణించి యిచ్చిరి నీకు
నమ్ము మమ్మాటికి లెమ్ము లె" మ్మనుడు
నంగద మోడ్పుఁగే లలికంబుఁజేర్చి
పొంగుచు వీరతాంబూలంబు గొనుడు
జగదేవశరణుని నగరికి బసవఁ
డగణిత భక్తసహాయుఁడై యరిగె
నసలార సుచితక్రియాదులఁ దనిసి
బసవన్న యసమసద్భక్తులుఁ దాను
ననయంబు భక్తి సుధామృతాపార
వనధి నిమగ్నుఁడై వర్తింపుచుండె.

## అల్లయ్య మధుపయ్యల కథ

మఱియంత నల్లయ్య మధుపయ్య యనఁగఁ
గఱకంఠుభక్తు లకర్మసంచయులు
లింగైకనిష్ఠావిలీనమానసులు
జంగమారాధనాసక్తచేతసులు
పరమశివాచార పరవర్తనిరతు
లురుతరకీర్తి నియుక్తులు నాఁగ
నసమానలీలఁ గళ్యాణంబునందు
బసవఁడు దారు నప్పాట వర్తింప
నంత బిజ్జలుఁడు దాఁ గొంతకాలమున
కంతకు ప్రోలికి నరుగంగఁ దలఁచి
బసవని మహిమయు భక్తి మహత్త్వ
మెపకంబు నెఱిఁగియు నెఱుఁగనియట్లు
పొదలిన యజ్ఞానబోధ గాఁజేసి
మదియించి యల్లయ్య మధుపయ్యగారి
తప్పేమియును లేక చొప్పుగా దనక
రప్పించి కన్నులు వుప్పించె నంత
'కాలకాలునిభక్త గణములమహిమ
లేల తా మున్నును నెఱుఁగునుగాదె
యక్కట! చెడఁజూచె నవనీశుఁ డింక
నిక్కటకంబున కెక్కడిబ్రదుకు
మృడుభక్తు లలిగినఁ జెడఁడె తా' ననుచు

జడిగొని నరులెల్ల బుడిబుళ్లు వోవ
బసవఁడు మొదలుగా నసమాత్మభక్తు
లసమకోపోద్దీపితాంగులై పొంగి
మసలక యల్లయ్య మధుపయ్యగారి
కసలారఁగా గన్ను లప్పుడు పడసి
'యింక నుండఁగఁగూడ దీయూర' ననుచు
శంకరభక్తులు జగదేవమంత్రిఁ
'బనిచినతొల్లింటి బాసగైకొనుము
తునుము శివద్రోహి' ననుచు బిజ్జలుని
నొసలిరేఖలు గసిబిసిచేసి రాజ్య
మసమాత్మకవిలియు నటు దుడిపించి
బల్లహుఁకటకంబు వదటిపా ల్సేసి
యెల్లవారును జూడ నీతృణంబునను
'బాడగుఁ గటకంబు పాడగుఁగూడఁ
బాడగు' ననుచు శాపంబు లిచ్చుచును
రాచినమడివాలుమాచయ్యగారు
నాచౌడరాయఁ డేకాంత రామయ్య
కిన్నరబ్రహ్మయ్య గేశిరాజయ్య
కన్నదబ్రహ్మయ్య గక్కయ్యగారు
మాదిరాజయ్యయు మసణయ్యగారు
నాదిగా నప్పురి యఖిలభక్తులును
దండిజంగమకోటి దనతోడ నడవ

బండారిబసవనదండనాయకుండు
నెసఁగఁ గప్పడిసంగమేశ్వరంబునకు
వెస నేఁగె బిజ్జలు నెసకంబు దలఁగఁ
గటకటా కలకలఁరు గణములు వోవఁ
గటకంబుభాగ్యంబు గ్రక్కునఁ దొలఁగె
భూకంపమయ్యెను భువి నర్ధరాత్రిఁ
గాకు లఱచె వంటకంబులు వ్రిచ్చె
ధరఁ బడె నుల్క లత్తఱి ఱాల వాన
గురిసె భాస్కరచంద్రపరివేషమయ్యె
దివిదీటుకట్టె వేసవి మూఁగె మంచు
గవిసెను మధ్యాహ్నకాలంబు నందుఁ
గడు నుగ్రరూపుఁడై కాలుండు గానఁ
బడియెను బట్టణ ప్రాంతదేశమునఁ
బొరిఁబొరి గవిసెఁ గావిరి యెల్లయెడల
ధరణీశ్వరుఁడు గాంచెఁ దలలేని నీడ
రవి యుదయించు తత్ప్రిస్తవంబునను
దివిఁ బ్రతిసూర్యులు దీపించి రింక
నెంతగానున్నదో యిటమీఁదననుచు
సంతాపచిత్తులై జనులు భీతిల్ల
నిక్కడ జగదేవుఁడింటికే తేరఁ
జక్కన నాయయ్య జనని వీక్షించి
"శివగణద్రోహంబు సెసిఁ బడ్డయపుడ

యవిచారమున వారి హరియింపవలయుఁ
జాలరేఁ దారేని సమయంగవలయుఁ
గాలకాలుని భక్తగణమార్గ మిదియు
సమయింపఁజాలక చండియై తాను
సమయనిప్రాణవంచక కుటిలునకుఁ
గుపితున కజ్ఞాన కపజీవితునకు
విపరీతచరితుండు విషమలోచనుఁడు
మెచ్చునే వానికి మిక్కిలి భక్తి
యిచ్చునే కూర్చునే యిన్నియు నేల
క్రితము నీప్రాణ పరిత్యాగమునకు
మతిమెచ్చి యవసరోచిత మిచ్చి నిన్నుఁ
బంచి యేఁగిరి కాక భక్తు లాద్రోహిఁ
ద్రుంచుట కోడియే తొలఁగిరె చెపుము
యందొక్కఁ డలిగిన నవికలాజాండ
సందోహములు గాలి డిందకయున్నె
దక్షుఁడు క్రొవ్వి యదక్షుఁడై తొల్లి
దక్ష మఖక్షయదక్షుఁ బల్కుటయు
వినఁగఁజాలక తాన తనకోపవహ్నిఁ
గనలుట వినవె యాగౌరి దత్త్రణము
యదిగాక యుపమన్యుఁ డభవునినింద
మది విన కవుడ భస్మంబగుఁగాదె
కావున శివభక్త గణనింద వినియు

నీ వూరకుండుట నీతియే వానిఁ
జంపకే కుడువఁగఁ జనుదెంచి తిపుడు
పంపుడుకళ్లు నీ కింపారు నెట్లు
ఛీ! కుక్క! చేఁజేత శివప్రసాదంబు
చేకొని కుడువఁగ సిగ్గెట్టులేదు
వచ్చి కద్కుడుగాక శ్వానంబునట్లు
నుచ్చుచ్చురే" యని యొఁగిఁ జిట్ట మిడిచి
వెడలి వాకిటిదెస మృడుప్రసాదంబు
కుడుకతోఁ గొనివచ్చి పుడమిఁబోయుడును
‘దగ వగు’ ననుచును దాఁ గుక్కభాతి
జగదేవుఁ డిట్లు ప్రసాదంబు గుడువ
మల్లబ్రహ్మయ లన మహీ వీరభక్తి
కెల్లయై వర్తిల్లు నెడ నర్ధరాత్రి
నీవార్త విని జగదేవునికడకు
వేవేగఁ జనుదెంచి వెండివొత్తునను
దారును నాప్రసాదం బారగించి
యారాత్రి కొల్వున కరిగి బిజ్జలుని
నల్లంతఁ జూడగని యలుఁగులు వెలికి
జల్లున నలిగి యాసభ దల్లడిల్ల
నొక్కట ముప్పూరు నుద్వృత్తి నెగసి
చక్కడ్చిపొడ్చి జర్జరితంబు సేసి
యలుకమై గెడిగెడి యనుచు బిజ్జలుని

తలగోసి పొట్టలోపలఁ బెట్టి కిట్టి
'తా నసంఖ్యాతుల యానతి యదియు
నీవరాధముఁ బొలియించితి మేము
అధికులౌ భక్తుల కహితంబు సేయు
వధము లందఱును నిక్ష్వేధి బోదు' రనుచుఁ
గాయముల్ బిగియుచు గతులు ద్రొక్కుచును
రాయముల్గొనుచు దండలనటింపుచును
బొంగిబొబ్బిడుచుఁ జెలంగి యార్చుచును
లింగభక్తులకెదుర్లేరు వొండనుచు
చిందుగాఁ జౌరులు బిజ్జలునితల
గుందుగండా! యని ఘూర్ణిల్లుచుండ
మగిడి యామల్ల బ్రహ్మయగారుఁ దాను
నగరు వెల్వడి తన నగరికి వచ్చి
తల్లికి నందంద ధరఁజాఁగి మ్రొక్కి
సల్లలితాంగి ప్రసాదంబు వడసి
'పరమపాతకు నట్టి భక్తనిగ్రహునిఁ
బొరిగొన్న యంతన పోవ ద్రోహి
నప్పుడేచంపక యరుదెంచినట్టి
తప్పున కింకొండు దండ మున్నదియు'
ననుచు నజ్జగదేవుఁ డంతలోపలను
దనశిరంబున కల్గికొని విమానములఁ
బుత్రమిత్రకళత్ర గోత్రాదులను వి

చిత్రంబుగా నష్ట శివలోకమునకుఁ
గొనిపోయెఁ గటకంబుజనులెల్ల బెదరి
కనుకనిఁ బఱవంగఁ గ్రందువుట్టుటయుఁ
గన్నభక్తులు వార్తవిన్నభక్తులును
నున్నభక్తులుఁబోయి రొక్కొక్కయెడకు
నంతరాజార్థమై యనిచేసి యతని
సంతాన మెల్ల నిస్సంతాన మయ్యె
వీఁకఁ గొట్టములలో వెలిఁగె గుజ్జములు
తోఁకల నిప్పులు దొరగ నాక్షణము
కరులును గరులును గన్నంత నెదిరి
ఘోరిఁబోరిఁదాఁకి జర్జరితమైపడియె
బ్రమసి యమాత్యాది భటవర్గ మెల్లఁ
దమలోనఁ జచ్చిరి సమరంబుసేసి
బసవని సత్యశాపమునఁగాఁ జేసి
పసచెడి కటకంబు వాడయ్యె నంత
వినియె నంతయు నట సనియెఁ గూడలికిఁ
గనియె సద్గురువు సంగయదేవు నచట
భక్తులుఁదానును బరమానురాగ
యుక్తి నబ్బసవయ్య యుండె సంప్రీతి
నంత నాగురువు సమంచితనాద
సంతతపూజాది సత్క్రియావలులఁ
ముంచి భజించి కీర్తించి మెప్పించి

మించి విన్నప మాచరించి ప్రార్థించి
"దేవ సద్గురుమూర్తి దివ్యలింగాంగ!
దేవ నాసంగయ్యదేవ ప్రాణేశ!
నీదుసద్భక్తప్రసాదంబుఁ గుడిచి
యాదట బ్రదికి యింతైతిఁ గావునను
భవభవంబుల వారి పన్నుఁ గాఁదగుదు
భువి వారి ఋణమునఁ బోవుటగలదు
అంతియకాని నిన్నడిగినచోటు
నెంతైన నేమైన నిచ్చినచోటు
గలతప్పు సైరించి కాచినచోటు
గలదేని చెప్పుమా కానమీయందుఁ
బుట్టిన మొదలును బోఁకయుఁ బోరయ
వట్టికొల్వైన నిన్ను ముట్టఁగొల్చితిని
వెట్టిచేసిన నీకు వెయ్యేఁడులైన
నెట్టును మేలకా కెగ్గేమి తలప
నూరకకిట్లనుచుట యుచితమే నీకు
నారంగఁ బ్రమథులయాన నీయాన
వృషభవాహన! విన్నవించుట వినక
వృషభంబు నీకెట్లు విడువంగ వచ్చు
కొల్లనొండేమియు నోటంబుగాదు
వల్లభ! యడుగను వర మింక నిన్నుఁ
బరమపరానంద పరవశీభూత!

నిరవధితత్త్వవిస్ఫురణ వెంపునను
గలిమనోవాక్కాయ కర్మచైతన్య
రతులు నీయంద విశ్రాంతంబు నొందఁ
జేయుము నీయాజ్ఞఁ జేసి యేతెంచి
చేయంగఁ గలపను ల్సేసితి నింక"
ననుడు దయాకృతి సద్గురుమూర్తి
తనతోఁటె భావంబుదాల్చి యాత్మగుణము
సంగయదేవుఁడు సదనాంతరంబు
భంగిగా వెడలుడు బసవయ్యసూచి
సుస్మిత తద్గురు చరణాబ్జయుగము
నెన్నుదు రిజేయంగ సన్నుతి మ్రొక్కి
యానందబాష్ప సమంచితవార్ధి
లా నిట్టవోడువ గద్గదకంఠ మధుర
ముత్పులకలు మేన మొగి నిండ హర్ష
తత్పరుఁడై యున్నఁ దనయు లే నెత్తి
చక్కన తనదు ప్రసాదంబు వెట్టి
యక్కున నందంద యప్పళింపుచును
గొడుకు లోపలఁ జేర్చికొని గురుమూర్తి
గుడి సొచ్చె నిరుపుర పొడగానరాదు
పసగొని సకలభక్త సమూహిసూడ
బసవయ్య గురుపుగర్భంబుసొచ్చుటకు
సంగయదేవుండు సద్గురుభాతి

భంగిగా నేతెంచి బసవయ్య నిట్టు
తనయందు సంధించికొనుటకు నంత
ఘనతరలీల జంగమకోటి యలర
నరుదగులింగ తూర్యంబులు మ్రోయ
ధరఁ బుష్పవృష్టిదాఁ బరిగొని కురియఁ
గోయని భ క్తనికాయ మెల్లెడల
గేయని బలుమాఱుఁ గీర్తనసేయ
జయజయారవములు సందడింపంగఁ
బ్రియఁగొని వినుకులుఁ గేళిక ల్దనర
మాదిరాజయ్యయు మాచిదేవుండు
నాదిగాఁ గలభ క్తు లనురాగలీలఁ
గలవె యుత్పత్తిస్థితిలయప్రపంచ
ములు బసవయ్యకుఁ దలఁచిచూడంగ
గాలిలోపల సురగాలినాఁ బుట్టి
గాలిలోనన వెండిఁ గలసినయట్లు
శరనిధిఁ గడలునా జనియించి వెండి
శరనిధిలోనన సమసిన యట్లు
ఉడువీథియందు విద్యుల్లతపుట్టి
యుడువీథియందఁ దా నడఁగినయట్లు
జలములయందు వర్షాఫలం బమరి
జలములలోనన సమసినయట్లు
సద్గురుకారుణ్య సంగతిఁ బుట్టి

సద్గురు కారుణ్య సంపదఁ దనరి
సద్గురుగర్భవిశ్రాంతిమై నిపుడు
తద్గతుఁడై లింగ తత్త్వంబుఁ బొందె
నట్టిద కాదె గుర్వంఘ్రియుగంబు
ముట్టఁగఁ గొల్చినయట్టి భక్తాలి
హృదయాంబుజంబుల నీబసవయ్య
కదలక పువ్వును గంపునుబోలె
వలి నున్నవాఁడుగా కిలవేలుగలదె
మలహారుభక్తులఁ గలకాల మెల్ల
భక్తహితార్థమై ప్రభవించెఁగాక
వ్యక్తిగా నతఁ డీశ్వరాంశంబ కాఁడె
యని నుతింపుచుఁ దొంటియట్ల సద్భక్తి
జనితసుఖామృత వనధిమధ్యమున
నోలలాడుచు నుండి రురుతరానంద
లీలమై నటు గొంతగాల మింపారఁ
బ్రస్తుతింపంగ సద్భక్తి విస్ఫురణఁ
బ్రస్తుతి కెక్కిన బసవని చరితఁ
జెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ
దప్పకుండఁగను యథాశక్తిఁ జేసి
యిమ్మహి నీశున కెఱుఁగంగరాని
యమ్మహాబసవని యద్భుత చరిత
వర్ణింప నెంతటివాఁడ నట్లయ్యు

వర్ణనచేసితి వారిన కాని
యేయెడ నన్యథా యొఱుఁగ నే ననెడి
యీయొక్కబలిమి మహిష్ఠతకలిమి
పదియునుగాక మహాభక్తవరుల
సదమల దివ్యప్రశంసగాఁజేసి
భావించినాఁడ వాక్పావనార్థంబు
గావింప మేటియీకథ రచించితిని
బసవపురాణంబుఁ బాటించి వినిన
నసలారుఁబో ప్రసాదానందసిద్ధి
బసవపురాణంబుఁ బాటించి వినిన
వసియించు సద్భక్తి వాసనమహిమ
బసవపురాణంబుఁ బాటించి వినినఁ
బసిగమైఁ బ్రాపించు భక్తులకరుణ
బసవపురాణంబుఁ బాటించి వినినఁ
బసరించు లింగానుభవనిత్యసుఖము
బసవపురాణంబుఁ బాటించి వినిన
నెసకంబుతోఁ గల్గు నీప్సితార్థములు
బసవపురాణంబు భక్తి వ్రాయించి
వసదిగాఁ జదివెడువారల కెల్ల
దురితము లాపదల్ ద్రోహంబు లెల్ల
హరియించు నెంతయు హరుకృపఁజేసి
యీపురాణం బెవ్వరేఁ దమయింట

నేపార నిడికొన్న నిహపరసిద్ధి
శరణోపకార బసవపురాణార్థ
విరచిత త్రిభువన విఖ్యాతచరిత!
శరణోపకార బసవపురాణార్థ
పరభుక్తిముక్తి సంవర్ధనభరిత!
శరణోపకార బసవపురాణార్థ
సరససమంచిత సత్యవాగ్జాల!
గొబ్బూరి మాదన్న కూరిమిశిష్య!
గొబ్బూరిసంగ సద్గుణ సముత్తుంగ!
ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య
పదపద్మ సౌరభ భ్రమరాయమాణ
జంగమలింగ ప్రసాదోప భోగ
సంగత సుఖ సుధాశరధి నిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ
సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగఘనకరస్థలి విశ్వనాథ
వరకృపాంచిత కవిత్వస్ఫూర్తిఁ బేర్చి
చను బసవపురాణ మనుకథయందు
సనుపమంబుగ సప్తమాశ్వాసమయ్యె.

---

చెన్నపురి వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1952.

# పద్యకావ్యములు.

| | | ప్రతి 1-కి రు॥ | అ॥ |
|---|---|---|---|
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | ... | 2 | 8 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యునిది | ... | 1 | 0 |
| అప్పకవీయము, క్రొత్తకూర్పు | ... | 5 | 0 |
| ,, శ్రీగిడుగురామమూర్తిపంతులవిమర్శ | ... | 0 | 12 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | .. | 0 | 12 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | | 15 | 0 |
| ఆంధ్రమహాభారతము — | | | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక (పాతది) | ... | 8 | 0 |
| ఆదిపంచకము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆది సభాపర్వములు గలసంపుటము | ... | 4 | 0 |
| అరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | .. | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | .. | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | . | 4 | 0 |
| శాంతిపర్వము | | 4 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | .. | 4 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిది | .. | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | . | 0 | 3 |
| „ టీకతో | .. | 0 | 10 |
| ఆనందరంగరాట్ఛందము | . | 2 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | .. | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు (నిఘంటుత్రయము) కాలికో | | 2 | 0 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము — శ్రీజనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | ... | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 18 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | . | 3 | 0 |
| కవికంఠోక్తి | . . | 0 | 4 |
| కవిజనాశ్రయము | ... | 2 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | .. | 0 | 8 |
| కవిరాజమనోరంజనము | . | 1 | 4 |
| కవిజనరంజనము | ... | 0 | 12 |
| కృష్ణదండకము | .. | 0 | 2 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | .. | 1 | 8 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| చేరీజూపద్యములు | ... | 0 | 4 |
| దండకరామాయణము, చక్కనిశైలి | ... | 3 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కృష్ణరాయవిజయము | . | 0 | 12 |
| కాశీఖండము, శ్రీనాథునిది | ... | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతం) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభుపుకృతము | ... | 0 | 10 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యకవి | ... | 0 | 12 |
| గయోపాఖ్యానము, ద్విపద (కృష్ణార్జునసంవాదము) గోపమంత్రిది | ... | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | ... | 0 | 12 |
| ,, శ్రీగొర్తి సూర్యనారాయణశాస్త్రిగారిది | | 1 | 0 |
| గరుడాచలము - యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 4 |
| గణికాగుణప్రవర్తనతారావళి | ... | 0 | 4 |
| గీతమంజరి, శ్రీచిలకమర్తిలక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) | ... | 2 | 0 |
| జైమినీభారతము | ... | 2 | 8 |
| తెలుగుసమస్యలు | ... | 0 | 3 |
| దశావతారచరిత్ర | ... | 4 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ధనాభిరామము | .. | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | .. | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకార సంగ్రహము) | ... | 3 | 0 |
| నలోపాఖ్యానము సటీక | ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికో బైండు | .. | 2 | 4 |
| నాచికేతోపాఖ్యానము, మల్లికార్జునకవి | ... | 1 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము | . | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము | | 0 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | . | 0 | 12 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | . | 1 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 4 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన | ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| బిల్హణీయము | . | 1 | 4 |
| భాస్కరరామాయణము | .. | 8 | 0 |
| భోగినీదండకము | ... | 0 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితముల మీఁద ముద్రితము | . | 5 | |
| మొల్లరామాయణము | ... | 2 | |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య | ... | 2 | |
| డిటో అకొండి వ్యాసమూర్తిగారిది | ... | 0 | |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| భక్తిరసశతకసంపుటము I, 20 శతకములు... | 3 | 0 |
| ,, II ,, ... | 3 | 0 |
| ,, III ,, .. | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, . | 3 | 0 |
| భారతసావిత్రి ... | 0 | 2 |
| భగవద్గీతా కందార్థములు .. | 1 | 4 |
| ,, శ్రీగోపినాథ వేంకటకవికృతము, పద్యకావ్యము | 1 | 4 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| మల్లభూపాలీయము, నీతిశతకము, ఎలకూచిబాలసరస్వతిది, వేదము లక్ష్మీనారాయణశాస్త్రి టీకతో... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద . | 6 | 0 |
| రంగరాయచరిత్రము | 1 | 0 |
| రాఘవపాండవీయము, సటీక | 4 | 0 |
| రాజశేఖరవిలాసము . | 0 | 12 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 8 |
| రాధికాసాంత్వనము, క్రొత్తకూర్పు ... | 1 | 8 |
| రామరాజీయము .. | 0 | 12 |
| రామాభ్యుదయము .. | 2 | 0 |
| రుక్మిణీకల్యాణము, సటీక ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము .. | 0 | 10 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 1 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | 1 | 8 |
| పాండురంగమహాత్మ్యము, టీక, .. | 6 | 8 |
| వసిష్ఠజనకసంవాదము ... | 0 | 8 |
| వామనపురాణము ... | 5 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| వివేకసింధువు, కొండనార్యప్రణీతము | .. | 1 | 8 |
| వేమనపద్యములు | ... | 0 | 8 |
| „ బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 8 |
| „ (2728) చిన్నసైజు | ... | 3 | 8 |
| „ (2728) ఆంధ్రతాత్పర్యముతో | ... | 7 | 8 |
| వేమనశతకము | ... | 0 | 4 |
| విజయవిలాసము | ... | 1 | 4 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 6 |
| వైజయంతీవిలాసము | ... | 1 | 4 |
| వీరభద్రవిజయము, పోతనది | ... | 2 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవి | ... | 1 | 0 |
| శశాంకవిజయం (తారాశశాంకవిజయము) | ... | 1 | 8 |
| శివలీలావిలాసము | ... | 0 | 8 |
| శివధర్మము, తామరపల్లి తమ్మయ్య | .. | 1 | 8 |
| శుకసప్తతి, కదిరీపతికృతము | .. | 3 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవి | | 3 | 0 |
| సమీరకుమారవిజయము | . | 2 | 8 |
| సప్తమస్కంధము, ప్రహ్లాదచరిత్ర | . | 0 | 6 |
| „ సటీక, చిన్నసైజు | ... | 3 | 8 |
| „ టీక, శ్రీదీపాల పిచ్చయ్యశాస్త్రి | ... | 4 | 0 |
| సానందోపాఖ్యానము | . | 2 | 8 |

# శుద్ధపత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 11 | జగుదుపకా | జగదుపకారి |
| 21 | 21 | ఓరీ | ఓరి |
| 28 | 18 | యను | యన |
| 29 | 20 | యత్షణ | యాత్షణ |
| 49 | 21 | | |
| 89 | 4 | | |
| 101 | 10 | | |
| 151 | 1 | | |
| 155 | 18 | | |
| 30 | 9 | ననుచు | నచుడు |
| 32 | 3 | నన | నవ |
| 43 | 18 | మైకులము | మైంగులము |
| 67 | 10 | దృష్టిం | దృష్టి |
| 76 | 22 | శ్రీ (స్త్రీ ?) | స్త్రీ |
| 80 | 20 | ప్రసన్యాస | ప్ర [illegible] న |
| 85 | 8 | ఆరగింపంగ | ఆ [illegible] ంగ |
| 86 | 17 | సత్త్వంబు | స [illegible] బు |
| 100 | 6 | ముక్క్రాస | [illegible] ాస |

| పుట | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 110 | 17 | సేతెంతుఁ | సేతెంతు, |
| 110 | 22 | ముఖాల | మఖాల |
| 112 | 4 | దుద్ర | రుద్ర |
| 114 | 11 | సుమంతు | సుమంత |
| 117 | 17 | రాజసూ | రాజసూ |
| 125 | 15 | జైకథ | జైనకథ |
| 171 | 9 | చిరి | బిరి |
| 173 | 3 | రజితాద్రి | రజతాద్రి |
| 176 | 13 | లిచ్చుచు | లిచ్చుచు |
| 182 | 11 | నంబికి | నంబికిఁ |
| 182 | 17 | యట | సెట |
| 183 | 18 | జావ | జావఁ |
| 185 | 7 | దతగిలి | దగిలి |
| ,, | 15 | దనుచు | దనుడు |
| 189 | 4 | వోక్షో | వాక్షో |
| 191 | 5 | తలఁగంగ | తలగంగ |
| 196 | 5 | నాఁబోతుఁబులిగొన్న | నా బోతుపులిఁగొన్న |
| 198 | 1 | దొలి | దొల్లి |
| 219 | 5 | లింగములనుఁ | లింగములను |
|  | 7 | నెప్పుడు | నెపుడు |
| 220 | 17 | మీఁద | మీఁదఁ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 224 | 21 | వలుద | వలుఁద |
| 244 | 21 | నిటి | నిట్టి |
| 288 | 11 | మృదుని | మృడుని |
| 306 | 12 | కదళి | కదళీ |
| 309 | 13 | వాఁకిట | వాకిట |
| 313 | 7 | గాఁగ | గాఁగఁ |
| 335 | 1 | నంపఁగ | సంపఁగ |
| 338 | 13 | కింక | కింకఁ |
| 340 | 16 | యట్లాట | యట్టాట [పడి |
| 348 | 17 | యెంతయొనుశ్రమాపడి | యెంతయునట్టుశ్రమ |
| 385 | 7 | వేయని | లేయని |
| 391 | 22 | దమోఘంబుఁ | దమోఘంబు |
| 396 | 2 | నిచ్చటిమృగమున నెరిఁ బొలియించి | నచ్చటిమృగములనట్టు పొలియించి |
| 399 | 6 | కోలాహలుఁడ | కోలాహాలుఁడ |
| | 9 | నిస్సృ | నిస్పృ |
| | 10 | నస్సృ | నస్పృ |
| 400 | 22 | జైనుండ | జైనుఁడ |
| 407 | 17 | నతని | నతనిఁ |
| 412 | 14 | గనఁక | గనక |
| 418 | 4 | బర గఁగది | బరగఁగఁది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 418 | 16 | పీరమ | పీరమా |
| 420 | 3 | హాస్తు | హాస్త |
| 427 | 22 | నుగ్గల | సుగ్గల |
| 440 | 7 | బున్నఁ | బున్న |
| 441 | 11 | వాపోవఁ | వాపోవ |
| 444 | 14 | యే తెర | యే తేర |
| 450 | 10 | నాటి | నాఁటి |
| 458 | 12 | దొల్నాడు | దొల్నాఁడు |
| 468 | 1 | నశ్వరపరదర్శనస్థలువడఁక | వీనిలో మొదటిది 469 పేజీ మొదటి పంక్తిగాను, రెండవది 468 పేజీ మొదటి పంక్తిగను జదువునది |
| 469 | 1 | వడరడరోప్నెస్మఖులై పిలిపింప | |
| 470 | 22 | యణఁకించి | నణఁకించి |
| 472 | 18 | మానోఽత్తి | మానోఽపి |
| 479 | 9 | వీపొగ్గి | వీఁపొగ్గి |
| 482 | 12 | ఆది | ఆదిఁ |
| 488 | 1 | యదృశు | యసదృశు |
| ,, | 21 | ట్లువుచు | ట్లువుచుఁ |
| 509 | 20 | పాదుల | పాఱుల |
| 514 | 12 | తూళఆపులకు | తూళఱపులకు |

# శుద్ధపత్రిక ▼

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 517 | 20 | బ్రాణేశ | బాణసి |
| ,, | 21 | నతివ | యతివ |
| 518 | 4 | హీనులునుదాను | హీనురాలిని |
| 520 | 19 | శైఁబాగ | పైఁబాగ |
| 526 | 22 | వ్రచ్చె | వ్రిచ్చె |
| 527 | 2 | వరువట్లు | వఱువట్లు |
| 531 | 2 | హిఁబూతుర్వ | హితుపూర్వ |
| , | 3 | పాతము | పాతకము |
| ,, | 13 | జుండు | జుఁడు |
| 536 | 20 | డింరిగ | డింగరి |
| 540 | 7 | పచుల | పసుల |
| 541 | 4 | పశ | వంశ |
| ,, | 7 | యంత్త్రము | యంత్రము |
| ,, | 22 | తెఱగు | తెఱుఁగు |
| 543 | 3 | గెడిపి | గెడపి |
| 553 | 8 | కూలుము | కూటము |
| 583 | 15 | వెండిఁ | వెండి |
| 584 | 13 | సుఖామృత | సుఖామృత |

మరా — అరసున్నలంటని తావులు వ్యత్యస్తముగ ముద్రితమయిన చోట్లు పాఠకులు సరిచేసికొనఁదగుచు

కఠినపదములకు, సాంకేతికపదములకు,

# అర్థ వివరణము

(Glossary)

| పుట | పంక్తి | పదము | వివరణము |
|---|---|---|---|
| 2 | 9 | త్రిభువన ప్రథముల | పూర్వముద్రణము లందలి "ప్రమథులం ద్రిభువనప్రమథుల" అను పాఠ మసంగత మయినది. అందు సారస్యము లేదు. బ్రహ్మాదుల సృష్టికన్న శివుని ప్రమథగణసృష్టి ప్రప్రథమ మని శివాగమ ప్రసిద్ధము కావున నిచ్చట "ప్రమథులం ద్రిభువన ప్రథముల" అను నదియే సరియైనకవి పాఠము |
| 4 | 10 | గ్రామసీమాఽలంఘనవ్రతము | తానుండు గ్రామము యొక్క పొలిమేరను దాటి చరింపక యున్నగ్రామమునందే నిత్యము తనయాచార విధుల నిర్వహించుట. ఇది వీరశైవుల చతుష్షష్టిశీలములలో నొకటి |

| పుట. | పంక్తి | పదము. | | వివరణము. |
|---|---|---|---|---|
| 5 | 8 | చిలిపిలిపోవు | = | అతిశయించు |
| 12 | 6 | వేడ్కకాఁడు | = | విటుఁడు |
| 23 | 16 | అతగులు | = | అల్పులు, దుర్బలులు |
| 27 | 15 | దారవోకుండ | = | వ్యర్థముగాకుండ |
| 28 | 15 | కొత్తడి(రూ క్రొత్తడి) | = | పతివ్రతా సమూహము. |
| 31 | 10 | వెలరొంచె | = | వెల్లనయ్యె |
| 34 | 16 | ఎరివు | = | బాధ |
| 35 | 3 | జంగమలింగము | = | చరలింగము, జీవిరూపమునఁ జరించుశివుఁడు = శివభక్తుఁడు. జంగమ, జంగమలింగశబ్దములు కేవల శివభక్త వాచకములు గనే పూర్వవాఙ్మయమున నుపయుక్తములయినవి |
| 36 | 4 | అఱుకువ | = | తక్కువ |
| 37 | 7 | ఇల్ల | = | ఇచ్చటి |
| | | కప్పడి | = | జీర్ణవస్త్రములుదాల్చు పరివ్రాజకుఁడు (అచ్చటి సంగమేశ్వర క్షేత్రమందలి శివలింగమునకు కప్పడి సంగమేశ్వరుఁడని వ్యవహారము ) |
| 38 | 4 | పాఁగెము | = | ప్రభ, పొంకము. |

| పుట | పంక్తి | పదము. | | వివరణము. |
|---|---|---|---|---|
| 39 | 11 | ఆగడి | = | లోనయి |
| | 15 | మఱపడ్డ | = | మఱుఁగువడ్డ, తార్మాణమయిన |
| 41 | 8,9 | త్రాటిమాలలు | = | కర్మపాశబద్ధులయిన నీచులు. |
| | 14 | త్రాటికి | = | కర్మపాశమునకు |
| 47 | 19 | పదకవాదము | = | వ్యర్థవాదము [మునకు. |
| 48 | 14 | ఫణిహారియింటికిని | = | ఆయూరియందలి శివాలయ |
| 52 | 8 | మందురు | = | బ్రదుకుదురు |
| 65 | 7 | తరువు | = | తొందర |
| 69 | 3 | కన్నాకు | = | మిన్ను. |
| 73 | 12 | పరస | = | యాత్రికసమూహము |
| 74 | 13 | ఒడ్డగెడవు | = | ఒకకొమ్మకిందికిఁ గ్రుంకి మఱొకకొమ్మమీఁదికి లేచుట. |
| 75 | 20 | ఒడయలు | = | మాహేశ్వరులు |
| 79 | 12 | మర్కటన్యాయము | = | బయటినిరోధ మెంతయున్నను సరకుగొనక కోఁతి తనకు దొరకిన వస్తువును గట్టిగాఁబట్టికొని విడువకుండుట |
| | 14 | వాయసఫలన్యాయము | = | కాకి తనకు దొరకిన పండునందలి సారమును గ్రోలిన వెంటనే దానిని విడిచిపెట్టుట |

ఇట పిడుపర్తి సోమనాథుని

| పుట. | పంక్తి | పదము. | | వివరణము. |
|---|---|---|---|---|
| | | | | పద్యానువాదము "రమణిఁ బిప్పిలి కావనచరంబుల నీతి నతిక్రమించి, కాకమధురసత్ఫలంబుగ లిగ్రుక్కున ముక్తతఁ జెంది" |
| 92 | 10 | నడుఁకుచు | = | జంకుచు |
| | 22 | లింగసదర్థులు | = | అనన్యచిత్తముతో, ఇష్టప్రాణలింగములభజించి తత్ప్రసాదమున నే వాంఛితార్థముల నెల్లఁబడయువారు |
| 95 | 1 | బయలు | = | శూన్యము |
| 96 | 10 | తెంగులు | = | నీచులు |
| 98 | 17 | ఏట | = | గొఱ్ఱె |
| 99 | 2 | ఏకరి | = | దుర్నయపరుఁడు, కాటకోటనిశండ్రికి విశేషణముగా గ్రహింపఁదగును. |
| 100 | 6 | ముక్కస | = | మూఁడు కుంచములు. |
| | 16 | పెఱికలు | = | గోనెమూటలు |
| 104 | 6 | అడబాల | = | వంటవాఁడు. |
| | 17 | వెండీఁడు | = | బొమ్మలాడించువాఁడు |

| పుట | పంక్తి | పదము. | | వివరణము |
|---|---|---|---|---|
| 105 | 15 | సుంకీఁడు | = | సుంకము (పన్ను) వసూలు చేయువాఁడు |
| | 17 | పేరాళగీఁడు | = | కథలు చెప్పువాఁడు |
| 106 | 9 | కీలారి | = | పసులకాపరి |
| 127 | 9 | పటువలి | = | మేలిజాతి వస్త్రము |
| 130 | 9 | బల్లహుఁడు | = | భల్లాణరాజు (ఈపదముసాధారణముగా ప్రభువు (రాజు) అను నర్థమునకే పూర్వవాఙ్మయమున నుదాహృతమయినది ) |
| | 15 | గణము | = | భక్తుఁడు. |
| | 19 | ప్రస్తవము | = | సందర్భము, సమయము |
| 149 | 11 | తూపొడ్వఁ దడవ | = | ఉమ్మివేయఁగనే |
| 153 | 13 | తొంగిళ్లు | = | తల్లులు చంటిపిల్లలకుఁ దలంటు నప్పుడు వారు పరుండుటకయి దగ్గఱకుఁ జేర్చి సాచియుంచెడి తొడల పయిభాగము |
| 158 | 10 | పితగుండు | = | మంకు బిడ్డఁడు |
| 160 | 10 | బడరునకు | = | ఈశ్వరునకు |
| 161 | 3 | గఱగాఱ | = | కఱుగుడు |
| | 14 | బెడంగనో | = | తెల్లఁగాఁ దోఁచునో |
| 162 | 12 | పోదండు | = | పోవుదము. |

| పుట | పంక్తి | పదము | వివరణము |
|---|---|---|---|
| 162 | 16 | ఎడమడుగు | = వైషమ్యము |
| 168 | 3 | గోద | = వృషభము (నంది) |
| 170 | 18 | అడుపరి | = చుట్టుగోడ, వప్రము [కల. |
| 181 | 2 | నిక్కాల | = వెంటనే యనుభవమునకువచ్చు |
| | 16 | వెడ్డువెట్టి | = ఆశపెట్టి, వంచించి. |
| 183 | 3 | గోరగలు | = భక్తులు. |
| 189 | 3 | పాదోట్రు | = సాలెగూడు |
| | 22 | పరిచ్ఛేది | = చంపునది |
| 195 | 13,14 | విగుర్వణము | = మితిమీఱినకష్టము |
| 225 | 20 | గామిడి | = గడుసరి |
| 226 | 21 | గొఱుపడము | = కంబళి |
| 227 | 8 | ఇబ్బంది | = అజ్ఞాని |
| 233 | 20 | మణుంగులు | = తెలుపుచేసిన బట్టలు |
| 234 | 1 | కట్టము | = వస్త్రము |
| | 22 | పిఱుసనఁడు | = లెక్కసేయఁడు |
| 236 | 1 | ప్రడ్డలు | = ఔద్ధత్యములు |
| 251 | 2 | పురులువోనాడి | = ఔద్ధత్యముదక్కి |
| 259 | 6 | కొల్చు | = ధాన్యము |
| | 17 | తపనిధి | = తఱుగని కొటారము |
| 260 | 2 | బలుసరితనము | = గరువంపుఁదనము |
| 261 | 22 | కాట్నము | = ధాన్యము. |

| పుట | పంక్తి | పదము | వివరణము |
| --- | --- | --- | --- |
| 452 | 1 | విసమాలు | = తూల్చు. |
| | 2 | ఇరుగాలిపసులు | = ద్విపాదపశువులు |
| 461 | 11 | వలివేగము | = వాయువేగము. |
| 462 | 20 | చోళ్ళవాళి | = చోళ్ళ (జీవనభృతి) పరిపాటిగాఁ గలది = ఐహికజీవనము |
| | | వేళవాళి | = జీవితావసానవేళకు వాళియైనది = ఆముష్మిక జీవనము |
| 466 | 7 | కరి | = సాక్షి |
| 467 | 4 | కెలసము | = పని |
| | 8 | సంత | = గొడవ |
| 483 | 3 | వయ్యాఁడె | = వైవఁడె |
| 494 | 6 | గదుగదుపు | = సందేహము, జంకు |
| 497 | 12 | కొత్తి | = నీచురాలు |
| 500 | 16 | పదరు | = సూది |
| 517 | 20 | పాణసి | = చండాలస్త్రీ |
| 529 | 1 | ఉలిపిజంగెత | = నీచురాలగుమాలెత. |
| 539 | 8 | దేవలకులు | = తంబళులు |
| 543 | 1 | ఏనుఁగుపత్తు | = ఏనుఁగుమైఁ గట్టు చౌడోలు. |
| | 13 | మడిగూటివృత్తి | = ప్రసాదముగొను వ్యాపారము. |
| 545 | 7 | బడిగల్లు | = పందికొక్కులఁ జంపుట కేర్పడిన బోను. |

| పుట | పంక్తి | పదము | వివరణము |
| --- | --- | --- | --- |
| 336 | 22 | సంజాదురే | = వెనుకాడుదురే |
| 340 | 21 | అఱగొడ్డైతనము | = బింకము, ధైర్యము |
| 342 | 22 | మోహాణము | = పిడి |
| 343 | 5 | పిమ్మిటి | = స్పృహాతప్పుట. |
| 347 | 18 | కలకేతుఁడు | = ఐంద్రజాలికుఁడు |
| 348 | 7 | ఇరుస | = రెండుకుంచములు |
| 349 | 1 | బుడిబుళ్ళవోవు | = అబ్బురపడు, భయపడు |
| 352 | 22 | లింగావసరము | = శివపూజ = భోజనము (వైష్ణవులలో "సాపాటు" శబ్దమువలె వీరశైవులు లింగావసరము, శివపూజ యను పదములను భోజన సాంకేతికముగా వ్యవహరింతురు) |
| 356 | 12 | అడకి | = ఇఱికించి |
| 357 | 11 | కడువునీరు | = బియ్యముకడిగిననీరు. |
| 363 | 16 | ఉనుపరి | = సహాయుఁడు |
| 379 | 6 | ఆలంబు | = అబద్ధము |
| 401 | 12 | మేడెమువొడువ | = యుద్ధముసేయ |
| 411 | 7 | ఇక్కంటితో | = రెండుకన్నులతో. |
| 420 | 14 | కుతగులు | = కుచ్చితులు. |
| 446 | 8 | త్రట్లు | = దద్దుర్లు |

| పుట | పంక్తి | పదము | వివరణము |
|---|---|---|---|
| 452 | 1 | విసమాలు | = తూల్చు. |
| | 2 | ఇరుగాలిపసులు | = ద్విపాదపశువులు |
| 461 | 11 | వలివేగము | = వాఁయువేగము. |
| 462 | 20 | చోళ్ళవాళి | = చోళ్ళు (జీవనభృతి) పరిపాటిగాఁ గలది = ఐహికజీవనము |
| | | వేళవాళి | = జీవితావసానవేళకు వాళియైనది = ఆముష్మిక జీవనము |
| 466 | 7 | కరి | = సాక్షి |
| 467 | 4 | కెలసము | = పని |
| | 8 | సంత | = గొడవ |
| 483 | 3 | వయ్యాఁడె | = వైవఁడె |
| 494 | 6 | గదుగదుపు | = సందేహము, జంకు |
| 497 | 12 | కొత్తి | = నీచురాలు |
| 500 | 16 | పదరు | = సూది |
| 517 | 20 | పాణసి | = చండాలస్త్రీ |
| 529 | 1 | ఉలిపిజంగెత | = నీచురాలగుమాలెత. |
| 539 | 8 | దేవలకులు | = తంబళులు |
| 543 | 1 | ఏనుఁగుపన్ను | = ఏనుఁగుపైఁ గట్టు చాడోలు. |
| | 13 | మడిగూటివృత్తి | = ప్రసాదముగొను వ్యాపారము. |
| 545 | 7 | బడిగల్లు | = పందికొక్కులఁ జంపుట కేర్పడిన ఱాతిబోను. |